# బైబులుభాష్య సంపుటావళి

## తొమ్మిదవ సంపుటం

# జ్ఞానవివాహం, తిరుసభ



# బైబులు భాష్య సంపుటాలు

## తొమ్మిదవ సంపుటం

# జ్ఞానవివాహం, తిరుసభ

ఫాదర్ పి. జోజయ్య, S.J.
ఆంధ్ర లొయోలా కాలేజి
విజయవాడ - 520 008

Copies : 3,000
First Edition : December 25, 2003

పర్యవేక్షణ :

**Fr. THANAM MARREDY**
Parish Priest
St. Peter's Cathedral
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P. INDIA

ముద్రణానుమతి :

**Rt. Rev. MALLAVARAPU PRAKASH**
Bishop of Vijayawada

ప్రచురణ :

**St. PETER'S CATHEDRAL**
Education Desk For The Children
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P., INDIA

# విషయసూచిక

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్లు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి. మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహాఘనత వహించిన డాక్టరు ఎం. ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి. సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

\- గ్రంథకర్త

# ముందుమాట

ఫా.జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా.జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా.జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా.మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా.జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు
మీ జ్ఞానతండ్రి
**+ మల్లవరపు ప్రకాష్**
విజయవాడ పీఠాధిపతులు

# 1. వాళ్లిద్దరూ ఒకే వ్యక్తిగా ఐక్యం గావాలి

## మనవిమాట

వివాహవ్యవస్థ మానవ జీవితానికి పునాదిలాంటిది. బహుపురాతనమూ పవిత్రమూ ఐంది. పిల్లల బాగోగులు, వారి భావిజీవితం చాలవరకు కుటుంబంపైనే ఆధారపడివుంటాయి. క్రైస్తవ విశ్వాసానికిగూడ కుటుంబమే పట్టుగొమ్మ. మంచి క్రైస్తవ కుటుంబం మంచి క్రైస్తవ పౌరులను తయారుచేస్తుంది. ఈ గ్రంథంలో క్రైస్తవ వివాహాన్నీ, కుటుంబ జీవితాన్నీ వివరించాం. ఈ పొత్తం ఇదివరకే ఏడు ముద్రణలు పొందింది.

## విషయసూచిక

# 1. ఆదిదంపతులు

ఆదికాండం : { 1, 26-28 పోలిక, సంతానం.<br>2,18-24 సహాయురాలు, ఇద్దరూ ఒకే వ్యక్తి

## 1. పోలిక

"దేవుడు తనకు పోలికగా నరుని సృజించాడు. ఆ నరుని స్త్రీ పురుషులనుగా సృజించాడు" - ఆది 1,27.

దేవుడు పిడికెడు మట్టిముద్దను తీసికొని తన శ్వాసను దానిలోనికి వూదాడు. దేవుని శ్వాస అంటే అతని ఆత్మ. ఈ ఆత్మను పొంది ఆ మట్టిముద్ద సజీవప్రాణి ఐంది. ఆ ప్రాణి ఆదాము. ఈ ఆదామునుండి స్త్రీ సృజింపబడింది.

నరుడు దేవునికి పోలికగా వుంటాడు. ఆకాశంలోని పక్షులు, భూమిమీది జంతువులు, నీళ్ళలోని చేపలు మొదలైన సృష్టి ప్రాణులన్నీగూడ అతని అధీనంలో వుంటాయి - కీర్తన 8,7.

ఆదాము ఏవలు ఆదిదంపతులు. ఈ ఇద్దరూ దేవుని ప్రతిబింబాలే. వీళ్ళిద్దరిలోను దేవుని పోలికలు ఉన్నాయి. ఇద్దరూ దేవుని బిడ్డలే. ఇద్దరూ దేవుని చేరవలసినవాళ్ళే. కావున వాళ్ళల్లో హెచ్చుతగ్గులంటూ లేవు. వాళ్ళ గుణగణాలు, శక్తిసామర్థ్యాలు వేరు. ఐనా దేవుని ఎదుట వాళ్ళ విలువ ఒకటే.

## 2. సహాయురాలు

"నరుడు ఒంటరిగా వుండడం మంచిదికాదు. అతనికి యోగ్యమైన సహాయురాలిని సృజిస్తాను" అని అనుకున్నాడు ప్రభువైన యావే - ఆది 2,18.

నరుడు ఒంటరిగా వుండడం మంచిదికాదు. అంచేత అతనికి సహాయురాలునిగా ఏవను సృజించాడు యావే. ఇక్కడ సహాయురాలంటే అతణ్ణి పరిపూర్ణుణ్ణి చేసే ప్రాణి. జంతువులను సృజించి ఆదామునకు చూపించాడు ప్రభువు. ఆదాము వాటికి పేర్లు పెట్టాడు. అనగా వాటిమీద అధికారం పొందాడు. కాని ఆదామునకు సహాయపడే సాటిజంతువు వాటిల్లో లేదు. వాటి స్థితి వేరు, అతని స్థితి వేరు. అంచేత అతనికి సహాయపడగలిగే వ్యక్తిని, ఏవను, ప్రభువు ప్రత్యేకంగా సృజించాడు. ఆమె లేనిదే అతడు పరిపూర్ణ ప్రాణికాలేదు. సంతానాన్ని పొంది అభివృద్ధిలోనికి రాలేదు. అతడు లేనిదే ఆమెకూడ పరిపూర్ణురాలు కాలేదు.

వృద్ధుడు వూతకర్రమీదలాగ అతడు ఆమెమీద, ఆమె అతనిమీద ఆధారపడుతూ వుండాలి. (సహాయం అనే హీబ్రూ పదానికి అర్థం ఇది). వాళ్ళిద్దరూ దేవునిమీద ఆధారపడుతూ వుండాలి.

## 3. సంతానం

"మీరు సంతానాన్ని కని అభివృద్ధి చెందండి. భూమి మీద వ్యాపించి దాన్ని వశపరచుకోండి" - ఆది 1,28.

సంతానం దేనికి? నరుడు దేవుని ప్రతిబింబం అన్నాం. భగవంతుని మహిమను ప్రకాశింపజేసేవాళ్లు నరులు. కావున నరులు ఈ నేలమీద సంచరించేలా చేయడం కోసం ఆదిదంపతులు సంతానం కనాలి. దేవుడు తొలిదంపతుల్ని తానే సృజించాడు. ఆ మీదట మనుష్యప్రాణుల్ని మనుష్యుల ద్వారాకాని సృజింపడు.

ఇక్కడ వివాహంయొక్క తొలిధర్మం సూచింపబడింది. పూర్వవేద ప్రజలు సంతానాన్ని మక్కువతో వాంఛించారు. బిడ్డల్ని కనటమంటే ప్రభువు ఆశీర్వాదాన్ని పొందటం. సంతానం లేకపోవడమంటే దైవశాపానికి గురికావడం.

## 4. పరస్పర ప్రేమ

"ఈవిడ నా ఎముకల్లో ఎముక, నా శరీరంలో శరీరం. నరునినుండి కలిగింపబడింది కనుక యీవిడ నారి అనబడుతుంది. కావున పురుషుడు తల్లిదండ్రులనుగూడ విడచి భార్యకు హత్తుకుంటాడు. వాళ్ళిద్దరూ ఒకే వ్యక్తిగా ఐక్యమౌతారు" - ఆది 2,23-24.

ఆదాము ఏవనుచూచి "ఈవిడ నా ఎముకల్లో ఎముక. శరీరంలో శరీరం" అనుకున్నాడు. దగ్గరిబంధువురాలు అని యీ మాటల భావం. ఆమె అతని దేహంనుండి పుట్టింది. అచ్చంగా అతని కోవకే చెందింది. అందుకే అతడు నరుడైతే, ఆవిడ నారి. ఇక, వాళ్ళిద్దరి సంబంధం చాల సన్నిహితమైంది. అతడు, ఆమె గాఢంగా ప్రేమించుకుంటారు. ఒకరితో ఒకరు ఐక్యమౌతారు. ఇద్దరైనాగూడా ఒకేవ్యక్తిగా కూడుకొనిపోతారు. అలా కూడుకొని ఒకరికొకరు సహాయపడతారు. బిడ్డల్ని కంటూవుంటారు. పురుషుడు తల్లిదండ్రులనుగూడ వదలిపెట్టి భార్యతో జీవిస్తాడు. క్రొత్త కుటుంబం ఏర్పరచుకుంటాడు. ఇక్కడ భార్యాభర్తల పరస్పర ప్రేమభావం, సహాయభావం సూచింపబడింది. ఇది వివాహపు రెండవ ధర్మం.

కావున ఆదిదంపతులను వర్ణించిన హీబ్రూ రచయిత దృష్టిలో వివాహధర్మాలు రెండు : సంతానం, పరస్పర ప్రేమ. ఇవి రెండూ బైబులు సూచించే ప్రధాన ధర్మాలు. పూర్వవేదంలో వేరే తావుల్లోకూడ వివాహపు ప్రస్తావన వస్తుంది.

## 5. ఇతర భావాలు

యావే ప్రభువు యిస్రాయేలు ప్రజలతో ఒడంబడిక చేసికొన్నాడు. ఈ యొడంబడికను వివాహంగా భావించారు ప్రవక్తలు. యావే నరుడు. యిస్రాయేలు ప్రజ వధువు. "నిన్ను సృజించిన ప్రభువే నీ భర్త" అంటాడు యెషయా ప్రవక్త - 54,5. "ఎడారి కాలంలో ఒక వధువులా నన్ననుసరించి వచ్చావు" అంటాడు యిర్మీయా ప్రవక్త -2,2.

అబ్రాహాము తన భార్యయైన సారను గాఢంగా ప్రేమించాడు. సార అతనికి లోబడి వుండేది. అనురాగంతో అతన్ని 'ప్రభూ' అని పిలిచేది. వీళ్ళకుటుంబములో నుండే మెస్సీయా జన్మించింది. వీళ్ళలాగే తోబియా సార కూడ ప్రేమిజీవితం జీవించిన ఆదర్శ దంపతులు.

కీర్తనకారులు వివాహజీవితాన్ని ఉదాత్తభావాలతో వర్ణించారు.

"నీ లోగిట నీ భార్య ఫలించిన ద్రాక్షలతలా ఉంటుంది. భోజనపు బల్లచుట్టు నీ పిల్లలు ఓలివుమొక్కల్లా కనబడతారు. ప్రభువుపట్ల భయభక్తులు చూపే గృహస్థు ఇలాంటి ఆశీర్వాదాన్ని పొందుతాడు" - కీర్తన 128,3-4.

మరో కీర్తనకారుడు పెండ్లికుమార్తెను ఇలా హెచ్చరించాడు - కీర్తన 45,10-11.

"కుమారీ! సావధానంగా విను
నీ పుట్టింటిని సొంత జనాన్ని యిక మరచిపో
ఈ రాజు నీ ప్రభువు
నీ సౌందర్యాన్ని కోరినవాడు ఇతడే
ఇతనికి నమస్కరిస్తూ వుండు."

## 6. పాపానంతరం వివాహదశలో మార్పు

పాపం తర్వాత ఆదిదంపతుల వివాహదశలో పెద్దమార్పు వచ్చింది. పూర్వమున్న భాగ్యస్థితిపోయి దౌర్భాగ్యస్థితి పట్టుకొంది. ఆదాము ఏవకు సహచరుడు కావడం మానివేసి నియంత అయ్యాడు. ఏవ ఆదాముకు సహాయురాలు కావడానికి బదులు బానిస ఐంది – ఆది 3,16. దేవుడు ఆదామును నిలదీయగా అతడు తాను తినగూడని పండు తినడానికి

కారణం ఏవ అన్నాడు. తప్పు ఆమెమీద మోపాడు-3,12. పాపానికి ముందు ఏవకు వ్యాధిబాధలు లేవు. కాని పాపానంతరం ఏవ ప్రసవవేదనకు గురైంది - 3,16. ఆదాము నొసటి చెమటోడ్చి రెక్కలకష్టం చేయవలసివచ్చింది - 3,16. తొలిపాపం వలన భూమికూడ శాపం పాలయింది. అది పైర్లకు మారుగా ముండ్ల తుప్పలను ఎదిగించింది - 3,17-18.

పాపానికి ముందు ఆదామేవలు దిగంబరులుగా వున్నా వారికి సిగ్గవేయలేదు. కాని పాపం తర్వాత సిగ్గు పుట్టింది. కనుక అత్తియాకులతో దిసమొలలను కప్పుకొన్నారు - 3,7. అనగా వారి నిష్కల్మషత్వం పోయింది. ఇంద్రియ వాంఛలు అదుపుతప్పాయి. ఈ యనర్థాలన్నీ కూడ పాపం వివాహదశలో తెచ్చిపెట్టిన దుష్పరిణామాలు.

## ప్రార్థనా భావాలు

*1. భార్యవలన భర్తపొందే తృప్తి*

ఈసాకు రిబ్కాను వివాహమాడాడు. ఆమెను నిండు మనస్సుతో ప్రేమించాడు. తల్లియైన సార చనిపోయిన తరవాత ఈసాకునకు చాల దుఃఖము కలిగింది. అప్పుడు రిబ్కా అతన్ని ఓదార్చింది. దానితో అతని దుఃఖం తీరిపోయింది. భార్యవలన భర్తపొందే తృప్తి ఇలాగుంటుంది- ఆది 24,67.

*2 భర్తవలన భార్యపొందే సంతృప్తి*

ఎల్కానా భార్య అన్న. ఆమెకు సంతానం కలగలేదు. ఓనాడు వాళ్లు షిలో దేవాలయానికి వెళ్ళారు. అన్న దేవాలయంలో ఓ మూల చతికిలపడి విలపించింది. అన్నం తినడం మానివేసింది. అది చూచి ఎల్కానా "అన్నా! నీకు ఈ విచారం దేనికి? నా ప్రేమ నీకు చాలదా? పదిమంది కొడుకులకంటెకూడ నేను నీకు ఎక్కువగాదా?" అన్నాడు. ఆ మాటలకు సంతృప్తిచెంది అన్న యింటికి వెళ్ళింది. ఆ మీదట వాళ్ళకు సమూవేలు పుట్టాడు. భర్త వలన భార్య యిలా సంతృప్తి చెందుతుంది - 1సమూ 1,8.

*3. భార్యాస్తుతి*

"ఉదయించే సూర్యుడు ఆకాశానికి అలంకారం
మంచి యిల్లాలు ఇంటికి అలంకారం
వెలిగే దీపం దీప స్తంభానికి అలంకారం
చిరునవ్వు నవ్వే ముఖం భార్యకు అలంకారం

సీరా 26,16-21.

*4. సంతాన దృష్టి*

తోబియా సారాను పెండ్లాడాడు. పెండ్లినాటిరాత్రి సారా తోబియా దగ్గరకు వచ్చింది. అప్పుడు తోబియా "ప్రభూ! ఆదామునకు ఏవను సహాయురాలినిగా అనుగ్రహించావు. వారిద్దరి వలన మానవలోకం ఉద్భవించింది. నేను సారాను ఈ దినం భార్యగా స్వీకరిస్తున్నాను. కామతృప్తికోసంగాక సంతానాన్ని పొందడంకోసం ఈవిడను గ్రహిస్తున్నాను. ముసలిప్రాయం వరకూ నేను ఈవిడతో కూడి జీవింతునుగాక" అని ప్రార్థించాడు. ఆ ప్రార్థనకు సార ఆమెన్ అని జవాబిచ్చింది. బైబుల్లోని స్త్రీ పురుషులు సంతానంపట్ల చూపే వాంఛ యిలా వుంటుంది - తోబీ 8,5-9.

*5. సహాయురాలు*

ఆదాముకోసం యోగ్యురాలైన సహాయురాల్ని సృజించాలనుకున్నాడు యావే. ఈ సందర్భంలో "సహాయరాలు" అంటే 1. ఆదామునకు దగ్గరి బంధువురాలు. ఆమె అతని ఎముకనుండి పుట్టింది. 2. ఆమెద్వారా కాని అతడు పరిపూర్ణుడు కాలేడు. ఆమెతో అతడు లైంగిక సంబంధం ఏర్పరచుకొని బిడ్డలను కనాలి. కఱ్ఱమీద ఆధారపడే వృద్ధునిలాగ ఆమెమీద అతడు ఆధారపడాలి. ఒక్క వాక్యంలో చెప్పాలంటే, వాళ్ళిద్దరు ఒకే వ్యక్తిగా ఐక్యమైపోవాలి. భార్యాభర్తల సంబంధం, సన్నిహితత్వం ఈలాంటిది.

*6. హెచ్చుతగ్గులు*

భగవంతుని సృష్టి ప్రణాళికరీత్యా స్త్రీ పురుషుల శక్తి సామర్థ్యాల్లో భేదం వుంది. లింగభేదమూవుంది. సమాజంలో వాళ్ళు చేయవలసినపనులుకూడా భిన్నభిన్నంగా వుంటాయి. కాని వాళ్ళిద్దరి విలువల్లో భేదం లేదు. స్త్రీ పురుషులు ఇద్దరూ దేవుని బిడ్డలే. దేవుని యెదుట యిద్దరూ సమానులే. యావే ఆదాము ఏవలను సృజించి వారికి "నరులు" అని పేరు పెట్టాడు. అనగా ఈ వాక్యంలో నరశబ్దం ఇద్దరకూ వర్తిస్తుంది. ఇద్దరు సమానులే-ఆది 2,23. స్త్రీకి పురుషుడు ఎంత అవసరమో, పురుషునికి స్త్రీకూడా అంత అవసరం-1కొ 11,11. పైగా క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినవాళ్లు లింగభేదాన్ని అతిక్రమించి సమానమైన హోదాను పొందుతారు - గల 3,28.

*7. భార్య భర్తకు బానిస ఔతుందా?*

ఆదిదంపతులు పాపంచేసాక, యావే ఏవను చూచి నీవు నీ భర్తకు బానిస వౌతావని శపించాడు - ఆది 3,16. కాని యిది ఏవ దుష్కర్మవలన కలిగిన శిక్ష, పాపఫలితం. స్త్రీ సామాన్యధర్మం కాదు. కావున క్రైస్తవభార్య భర్తకు సహాయురాలుగాని భానిసకాదు. అందుచే క్రైస్తవభర్త భార్యను స్నేహితురాలునిగా భావించాలి.

# 2. క్రీస్తు శ్రీసభ

ఎఫె 5,22-32. { 1. క్రీస్తు -- పురుషుడు -- ఆత్మార్పణం
2. శ్రీసభ -- స్త్రీ -- విధేయురాలు }

## 1. పోలిక

"క్రీస్తు శ్రీసభను ప్రేమించాడు. ఆ సభ కొరకై తన్ను తాను అర్పించుకొన్నాడు. శ్రీసభ క్రీస్తునకు లోబడి వుంటుంది".

పూర్వవేదంలోని ప్రవక్తలు భగవంతునకు ప్రజలకు మధ్యవుండే ప్రేమ భార్యాభర్తల ప్రేమలాంటిది అన్నారు. కాని భార్యాభర్తల ప్రేమ భగవంతునకు ప్రజలకు మధ్య వుండే ప్రేమలాంటిది అనలేదు. అనగా దేవుని ప్రేమ మన ప్రేమలాంటిది అన్నారుగాని, మన ప్రేమ దేవుని ప్రేమ లాంటిది అనలేదు.

ఇక, తొలిసారిగా మనప్రేమను దేవుని ప్రేమతో పోల్చాడు ప్రేషితుడైన పౌలు. అతని భావం ప్రకారం క్రీస్తు వరుడు, శ్రీసభ వధువు. క్రీస్తు ప్రాణాలనే అర్పించి శ్రీసభను వధువుగా పొందాడు. శ్రీసభ వరుడైన క్రీస్తునకు విధేయురాలై వుంటుంది. (ఇక్కడ శ్రీసభ అనగా - క్రీస్తును విశ్వసించే క్రైస్తవ సమాజం)

## 2. అన్వయం

క్రీస్తు క్రైస్తవ వరునకు పోలికగా వుంటాడు. శ్రీసభ క్రైస్తవ వధువునకు పోలికగా వుంటుంది. జ్ఞానస్నానం పొందిన క్రైస్తవ వధూవరులు ఇద్దరూ వివాహం చేసికోగానే క్రీస్తు శ్రీసభ అనే పోలిక వాళ్ళకు సోకుతుంది. క్రీస్తు శ్రీసభల సంబంధం వాళ్ళకు వర్తిస్తుంది. క్రీస్తు శ్రీసభల వరప్రసాదం వాళ్ళమీద పనిచేస్తుంది.

క్రైస్తవ వివాహంలోని ఘనత అంతాకూడా ఈ పోలికలోనే యిమిడి వుంది. ఈ పోలికే లేకపోతే మన వివాహాలు అన్యమతస్థుల వివాహాలు ఒక్కటే ఔతాయి. అందుకే మనవాళ్ళు జ్ఞానవివాహం చేసుకొమ్మనేది.

## 3. బాధ్యతలు

మొదట శ్రీసభ, స్త్రీలు : క్రీస్తు శ్రీసభను రక్షించాడు. ఆమె పాపాలను తన నెత్తుటితో కడిగివేసాడు. ఆమెకు వాక్యస్నానం చేయించాడు. ఆమెను తన వధువును చేసికున్నాడు. కావున శ్రీసభ క్రీస్తునకు లోబడి ఉంటుంది. ఇదే విధంగా క్రైస్తవ భార్యకూడ

భర్తకు లోబడివుండాలి. క్రీస్తు శ్రీసభకులాగే, భర్త భార్యకు శిరస్సు. శిరస్సు అవయవాల్ని అదుపులో పెట్టుకుంటుంది. అదేవిధంగా భర్తకూడ భార్యను తన అధీనంలో వుంచుకుంటాడు. కావున క్రైస్తవ భార్య యొక్క ప్రధాన ధర్మం విధేయత.

ఆ పిమ్మట క్రీస్తు, పురుషులు : క్రైస్తవ భర్త భార్యను స్వాధీనంలో వుంచుకోవడమంటే ఆమెమీద అధికారం చలాయించటంగాదు. క్రీస్తు శ్రీసభను ప్రేమించినట్లుగా అతడూ భార్యను ప్రేమిస్తూండాలి. ఇది భర్తయొక్క ప్రధాన ధర్మం.

క్రీస్తు శ్రీసభను ఎలా ప్రేమించాడు? పాపాత్మురాలైన శ్రీసభకోసం సిలువబలిద్వారా తన్ను తాను సమర్పించుకున్నాడు. క్రీస్తు తన నెత్తుటితో ఆ సభ మాలిన్యం కడిగివేసాడు. తన వాక్యబోధనమే ఆ సభకు స్నానం. ఆమెను సుందరంగా అలంకరించి తనముందు నిలుపుకున్నాడు. (ఆనాటి గ్రీకు కుటుంబాల్లో, వివాహ సమయంలో వధువును చక్కగా అలంకరించి వరునిముందు నిలిపేవాళ్ళు). ఆ సభను తన వరప్రసాదంతో పోషించి కాపాడుతూవచ్చాడు. ఈలాగే భర్తకూడ భార్యకోసం తన్ను తాను అర్పించుకోవాలి. ఆమె శ్రేయస్సుకోసం పాటుపడాలి. ఆమెను ప్రేమిస్తూ ఆమెయందు ఆనందిస్తూ ఉండాలి. ఆమెను పోషిస్తూ ఆదరిస్తూ ఉండాలి. తన తల్లిదండ్రులను గూడ వదలిపెట్టి ఆమెతో ఐక్యంగావాలి. అతడు శిరస్సు, ఆమె దేహం. శిరస్సు దేహాన్ని ఆదరించినట్లే అతడూ ఆమెను ఆదరిస్తూ వుండాలి. కావున భర్తయొక్క బాధ్యతలు చాలగొప్పవి.

## 4. వివాహ జీవితం - సిలువ బలి

వివాహజీవితం క్రీస్తు సిలువ మరణానికి చిహ్నంగా ఉంటుంది. క్రీస్తు సిలువమీద చనిపోతేనేగాని శ్రీసభ పునీతురాలు కాలేదు. అలాగే వివాహజీవితంలోగూడ భర్తవైపున నిత్యం స్వార్థత్యాగమంటూ ఉండాలి. భార్యాపుత్రులను ఆదరించడమంటూ ఉండాలి.

భార్య భర్తకు విధేయత చూపుతూ తాను పునీతురాలు కావాలి. తన బిడ్డలను పునీతులను జేసికోవాలి. ఆమె చేయవలసిన త్యాగం ఈ విధేయతే. ఇలా భార్యాభర్తలిద్దరుకూడ క్రీస్తునందు పునీతులు కావాలి.

## ప్రార్థనా భావాలు

*1. భర్త ప్రేమ*

భార్య భర్తకోసం ఉద్దేశింపబడినది - 1కొ 11,9. కావున శిరస్సు దేహాన్నివలె అతడూ ఆమెను ఆదరిస్తూ ఉండాలి-ఎఫె 5,28.

*2. భార్య ప్రేమ*

యూదితు యిస్రాయేలు స్త్రీ. విధవ. చాల ప్రజ్ఞావంతురాలు. హోలోఫెర్నెసు అనే శత్రుసైన్యాధిపతి శిరస్సు తెగనరికి తన ప్రజలకు విజయం చేకూర్చింది. యెరూషలేం పట్టణాన్ని కాపాడింది. ఈమె సౌందర్యాన్ని, సాహసాన్ని మెచ్చుకొని చాలమంది ఈమెను పెండ్లాడాలని ఉవ్విళ్ళూరారు. కాని యూదితు మాత్రం గతించిన తన భర్త మనష్షేను స్మరించుకుంటూ వివాహం మానివేసింది. వైధవ్యంతోనే రోజులు వెళ్ళబుచ్చింది. భర్తపట్ల ఆమె చూపిన గాఢానురాగం అలాంటిది-యూదితు 16,22.

*3. వివాహ సంకేతాలు*

క్రైస్తవ వివాహంలో రెండు సంకేతాలు ఉన్నాయి. పూర్వవేదంలో యావే ప్రభువు యిస్రాయేలు ప్రజలతో ఒడంబడిక చేసికున్నాడు. ఈ యొడంబడికనే ప్రవక్తలు పెండ్లిగా భావించారు. అనగా యావే అనే వరుడు యిస్రాయేలు అనే వధువును పెండ్లిచేసుకున్నాడు. ఈ యొడంబడిక క్రైస్తవ వివాహానికి సంకేతంగా ఉంటుంది. ఇక, నూత్నవేదంలో క్రీస్తు శ్రీసభను ప్రేమించి ఆ సభకోసం ప్రాణాలర్పించాడు. ఈ క్రీస్తు-శ్రీసభల ప్రేమకూడా క్రైస్తవ వివాహానికి పోలికగా వుంటుంది.

*4. శ్రీసభ సంతానవతి*

క్రీస్తుపత్ని శ్రీసభ సంతానవతిగాని గొడ్రాలుగాదు. జ్ఞానస్నానపుతొట్టి ఆమె గర్భం. ఈ జ్ఞానస్నానం ద్వారా ఆమె చాలమంది బిడ్డలను కంటుంది. వాళ్ళనుచూచి ఆనందిస్తుంది. ఈలాగే క్రైస్తవ కుటుంబినికూడ తన సంతానాన్ని చూచి సంతృప్తి చెందాలి. వివాహపు పూజలో గురువు "ప్రభూ! ఈ వధూవరులు తమ బిడ్డలను, బిడ్డల బిడ్డలను చూచేవరకూ జీవింతురుగాక" అని ప్రార్థిస్తారు.

# 3. సహజమైన వివాహబంధాన్నే క్రీస్తు సంస్కారంగా మార్చాడు

ఇతర దేవద్రవ్యానుమానాలను క్రీస్తు క్రొత్తగా స్థాపించాడు. కాని వివాహాన్ని అతడు నూత్నంగా స్థాపించలేదు. మానవజాతిలో అంతవరకు సహజంగా నెలకొనివున్న వివాహబంధాన్నే క్రైస్తవ సంస్కారంగా మార్చాడు. ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. సహజంగానేవున్న వివాహబంధం పవిత్రమైంది.

అనాదికాలంనుండి మానవజాతిలో సహజమైన వివాహబంధం నెలకొనివుంది. ఈ వివాహం కేవలం ఓ సాంఘిక ఆచారం మాత్రమే కాదు. అది భగవంతునితో ముడివడివుంది. కనుక పవిత్రమైంది. ఈ పవిత్ర వివాహబంధాన్నే క్రీస్తు సంస్కారంగా మార్చింది.

మానవలోకంలో సహజంగా నెలకొనివున్న పరిణయం పవిత్రమైందని నిరూపించడం ఎలా? ఆదిమకాలంలోనే భగవంతుడు స్త్రీ పురుషులమధ్య ఐక్యతను నెలకొల్పి పెండ్లిని ఏర్పాటుచేసాడు. కనుక ప్రతిజాతిలోను, ప్రతిమతంలోను ప్రజలు పరిణయాన్ని దివ్యమైనదాన్నిగా ఎంచారు. దానికి ఎన్నో కర్మకాండలు చేర్చారు. దానిపట్ల గౌరవం పెంచుకొన్నారు. భగవంతుడు భార్యాభర్తలద్వారా తన బిడ్డలైన నరులను సృజిస్తాడు. పరమేశ్వరుని జీవం తల్లిదండ్రులద్వారా బిడ్డలను చేరుతుంది. దంపతులమధ్య ఉండే పరస్పరానురాగంగూడ భగవంతుని ప్రేమే. ఈ ప్రేమను అతడు దీవించి ఫలప్రదం చేస్తాడు. ఫలితంగా బిడ్డలు కలుగుతారు. ఈ శిశువులు భగవంతుని పోలిక కలవాళ్లు. **కడన** భగవంతుణ్ణి చేరుకొనేవాళ్లు. నరులు పెండ్లితంతుద్వారా దేవునినుండి దీవెనలుపొంది **ఆ పిమ్మట** శారీరకంగా ఐక్యమై దేవుని ప్రతిరూపమైన సంతానాన్ని కంటారు. ఈలా **పెండ్లిలో** ప్రతి అంశంలోను భగవంతుని ప్రమేయం ఉంటుంది. కనుక అది పవిత్రమైంది.

సుతుడు నరావతారం ఎత్తినపుడు అతని దైవస్వభావం మన మానవ స్వభావంతో ఐక్యమైంది. ప్రాచీనకాలంనుండి వస్తున్న స్త్రీ పురుషుల ఐక్యత ఈ దైవమానవ ఐక్యతను సూచిస్తుంది. పెండ్లి క్రీస్తు నరావతారానికి గుర్తుగా ఉంటుంది. పెండ్లి పవిత్రతకు ఇదికూడ ఒక కారణం.

## 2. వివాహానికి సంస్కారంగా గుర్తింపు ఎప్పుడు వచ్చింది?

తిరుసభ పెండ్లిని ఎప్పుడు క్రైస్తవ సంస్కారంగా గుర్తించింది? తిరుసభకు పరిణయం పవిత్రమైందని మొదటినుండి తెలుసు. కాని అది ఏడు దేవద్రవ్యానుమానాల్లో ఒకటని తొలిరోజుల్లో తెలియదు. ప్రాచీన వేదశాస్త్రులు వివాహం క్రీస్తుకీ తిరుసభకూవుండే ఐక్యతను సూచిస్తుందనుకొన్నారు. నరుల్లో సహజంగా వుండి వాళ్ళను అపమార్గం పట్టించే లైంగిక వాంఛలకు అది విరుగుడుగా పనిచేస్తుందనుకొన్నారు. కాని దానివల్ల వివాహితులకు ప్రత్యేక వరప్రసాదం లభిస్తుందనుకోలేదు. పైగా వివాహజీవితంలో లింగం ప్రమేయం అధికంగా ఉంటుంది. కనుక అది వరప్రసాదాన్ని ఈయలేదు అనుకొన్నారు.

1350 ప్రాంతంలోగాని క్రైస్తవ వేదాంతులు వివాహం ద్వారా ప్రత్యేక వరప్రసాదం లభిస్తుందనీ, అది యేడు దేవ ద్రవ్యానుమానాల్లో ఒకటనీ స్పష్టంగా తెలియజేయలేదు. 16వ శతాబ్దంలో లూతరూ అతని అనుయాయులూ వివాహం దేవద్రవ్యానుమానం కాదని వాదించారు. అది కేవలం తిరుసభ ఏర్పరచిన తంతుకనుక దాని వల్ల వరప్రసాదం లభించదన్నారు. దీనికి భిన్నంగా త్రెంటు మహాసభ పెండ్లి యేడు సంస్కారాల్లో ఒకటని ధ్రువీకరించింది.

## 3. వివాహం సంస్కారమేనని చెప్పే బైబులు బోధలు

పూర్వవేదంలో దేవుడు సీనాయికొండదగ్గర యిస్రాయేలీయులతో నిబంధనం చేసికొన్నాడు. వారిని గాఢంగా ప్రేమించాడు. ఈ నిబంధనం స్త్రీ పురుషుల పెండ్లిలాంటిది అన్నారు ప్రవక్తలు. నిబంధనంద్వారా దేవుడు వరుడు, యిస్రాయేలు వధువు అయ్యారని చెప్పారు. ఈ నిబంధనం భావికాలంలో రాబోయే స్త్రీ పురుషుల ఐక్యతనుగూడ సూచిస్తుంది. క్రీస్తు సిలువమీద చనిపోయి తిరుసభను పత్నిగా పొందాడు. తిరుసభను గాఢంగా ప్రేమించాడు. నూత్నవేదంలో క్రీస్తు తిరుసభల పోలిక వధూవరులమీద సోకుతుంది. వారి పెండ్లిని సంస్కారంగా మార్చి వారికి వరప్రసాదాన్ని దయచేస్తుంది. క్రైస్తవ పరిణయంలో ఈ క్రీస్తు తిరుసభల పోలికే ముఖ్యమైంది.

క్రీస్తు వివాహ సంస్కారాన్ని ఎప్పుడు స్థాపించాడు? ప్రభువు కానాపూరి వివాహానికి హాజరై అక్కడి పెండ్లివారికి సహాయం చేసాడు - యోహా2. భర్త భార్యను పరిత్యజించడం న్యాయమేనా అని పరిసయులు అడిగినప్పుడు అతడు విడాకులు చెల్లవని చెప్పాడు. దేవుడు జతపరచిన జంటను మానవమాత్రులు వేరుపరచగూడదు అన్నాడు-మత్త 19,6. ఈ సందర్భాలను పురస్కరించుకొని తిరుసభ క్రీస్తు హృదయాన్ని అర్థం చేసికొంది. ప్రభువు పరిణయాన్ని గూడ ఓ సంస్కారంగా పరిగణింపగోరాడని క్రమేణ గుర్తించింది. బైబులంతటిలోను ఎఫెసీయులు 5,21-33లో పౌలు చెప్పిన క్రీస్తు తిరుసభల పోలిక వివాహంగూడ ఓ సంస్కారమేనని అర్థంచేసికోవడానికి బాగా ఉపయోగపడుతుంది. తిరుసభ ప్రారంభంనుండి వివాహాన్ని దేవద్రవ్యానుమానంగా గణించకపోయినా దాన్ని ఓ పవిత్రకార్యంగా గుర్తిస్తూ వచ్చింది. ఒక దశలో అదికూడ దేవద్రవ్యానుమానమేనని గ్రహించింది. కనుక ప్రోటస్టెంటు సంస్కరణవాదులు వాదించినట్లు అది కేవలం తిరుసభ సృష్టించింది కాదు. క్రీస్తు స్వయంగా నెలకొల్పింది.

ప్రతి దేవద్రవ్యానుమానమూ ఉత్థానక్రీస్తు నెరవేర్చే పవిత్రక్రియ. తిరుసభ జరిపే ఓ సాంకేతిక క్రియ. దానిద్వారా ప్రభువు ఆన ఉత్థాన భాగ్యాలనుండి మనకు వరప్రసాదాన్ని

దయచేస్తాడు. జ్ఞానవివాహంకూడా ఈలా మనకు ఉత్థానక్రీస్తు వరప్రసాదాన్ని దయచేసేదే కనుక అది కూడ ఓ దేవ ద్రవ్యానుమానమే.

పరిణయమాడే వధూవరులు క్రీస్తుని తిరుసభనూ పోలివుంటారని చెప్పాడు పౌలు. ఈ పోలిక వరప్రసాదాన్ని సంపాదించి పెడుతుంది. కనుక జ్ఞానవివాహంగూడ ఓ సంస్కారమే.

సంగ్రహంగా చెప్పాలంటే, క్రీస్తు జ్ఞానవివాహాన్ని నూత్నంగా స్థాపించలేదు. అది లోకారంభంనుండి మానవజాతిలో వున్నదే. ప్రభువు దాన్ని చేకొని పవిత్రపరచి జ్ఞానవివాహమనే నూత్న సంస్కారాన్ని ఏర్పాటు చేసాడు.

## ప్రార్థనా భావాలు

*1. దేవునికి లింగం లేదు*

పూర్వవేదాన్ని వ్రాసిన కాలంలో యిస్రాయేలీయులకు సమకాలికులైన అన్యజాతి ప్రజలు బాలు దేవతను కొల్చేవాళ్ళు. ఈ దేవతకు అనత్ అనే భార్య వుండేది. ఆనాటి అన్యజాతి ప్రజలు ఈ భార్యాభర్తలు తమకు సంతానాన్ని ప్రసాదిస్తారని నమ్మి వారిని కొల్చేవాళ్ళు. దీనికి భిన్నంగా బైబులు వ్రాసిన భక్తులు యావే ప్రభువుకి భార్యలేదని చెప్పారు. శరీరధారి కాదు కనుక అతనికి లింగం కూడ లేదు. ఈ పవిత్ర ప్రభువు యిస్రాయేలీయులతో నిబంధనం చేసికొని వారిని దీవించాడు. తనకూ ఆ ప్రజలకూ మధ్య భార్యాభర్తల సంబంధం నెలకొనేలా చేసాడు. ఈ సంబంధమే తర్వాత క్రీస్తు తిరుసభలమీద సోకింది. నేడు మన వివాహం పవిత్రం కావడానికికూడ కారణమైంది.

*2. తొలి వివాహం*

భగవంతుడు నరుడు ఒంటరిగా ఉండడం మంచిది కాదు. అతనికి సాటియైన తోడును తయారుచేస్తాను అనుకొన్నాడు. ఆదాము ప్రక్కటెముకనుండి ఏవను రూపొందించి ఆమెను అతనికి తోడుగా ఇచ్చాడు–ఆది 2,18. ఆ జంటను దీవించి మీరు చాలమంది బిడ్డలను కని వృద్ధిచెందండని చెప్పాడు - 1,28. ఆదాము ఏవను ఆదరంతో అంగీకరించాడు. ఇదే బైబుల్లోని తొలి వివాహం. అది నేటి మన వివాహాలన్నిటికి ఆదర్శంగా వుంటుంది.

*3. పరస్పరాకర్షణం*

దేవుడు ఏవను ఆదాము ప్రక్కటెముక నుండి చేసాడు - ఆది 2,22. అనగా ఆమె అతని కోవకు చెందింది. అతనిలాంటిది. తర్వాత ఆదాము ఏవనుజూచి ఈమె నా

యెముకల్లో ఎముక, మాంసంలో మాంసం అనుకొని మురిసిపోయాడు-2,23. అనగా ఆమె తనకు దగ్గరి బంధువురాలు, ఆప్తురాలు అని భావం. ఆదామేవలు పరస్పరాకర్షణతో, అనురాగంతో ఏకవ్యక్తిగా ఐక్యమైపోయారు. భగవంతుడే భార్యాభర్తలమధ్య ఈ ఆకర్షణను నెలకొల్పి వారిలో పరస్పర ప్రేమను వృద్ధిచేస్తాడు. ఈ యనురాగమే లేకపోతే ఆలుమగలు దీర్ఘకాలం సంసారజీవితం గడపలేరు.

*4. పరమగీతం వర్ణించే ప్రేమ*

బైబుల్లో పరమగీతం చాల విలక్షణమైన గ్రంథం. ఈ పుస్తకం నిర్మలమైన దాంపత్యప్రేమను వర్ణిస్తుంది. "ప్రేమ మృత్యువువలె బలమైనది. ప్రేమజ్వాలలు అగ్నిజ్వాలల వంటివి. జలములు ప్రేమను ఆర్పలేవు. ప్రవాహములు వలపును ముంచివేయలేవు. ఎవడును తన పూర్తి సొత్తుతోగూడ ప్రేమను కొనజాలడు" - 8,6-7. దంపతులు ఈ గ్రంథాన్ని చదివి ప్రేరణను పొందాలి. తమ ప్రేమను బలపర్చుకోవాలి. ఈ పుస్తకం ప్రచారంలోకి వచ్చాక పూర్వవేద రబ్బయిలూ నూత్నవేద రబ్బయిలూకూడ దీనిలోని ప్రేమ భగవంతునికి నరులపట్ల వుండే ప్రేమకు పోలికగా వుంటుందని చెప్పారు. కాని ఈ గ్రంథరచయిత ఉద్దేశించిన మొదటి అర్థం దాంపత్య ప్రేమ మాత్రమే.

*5. మంచి తోడు*

పెండ్లి చేసికోబోయే యువతీయువకులు తమకు మంచి తోడు లభించాలని దేవుని ప్రార్థించాలి. వివాహితుల భవిష్యత్తు చాలవరకు వాళ్ళు పెండ్లియాడే వ్యక్తులపై ఆధారపడి వుంటుంది.

# 4. వివాహ విధిలో ముఖ్యాంశం వధూవరుల అంగీకారమే.

వధూవరుల అంగీకారంద్వారా క్రైస్తవ వివాహం దేవద్రవ్యానుమాన మౌతుంది. కనుక అంగీకారం అతిముఖ్యమైంది. దాన్నిగూర్చి మనకు క్షుణ్ణంగా తెలిసివుండాలి. ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. అంగీకారమే ముఖ్యమైంది

వధూవరులను భార్యాభర్తలనుగా చేసేది వారి యంగీకారం. జ్ఞానస్నానం పొందిన వధూవరులు గుళ్ళో పీఠంముందు హాజరై గురువు మరియు సాక్షులముందు తాము

ఒకరినొకరు పెండ్లి యాడ్డానికి సిద్ధంగా వున్నామని సూచిస్తూ తమ అంగీకారాన్ని తెలియజేస్తారు. ఈ యంగీకారాన్ని తెలియజేయమని ఎవరూ వారిని నిర్బంధం చేయగూడదు. వధూవరులు స్వేచ్ఛగా తమ సమ్మతిని తెలియజేయాలి. ఇంకా, వారి వివాహాన్ని రద్దుచేసే అవరోధాలు కూడ ఏమి వుండకూడదు.

తిరుసభ బోధల ప్రకారం, వధూవరులను భార్యాభర్తలను చేసేది ఈ యంగీకారమే. కనుక ఈ యంగీకారం వున్నపుడు నిజమైన వివాహం జరిగినట్లే. ఈ సమ్మతి లేనపుడు నిజమైన వివాహం జరగనట్లే. ఈ యంగీకారం వలననే క్రైస్తవ వివాహం దేవద్రవ్యానుమానం ఔతుంది.

గుడిలో పీఠంముందు వధూవరులు తమ సమ్మతిని ఈలా తెలియజేస్తారు. "రాజారావునైన నేను శాంతవైన నిన్ను భార్యగా చేకొంటున్నాను. - శాంతనైన నేను రాజారావువైన నిన్ను భర్తగా చేకొంటున్నాను. కష్టంలోను సుఖంలోను, వ్యాధిలోను సౌఖ్యంలోను నేను నీపట్ల విశ్వసనీయుడనుగా (విశ్వసనీయురాలినిగా) మెలుగుతానని మాట యిస్తున్నాను. నేను ప్రతినిత్యం నిన్ను ప్రేమించి గౌరవిస్తాను". ఈ యంగీకార వాక్యాలద్వారా స్త్రీ పురుషులు భార్యాభర్తలౌతారు. ఆ యిద్దరూ వివాహబంధం ద్వారా ఏకవ్యక్తిగా ఐక్యమైపోతారు. వివాహం సాంగ్యంలోకెల్ల ఈ యంగీకార వాక్యాలు అతి ముఖ్యమైనవి.

కనుక వధూవరులు ఈ వాక్యాలను హృదయపూర్వకంగా వెలిబుచ్చాలి. వాళ్ళు ఇతరుల వలన నిర్బంధానికీ గురైకాని, ఇతరులకు భయపడికాని ఈ వాక్యాలను ఉచ్చరించకూడదు. ఇతరుల నిర్బంధానికి గురై వెలిబుచ్చిన అంగీకారం నిజమైన అంగీకారం కానేరదు. ఆ పెండ్లికూడ నిజమైన పెండ్లికాదు. నిర్బంధంతో వెలిబుచ్చిన అంగీకారం పెండ్లిని రద్దు చేస్తుంది.

వివాహపూజను జరిపే గురువే వధూవరుల అంగీకారాన్ని తిరుసభ పేరిట స్వీకరిస్తారు. "తిరుసభ సమక్షంలో మీరు మీ సమ్మతిని వెల్లడిచేసారు. ప్రభువు దానిని దయతో దృఢపరచి మీకు సంపూర్ణాశీర్వాదాన్ని దయచేయునుగాక. సర్వేశ్వరుడు జతపరచిన జంటను మనుష్యమాత్రుడు వేరుపరపకుండుగాక" అని ఆశీర్వదిస్తారు. ఈలా గురువు, వివాహానికి సాక్షులుగావున్న పెద్దలుకూడ పెండ్లి తిరుసభ పేరిట జరిగిందని ధృవపరుస్తారు. యువతీ యువకులు ఎప్పుడుకూడ గుడిపెండ్లి చేసికోవాలి. తిరుసభ యిచ్చే వరప్రసాదం భార్యాభర్తలమీదికి, వారికి కలుగబోయే బిడ్డలమీదికికూడ దిగిరావాలి.

## 2. వివాహ సంస్కారాన్ని ఇచ్చేదెవరు?

జ్ఞానస్నానం మొదలైన దేవద్రవ్యానుమానాలను గురువు ఇస్తారు. కాని వివాహ దేవద్రవ్యానుమానాన్ని వధూవరులే ఒకరినొకరు ఇచ్చుకొంటారు. మామూలుగా క్రైస్తవ వివాహానికి గురువు హాజరుకావాలి. కాని కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో అతడు లేకపోయినా చెల్లుతుంది. కనుక గురువు ఈ దేవద్రవ్యానుమానాన్ని ఈయడని గ్రహించాలి. కొందరు వేదశాస్త్రులు గురువు ఆశీర్వాదం వలన వివాహ సంస్కారం జరుగుతుందని వాకొన్నారు ఇది పొరపాటు.

జ్ఞానస్నానం పొంది వుండడం వలన వధూవరులకు జ్ఞానస్నాన యాజకత్వం వుంటుంది. ఈ యాజకత్వం ద్వారానే వాళ్లు ఒకరికొకరు వివాహసంస్కారాన్ని ఇచ్చుకొంటారు. ఒకరికొకరు వరప్రసాదకారకులూ, రక్షణ సాధకులూ ఔతారు.

వివాహ సంస్కారం ఇద్దరు వ్యక్తులు ఇచ్చిపుచ్చుకొనేది. భార్యాభర్తలు ఒకరికొకరు ఈ సంస్కారాన్ని ఇస్తారు. ఒకరినుండి ఒకరు దీన్ని పొందుతారు. పరస్పరాంగీకారాన్ని తెలిపి వివాహ సంస్కారాన్ని జరుపుకొన్నపుడు ఆలుమగలమధ్య ఆధ్యాత్మికబంధం ఏర్పడుతుంది. ఐక్యత సిద్ధిస్తుంది. ఆ క్షణంనుండి వాళ్ళు జీవితంలోవచ్చే సుఖదుఃఖాలను కలిసే అనుభవిస్తారు.

మామూలుగా మన క్రైస్తవవివాహం పూజలో జరగుతుంది. పూజలో జరగనపుడుకూడ గురువు సాధారణంగా వివాహానికి హాజరుకావాలి. అతడు క్రైస్తవ వివాహానికీ దాని పావిత్ర్యానికీ సాక్షిగా వుంటాడు. అసలు వివాహ సంస్కారాన్ని జరిపే ప్రధానవ్యక్తి ఉత్థాన క్రీస్తే. వివాహానికి హాజరైన గురువు ఈ క్రీస్తు సాన్నిధ్యాన్ని సూచిస్తుంటాడు.

మనది ల్యాటిన్ (పశ్చిమ) తిరుసభ. మన దైవశాస్త్రం ప్రకారం వధూవరుల అంగీకారం వలననే వివాహం దేవద్రవ్యానుమానమౌతుంది. కాని ప్రాచ్య తిరుసభ దైవశాస్త్రం ప్రకారం, వివాహం దేవద్రవ్యానుమానం కావాలంటే వధూవరుల అంగీకారంతోపాటు గురువు ఆశీర్వాదం కూడా వుండాలి. అది ఆ క్రైస్తవుల ప్రత్యేకత.

పెండ్లితంతు ముగిసాక ఏ కారణం చేతనయినాసరే భార్యాభర్తలు తమ కళ్యాణాన్ని రద్దు చేసికోవాలంటే కుదురుతుందా? భార్యాభర్తలు శారీరకంగా కలసికొన్నతర్వాత ఆ వివాహాన్ని రద్దుచేయడానికి వీల్లేదు. శారీరక సంయోగంద్వారా క్రీస్తు తిరుసభల పోలికవాళ్ళమీద పరిపూర్ణంగా సోకుతుంది. వాళ్ళిద్దరూ పరిపూర్ణంగా ఏకశరీరం, ఏకవ్యక్తి ఔతారు. కాని శారీరకంగా కలసికోకపూర్వం కొన్ని నియమాల ప్రకారం వివాహాన్ని రద్దుచేయవచ్చు. ఈదశలో కళ్యాణం ఇంకా అపరిపూర్ణ స్థితిలోనే వుంటుంది.

వధూవరుల్లో ఒకరు అక్రైస్తవులైతే ఆ కళ్యాణం దేవద్రవ్యానుమానంకాదు. కాని అలాంటి వివాహం కూడ పవిత్రమైందే. వారికి కలిగే బిడ్డలుకూడ పవిత్రులుగానే వుంటారు. అవిశ్వాసియైన భర్త తన క్రైస్తవ భార్యద్వారా, అవిశ్వాసియైన భార్య తన క్రైస్తవ భర్తద్వారా పరిశుద్ధులౌతారు అన్నాడు పౌలు - 1కొ 7,14. ఐనా వివాహమాడే యిరువురూ జ్ఞానస్నానం పొందివుండడం సమంజసం.

క్రైస్తవులుకాని భార్యాభర్తలు జ్ఞానస్నానం పొందినపుడు వారి వివాహంకూడ దేవద్రవ్యానుమానం ఔతుంది.

## 3. వివాహంమీద తిరుసభకు అధికారం

వధూవరులే ఒకరికొకరు కల్యాణ సంస్కారాన్ని ఇచ్చుకొన్నా, వారి వివాహంమీద తిరుసభకు అధికారం వుంటుంది. వాళ్ళుకూడ తిరుసభలో భాగమే కదా! కనుక తిరుసభకు రక్తసంబంధం మొదలైన వివాహ ఆంక్షలు విధించే అధికారం వుంది.

పెండ్లి ఆధ్యాత్మిక రంగానికి మాత్రమేగాక లౌకికరంగానికికూడ చెందింది. కనుక ప్రభుత్వానికిగూడ దానిమీద అధికారం వుంది. ఆస్తి సంతానం మొదలైన విషయాల్లో వివాహితులమీద ప్రభుత్వాధికారం చెల్లుతుంది. ఈ రంగాల్లో గొడవలు వచ్చినపుడు మామూలుగా న్యాయస్థానం పరిష్కరిస్తుంది.

## ప్రార్థనా భావాలు

*1. ఆదామేవల అంగీకారం*

సృష్ట్యాదిలో ఆదామేవలు ఒకరినొకరు భార్యాభర్తలనుగా అంగీకరించారు. దేవుడు ఏవను ఆదామునొద్దకు తీసికొనిరాగా అతడు "ఈమె నా యెముకల్లో ఎముక దేహంలో దేహం. ఈమె నరునినుండి రూపొందింది కనుక నారి ఔతుంది. కావున నరుడు సొంత తల్లిదండ్రులనుగూడ విడనాడి తన ఆలికి అంటిపెట్టుకొని వుంటాడు. వాళ్ళిద్దరూ ఏకశరీరమౌతారు" అని అనుకొన్నాడు. ఒకవిధంగా, ఈ యాదామేవల అంగీకారం నేడు గుడిలో పెండ్లిచేసికొనే మన వధూవరుల అంగీకారంమీద కూడ సోకుతుంది. ఆ తొలి అంగీకారం నేటి మన అంగీకారాన్ని పవిత్రం చేస్తుంది. ఆదామేవలు అందరికీ ఆదిమ మాతాపితలు.

*2. ఒకరినొకరు నమ్మడం*

వధూవరుల అంగీకారంలో ఒకరినొకరు నమ్మడమనే గుణం వుంటుంది. "వాళ్ళు నేను నిన్ను భార్యగా - భర్తగా చేకొంటున్నాను. నీపట్ల విశ్వసనీయుడనుగా

(విశ్వసనీయురాలినిగా) మెలుగుతానని మాట యిస్తున్నాను" అనే వాక్యాలు ఉచ్చరిస్తారు. ఈ వాక్యాలద్వారా భార్యాభర్తలు ఒకరినొకరు నమ్ముతామని ప్రమాణం చేస్తున్నారు. ఈ ప్రమాణానికి తగ్గట్టుగా వాళ్ళు ఒకరినొకరు విశ్వసించాలి. ఒకరికొకరు మేలేగాని కీడు తలపెట్టకూడదు. ఒకరికొకరు విధేయులు కావాలి. ఒకరినొకరు ప్రేమించి, సేవించి అభివృద్ధిలోనికి తీసుకరావాలి. ఎప్పుడైనా భార్యాభర్తలమధ్య ఈ విశ్వాసగుణం లోపిస్తే దాన్ని వెంటనే భర్తీ చేసికోవాలి.

*3. లైంగికమైన కలయిక*

వధూవరులు పీఠంముందు నేను నిన్ను భార్యాగా - భర్తగా చేసికొంటున్నాను అని చెప్తారు. అనగా వాళ్ళిద్దరూ ఒకరినొకరు స్త్రీ పురుషులనుగా అంగీకరిస్తున్నారు. స్త్రీపురుషులు ఒకరికొకరు కావలసినవాళ్ళు. ఒకరినొకరు పరిపూర్ణం చేసికొనేవాళ్ళు. వాళ్ళిద్దరు ఏక శరీరులుగా ఐక్యమై సంతానాన్ని కనాలి. పౌలు చెప్పినట్లుగా ఒకరి శరీరంమీద ఒకరు యాజమాన్యం పొందాలి - 1కొ 7,4. ఒకరికొకరు శరీరదానం చేసికోవాలి. కనుక నేను నిన్ను భార్యగా - భర్తగా చేకొంటున్నాను అనే మాటల్లో లైంగికమైన కలయిక, సంతానప్రాప్తి అనే భావాలుకూడ ఇమిడివున్నాయి.

*4. ఎన్నిక*

వధూవరులు "నేను నిన్ను భార్యగా - భర్తగా స్వీకరిస్తున్నాను" అని చెప్తారు. ఈ వాక్యాల్లో ఎన్నిక అనే భావంకూడ ఉంది. ఇంతమందిలో నిన్ను మాత్రమే నేను భార్యగా-భర్తగా స్వీకరిస్తున్నాను అనే భావంకూడ ఇమిడివుంది. వరుడు ఇందరు యువతుల్లో ఈమెను మాత్రమే తనకు భార్యగా ఎన్నుకొంటున్నాడు. అలాగే వధువు ఇందరు యువకుల్లో ఇతన్ని మాత్రమే తనకు భర్తగా ఎన్నుకొంటూంది. ఇక వాళ్ళిద్దరూ పరస్పరానురాగంతో ఐక్యభావంతో జీవించాలి. ఇక వాళ్ళకు ఎడబాటుకాని విడాకులుకాని తగవు.

# 5. క్రైస్తవ వివాహం విడాకులను అంగీకరించదు

క్రైస్తవ వివాహానికి ఐక్యత, అవిచ్ఛిన్నత అనే రెండు గుణాలున్నాయి. వివాహం చేసికొనేవాళ్ళు స్వేచ్ఛగానే చేసికొంటారు. ఐనా వివాహం చేసికొన్న పిదప అందరూ ఈ రెండు లక్షణాలను పాటించవలసిందే. క్రీస్తు మానవలోకంలో సహజంగావున్న వివాహాన్నే దేవద్రవ్యానుమానంగా మార్చాడు. దానితో ఐక్యత, అవిచ్ఛిన్నత అనే రెండుగుణాలు ఇంకా బలపడ్డాయి. ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. ఐక్యత

ఐక్యత అంటే ఒక భార్య, ఒక భర్త మాత్రమే కలసి జీవించడం. కనుక బహుభర్తృత్వం, బహుభార్యాత్వం రెండూ నిషిద్ధాలే.

నరులు మొదట వివాహవ్యవస్థ లేకుండా విచ్చలవిడిగా జీవించేవాళ్ళనీ, తర్వాత బహుభార్యాత్వం వాడుకలోకి వచ్చిందనీ, ఆ పిమ్మట ఏకపత్నీ విధానం వ్యాప్తిలోకి వచ్చిందనీ కొందరు సాంఘిక శాస్త్రవేత్తలు వ్రాసారు. కాని ఈ వాదాన్ని ఇప్పుడు చాలమంది అంగీకరింపరు.

పెండ్లి అనాదికాలంనుండి ఉన్నదే. ఆదిమకాలంలో బహుభర్తృత్వం అక్కడక్కడ వాడుకలో ఉండివుండవచ్చు. కాని ఈ పద్ధతివల్ల పుట్టిన బిడ్డలకు చేటు కలుగుతుంది. సంతానానికి తల్లిదండ్రుల ఆదరణ లభించదు. కనుక ఈ విధానం సరైందికాదు. పైగా ఇప్పుడు బహుభర్తృత్వం ఎక్కడా వాడుకలో లేదు.

ఇక బహుభార్యాత్వానికి వస్తే, ఈ విధానం అన్ని దేశాల్లోను, అన్ని కాలాల్లోను వాడుకలో వుంది. ఐనా యిది ఏనాడుకూడ బహుళ ప్రచారంలో లేదు. ఎవరో కొద్దిమంది ధనవంతులు మాత్రం దీన్ని పాటించారు.

బహుభార్యాత్వంకూడ బిడ్డలకు చేటు తెస్తుంది. ఈ పద్ధతివల్ల జన్మించే బిడ్డలకు తండ్రి ఆదరాభిమానాలు సమానంగా లభించవు. పైగా ఒక పురుషుడు ఒక స్త్రీ పరస్పర ప్రేమభావంతో ఐక్యమయ్యేది వివాహం. సంసారంలో పురుషుడు తన్ను తాను పూర్తిగా ఒక స్త్రీకి అర్పించుకోవాలి. ఆలాగే స్త్రీ కూడ తన్నుతాను పూర్తిగా ఒక పురుషునికి అర్పించుకోవాలి. బహుభార్యాత్వంలో ఈసూత్రం చెల్లదు. కనుక అది సరైన పద్ధతి కాదు.

తొలిదంపతులైన ఆదామేవల వివాహం ఏకపత్నీ విధానం. ఏవ ఆదాముకి పరాయిదికాదు. అతని శరీరంనుండి పుట్టింది. అనగా అతనిలాంటిది, అతనితో సరిసమానమైంది. వాళ్ళిద్దరూ ఏకశరీరంగా, ఏకవ్యక్తిగా ఐక్యమౌతారు. ఇది భగవంతుడు నిర్ణయించిన వివాహపద్ధతి. ఐనా పూర్వవేదంలోని యూదులు చాలమంది ఈసూత్రాన్ని మీరి బహుభార్యాత్వాన్ని పాటించారు. భగవంతుడు ఆ కాలపు పరిస్థితుల ననుసరించి వారి లోపాన్ని సహించి వూరకున్నాడు. వాళ్లు ఇప్పుడు మనకు ఏమాత్రం ఆదర్శంకాదు.

ట్రెంటు మహాసభ క్రైస్తవులకు బహుభార్యాత్వం ఎంతమాత్రం చెల్లదని ఖండితంగా బోధించింది. క్రీస్తు తిరుసభల పోలిక సోకి క్రైస్తవవివాహం పునీతమౌతుంది. ఈ పోలికవల్ల క్రైస్తవ వివాహంలో ఏకత్వం ఇంకా బలపడుతుంది. బహుభార్యాత్వం భిన్నత్వాన్ని తెచ్చిపెడుతుంది. కనుక ఆ పద్ధతిని ఎంతమాత్రం అనుమతింపరాదు.

## 2. అవిచ్ఛిన్నత

అవిచ్ఛిన్నత అంటే భార్యాభర్తలు విడివడిపోకుండా జీవితాంతం కలసి జీవించడం. అనగా విడాకులు లేకపోవడం.

అన్ని జాతుల ప్రజలు వివాహం స్థిరంగా వుండాలని కోరుకొన్నారు. విడాకులను నిషేధించారు. ఐనా చాలమంది ఈ నిషేధాన్ని ఉల్లంఘించి విడాకులు పొందారు. అలా పొందిన తావులందెల్ల కుటుంబాలు జాతులుకూడ విచ్ఛిన్నమైపోయాయి.

బిడ్డల మేలుకోరే తల్లిదండ్రులు విడివడిపోకూడదు. కనుక విడాకులు పనికిరావు. పైగా భార్యాభర్తల బంధం పరిపూర్ణ ప్రేమను కోరేది. ఒక పురుషుడు ఒక స్త్రీనీ, ఒక స్త్రీ ఒక పురుషుణ్ణీ జీవితాంతం పరిపూర్ణంగా ప్రేమించాలి. అలా కాకుండ వాళ్ళు మధ్యలో విడివడిపోయి మరో మూడో వ్యక్తిని ప్రేమిస్తే అది వివాహమెలా ఔతుంది?

దేవుడు ఆదిదంపతులను జతగూర్చినపుడు విడాకులు పొసగవనే భావించాడు. ఆదామేవలు ఏకశరీరం, ఏకవ్యక్తికావాలనే అతని ఉద్దేశం - ఆది 2,24. తర్వాత మోషే ఆనాటి ప్రజల హృదయ కాఠిన్యాన్ని అనుసరించి - అనగా ప్రాచీనకాలంలోని పురుషులు స్త్రీలపట్ల బహూక్రూరంగా ప్రవర్తిస్తారని తెలిసి, స్త్రీల రక్షణను మనసులో పెట్టుకొనే విడాకులను అంగీకరించాడు. మగవాడు అబలను హింసించి చంపివేయడంకంటె విడాకులిచ్చి పంపివేయడం మెరుగుకదా! కాని సృష్ట్యాదిలో ఈ విడాకుల విధానంలేదు- మత్త 19,8. ఇరువురు వ్యక్తులు ఏకశరీరులై, అనగా ఏకప్రాణం కలవారై, ఏకవ్యక్తిగా ఒనగూడి జీవించాలంటే విడాకులు పొసగవు. దేవుడు జతపరచిన జంటను మానవమాత్రులు వేరుపరచరాదు-మత్త 19,6. ఇది క్రీస్తు బోధ.

16వ శతాబ్దంలో చీలిపోయిన ప్రోటస్టెంటు శాఖలు విడాకులను అంగీకరించాయి. కాని క్యాతలిక్ తిరుసభ మాత్రం ట్రెంటు మహాసభ కాలంనుండి వివాహబంధం అవిచ్ఛిన్నంగా ఉండిపోవాలని అధికారపూర్వకంగా బోధిస్తూ వచ్చింది. విశేషంగా భార్యాభర్తలు శారీరకంగా కలసికొన్నపుడు వారి వివాహం ఖండితంగా అవిచ్ఛిన్నంగా వుండిపోతుందని తిరుసభ బోధ... ఎందుకు?

క్రీస్తు తిరుసభల పోలికనోకి క్రైస్తవ వివాహం వరప్రసాదాన్ని పొందుతుంది. ప్రభువు తిరుసభ కొరకు ప్రాణాలర్పించాడు. తిరుసభ ప్రేమభావంతో తన్నుతాను క్రీస్తుకి అర్పించుకొంటుంది. అలాగే వివాహజీవితంలో గూడ భార్యాభర్తలు ఒకరికొకరు ప్రాణాలర్పించుకొంటూ తుదివరకు విడిపోకుండా జీవించాలి. దంపతులు ఒకరినొకరు ప్రేమించుకొంటూ తుదిగడియల వరకు ఒకరితో వొకరు కలసివుండే వరప్రసాదాన్ని

క్రీస్తే దయచేస్తాడు. భర్త భార్యకు ద్రోహం చేసినా, భార్య భర్తకు ద్రోహం చేసినా వాళ్లు ఒకరినొకరు క్షమించే శక్తినిగూడ ప్రభువే దయచేస్తాడు. ఏ కారణంచేతనైనాసరే దంపతులు విడిపోతుంటే క్రీస్తు సిలువ వారిని ఐక్యపరుస్తుంది. సంసారజీవితంలో పరస్పర విశ్వసనీయత, అపరాధక్షమాపణం ముఖ్యాంశాలుగా ఉండాలి. ఇవి క్రీస్తు అనుగ్రహంవల్ల సాధ్యమౌతాయి. ఉత్థానక్రీస్తు ఆత్మ దంపతులమీదికి దిగివచ్చి వారికి ఐక్యతనూ ప్రేమశక్తినీ ప్రసాదిస్తుంది. దీనివల్లనే చాల కుటుంబాలు విచ్ఛిన్నంకాకుండా నిలవగల్గుతున్నాయి.

క్రీస్తు తిరుసభలకు ఎడబాటు లేదు కనుక ఆ పోలికను పొందిన స్త్రీ పురుషుల వివాహానికిగూడ విడాకులు లేవు. అత్యవసరమైతే భార్యాభర్తలు విడిపోయి వేరువేరుగా జీవించవచ్చు. కాని భార్యాభర్తలు బ్రతికివుండగా ఒకరు వేరొకరిని వివాహం జేసికోవడం మాత్రం పనికిరాదు. హెన్రీరాజు తన భార్య క్యాతరిన్‌కు విడాకులిచ్చి అన్నబోలిన్ అనే ఆవిడను పరిణయమాడగోరాడు. రోము అంగీకరింపలేదు. అతడు తిరుసభను వదలివేసి ఆంగ్లికన్ శాఖను స్థాపించాడు. ఈలాంటి విషమ పరిస్థితుల్లోగూడ తిరుసభ విడాకులను అంగీకరింపలేదు.

భార్యాభర్తల్లో ఒకరు అక్రైస్తవులనుకొందాం. ఆవ్యక్తి క్రైస్తవమతం నచ్చక తన క్రైస్తవ సహచ(రి)రుని విడనాడితే, ఆ విడనాడిన క్రైస్తవ వ్యక్తి మళ్లా వివాహం చేసికోవచ్చు. దీనికే "పౌలుగారి అనుమతి" అని పేరు - 1కొ 7,15. క్రైస్తవ వివాహంలో క్రీస్తు తిరుసభల పోలిక ముఖ్యం. ఇక్కడ అక్రైస్తవవ్యక్తి ఈ పోలికను నిరాకరిస్తున్నాడు. కనుక వివాహం రద్దవుతుంది. అందుచే క్రైస్తవ వ్యక్తి మళ్ళా పెండ్లి చేసుకోవచ్చు.

ఈ పట్టున వివాదాస్పదమైన ఓ అంశాన్ని ప్రస్తావించాలి. ఏ కారణం చేతనయినాసరే భర్త భార్యను పరిత్యజించవచ్చా అని పరిసయులు క్రీస్తుని అడిగారు. ప్రభువు పరిత్యజించకూడదు అని చెప్పి ఇంకో విషయాన్నిగూడ తెలియజేసాడు. వ్యభిచారణం కారణం వలన తప్ప తన భార్యను విడనాడి వేరొకతెను పరిణయమాడేవాడు వ్యభిచారదోషి ఔతాడని చెప్పాడు - మత్త 19,9. ఇక్కడ "వ్యభిచార కారణంవల్ల తప్ప" అనే మాటలకు అర్థమేమిటి? భర్తగాని భార్యగాని వ్యభిచారం చేసినపుడు ఆ వివాహం రద్దవుతుందని భావమా? ఇక్కడ వ్యభిచారం అనే మాటకు గ్రీకుమూలంలో వాడిన పదం "పోర్నేయా". దానికి తుల్యమైన హీబ్రూపదం "జేనూత్". అన్న మారుచెల్లెలు మొదలైన దగ్గరి రక్తబంధువులు పెండ్లి చేసుకొంటే దాన్ని యూదులు జేనూత్ వివాహం అనేవాళ్ళు. ఈలాంటి వివాహాలు చెల్లవు. అవి అసలు పరిణయాలే కాదు. కనుక ఈ జంట విడిపోవలసిందే. పై వచనంలో వ్యభిచారకారణం వలన తప్ప అన్నపుడు క్రీస్తు ఉద్దేశించింది ఈ జేనూత్ పెండ్లే. ఇది అసలు వివాహమే కాదు. కనుక రద్దుకావలసిందేనని క్రీస్తు

ఉద్దేశం. కనుక ఈ వాక్యంలోని "వ్యభిచారం" మామూలు వ్యభిచారంకాదు. దగ్గరి బంధువులు చేసికొన్న నిషిద్ధవివాహం, అంతే. ఐనా ప్రోటస్టెంటు శాఖలు ఈ వాక్యాన్ని ఆధారంగా తీసికొని విడాకులను అనుమతించాయి. "దేవుడు జతపరచిన జంటను మానవమాత్రులు వేరుపరపరాదు" అన్న క్రీస్తు సూక్తికి అపవాదం లేదు. అది నూటికి నూరుపాళ్ళు చెల్లే సూత్రం. కనుక ఏలాంటి పరిస్థితుల్లోను విడాకులు పొసగవు.

## 3. వివాహబంధం

వివాహబంధం పెండ్లినాడు ప్రారంభమై భార్యాభర్తలు జీవించినంతకాలం కొనసాగుతుంది. అది కొనసాగినంతకాలం భార్యాభర్తలకు వరప్రసాదాన్ని ఇస్తూనే వుంటుంది. ఐనా వివాహ దేవద్రవ్యానుమానానికి గురుపట్టం జ్ఞానస్నానం మొదలైన వాటికిలాగ అక్షయమైన ముద్ర ఏమీలేదు. భార్యాభర్తల్లో ఒకరు గతించగానే వివాహబంధం విడివడిపోతుంది.

వివాహబంధంవల్ల దంపతులు తిరుసభకు చెందినవాళ్ళవుతారు. దేవుని పోలిక కలిగిన బిడ్డలను కని జ్ఞానశరీరాన్ని వృద్ధిచేస్తారు. ఇందుకు కావలసిన వరప్రసాదాన్ని వివాహబంధమే వాళ్ళకు దయచేస్తుంది.

దంపతుల్లో ఒకరు చనిపోగానే వివాహబంధం విడిపోతుంది. బ్రతికివున్న వ్యక్తి చనిపోయిన వ్యక్తిని ప్రేమతో స్మరించుకోవచ్చు. కాని అది వివాహబంధం మాత్రంకాదు. కనుక ఆ వ్యక్తి మళ్ళా పెండ్లిచేసికోవచ్చు.

## ప్రార్థనా భావాలు

*1. హిలెల్, షమ్మయి బోధలు*

క్రీస్తు నాడు విడాకులనుగూర్చి యూదుల్లో రెండుభావాలుండేవి. హిలెల్ అనే రబ్బయి చిన్న అపరాధానికి భర్త భార్యకు విడాకులీయవచ్చునని బోధించాడు. అనగా భర్త తేలికగా భార్యను విడనాడవచ్చు. దీనికి భిన్నంగా షమ్మయి అనే రబ్బయి తీవ్రమైన అపరాధానికిమాత్రమే భర్త భార్యకు విడాకులీయవచ్చునని చెప్పాడు. అనగా భర్త భార్యను తేలికగా విడనాడకూడదు. కాని క్రీస్తు ఈ యిద్దరు రబ్బయిల భావాలనుకూడ కాదని అసలు విడాకులే పనికిరావని బోధించాడు. సృష్ట్యాదిలోని ఆదామేవల్లాగ భార్యాభర్తలు ఏకశరీరులై యుండాలనీ, దేవుడు జతపరచిన జంటను మానవమాత్రులు వేరుపరపరాదనీ నుడివాడు. భార్యను విడనాడి మరొకతెను వివాహమాడే పురుషుడు ఆ నూత్న స్త్రీతో వ్యభిచరించినట్లేనని పల్కాడు - మత్త 19,3-8.

*2. మలాకీ బోధ*

మలాకీ ప్రవక్త పురుషుడు భార్యను విడనాడి ఆమెకు ద్రోహం చేయకూడదని ఖండితంగా ఆజ్ఞాపించాడు. నరుడు తాను యువకుడుగా వున్నపుడు పెండ్లాడిన భార్యకు ద్రోహం చేయగూడదు. భగవంతుడు దంపతులను ఏకదేహంగాను, ఏకాత్మగానుచేసి వారినుండి బిడ్డలను కలిగిస్తాడు. కనుక పురుషుడు తన భార్యను విడనాడకూడదు - 2,14-16.

*3. భార్య భోగ్యవస్తువు కాదు*

వివాహజీవితంలో పురుషులు స్వార్థంతో ప్రవర్తిస్తుంటారు. భార్యను తమ తృప్తికోసం వాడుకొంటూ వుంటారు. వైదిక కాలంనాడు భారత స్త్రీకి సమాజంలో గొప్ప విలువ వుండేది. పురుషుడు ఆమెను "సహధర్మచారిణి" అన్నాడు. ఆమె లేనిదే వైదిక ధర్మాన్ని సాధించలేను అనుకొన్నాడు. దురదృష్టవశాత్తు స్త్రీ క్రమేణ భోగ్యవస్తువుగా మారిపోయింది. కొందరి దృష్టిలో కేవలం బిడ్డలనుకనే యంత్రమైపోయింది. వంటింటికి పడకటింటికి పనికివచ్చే వస్తువైపోయింది. క్రైస్తవులమైన మనకు ఈ దృష్టి పనికిరాదు. స్త్రీపురుషులిద్దరూ దేవుని ప్రతిబింబాలే అన్నాం. ఇద్దరి ఆశయం దేవుడే. ఇద్దరూ దేవుని బిడ్డలే. పైగా క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినవాళ్ళు స్త్రీలైనాసరే పురుషులైనాసరే సరిసమానమే. క్రీస్తులోనికి ఐక్యమైన భార్యాభర్తల్లో మాత్రం హెచ్చుతగ్గులుండవచ్చా?

*4. వ్యభిచార దోషం*

మనం జ్ఞానస్నానంద్వారా క్రీస్తుతో ఐక్యమౌతాం. క్రీస్తుదేహంతో అతుక్కొనిపోయి అతని అవయవాలుగా మారిపోతాం. అంచేత వ్యభిచారం చేసినప్పుడెల్ల క్రీస్తు అవయవాల్ని రంకులాడిపాలు చేస్తాం. ఇది వివాహ ద్రోహం - 1కొ 6,15. ఈ దేహం జారత్వంకోసం గాక ప్రభువుకోసం ఉద్దేశింపబడింది. కావున ఈ దేహంతోను పాపం చేయకూడదు, ఈ దేహంలోను పాపం చేయగూడదు - 1కొ 6,18. పైగా ఈ దేహం పవిత్రాత్మకు ఆలయమౌతుంది. ఈ యాలయాన్ని పాపంద్వారా అమంగళపరచగూడదు - 1కొ 6,19. అసలు ఈలాంటి మోహవాంఛలకు మనసులోకూడ సమ్మతి చూపించకూడదు. అలా చూపిస్తే మానసిక వ్యభిచారమౌతుంది - మత్త 5,28.

*5. సంతానం విలువ*

నేటి ప్రజలు గర్భనిరోధక ప్రయత్నాలు చేస్తున్నారు. కాని బైబులు దృష్ట్యా సంతానం ప్రభువు ఆశీర్వాదాన్ని సూచిస్తుంది. అందుకే తల్లులు ఒకమారు చిన్నబిడ్డలతో రాగా

ప్రభువు చేతులుచాచి ఆ బిడ్డలను దీవించాడు– మార్కు 10,16. బిడ్డలు తల్లిదండ్రులమీద ఆధారపడి నిష్కపట జీవితం గడిపినట్లే తన శిష్యులుకూడ పరలోకపితమీద ఆధారపడి జీవించాలని హెచ్చరించాడు. క్రీస్తునాటి యూదుల రబ్బయిలుకూడ బిడ్డలను ఆదరించారు. "చిన్న బిడ్డలు మోషే ధర్మశాస్త్రాన్ని ఉల్లంఘించరు. నిష్కపటజీవితం గడుపుతారు. కావున పరలోకరాజ్యంలో వాళ్ళకు స్థానం వుంది" అని బోధించారు. కనుక బిడ్డల పుట్టువును కృత్రిమంగా ఆపివేయడమనేది క్రైస్తవ దృక్పథంగాదు. "నా పేరిట ఈ చిన్నబిడ్డను స్వీకరించేవాడు నన్ను స్వీకరిస్తాడు" అన్న ప్రభువు వాక్యాన్ని గౌరవించి క్రైస్తవ ప్రజలు బిడ్డల పుట్టువునకు సమ్మతించాలి – లూకా 9,43. వాళ్ళను ఆదరించాలి. క్రైస్తవ సమాజంలో వాళ్ళకూ స్థానం కల్పించాలి.

# 6. వివాహ వరప్రసాదం జ్ఞానశరీరాభివృద్ధికి తోడ్పడుతుంది

ఏడు దేవ ద్రవ్యానుమానాలు ఏడు ప్రత్యేక వరప్రసాదాలనిస్తాయి. వివాహసంస్కారానికికూడ ప్రత్యేక వరప్రసాదం వుంది. వివాహితులు ఈ వరప్రసాదాన్ని గూర్చి విపులంగా తెలిసికొని వుండాలి. ఈ యధ్యాయంలో ఆరంశాలు పరిశీలిద్దాం.

## 1. వివాహం ఆశయాలు

భగవంతుడు వివాహంద్వారా ఉద్దేశించిన ఆశయాలు రెండు. భార్యాభర్తల పరస్పర ప్రేమ, సంతానోత్పత్తి. వాళ్ళిద్దరూ ఒకే వ్యక్తిగా ఐక్యమౌతారు అనే ఆదికాండం 2,24వ వచనం పరస్పర ప్రేమను సూచిస్తుంది. మీరు సంతానాన్ని కని వృద్ధిచెందండి అనే ఆదికాండం 1,28 వచనం సంతానాన్ని సూచిస్తుంది.

ఈ రెండు ఆశయాల్లో ఒకటి హెచ్చు ఒకటి తగ్గూ అంటూ లేదు. రెండూ సరిసమానమే. వివాహంద్వారా స్త్రీ పురుషులు ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకుంటారు. ఒకరికొకరు ఆత్మార్పణం చేసికొంటారు. శారీరకమైన కలయిక ద్వారా దుష్టమైన వాంఛలను అదుపులోనికి తెచ్చుకొని పవిత్ర జీవితం గడుపుతారు. ఈ కలయిక ద్వారానే దేవుని పోలిక కలిగిన బిడ్డలను కంటారు. ఆ బిడ్డలను పెంచి వారికి విద్యాబుద్ధులు నేర్పుతారు. భార్యాభర్తలు ప్రేమతో శారీరకంగా కలసికొంటారు. కాని అలా కలసికొనక పూర్వమే అస్పష్టంగానైనా సంతానాన్ని కోరుకొంటారు. కలయిక తర్వాత ఈ కోరికతీరి బిడ్డలు కలుగుతారు. కనుక పరస్పర ప్రేమ సంతానోత్పత్తి అనే రెండాశయాలు ఎప్పుడూ కలసే వుంటాయి.

## 2. పై రెండాశయాల పరిపూర్ణభావం

పై వివాహాశయాల భావాన్ని లోతుగా అర్థంచేసికోవాలి. వివాహ సంస్కారం సతీపతుల పరస్పర ప్రేమను పవిత్రం చేస్తుంది. వాళ్ళిద్దరూ ఒకరినొకరు నిండు హృదయంతో ప్రేమించుకొని సోదరప్రేమ అనే క్రైస్తవ పుణ్యంలో పెరుగుతారు. దీనిద్వారా తమ దైవప్రేమను గూడ వృద్ధిచేసికొంటారు.

ఇంకా, వివాహబంధం నరుల్లో సహజంగా వుండే కామవాంఛను జయించడానికిగూడ తోడ్పడుతుంది. జంతువుల్లోలాగే నరుల్లోకూడ ఆడ మగ ఒకరినొకరు కామించడం అనే నైసర్గిక గుణం వుంది. ఈ గుణం హద్దులుమీరి స్త్రీ పురుషులను పాపానికి పురికొల్పుతుంది. ఫలితంగా నరులు మోహానికి లొంగి వ్యభిచారంలో పడిపోతారు. ఆలుమగలు శారీరకమైన కలయికద్వారా ఈ కామవాంఛను చాలవరకు అదుపులోకి తెచ్చుకొంటారు. వివాహ సంస్కారం నైసర్గికమైన కామవాంఛలను పునీతంజేసి ప్రేమనుగా మార్చుతుంది. దీనివల్ల నరులు తమ జంతుస్వభావాన్ని దాటిపోయి దివ్యత్వాన్ని చేరుకోగల్గుతారు.

ఇంతవరకు భార్యాభర్తల పరస్పర ప్రేమనుగూర్చి. ఇక వాళ్ళు కనే సంతానాన్ని గూర్చి విచారిద్దాం. ప్రేమలో సృజనశక్తి వుంది. భార్యాభర్తల ప్రేమకుగూడ నూత్నజీవాన్ని సృష్టించే శక్తీవుంది. కనుకనే ఆలుమగలు ప్రేమతో కలసికొన్నపుడు బిడ్డలు కలుగుతారు.

భార్యాభర్తల ఐక్యతకు చిహ్నం వాళ్ళుకనే బిడ్డలు. వారి పరస్పర ప్రేమకు, పరస్పర దానానికి ప్రతిఫలం బిడ్డలు. శిశువులు తల్లిదండ్రుల ఆకారాలను రూపురేఖలను తమలో ఇముడ్చుకొని తాము ఆ యిద్దరి పరస్పర ప్రేమకు ప్రతిరూపమో అన్నట్లు ఒప్పుతూంటారు. భార్యాభర్తలు తమ సంతానాన్ని చూచి సంతోషించి ఒకరితో ఒకరు ఇంకా గాఢంగా ఐక్యమౌతారు.

పిల్లలను పెంచి పెద్దజేయడంద్వారా, వారికి విద్యాబుద్ధులను నేర్పడంద్వారా తల్లితండ్రుల్లోని ప్రేమశక్తి స్పందిస్తుంది. వాళ్ళు తమ స్వార్థాన్ని అణచుకొని బిడ్డల శ్రేయస్సునకు పాటుపడతారు. వివాహబంధంలో ప్రేమ నశించి ఆ బంధం విడిపోయే స్థితికి వచ్చినపుడు సంతాన ప్రేమే తల్లిదండ్రులను కలిపి వుంచుతుంది. బిడ్డల మేలుకొరకు అమ్మా నాన్నలు కలసి జీవించగోరుతారు.

భగవంతుని ప్రతిరూపులైన శిశువులను సృజించడంలో తల్లిదండ్రులు దేవునితో సహకరిస్తారు. వాళ్లు కేవలం మానవజాతిని అభివృద్ధి చేసేవాళ్లు మాత్రమేకాదు. క్రీస్తు శరీరమైన తిరుసభలో క్రొత్త సభ్యులను చేర్చేవాళ్లు కూడ. అమ్మానాన్నలు స్వయంగా

బిడ్డలకు వరప్రసాదం ఈయలేరు. కాని జ్ఞానస్నానం ఇప్పించటంద్వారా వాళ్లు వరప్రసాద కారకులౌతారు. బిడ్డలను క్రీస్తు మార్గంలో పెంచి పెద్దజేయడంద్వారా వారిలో దివ్యజీవనాన్ని వృద్ధిచేస్తారు. వారిని ఇహపరాలకు చెందిన పౌరులనుగా తయారుచేస్తారు. కనుకనే వేదశాస్త్రులు "నరుల పరలోక జీవితానికి వివాహం నారుమడిలాంటిది" అన్నారు.

దాంపత్య జీవితం పరస్పరానురాగ జీవితం. ఈ యనురాగ ఫలితమే నూత్న జీవమైన సంతానం. ఈ దృష్టితోజూస్తే వివాహాశయాలు రెండు కాదు, ఒకటే. అది సంతానఫలాన్ని ప్రసాదించే స్త్రీపురుషుల పరస్పరప్రేమ.

యువతీయువకులు ఒకరినొకరు ప్రేమించి పెండ్లి చేసికొంటారు. లేదా పెండ్లిచేసికొని ప్రేమిస్తారు. వాళ్ళు ఒకరితో ఒకరు ఐక్యమై ఏకశరీరమౌతారు. ఏకవ్యక్తి ఔతారు. ఈ యైక్యత ఫలితంగా వారిద్దరి పోలిక కలిగి, వారికంటె భిన్నమైన మూడవవ్యక్తి సంతాన రూపంలో ఉద్భవిస్తాడు. ఈ మూడవవ్యక్తి వారినింకా గాఢంగా ఐక్యపరుస్తాడు.

## 3. వివాహ సంస్కారం ఇచ్చే వరప్రసాదం

ఉత్థాన క్రీస్తు వరప్రసాదం ఏడు దేవద్రవ్యానుమానాల ద్వారా మనమీద సోకుతుంది. ఒక్కో దేవ ద్రవ్యానుమానాం ఒక్కో ప్రత్యేక వరప్రసాదాన్నిస్తుంది. కాని మన సహకారమూ ఆశా లేందే దేవద్రవ్యానుమానాలు పనిచేయవు.

ఇక, వివాహ సంస్కారం ఇచ్చే వరప్రసాదం దంపతులు తమ వివాహ జీవితాన్ని పవిత్రంగా గడపటానికి ఉపయోగపడుతుంది. వివాహాశయాలను సాధించడానికి తోడ్పడుతుంది. పరస్పర ప్రేమ బిడ్డలను కనిపెంచి పెద్దజేయడం వివాహాశయాలని చెప్పాం. వివాహ వరప్రసాదం ఈ రెండాశయాలను సాధించడానికి చక్కగా ఉపయోగపడుతుంది. ఈ వివాహ వరప్రసాదం సంసార జీవితం గడిపేవాళ్ళకు మాత్రమే లభిస్తుంది. గురువు మఠకన్యలకు లభించదు.

ఈ సంస్కారంద్వారా దంపతులకు పవిత్రీకరణ వరప్రసాదం లభిస్తుంది. క్రీస్తు తిరుసభల పోలిక ద్వారానే ఈ వరప్రసాదం దంపతులమీదికి దిగివస్తుంది. దీనిద్వారా వాళ్లు దివ్యజీవనం గడపగల్గుతారు. ఇంకా, వాళ్ళకు సహాయ వరప్రసాదంగూడ లభిస్తుంది. దీని శక్తివల్ల వివాహ విధులను నెరవేర్చగల్గుతారు. ఈ రెండు వరప్రసాదాల బలంతోనే వాళ్ళు జన్మపాపం ద్వారా సంక్రమించిన కామాన్ని జయిస్తారు. వాళ్ళ ప్రేమ జంతుప్రేమను దాటిపోయి దివ్యప్రేమగా మారుతుంది. క్రీస్తుప్రేమగా రూపొందుతుంది. దంపతులు తమ లోపాలతోపాటు, మంచి గుణాలతోపాటు ఒకరినొకరు అంగీకరించుకొంటారు. ఒకరినొకరు ప్రోత్సహించుకొంటారు. వివాహ జీవితంలోని కష్టాలను ఓర్పుతో భరిస్తారు.

బిడ్డలను కని పుణ్యమార్గంలో పెంచి పెద్దజేస్తారు. ఈ ప్రత్యేకమైన దైవానుగ్రహమే లేకపోతే వివాహ జీవితం దుర్భరమౌతుంది. దానిలో ఎదురయ్యే ఒడుదుడుకులకు తట్టుకోలేరు.

ఈ ప్రత్యేకానుగ్రహంద్వారా భార్యాభర్తలు ఒకరినొకరు పవిత్రపరచుకొంటారు. ఒకరికొకరు వరప్రసాద కారకులౌతారు. ఈ వరప్రసాదం తల్లిదండ్రులమీద పిల్లల మీదాకూడ సోకుతుంది. వాళ్ళంతా అనురాగంతో ఒకరినొకరు అంగీకరించుకొని కూడిమాడి జీవిస్తారు. కుటుంబమంతా గూడ దైవసోదర ప్రేమలతో నిండి భక్తిమంతంగా జీవిస్తుంది. ఉత్థానక్రీస్తు వివాహబంధంద్వారా ఈ వరప్రసాదాలన్నిటినీ కుటుంబానికి దయచేస్తాడు. దంపతులు ఎప్పుడుగూడ ఈ ప్రత్యేక వరప్రసాదాన్ని అధికాధికంగా దయచేయమని ప్రభువుని వేడుకొంటుండాలి.

## 4. వివాహమూ తిరుసభ అభివృద్ధీ

భార్యాభర్తల ఐక్యత క్రీస్తు తిరుసభల ఐక్యతను పోలి వుంటుంది. దంపతులు బిడ్డలను కని మానవ సమాజాన్ని పెంచుతారు. ఆ బిడ్డలకు జ్ఞానస్నానమిప్పించి వారిని దేవుని బిడ్డలనుగా తయారుచేస్తారు. తల్లిదండ్రులు బిడ్డలతో గూడిన క్రైస్తవ కుటుంబం ఓచిన్న తిరుసభలాంటిది. ఈలాంటి చిన్న తిరుసభలు చాల చేరి విశ్వ తిరుసభ ఔతాయి.

క్రీస్తు వరప్రసాదం తిరుసభను చేరుతుంది. వివాహ సంస్కారంద్వారా తిరుసభ ఈ వరప్రసాదాన్ని దంపతులకు అందిస్తుంది. దంపతులు తమ ఐక్యతద్వారా క్రీస్తు తిరుసభల ఐక్యతను లోకానికి వెల్లడిచేస్తారు. దంపతులూ బిడ్డలూ కలసి కుటుంబమౌతారు. చాల కుటుంబాలు చేరి స్థానిక తిరుసభ ఔతాయి. చాల స్థానిక తిరుసభలు చేరి విశ్వ శ్రీసభ ఔతాయి. స్థానిక శ్రీసభలు విశ్వ శ్రీసభకేలాగో కుటుంబాలు స్థానిక శ్రీసభకు ఆలాగు. ప్రతి కుటుంబం ఓ చిన్న తిరుసభ. క్రీస్తూ తిరుసభా కలసి చెట్టనుకొంటే, ఆ చెట్టుకి పుట్టిన కొమ్మలు క్రైస్తవ కుటుంబాలు. వివాహ సంస్కారంద్వారా క్రీస్తు జ్ఞానశరీరమైన తిరుసభ శాఖోపశాఖలుగా పెరిగిపోతుంది. క్రైస్తవ కుటుంబాల పెంపు తిరుసభ పెంపు.

## 5. వివాహమూ దివ్యసత్ప్రసాదమూ

దివ్యసత్ప్రసాదం ఐక్యతా చిహ్నం. ఒకే రొట్టెలో పాలుపంచుకొనే మనమంతా ఒకే శరీరమౌతాం - 1కొ 10,17. దివ్యసత్ప్రసాదం క్రైస్తవుల ఐక్యతకు చిహ్నమైతే, వివాహం క్రీస్తు తిరుసభల ఐక్యతకు గుర్తు. దంపతులు దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరించడంద్వారా ఈ రెండైక్యతలను తమలో ప్రతిబింబించుకొంటారు. క్రీస్తు ప్రేమను నిండుగాపొంది సంపూర్ణ ఐక్యతను సాధిస్తారు. కనుక దంపతులు తరచుగా, భక్తిభావంతో దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరించాలి. దానివల్ల వాళ్ళ వివాహబంధం దృఢతరమౌతుంది.

పూర్వవేదంలో యావే ప్రభువు యిస్రాయేలీయులతో ఒడంబడిక చేసికొన్నాడు. నూత్నవేదంలో క్రీస్తుమనతో నిబంధనం చేసికొన్నాడు. ఈలా దేవునికీ ప్రజలకూ మధ్య నిబంధనం ఏర్పడింది. ఇక, వివాహ సంస్కారం గూడ ఓ నిబంధనమే. ఈ నిబంధనం స్త్రీపురుషులిద్దరికీ మధ్య నెలకొని వుండేది. పూర్వనూత్నవేదాల్లో దేవుడు ప్రజలతో చేసికొన్న నిబంధనం నేడు మన వివాహ నిబంధనం మీద సోకి దాన్ని బలపరుస్తుంది. ఇక, పూర్వ నూత్నవేదాల నిబంధనను జ్ఞప్తికి తెచ్చేది దివ్యపూజ. ఇక్కడ ప్రభువు నూత్ననిబంధన రక్తాన్ని చిందిస్తాడు-మత్త 26,28. వధూవరులు సాధ్యమైనంతవరకు దివ్యపూజలోనే పెండ్లిచేసికోవాలి. ఈ పూజలో ప్రభువు శరీరరక్తాలను స్వీకరించాలి. దీనిద్వారా క్రీస్తు నిబంధనం వారిపై సోకి వారి వివాహ నిబంధనాన్ని పునీతం చేస్తుంది.

క్రీస్తు దివ్యసత్ర్పసాదాన్ని స్థాపిస్తూ నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరినొకరు ప్రేమించండి అన్నాడు - యోహా 13,34. దివ్యసత్ర్పసాద స్వీకరణం ద్వారా దంపతుల్లో ప్రేమశక్తి బలపడుతుంది. ప్రభువు వారి వివాహబంధాన్ని దీవించి వారిని గాఢంగా ఐక్యపరుస్తాడు. వివాహితులకు ప్రేమను మించిన సౌభాగ్యం ఏముంటుంది కనుక?

దంపతులు జీవితాంతమూ పూజలో తరచుగా పాల్గొని దివ్యసత్ర్పసాదాన్ని స్వీకరిస్తూండాలి. దివ్యభోజనం వారి పరస్పర ప్రేమనూ పరస్పరదానాన్నీ బలపరచే సాధనం.

## 6. వివాహమూ త్రీత్వమూ

క్రీస్తు తండ్రి నుండి ఆత్మను పంపి తిరుసభను నెలకొల్పాడు. తిరుసభ సభ్యుల్లో పరిశుద్ధ త్రీత్వం రూపురేఖలు కన్పిస్తాయి. ఇక, వివాహం క్రీస్తు తిరుసభల పోలికను సూచించేది. కనుక తిరుసభలోని పరిశుద్ధ త్రీత్వం పోలికలు వివాహ జీవితంలోగూడ కన్పిస్తాయి. ఏలాగ?

పరిశుద్ధ త్రీత్వంలో తండ్రి కుమారుల ఐక్యతనుండి ఆత్మ ఉద్భవిస్తుంది. అలాగే కుటుంబంలో తల్లిదండ్రుల ఐక్యతనుండి సంతానం కలుగుతుంది. త్రీత్వంలోని తండ్రీ కుమారులు మన కుటుంబంలోని తండ్రీ తల్లులను పోలివుంటారు. పవిత్రాత్మ మన కుటుంబంలోని సంతానాన్ని పోలివుంటుంది. త్రీత్వంలో తండ్రికుమారుల నుండి ఆత్మ బయలుదేరినట్లే, కుటుంబంలో తల్లిదండ్రులనుండి బిడ్డలు కలుగుతారు. ఇక్కడ తల్లిదండ్రులిద్దరినీ బిడ్డలనుకనే ఏకవ్యక్తినిగా గణించాలి. వివాహ బంధంద్వారా వాళ్ళిద్దరూ ఏకశరీరమౌతారుకదా! త్రీత్వంలో తండ్రీకుమారులను ఐక్యపరచే ప్రేమబంధం ఆత్మ. కుటుంబంలో మాతాపితలను ఐక్యపరచే సాధనం సంతానం.

త్రీత్వంలోని తండ్రిలో పితృత్వం పరిపూర్ణంగా ఉంటుంది – ఎఫె 3,15. ఇక్కడ పితృత్వమంటే జననీజనకుల గుణాలు రెండూ కూడ. మన తల్లిదండ్రుల్లో వుండే పితృగుణమూ మాతృగుణమూకూడ పరలోకపు తండ్రిలో పరిపూర్ణంగా వుంటాయి. అతడు తండ్రులందరికి తండ్రి, తల్లులందరికి తల్లి. భూలోకంలోని తల్లి తండ్రీ ఏకవ్యక్తిగా ఐక్యమై ఈ పరలోకంలోని తండ్రిని పోలివుంటారు. ఈ యేకవ్యక్తియైన తల్లిదండ్రులే సంతానాన్ని కనేది. కుటుంబం పవిత్రత్రీత్వాన్ని పోలివుంటుంది కనుక పవిత్రమైంది. దైవరూపాన్ని ప్రతిబింబించేది. కుటుంబ సభ్యులంతా తమ ఔన్నత్యానికి తగినట్లుగా పవిత్రజీవనం గడపాలి.

## ప్రార్థనా భావాలు

*1. సీనాయి నిబంధనం వివాహం లాంటిది*

పూర్వవేద ప్రవక్తలు యిస్రాయేలీయుల వివాహజీవితాన్ని గూర్చి చెప్పదల్చుకోలేదు. ప్రభువు ప్రజలతో చేసికొన్న నిబంధననుగూర్చి చెప్పదలచుకొన్నారు. ఆ నిబంధనం వధూవరులు చేసికొనే వివాహ నిబంధనం లాంటిది అన్నారు. వరుడు వధువును పెండ్లియాడినట్లే సీనాయి నిబంధనంద్వారా ప్రభువు యిస్రాయేలీయులను పెండ్లియాడాడని చెప్పారు. అనగా దేవుడు యిస్రాయేలీయులను అనురాగంతో చూస్తాడని భావం. ఈ ఉపమానాన్ని మొదట పేర్కొన్నవాడు హోషేయ. ఇతని భార్య గోమెరు. ఈమె వ్యభిచారిణియై భర్తకు ద్రోహం చేసింది. ఐనా ప్రవక్త దేవుని ఆజ్ఞపై ఈమెను మళ్ళా భార్యనుగా స్వీకరించి గాఢంగా ప్రేమించాడు–3,1. ఈ గోమెరులాగే యిస్రాయేలీయులు అన్యదైవమైన బాలుని కొల్చి ప్రభువుకి ద్రోహంచేసినా, ప్రభువు కరుణతో మళ్ళా వారిని తన ప్రజలనుగా స్వీకరించాడు. ఇస్రాయేలీయులు భార్య, యావే భర్త. హోషేయ తర్వాత ఇతర ప్రవక్తలు కూడ ఈ భావాన్ని వ్యాప్తిలోకి తెచ్చారు. నూత్నవేదంలో పౌలు ఈ భావాన్ని ఎన్నుకొని దాన్ని క్రీస్తుకీ తిరుసభకీ అన్వయించాడు.

*2. సంతాన భాగ్యం*

దేవుడు ఆదామేవలను జతపరచి మీరు చాలమంది బిడ్డలను కని వృద్ధిచెందండని ఆశీర్వదించాడు – ఆది 1,28. పూర్వవేద ప్రజలు సంతానాన్ని మక్కువతో ఆశించారు. వాళ్ళ దృష్టిలో బిడ్డలను కనడమంటే దేవుని దీవెనలు పొందడం. బిడ్డలు కలుగకపోవడమంట దేవుని శాపానికి గురికావడం. చాలకాలం గొడ్రాలుగా వుండిపోయిన రాహేలు నీవు నాకు బిడ్డలనిస్తావా లేక చావమంటావా అని యాకోబు నెదుట

మొరపెట్టుకొంది - ఆది 30,1. బిడ్డలు కలిగాక ఆమె దేవుడు నా అవమానాన్ని తొలగించాడని సంతోషించింది-30,28. నేటి తల్లిదండ్రులు బిడ్డల పుట్టువును అంగీకరించకపోవడం శోచనీయం.

*3. దైవ సహాయం*

వివాహ పూజలో వచ్చే ఓ ప్రార్థన యిది. ఇది దంపతులకు ప్రేరణం పుట్టిస్తుంది. "సృష్టికర్తవైన సర్వేశ్వరా! పరిశుద్ధుడవైన పితా! నీవు స్త్రీ పురుషులను నీకు పోలికగా జేసావు. వివాహ జీవితాన్ని ఆశీర్వదించేవాడివి నీవే. ఈ దినం వివాహ సంస్కారంద్వారా తన భర్తతో ఐక్యమైన ఈ వధువు కొరకు మేము నీకు ప్రార్థన చేస్తున్నాం. నీవు ఈమెను ఈమె భర్తను మెండుగా దీవించు. నీవు దయచేసే వివాహ ప్రేమయందు వీళ్ళిద్దరు ఆనందింతురుగాక. వీరు తమ బిడ్డలద్వారా తిరుసభను వృద్ధిలోకి తెత్తురుగాక. ప్రభూ! ఈ దంపతుల సౌఖ్యంలో నిన్ను స్తుతింతురుగాక. దుఃఖంలో నీకు మొరపెట్టుకొందురుగాక. వీళ్ళు తమ పనిలో నీవు సాయపడతావనియు, తమ అవసరాల్లో నీవు తమ్ము ఆదుకొంటావనియు గ్రహించి సంతోషింతురుగాక. తిరుసభతో ఐక్యమై నీకు ప్రార్థన చేయుదురుగాక. ఈ లోకంలో నీకు సాక్షులుగా వుందురుగాక. తమ స్నేహితులతో కలసి వృద్ధాప్యంవరకు జీవింతురుగాక. కడన నీరాజ్యంలో ప్రవేశింతురుగాక. మా ప్రభువైన క్రీస్తుద్వారా ఈ మనవిని ఆలించండి, ఆమెన్."

# 7. ప్రేమ మార్గం

ఆధ్యాత్మికంగా జూస్తే వివాహితులకు మూడు ప్రధాన మార్గాలు ఉన్నాయి. అవి ప్రేమ, సిలువ, భక్తి మార్గాలు. ఈ మూడు మార్గాలను మూడధ్యాయాల్లో పరిశీలించి చూద్దాం.

## 1. వివాహం జీవితంగూడ పవిత్రమైందే

సన్యాసజీవితంలాగే వివాహజీవితంగూడ ప్రత్యేకత కలది. అదికూడ పిలుపే. వివాహితులుకూడా ప్రత్యేకమైన ఆధ్యాత్మికజీవితం గడపాలి. ఇంతవరకు సంసారజీవితం అంత శ్రేష్ఠమైంది కాదు అనే అభిప్రాయం ప్రచారంలోవుంది. కాని అది పొరపాటు. గృహస్థజీవితం కూడ ఆధ్యాత్మికమైందే.

వివాహితులు తమ పిలుపులోని ఔన్నత్యాన్ని చక్కగా అర్థంచేసికోవాలి. సంసారజీవితం ద్వారాగూడ క్రీస్తు మరణోత్థానాలు తిరుసభలో కొనసాగుతాయి. ఇక్కడ

యిద్దరు వ్యక్తులు కలసి జీవిస్తారు. వారి కలయిక క్రీస్తు తిరుసభల కలయికను పోలివుంటుంది. కనుక పవిత్రమైంది. ఈ కలయిక ద్వారానే ఉత్థానక్రీస్తూ పవిత్రాత్మా వారిని పునీతులను చేస్తారు.

స్త్రీపురుషులమధ్య విడదీయరాని బంధం వుంటుంది. ఇదే వారికి రక్షణ నిస్తుంది. దంపతులు పీఠముందు ఒకరికొకరు వివాహ సంస్కారాన్ని ఇచ్చుకొంటారని చెప్పాం. దీనిద్వారా వాళ్లు ఒకరి ఆధ్యాత్మిక జీవితానికొకరు పూచీపడతారు. ఒకరినొకరు పవిత్రపరచుకొంటారు. దేవుడే వారిద్దరిని జతపరచి ఒకరిద్వారా ఒకరిని పవిత్రపరుస్తాడు.

కన్యా గురు సన్యా జీవితాలు వివాహజీవితంకంటె ఎక్కువ పవిత్రమైనవే. కాని దాంపత్యజీవితంగూడ దానంతట అది పవిత్రమైందే. దేవుడే ఆ మార్గాన్ని నిర్ణయించాడు కదా? అందరం క్రీస్తు ననుసరించి పునీతులం కావలసిందే. సంసారులు క్రీస్తు తిరుసభల పోలికనుపొంది, వారి పద్ధతిలో వాళ్ళు క్రీస్తు ననుసరించి, పావిత్ర్యాన్ని పొందుతారు.

## 2. ప్రేమ సమాజం

లోకంలో నిర్మలమైన ప్రేమ ఎక్కడవున్నా అది దేవుని ప్రేమనే సూచిస్తుంది. ప్రేమ వున్నచోట దేవుడుంటాడు. దేవుడు ప్రేమేకదా! క్రీస్తు తిరుసభను రక్షించి ఆ సభతో నిబంధనం చేసికోవడంలో దేవుని ప్రేమ వ్యక్తమైంది. ఇక క్రైస్తవ వివాహం క్రీస్తు తిరుసభల నిబంధనను పోలివుంటుందని చెప్పాం. కనుక దైవప్రేమ వివాహజీవితంలోకి గూడ ప్రవేశించి దాన్ని పునీతం చేస్తుంది. భార్యాభర్తలను ఓ ప్రేమసమాజంగా ఒనగూర్చుతుంది.

దంపతులు వారి పరస్పర ప్రేమద్వారా క్రీస్తుకిచెందిన వాళ్ళవుతారు. క్రీస్తునుండి ఒకరినొకరు వరప్రసాదంగా స్వీకరిస్తారు. ఒకరికొకరు క్రీస్తు వరప్రసాదాన్ని దయచేస్తారు. పరస్పర ప్రేమద్వారా దేవుని ప్రేమను తమలో ప్రతిబింబించుకొంటారు.

క్రైస్తవ వివాహంలో శారీరకప్రేమా, దివ్యప్రేమా కూడా పరాకాష్ఠ నందుతాయి. శారీరక ప్రేమద్వారా దంపతులు ఒకరికొకరు పూర్తిగా సమర్పించుకొంటారు. ఒకరిపట్ల ఒకరు విశ్వసనీయులుగా మెలుగుతారు. ఒకరి జీవితంలోని కొకరు చొచ్చుకొనిపోయి ఏకవ్యక్తిగా తయారౌతారు. ఒకరికొకరు విడదీయరాని స్నేహితులౌతారు. దీనిద్వారా వాళ్ళ శరీరమూ మనసూకూడ ఔన్నత్యాన్ని పొందుతాయి.

వివాహసంస్కారంద్వారా దంపతుల శారీరకప్రేమ క్రమేణ దివ్యప్రేమగా మారిపోతుంది. వాళ్లు ఒకరినొకరు దేవుని బిడ్డనుగా, తిరుసభ సభ్యునిగా గుర్తించి పరస్పరం సేవలు చేసికొంటారు. క్రీస్తునందు ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకొంటారు. క్రీస్తు ప్రభావం వారిమీద బలంగా సోకుతుంది. ఇద్దరూ సంతానాన్ని అంగీకరించి ప్రేమిస్తారు.

తోడి నరులనుగూడ ఆదరించి సోదరప్రేమను పెంచుకొంటారు. ఈ విధంగా ఆలుమగల్లో దివ్యప్రేమ వృద్ధి చెందుతుంది.

భార్యాభర్తల ప్రేమలోని ముఖ్యాంశం ఆత్మార్పణం. వాళ్ళిద్దరూ ఒకరికొకరు తమ్ముతాము సమర్పించుకోవాలి. తమ ప్రేమను వట్టిమాటల్లోకాక చేతల్లో చూపించాలి. ఒకరికొకరు ఎంత త్యాగమైనా చేయాలి. భర్త క్రీస్తుని పోలి భార్యకొరకు తన ప్రాణాన్నికూడ సమర్పించాలి. భార్య తిరుసభనుపోలి కృతజ్ఞతా భావంతో భర్త ప్రేమను అంగీకరించి సంతానవతి కావాలి.

దంపతులు తొలిరోజుల్లో శారీరకప్రేమతోనే తృప్తి జెందుతారు. కాని ఈ ప్రేమ ఎంతోకాలం నిలవదు. ఈ ప్రేమ సమసిపోయాక వాళ్లు ఒకరినొకరు నిరాకరింపగూడదు. ఉన్నవాళ్ళు ఉన్నట్లుగా - అనగా లోపాలతోపాటు సద్గుణాలతోపాటు ఒకరినొకరు ఓర్పుతో అంగీకరించాలి. ఇరువురూ ఒకరిలో దాగివున్న మంచితనాన్నీ శక్తిసామర్థ్యాలను ఒకరు వెలికితీయాలి. జీవితంలో ఎదురయ్యే కష్టసుఖాల్లో పాల్గొనడంద్వారా వారి ప్రేమ క్రమేణ పెరుగుతుంది.

వివాహ ప్రేమ క్రీస్తు తిరుసభలను పోలివుండడం దివ్యమైంది. ఒకరి విలువను ఒకరు అంగీకరించడంద్వారా వ్యక్తి సంబంధమైంది. ఒకరినొకరు పవిత్రపరచుకోవడం ద్వారా పునీతమైంది. సంతానాన్ని కనడంద్వారా ఫలభరితమైంది.

## 3. సంతానాన్ని కోరే ప్రేమ

వివాహప్రేమ సంతానంకొరకు ఎదురుచూస్తుంది. బిడ్డలను గాఢంగా వాంఛిస్తుంది. సంతానాన్ని ఆశించని ఆలుమగల ప్రేమ వంధ్యాత్వంతో నిండివుంటుంది. అలాంటి ప్రేమగల భార్యాభర్తలు ఒకరికొకరు సమర్పించుకోరు. నిరంతరం ఒకరినొకరు స్వార్థానికి వాడుకొంటారు. లైంగికానందమే ముఖ్యమనుకొంటారు. బిడ్డలనుకాక కేవలం లైంగికానందాన్నే కోరుకొనే ప్రేమ నింద్యమైంది.

పూర్వవేద ప్రవక్తలు యావే ప్రభువుకి యిస్రాయలీయులపట్లగల ప్రేమను భార్యాభర్తల ప్రేమతో పోల్చారు. నూత్నవేదంలో క్రీస్తుకి తిరుసభపట్లగల ప్రేమ దంపతుల ప్రేమకు ఆదర్శం. ఈ దైవప్రేమలు రెండూ ఫలభరితమైనవి. యావే ప్రభువూ క్రీస్తూ ప్రజల రక్షణకొరకు పాటుపడ్డారుకదా! ఈ దివ్యప్రేమలను పోలిన మన వివాహ ప్రేమకూడ ఫలభరితం కావాలి.

సంతానాన్ని కనడమంటే దేవుని సృష్టిని కొనసాగించడం. ఒకవిధంగా చెప్పాలంటే, ప్రతిసృష్టి చేయడం. భగవంతుని సృష్టి అద్భుతంగా వుంటుంది. అన్నంలో

రుచి వుంటుంది. ఈ రుచికి లొంగి నరులు అన్నం తింటారు. అలా తినడంవల్ల దేహపోషణం జరుగుతుంది. ఈ రీతినే స్త్రీపురుషుల కలయికలోగూడ సుఖం వుంటుంది. ఈ సుఖానికి లొంగి స్త్రీపురుషులు కలసికొంటారు. ఈ కలయికద్వారా సంతానోత్పత్తి జరుగుతుంది. దేహధారణం, సంతానోత్పత్తి భగవంతుడు సంకల్పించిన ఉద్దేశాలు. రుచి, సుఖం అనే గుణాలద్వారా అతడీయాశయాలను సాధిస్తాడు. లేకపోతే రోజుకి మూడుసార్లు ఎవడు అన్నంతింటాడు? యాతనతో కూడిన బిడ్డలను ఎవడు కంటాడు?

ఇక దేవుని సృష్టికార్యంతో సహకరించేవాళ్ళు తల్లిదండ్రులు. తండ్రి వీర్యం తల్లి గర్భంలో ప్రవేశించినపుడు పిండం ఏర్పడుతుంది. ఆ పిండంలోనికి ఆత్మను ప్రవేశపెట్టి మనుష్యప్రాణిని సృజిస్తాడు భగవంతుడు. మనం పాలరాతిని ఈయందే శిల్పి బొమ్మను చెక్కలేడు. అలాగే మనం పిండాన్ని ఈయందే భగవంతుడు నరుని సృజింపలేడు. ఈలా సృష్టితో సహకరించేది భార్యాభర్తల శారీరక సంబంధం. అందుకే దీన్ని ప్రతిసృష్టి అన్నాం.

ఈ కార్యంద్వారా జ్ఞానశరీరం అభివృద్ధిలోకి వస్తుంది. పరిశుద్ధాత్మకు నివాసయోగ్యులైన పిల్లలు కలుగుతారు. భూమిపై భగవదారాధకులు విస్తరిల్లుతారు. మోక్షం పరిశుద్ధులతో నిండిపోతుంది. ఈలాంటి శారీరకసంబంధం పట్ల మనకు పవిత్రమైన భావాలుండాలి.

కొన్నిపార్లు శారీరకావరోధాలవల్ల దంపతులకు బిడ్డలు కలుగరు. దీన్నే వంధ్యాత్వం అంటాం. ఈ పరిస్థితిలో దంపతులు పరస్పర ప్రేమనే సంతానంగా భావించాలి. ఇంకా వాళ్లు ఇతరుల బిడ్డలను దత్తు తీసుకోవచ్చు. లేదా ఏదైనా ప్రేషిత సేవకు తమ జీవితాన్ని అంకితం చేసికోవచ్చు. ఈ ప్రక్రియలు బిడ్డలులేని లోటు కొంతవరకు తీరుస్తాయి.

## 4. వివాహప్రేమ - లైంగికప్రేమ

జంతువుల్లో లైంగిక ప్రక్రియ కేవలం శారీరకమైంది. నైసర్గికంగానే కలిగేది. కాని నరుల్లో అలాకాదు. అది దాంపత్యప్రేమకు సంబంధించింది. దంపతులు లైంగికక్రియద్వారా తమలో సహజంగావున్న కామాన్ని శాంతింపజేసికొంటారు. లైంగికక్రియ కామాన్ని శాంతింపజేయాలి గాని రెచ్చగొట్టకూడదు. క్రమేణ ఈ లైంగికక్రియే దివ్యప్రేమగా పరిణామం చెందుతుంది. శరీరం ఆత్మ ప్రాబల్యానికి లొంగుతుంది.

లైంగిక క్రియద్వారా ఆలుమగలు పరిపూర్ణంగా ఒకరికొకరు సమర్పించు కొంటారు. దానిద్వారా వారి దాంపత్యజీవితం, వారి ప్రేమ, వారి సంతోషం పరిపూర్ణమౌతాయి. భార్యాభర్తల లైంగికక్రియలో అపవిత్రత ఏమీలేదు. అది అన్నివిధాలా పవిత్రమైంది, పవిత్రపరచేది కూడ. కనుక దాన్నిగూర్చి మనం సిగ్గుపడకూడదు, ఎగతాళిగా మాట్లాడకూడదు.

లైంగికానందం భార్యాభర్తలు ఇద్దరూ కలసి పంచుకొనేది. ఇద్దరినీ తృప్తిపరచేది. కనుక లైంగికక్రియలో దంపతులు ఒకరినొకరు సంతోషపెట్టాలి. ఇది నిస్వార్థప్రేమ. ఒకరినొకరు తమ ఆనందానికి వాడుకోగూడదు. ఇది స్వార్థప్రేమ. ఎప్పుడూ భార్య భర్తనూ, భర్త భార్యనూ సంతృప్తిపరచే ప్రయత్నంలో వుండాలి. ఒకరినొకరు మానుష వ్యక్తినిగా గౌరవించాలి. ఒకరిపట్ల ఒకరికి ఆరాధనభావం వుండాలి. శారీరకంగా జూస్తే సతీపతులకు లైంగికానందాన్ని మించిన ఆనందం లేదు. ఈ యానందంలో దంపతులిద్దరూ పాలుపంచుకోవాలి. ఇది దాంపత్య ధర్మం. ఈ విషయంలో తరచుగా పురుషుడు స్త్రీకి ద్రోహం చేస్తూంటాడు. ఆమెను తన కోరికకు బలిచేస్తూంటాడు. ఇది పెద్ద నేరం.

దాంపత్య జీవితంలో లైంగిక వైముఖ్యం, మితిమీరిన భోగవాంఛ రెండూ నేరాలే. కొంతమంది, విశేషంగా స్త్రీలు, లైంగికక్రియను అసహ్యించుకొని దానిపట్ల వైముఖ్యం జూపుతారు. అది జంతుప్రక్రియ అనుకొంటారు. ఇది పొరపాటు. మానవజాతి ఈలోకంలో అవిచ్ఛిన్నంగా కొనసాగిపోవడం కొరకు, స్త్రీపురుషులు కలసి స్నేహంగా జీవించడం కొరకు, భగవంతుడే లింగాన్ని సృజించాడు. కనుక అది చెడ్డదికాదు, పవిత్రమైంది. కనుక స్త్రీపురుషులు నిర్మలమైన ఉద్దేశంతో లైంగిక క్రియలో పాల్గొని ఈ సృష్టిని కొనసాగించడంలో భగవంతునితో సహకరించాలి. భార్యాభర్తలు పరస్పర ప్రేమతో లైంగికక్రియను జరిపితే భగవంతుణ్ణి పూజించినంత పుణ్యం.

మితిమీరిన భోగవాంఛకూడ నిషిద్ధమే. భోగవాంఛ అంటే కామాన్ని తీర్చుకోవడం. జంతువులా కేవలం స్వీయసుఖాన్ని అనుభవించడం. ఇది మానుష వ్యక్తులైన భార్యాభర్తలకు తగదు. వివాహజీవితానికి పనికిరాదు. స్వీయతృప్తికొరకే సుఖాన్ని కోరుకోగూడదు. ఎదుటి వ్యక్తికి ప్రేమను పంచి ఈయడం కొరకు సుఖాన్ని కోరుకోవాలి. కనుక లైంగిక క్రియలో భార్యాభర్తలు, విశేషంగా భర్తలు కేవలం భోగప్రియులు కాగూడదు. శారీరకమైన కలయికద్వారా నైసర్గికమైన లైంగికవాంఛ దివ్యప్రేమగా రూపొందాలి. కనుక స్త్రీపురుషులు ప్రయత్నంజేసి తమ శారీరకమైన కలయికను పవిత్రమైన స్థాయికి తీసికొనిరావాలి.

ఇంకా, ప్రేమ అంటే ఈయడంగాని పుచ్చుకోవడం గాదు. కావున భర్త భార్య విషయంలో ఈమెనుండి యెంత సుఖం పొందుదామా అనికాక, ఈమెను ఏలా సుఖపెడదామా అని ఆలోచిస్తూండాలి. అలాగే భార్యకూడ ఇతన్నుండి ఎంత సుఖాన్ని పొందుదామా అనిగాక, ఇతన్ని యేలా సుఖపెడదామా అని ఆలోచిస్తుండాలి. ఇదినిజమైన ప్రేమ. క్రీస్తు ప్రేమను ప్రకాశింపజేసేది శారీరక సంబంధం. కావున ఈ శారీరక సంబంధం మన స్వార్థబుద్ధికీ, కామతృప్తికీగాక, ప్రేమగుణానికి నిదర్శనంగా వుండాలి.

వివాహజీవితంలో లైంగికక్రియ ముఖ్యమైందే. కాని అది అన్నిటికంటె ముఖ్యమైంది కాదు. అదే మొదటి విలువకాదు. సంసారజీవితంలో శారీరకమైన కలయిక ఒక్కటే ముఖ్యంకాదని భార్యాభర్తలు కొద్దిరోజుల్లోనే గుర్తిస్తారు. జీవితంలో ఇంకా ముఖ్యవిషయాలు చాలా వున్నాయనీ వాటిమీదకూడ మనసుపెట్టి జీవించాలనీ అర్థంచేసికొంటారు. కనుక దంపతుల శృంగారం ఆదుపాజ్ఞల్లో వుండాలి. దాని స్థానం దానికుంది. కాని అది హద్దుమీరరాదు.

## ప్రార్థనా భావాలు

*1. వైవాహికానందం*

వివాహ జీవితంలో ఎంతో ఆనందం వుంటుంది. భార్యాభర్తలు ఈ యానందాన్ని హాయిగా అనుభవించవచ్చు. స్త్రీ పురుషుల కలయిక ఆనందాన్నిస్తుంది. భర్త భార్య సౌందర్యాన్ని వినయ విధేయతలను జూచి ఆనందిస్తాడు. భార్య భర్త శక్తి సామర్థ్యాలను ప్రేమను మంచితనాన్ని చూచి ఆనందిస్తుంది. సంతానం కలిగి పిల్లలు అభివృద్ధిలోకి వస్తూంటే అదీ ఆనందమే. కష్టపడి పనిచేసికొంటూ తోడిప్రజలతో ఒద్దికగా జీవిస్తే అదీ ఆనందమే. నిర్మలమైన అంతరాత్మతో తోడిప్రజలకు కీడు చేయకుండ చేతనైనంతవరకు మేలు చేసికొంటూపోతే అదీ ఆనందమే. ఈ యానందాలన్నిటినీ అనుభవిస్తూ కృతజ్ఞతతో ప్రభువుకి వందనాలు అర్పించుకోవావలి సంసారజీవితం గడిపే స్త్రీపురుషులు. అప్పుడే కందెన పెట్టిన బండి యిరుసులాగ సంసారజీవితం మెత్తగా సాగిపోయేది.

గురువు గురుజీవితంలో ఆనందిస్తాడు. మఠకన్య కన్యాజీవితంలో ఆనందిస్తుంది. అలాగే భార్యాభర్తలు సంసారజీవితంలో ఆనందించాలి.

*2. దేహదానం*

వివాహ ధర్మం ప్రకారం భార్య దేహం భర్తది. భర్తదేహం భార్యది. కావున భార్య కోరినపుడెల్ల భర్త, భర్త కోరినపుడెల్ల భార్య శారీరక సంబంధానికి అనుమతిస్తుండాలి. ఈ లైంగిక సంబంధం దంపతులను పవిత్రపరుస్తుంది -1కొరి 7,3-4. దేహదానమనే ఈ నియమాన్ని ఉల్లంఘించినవాళ్లు వివాహజీవితానికి విరుద్ధంగా పాపంజేసిన వాళ్ళవుతారు. ఇక, శారీరక సంబంధం భార్యాభర్తల మధ్య కలిగే కలహాన్నీ అపార్థాన్నీ చక్కదిద్దుతుందని మానసికశాస్త్రవేత్తలు చెప్తారు.

*3. స్వీయభార్య*

సామెతల గ్రంథకర్త పురుషులకు చక్కని వైవాహిక ధర్మాలు బోధించాడు. "పురుషుడు సొంత పాత్రలోని నీళ్ళు త్రాగుతూండాలి. సొంతబావిలోని జలధారను

సేవిస్తూండాలి. తాను యువకుడుగా వున్నపుడే స్వీకరించిన భార్యయందు ఆనందిస్తూండాలి. లేడిలా, దుప్పిలా ఆమె అతనికి అందంగా కన్పిస్తుంది. అతడు ఆమె ప్రేమకు బద్ధుడు కావాలి. అతనికి సంతృప్తినిచ్చేది రంకులాడి రొమ్ముకాదు, నిజభార్య వక్షస్సు" - 5,15-20.

*4. స్త్రీ సహజమైన వినయం*

క్రైస్తవ స్త్రీకి వినయం తగుతుంది. చక్కని జడలు, బంగారు సొమ్ములు, ముత్యాలదండలు, వెలగలదుస్తులు - ఇవికాదు ఆమెకు అలంకారాన్ని ఇచ్చేది. అణకువ, దైవభక్తి, సత్క్రియలు - ఇవి క్రైస్తవ కుటుంబినికి పెట్టని సొమ్ములు - 1తిమో 2,9-10. ఆమె సాధుమతి మృదుస్వభావయై యుండాలి. ఈ గుణాలు ఆమె హృదయానికి అక్షయాలంకారాలు - 1పేత్రు 3,3-4. సార, రిబ్కా మొదలైన ఉత్తమస్త్రీలు ఈలాంటి గుణాలు కలవాళ్లు. క్రైస్తవ కుటుంబిని ఆదర్శాలు కూడ ఈలా వుండాలి. ఇంకా, స్త్రీ బిడ్డలను కనడంద్వారా ధన్యురాలవుతుంది - 1తిమో 2,15.

*5. జంతుమైథునం*

జంతు మైథునంలో మృగాలు మొదట శారరీకసుఖాన్ని కోరుకొంటాయి. ఆ పిమ్మట వాటికి తెలియకుండానే యాదృచ్ఛికంగా పిల్లలు పుడతాయి. మనుష్య మైథునంలో మొదట సంతానం ఉద్దేశింపబడుతుంది. ఈ దృష్టితోనే శారీరకసుఖాన్ని అనుభవిస్తారు. భార్యాభర్తలు ఈ సత్యాన్ని మరచిపోగూడదు.

*6. క్రీస్తునందు*

మనంచేసే పనులన్నీ కూడ క్రీస్తుపేరిట చేయాలన్నాడు ప్రేషితుడైన పౌలు- కొలో 3,17. తినడం, త్రాగడం, నిద్రించడం మొదలైన మామూలు కార్యాలన్నీ ప్రభువుకే అర్పించమన్నాడు. స్త్రీ పురుషులు తమ కలయికనుగూడ ప్రభువుకే అర్పించుకోవాలి.

# 8. సిలువ మార్గం

క్రీస్తు సిలువను మోయడం కష్టం. ఐనా దాన్ని మోసినప్పుడేగాని క్రీస్తు శిష్యులం కాలేం. అన్ని దేవద్రవ్యానుమానాల్లోలాగే వివాహంలోకూడ క్రీస్తు సిలువబాధలూ ఉత్థాన మహిమా రెండూ వుంటాయి. ఇక్కడ మనం సిలువ బాధలను పరిశీలించాలి. క్రీస్తు స్వీయమరణంద్వారా తిరుసభనే పత్నిగా పొందాడు. ఈ స్వార్థత్యాగం మన వివాహజీవితంలోగూడ కన్పించాలి. భార్యాభర్తల ఆత్మార్పణం, వారి జీవితంలో ఎదురయ్యే వొడుదుడుకులు వాళ్ళు క్రీస్తు సిలువలో పాలుపొందేలా చేస్తాయి. ఎదుటి వ్యక్తికి ఆత్మార్పణం

చేసికొని అతన్ని సంతోషపెట్టడంలో పెద్ద సిలువవుంటుంది. ఈ సిలువను దంపతులు మోయక తప్పదు. ఆత్మార్పణంలేందే ప్రేమలేదు. స్నేహితుని కొరకు ప్రాణాలు అర్పించడంకంటె గొప్ప ప్రేమ ఏముంటుంది? -యోహా 15,13 ఇదే సిలువ. ఆత్మార్పణం రూపంలో వుండే ఈ సిలువను దంపతులిద్దరూ మోయాలి. స్వార్థాన్ని జయించి తన్నుతాను నిరాకరించుకొంటేనేగాని స్త్రీపురుషులు నిజమైన దాంపత్యజీవితం గడపలేరు.

## 1. లైంగికరంగంలో సిలువలు

వివాహజీవితంలో శృంగారం వుండవలసిందే. కాని దీనికి సంయమనం అవసరం. భార్య మేలుకోరి భర్త, భర్తమేలుకోరి భార్య లైంగికక్రియను మానుకోవాలి. వ్యాధిబాధలకు గురికావడం, మనోధర్మాలు వికటించి వుండడం మొదలైన సందర్భాల్లో దంపతుల్లో వొకరు లైంగికక్రియకు సమ్మతింపకపోవచ్చు. అప్పుడు రెండవవ్యక్తి తన భాగస్వామిని నిర్బంధం చేయకూడదు. నిగ్రహాన్ని పాటించాలి. ఇది పెద్ద సిలువ. ఐనా ఆలుమగలు దీన్ని మోయకతప్పదు. ఒకోసారి ఈ నిగ్రహాన్ని చాలకాలం పాటింపవలసి వుంటుంది. ఈ సందర్భంలో దంపతుల భావన "నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. కనుక నీవు అంగీకరించని దానిని గూర్చి నేను నిన్ను నిర్బంధం చేయను" అన్నట్లుగా వుండాలి.

పౌలు వివాహితులు అవివాహితులో అన్నట్లు జీవించాలని చెప్పాడు-1కొరి 7,29. ఇక్కడ వివాహితులు లైంగికక్రియను అసలు మానుకోవాలని పౌలు భావంకాదు. అతడు రెండవరాకడ సమీపంలో వుందని నమ్మాడు. కనుక దంపతులు లైంగిక వ్యాపారాలు మాని ఆధ్యాత్మిక విషయాలమీదికి మనసు త్రిప్పుకోవాలని భావం. విశాలార్థంలో ఈ వాక్యం నేడు మనకుకూడ వర్తిస్తుంది. భగవంతుణ్ణి పూజించుకోవడానికీ, ప్రార్థన చేసికోవడానికీ, దీనులకూ ఆపన్నులకూ సేవలు చేయడానికీ కొన్నిసార్లు లైంగిక వ్యాపారాలు మానుకోవలసివస్తుంది. ఈ సిలువను మోయడంద్వారా దంపతులు ఎంతో పుణ్యాన్ని ఆర్జిస్తారు.

ఇంతవరకు లైంగిక రంగాన్ని గూర్చి చెప్పాం. కాని వివాహజీవితంలో సిలువలు కేవలం ఈ రంగంలో మాత్రమేకాక ఇంకా అనేకరంగాల్లో రావచ్చు. ఇవి చాలా వున్నాయి.

## 2. ఇతర రంగాల్లో సిలువలు

వైవాహిక జీవితంలో పెద్ద సిలువలు వస్తుంటాయి. భార్యాభర్తలకు మనసు కుదరకపోవడం, చపలచిత్తంతో వివాహద్రోహం చేయడం సిలువ. వ్యాధిబాధలు, తలవని తలంపుగా భర్తగాని భార్యగాని చనిపోవడం సిలువ. పిల్లలు మాట వినకపోవడం, ఒకోసారి

అసలు పిల్లలే కలక్కపోవడం సిలువ. కొద్దిజీతాలు, పెద్దసంసారం సిలువ. ఈలాంటి బాధలన్నీ మనం క్రీస్తునందు ఓపికతో భరించాలి. క్రీస్తు బాధామయుడు. గురువుకంటె శిష్యులు గొప్పవాళ్ళు కాదు. అతనికొక త్రోవ మనకు వేరొక త్రోవ అంటూలేదు. పచ్చి మ్రానుకే అలాంటి బాధలు సంభవించాయి. ఎండు మ్రానులాంటి వాళ్ళమైన మనకు ఎంతటి విపత్తులైనా కలుగుతాయి. ఈలాంటి పరిస్థితుల్లో ప్రత్యేకానుగ్రహం మనకు సహాయపడుతుంది.

వివాహం సిలువబలిని తలపిస్తూంటుంది. క్రీస్తు తిరుసభ కొరకు తన్నుతాను అర్పించుకొన్నాడు. అదే సిలువ బలి. క్రీస్తు తిరుసభను పోలింది వివాహజీవితం. కావున ఈ సంసారజీవితం సిలువబలికి పోలికగా వుంటుంది. క్రీస్తు పూజాబలిలో దినదినం మనకొరకై పరలోకపితకు అర్పించుకొంటాడు. ఇదే విధంగా వివాహజీవితంలో గూడ జరగాలి. భర్త భార్యతోపాటు క్రీస్తుద్వారా తన్నుతాను దేవునికి అర్పించుకోవాలి. ఇద్దరూ సంతానంతోపాటు తమ్ముతాము దేవునికి అర్పించుకోవాలి. ఈలా మనం క్రీస్తు సమర్పణంతో పాటు తమ సమర్పణనూ రోజురోజు కొనసాగించాలి. క్రీస్తు జీవితం సమర్పణాత్మకమైన జీవితం. కుటుంబజీవితం గడిపే గృహస్థులు పూజబలితో సంబంధం పెంపొందించుకొనే మార్గం ఇది.

సంసారజీవితంలో వ్యక్తిగత లోపాలుగూడ బాధను తెచ్చిపెడతయి. వివాహ జీవితం మొదట క్రొత్తగా, బులపరంగా వుంటుంది. వధూవరులు ఒకరికొకరు అందంగా, గొప్పగా కన్పిస్తారు. కాని కొద్దికాలం గడిచాక ఈ యందచందాలు మాసిపోతాయి. రోజూ చూచిన ముఖమే చూచుకోవడం, విన్నమాటలే వినటం జరుగుతుంది. క్రమేణ ఒకరి లోపాలు ఒకరికి తెలిసిపోయి ఒకరంటే వొకరు విసుక్కోవడం గొణుక్కోవడం రుసరుసలాడ్డం మొదలుపెడతారు. ఈలాంటప్పుడు భార్యాభర్తలు చాల జాగ్రత్తగా మెలగాలి. ఒకరి లోపాలనొకరు ఓర్పుతో భరించాలి. భర్త భార్య మేలిగుణాలతోపాటు లోపాలనుగూడా జీవితాంతంవరకు అంగీకరించాలి. ఇద్దరూ ఒకరినొకరు ప్రేమతో మృదువుగా సంస్కరించుకోవాలి. ఒకరినొకరు చిన్నపిల్లలనులాగ నేర్పుతో, ఓర్పుతో సరిదిద్దుతూండాలి. క్రీస్తును కానావూరి వివాహానికివలె మన వివాహానికిగూడ ఆహ్వానించాలి. యేసు వుండడంవల్ల అక్కడ రసం కొరత తీరిపోయింది. ఆ ప్రభువు ప్రత్యక్షమై వుంటే చాల మన జీవితంలోని కొరతలుగూడ తీరిపోతాయి.

## 3. ప్రాపంచిక విషయాల్లో నిమగ్నులు కావాలి

గురువులు మఠకన్యలు దైవసంబంధ కార్యాల్లో నిమగ్నులౌతారు. కాని వివాహజీవితం గడిపేవాళ్ళు ప్రపంచసంబంధ కార్యాల్లో నిమగ్నులుకావాలి. పొలాలు ఆఫీసులు

ఐళ్ళు మొదలైన తావుల్లో పనిజేసికొంటూంటారు గృహస్థులు. మంచి ఉద్దేశంతో చేస్తే ప్రపంచంలోని ఏపనైనా వాళ్ళను పవిత్రపరుస్తుంది. కావున గృహస్థులు నిజాయితీతో ఈ పనులనుజేసి ప్రభువునకు అర్పిస్తుండాలి. అరవై దెబ్బయియేండ్లు జీవించేపుడు, ఈ పనులే మనలను పునీతులనుజేయాలి. అవి దేవుని యెదుట మనకు సాక్ష్యం పలకాలి. ఇక "భూమండలమంతట నివసించి దానిని వశం చేసికొనండి" "నొసటి చెమటోడ్చి పొట్టకూడు సంపాదించుకొనండి" అన్న భగవద్వాక్యాలు వుండనే ఉన్నాయి - ఆది 1,28. 3,19.

## 4. పావనాత్మ

పితసుతులను ఐక్యపరచేది, ముగ్గురు వ్యక్తులు ఒక్క దేవుడయ్యేలా చేసేది పావనాత్మ. ఈయాత్మ ప్రేమజలాన్ని మన హృదయంలో కుమ్మరిస్తుంది - రోమా 5,5. కుటుంబంలోని వాళ్ళంతా కూడిమాడి ప్రేమజీవితం గడిపేలా చేసేది ఈయాత్మే. ఈయాత్మ ప్రత్యక్షమై వున్నచోట సిలువ వుంటుందిగాని అది భారమనిపించదు. కావున గృహస్థులు ఈ యాత్మపట్ల భక్తిభావంతో మెలుగుతూండాలి.

గృహస్థులు పవిత్రులయ్యే మార్గాలు రెండు. ప్రేమమార్గం, సిలువమార్గం. వివాహితులు సాధారణంగా తొలిరోజుల్లో ప్రేమమార్గంలో నడచిపోతారు. కడపటి రోజుల్లో సిలువమార్గంలో సాగిపోతారు.

## ప్రార్థనా భావాలు

*1. బలిపీఠం*

వధూవరులు తమ క్రొత్త జీవితపు తొలి రోజుననే బలిపీఠంముందు సమావేశమౌతారు. ఆ పీఠం ముందు, దాని మీది సిలువయెదుట, ప్రభుసమక్షంలో భార్యాభర్తలుగా మారిపోతారు. ఆనాటినుండి ప్రభువు సిలువ వారిపై సోకుతూనే వుంటుంది. ఒకోమారు వాళ్ళమీద భారంగా వాలుతుంది. ఐనా ఈ పీఠంమీది దైవసాన్నిధ్యం వారి జీవితంలోగూడ నెలకొని వుంటుంది. తొలిరోజే ఈ పీఠంముందు విందులో భార్యాభర్తలు పాలుపొందుతారు. మళ్లా మోక్షవిందులో పాల్గొనేదాక యీ విందు దంపతులను ముందుకు నడుపుతూంటుంది.

*2. కష్టసుఖాలు*

కుటుంబజీవితంలో కష్టసుఖాలు కావడికుండల్లా మారుతూంటాయి. ఐనా సుఖదుఃఖాల్లోను, శీతోష్ణాల్లోను మనలను భరించేది ఆ ప్రభువే. కావున దంపతులు

వెలుగులోను చీకటిలోను ప్రభువుమీదనే ఆధారపడాలి. పెండ్లిపూజలో వధూవరులు "మంచిరోజుల్లోను చెడురోజుల్లోను, వ్యాధిలో వున్నపుడును ఆరోగ్యంగా వున్నపుడును ఒకరిపట్ల ఒకరం విశ్వాస యోగ్యంగా ప్రవర్తిస్తామని" పీఠంముందు ప్రమాణం చేస్తారు. భార్యాభర్తలు అక్షరాల ఈ భావానికి అనుగుణంగా జీవించవలసిన రోజులు వస్తాయి.

*3. బిడ్డలులేని బ్రతుకు*

ఒకోమారు సంతానం కలుగదు. అలాంటప్పుడు స్త్రీ పురుషులు తీరనివ్యధను అనుభవిస్తారు. ఈలాంటి పరిస్థితిలో కొంతవరకు ఓదార్పుపొందే మార్గం ఇది. భార్యాభర్తలు పరస్పర ప్రేమనుగూడ సంతానంగానే భావించుకోవాలి. ఈ ప్రేమ తరచుగా భౌతికరూపందాల్చి సంతానమౌతుంది. కాని ఒకోమారు అలా రూపొందదు. ఆ పిమ్మట మన సొంతబిడ్డలపట్ల చూపే ప్రేమనే వేరేవాళ్ళ బిడ్డలపట్ల చూపుతూ వాళ్ళను ఆదుకొంటూండాలి.

*4. వైధవ్యం*

వైధవ్యం స్త్రీకి ఘోరవ్యధను కలిగిస్తుంది. ఐనా ఆమె క్రీస్తునందు ఈబాధ సహించాలి. విధవకు మళ్ళా పెండ్లి చేసికొనే స్వాతంత్ర్యం వుంది. కాని క్రీస్తునందు తన వైధవ్యాన్ని భరించే స్త్రీ ధన్యురాలు - 1కొ 7,10. క్రీస్తునందు అనగా ప్రభువు ప్రజలకు పరిచర్యలు చేస్తూ అనిభావం. పరదేసులకు ఆతిథ్యమిస్తూ, పరిశుద్ధుల పాదాలు కడుగుతూ, శ్రమపడేవారికి సహాయంచేస్తూ ప్రతి సత్కార్యానికి ముందుకివస్తూ, రోజులు సాగించమన్నాడు తననాటి విధవలను ప్రేషితుడైన పౌలు- 1తిమో 5,10. ప్రభువు తనకిచ్చిన సిలువను ఓర్పుతో భరించడం, ఇంటిలోను ఇరుగుపొరుగు వాళ్ళ ఇండ్లలోను వున్న బిడ్డలను ఆదరించడం, గుడిలోను బడిలోను పరిచర్య చేస్తూండడం, అనవసరపు ప్రసంగాలు మాని ప్రార్థన చేసికోవడం - ఇవి విధవలు చేయదగిన సత్కార్యాలు. అన్నావారికి ఆదర్శంగా వుంటుంది - లూకా 2,26-28.

*5. తిరుకుటుంబం*

కుటుంబ జీవితానికి ప్రభువు తానే ఆదర్శంగా నిలిచాడు. నజరేతు గ్రామం. తల్లిదండ్రులు మరియా యోసేపులు. వాళ్ళతో కలసిమెలసి పనిచేసే పసిపాపడు బాలయేసు. వాళ్లు ముగ్గురూ కష్టజీవులు. వడ్రంగి వృత్తితో జీవించేవాళ్ళు. క్రైస్తవ కుటుంబాలు ఈ కుటంబంవైపు తేరిపార జూచి తమ రూపురేఖలు తీర్చిదిద్దుకోవాలి - లూకా 2,51-52.

# 9. భక్తి మార్గం

వివాహ జీవితం జీవించేవాళ్లు ప్రేమ, సిలువ మార్గాలనే కాక భక్తిమార్గాన్ని గూడ అనుసరిస్తూ వుండాలి. దంపతులు తమ వివాహ జీవితంతో మూడు విధాలుగా భక్తిని పెంపొదించుకోవచ్చు. మొదటిది, ఒకరినొకరు నిస్వార్థప్రేమతో ప్రేమించుకోవడం. రెండవది, ప్రార్థనాజీవితానికి అలవాటుపడ్డం. మూడవది, క్రైస్తవ సంస్కారాలను యోగ్యంగా స్వీకరిస్తూ వుండడం. ఇక యీ మూడంశాలను విచారిద్దాం.

## 1. నిస్వార్థ ప్రేమ

భార్యాభర్తలు ఒకరినొకరు ఓ వరప్రసాదంగా భావించుకోవాలి. అనగా ఈ భార్య లేక ఈ భర్త, దేవుడు నాకనుగ్రహించిన వరప్రసాదం. ఈ వ్యక్తిద్వారా నేను పవిత్రతను పొందాలి. ఈ వ్యక్తిని నేను పవిత్రపరచాలి.

భార్యాభర్తలు విశేషంగా లైంగిక పావిత్ర్యాన్ని పెంపొందించుకోవాలి. లైంగిక పావిత్ర్యమంటే దంపతులు లైంగికక్రియలో నిస్వార్థప్రేమతో ప్రవర్తించడం. లైంగిక సుఖం భార్యాభర్తలు ఇద్దరూ కలసి అనుభవించేది. ఇద్దరూ కలసి పాలుపంచుకొనేది. కనుక భర్త తాను సుఖించడంతో సరిపోదు. భార్యనూ సుఖపెట్టాలి. అలాగే భార్య తాను సుఖించడంతో సరిపోదు. భర్తనూ సుఖపెట్టాలి.

కాని తరచుగా భార్యాభర్తల్లో ఎవరోవొకరు, విశేషంగా పురుషులు, ఈ నియమాన్ని ఉల్లంఘిస్తూ వుంటారు. లైంగికక్రియలో తమ సుఖాన్ని తాము చూచుకొని ఎదుటివ్యక్తి సుఖాన్ని విస్మరిస్తూ వుంటారు. ఈ యెదుటి మనిషిగూడ నాలాగే ఓ వ్యక్తి. నా సుఖంకోసం ఈ మానుషవ్యక్తిని ఓ వుపకరణంగా వాడుకోగూడదు. అలా వాడుకుంటే ఆ వ్యక్తిని ఓ వస్తువుగా ఉపయోగించుకొని అవమానించినట్లే. కేవలం స్వీయతృప్తి కోసమే భార్యను సమీపించే భర్తగాని, భర్తను సమీపించే భార్యగాని జంతువుల్లా ప్రవర్తిస్తున్నారనే చెప్పాలి. ఎదుటివ్యక్తిని ఆదరించని లైంగికక్రియ, ప్రేమలేని లైంగికక్రియ జంతువులకు యోగ్యమైతే ఔతుందేమోగాని నరులకు యోగ్యంగాదు.

అసలు ఆలుమగలు ఎదటి వ్యక్తినుండి సుఖాన్ని పొందడంగాదు, ఎదుటివ్యక్తికి సుఖాన్ని ఈయడమే తమ కలయిక యొక్క ధ్యేయం అనుకోవాలి. ఎదుటివ్యక్తి ప్రేమను అనుభవించడంగాదు, ఎదుటివ్యక్తిని ప్రేమించడమే ప్రధానం అనుకోవాలి. ఇది స్వార్థంలేని ప్రేమ. భార్యాభర్తలు అవశ్యం పెంపొందించుకోవలసిన ప్రేమ. ఈలాంటి నిస్వార్థప్రేమ ద్వారాగాని దంపతులు "స్నేహితులకోసం స్వీయప్రాణాన్ని సమర్పించడంకంటె ఉత్తమ

ప్రేమ యేముంది?" అనే ప్రభువాక్యాన్ని సార్థకం జేసికోరు - యోహా 15,13. దీనిద్వారాగాని భార్యాభర్తల ప్రేమ శ్రీసభ-క్రీస్తు ప్రేమ పోలికనందజాలదు.

ఇలా భార్యాభర్తలు లైంగిక క్రియలో నిస్వార్థంతో ప్రవర్తించడమనేది వాళ్ళ దాంపత్య జీవితానికీ అంతస్తునకూ సంబంధించిన పుణ్యం. కనుక దీన్ని దాంపత్యపుణ్యం అనాలి. ఈ పుణ్యాన్ని పాటించందే వాళ్ళ దాంపత్య జీవితం పునీతంకాదు. గుడికి వెళ్ళడం, జపాలు జపమాల చెప్పుకోవడం, క్రైస్తవ సంస్కారాలు పొందుతూ ఉండడం సులభం. కాని ఈ దాంపత్య పుణ్యాన్ని పాటించడం కష్టం. ఐనా ఈ పుణ్యంద్వారా భార్యాభర్తలు తమ్ము తామేగాదు, ఒకరినొకరుగూడ పవిత్రపరచుకుంటారు.

ఈలా భార్యాభర్తలు ఒకరినొకరు ప్రభు వరప్రసాదంగా భావించుకోవాలి. ఒకరిపట్ల ఒకరు మర్యాదతో, గౌరవంతో భక్తిభావంతో ప్రవర్తించాలి. ఇతరుని భజించేవాడు లేక సేవించేవాడు, భక్తుడు. ఇక సేవలేని ప్రేమంటూ లేదు. కనుక భార్యాభర్తలు ఒకరిపట్ల ఒకరు భక్తిభావం ప్రదర్శించడమంటే ఒకరినొకరు ప్రేమిస్తూ సేవిస్తూ ఉండడం. ఇదీ దాంపత్య జీవితానికి తగిన భక్తి.

## 2. ప్రార్థనా జీవితం

ప్రార్థనలేందే కుటుంబజీవితంలో భక్తిని పెంపొందించుకోలేం. ప్రార్థన భార్యాభర్తలను ఐక్యపరుస్తుంది. బిడ్డలను తల్లిదండ్రులతో జోడిస్తుంది. రోజురోజు నియమిత కాలానికి సమావేశమై భక్తిశ్రద్ధలతో ప్రార్థన చేసుకునే కుటుంబం కూడిమాడి జీవిస్తుంది.

ప్రార్థనమంటే దైనందిన కార్యాలు మానుకొని ఓ ఐదు నిమిషాలు దేవునివైపు మనస్సు మరల్చడం మాత్రమేగాదు. మరి ఆ దైనందిన కార్యాలనే దేవునివైపు మరల్చడం. ప్రార్థనద్వారా మన జీవితంలోని కష్టాలను సుఖాలను ప్రభువునకు అర్పించుకోవాలి. మన పనులన్నీ ఆ ప్రభువునకు సమర్పితం కావాలి. మన జీవితమంతా పరలోకంలోని తండ్రికి అంకితం కావాలి.

కుటుంబ ప్రార్థనలో బిడ్డలుకూడ తప్పనిసరిగా పాల్గొనాలి. ఈలా పాల్గొనడం ద్వారా పిల్లలకు ప్రార్థనాభ్యాసం అలవడుతుంది. ప్రార్థనకు అలవాటుపడిన పిల్లలు దేవుణ్ణి, దేవునికోసం తోడిప్రజలను, ప్రేమించడం నేర్చుకుంటారు. చిన్ననాడు ప్రార్థనకు అలవాటుపడిన బాలబాలికలు యౌవనప్రాయంలో చాంచల్యంవల్ల కొంతకాలం భగవంతుని విస్మరించినా, ఆ పిమ్మట మళ్ళా ప్రభువును స్మరిస్తారు. చిన్ననాడు ప్రార్థనద్వారా పరిచయం జేసుకున్న ప్రభువును మళ్ళా సమీపిస్తారు. ఇక ఈ ప్రార్థనాభ్యాసానికి అలవాటుపడని బాలబాలికలు పెరిగి పెద్దవాళ్ళయ్యాక ప్రపంచ వ్యామోహాల్లో చిక్కుకొని పోతారు. లౌకిక విషయాలనే వరదలోబడి కొట్టుకొనిపోతారు.

ప్రార్థనం బహుముఖంగా ఉంటుంది. కనుక కుటుంబప్రార్థన పలానా విధంగా ఉండాలి అని ఓ నియమాన్ని సూచించలేం. ఐనా మన క్యాతలిక్ క్రైస్తవులకు బైబులుతో అట్టే పరిచయం ఉండదు గనుక మన ప్రజలు బైబులు చదువుకొని ప్రార్థన చేసికోవడం చాల ముఖ్యం. మనం ప్రార్థించేప్పుడు దేవునితో సంభాషిస్తాం. కాని బైబులు చదువుకునేప్పుడు ప్రభువే మనతో సంభాషిస్తాడు. జీవితంలో ఈ రెండు రకాల సంభాషణలూ అవసరమే. బైబులు చదువుకోవడంకూడ ఓ ప్రార్థన. బైబులు వాక్యాలద్వారా ప్రభువు మనతో మాటలాడతాడు అనే సత్యాన్ని మనవాళ్ళు చాలమంది గుర్తించరు. స్తిమితంగా కూర్చుండి రోజూ కాసేపు బైబులు చదువుకొని ప్రార్థనం చేసికోవాలి. ఈ ప్రార్థనం మనవి, విజ్ఞాపనం, కృతజ్ఞత, పశ్చాత్తాపం, ఆరాధన అనే నానారూపాల్లో వుండవచ్చు. ప్రార్థనలో వేదవాక్యం నోటికి రుచి తగలాలి. ఒకసారి వేదవాక్యాన్ని రుచిచూచిన భక్తులు ఇక దాన్ని వదలి ఉండలేరు.

ఈ లోకయాత్రలో ప్రభువు వాక్యమే దీపమై మనకు దారి చూపిస్తుంది. మనం దేవుని ఆజ్ఞల ప్రకారం జీవించేలా, దేవుని మార్గాల్లో నడిచేలా చేస్తుంది.

మంచి ప్రార్థనవల్ల మన జీవితం మంచికి మారుతుంది. మన పొరపాట్లను కొంతవరకైనా సవరించుకొంటాం. మనలోని స్వార్థం తగ్గుతుంది. తోడివారిని ప్రేమభావంతో ఆదరిస్తాం. ఇవన్నీ మన ప్రార్థనం ఫలించిందనడానికి గుర్తులు.

గృహస్థులకు తరచుగా పగటిపూట కాలవ్యవధి లభించదు. కనుక కుటుంబమంతాకూడి రాత్రిపూట ప్రశాంతంగా అవధానంగా జపంచేసికోవడం మంచిది. ఎవరి ప్రార్థనా కాలాన్ని వాళ్ళు నిర్ణయించుకోవడం ఉత్తమం.

## 3. క్రైస్తవ సంస్కారాలు

కుటుంబ జీవితాన్ని పవిత్రంజేసే సాధనాలన్నిటిలోను క్రైస్తవ సంస్కారాలు ప్రధానమైనవి. మొట్టమొదట వివాహజీవితం జీవించేవాళ్ళను జ్ఞానవివాహ సంస్కారం పునీతులను జేస్తుంది. ఈ సంస్కారంవలన క్రీస్తు-స్త్రీసభల ప్రేమ భార్యాభర్తల ప్రేమపైసోకి ఆ ప్రేమను నిర్మలం చేస్తుంది. ఈ సంస్కారం ఇచ్చే ప్రత్యేక వరప్రసాదం కష్టసుఖాల్లోను దంపతులను ఆదరిస్తుంది.

ఇక జ్ఞానస్నాన సంస్కారం వుంది. ఇది మనలను క్రీస్తుతో ఐక్యంజేస్తుంది. శ్రీసభ సభ్యులనుగా తయారుచేస్తుంది. ఈ శ్రీసభలో ఆరాధన జీవితమూ ప్రేమ జీవితమూ ప్రధానమైనవి. కనుక జ్ఞానస్నానం శ్రీసభలో ఓ భాగమైన క్రైస్తవ కుటుంబంకూడ ఈ యారాధన జీవితాన్ని సంపూర్ణంగా జీవించేలా జేస్తుంది.

జ్ఞానస్నానాన్ని పరిపూర్ణం జేసేది భద్రమైన అభ్యంగనం. దీనిద్వారా క్రీస్తు తరపున ప్రపంచానికి సాక్ష్యమిస్తాం. పైగా ఈ సంస్కారం దంపతులు వివాహజీవితానికి సాక్ష్యమిచ్చేలాగూడ చేస్తుంది. అనగా భార్యాభర్తలు పరస్పరానురాగంతో జీవిస్తూ, విడివడని తమ క్రైస్తవ ప్రేమనుగూర్చి లోకం యెదుట సాక్ష్యమిస్తారు. బిడ్డలను కనిపెంచుతూ సంతానం దాంపత్యజీవితధ్యేయమని యెలుగెత్తి చాటుతారు. స్వార్థప్రేమతో, విడాకులతో, కుటుంబ నియంత్రణతో కలుషితమైపోయిన నేటి కుటుంబజీవితానికి క్రైస్తవ దంపతులిచ్చే ఈ సాక్ష్యం ఎంతైనా అవసరం.

ఆమీదట దివ్యసత్ప్రసాదముంది. ఇది క్రీస్తు ప్రేమను ప్రసాదించే సంస్కారం. దీనివలన దంపతులు క్రీస్తు ప్రేమను పొందుతారు. పరస్పర ప్రేమను పెంపొందించు కుంటారు. ఈ ప్రేమద్వారా ఒకరినొకరు ఆదరించుకుంటూ ఒకరిపట్ల ఒకరు విశ్వాసంతో ప్రవర్తిస్తారు. వివాహంనాడు ఒకరి యెదుట ఒకరు చేసిన ప్రమాణాలను నిలబెట్టుకొంటారు. ఒకరి కష్టాల నొకరు సానుభూతితో అర్థంజేసికొని ఒకరి నొకరు ఓర్పుతో భరిస్తూ వుంటారు. దేహంలో జీవశక్తి యేలాంటిదో కుటుంబంలో ప్రేమశక్తి అలాంటిది. జీవాన్ని గోల్పోయిన దేహం శిథిలమైపోతుంది. ప్రేమను గోల్పోయిన కుటుంబం విచ్ఛిన్నమైపోతుంది. కుటుంబాలను నిలబెట్టేది దివ్యసత్ప్రసాదం.

కట్టకడన పాపోచ్చారణముంది. ఇది నరుల తప్పిదాలను క్షమించి వాళ్ళ బలహీనతలనూ, లోపాలనూ చక్కదిద్దే సంస్కారం. దీనివలన దంపతులు స్వీయ పాపాలకు లోపాలకు ప్రభువునుండి క్షమాపణం పొందుతారు. పైగా, ప్రభు క్షమాపణను ఆదర్శంగా బెట్టుకొని ఒకరినొకరు క్షమించుకోవడంగూడ నేర్చుకుంటారు. ఒకరి బలహీనతల నొకరు జాలితో చక్కదిద్దుకోవడానికి అలవాటు పడతారు.

ఇక, పాపోచ్చారణం లాంటిదే ఆత్మశోధనం గూడ. దంపతులు చేసుకునే ఆత్మశోధనం వాళ్ళ అంతస్తునకు తగినట్లుగా వుండాలి. అనగా భార్యాభర్తలు తమ పరస్పర ప్రేమనుగూర్చి, తాము బిడ్డలను పెంచే విధానాన్ని గూర్చి కుటుంబ జీవితం ద్వారాలోకానికి తామిచ్చే సాక్ష్యాన్ని గూర్చి ఆత్మశోధనం చేసుకోవాలి. ఈ యాత్మశోధనను గ్రంథాంతంలో పొందుపరచాం గనుక దాన్ని వాడుకోవచ్చు.

కుటుంబజీవితం జీవించేవాళ్లు ఈ క్రైస్తవ సంస్కారాలపట్ల ఆదరాన్ని భక్తిని చూపుతూండాలి. వాటిని యోగ్యంగా పొందుతూండాలి. అలా పొందినట్లయితే కుటుంబ ప్రజలు ప్రభు దీవెనలు బడసి ప్రశాంతంగా జీవిస్తారు. పుణ్యమార్గంలో సాగిపోతారు.

*1. సంయమనం*

పౌలు తన లేఖల్లో భార్యాభర్తలకు సంయమనాన్ని బోధించాడు. కాలం చివరకు వచ్చిందిగనుక భార్య కలిగిన వాళ్లుకూడ భార్యలేనట్లుగా జీవించాలి అన్నాడు-1కొ 7,29. ప్రభువు రెండవ రాకడను మనస్సులో పెట్టుకొని అతడీలా వ్రాసాడు. ఈ లోక విషయాలూ, వాటితోపాటు వివాహంకూడా, ప్రభు రాకడకు తావీయాలి. అనగా లైంగిక జీవితమే ప్రధానం కాదని భావం. మరో తావులో పౌలు, ప్రార్థనంచేసికొని భగవత్సాక్షాత్కారం కలిగించుకోవడం కోసం భార్యాభర్తలు కొంతకాలంపాటు ఒకరినొకరు సమీపించకుండా వుండడం మంచిదనికూడ సూచించాడు-1కొ 7,5. ఇక్కడ లైంగికక్రియ చెడ్డదని కాదుగాని, భగవత్సాన్నిధ్యాన్ని కలిగించుకోవడంకోసం దాన్ని కొంతకాలం విసర్జించమన్నాడు. భార్యాభర్తలు లైంగిక విషయాల్లో సంయమనాన్ని పాటించాలి అనడానికి ఈ ఉదాహరణలు చాలు. ఉపవాసం చేసిన దేహం ఆరోగ్యంతో పనిచేస్తుంది. సంయమనానికి అలవాటుపడిన స్త్రీపురుషులు లైంగికక్రియలోని విలువను ఉదాత్తతను అధికంగా గుర్తిస్తారు. పైగా లైంగికక్రియ, లైంగికసుఖమే వివాహజీవితానికి పరమావధి అని బోధించే వెర్రివేదం నిలువజాలదని కూడ దంపతులు ఈ సంయమనంద్వారా తేల్చి చూపవచ్చు.

*2. తిమోతి*

తిమోతి పౌలు శిష్యుడు. పౌలు గతించిన తరువాత అతడు ప్రారంభించిన ప్రేషితకార్యాన్ని కొనసాగించిన ప్రేషితోత్తముడు. ఈ తిమోతి అమ్మమ్మ పేరు లోయి. ఆమె తిమోతి బాలుడుగా వున్నపుడే అతన్ని భక్తిమార్గంలో తీర్చిదిద్దింది. అతన్ని ఒడిలో కూర్చుండబెట్టుకొని వేదగ్రంథం చదివించింది. ప్రార్థనం చేయడం నేర్పించింది- 2తిమో 3,15. ఈలా కుటుంబంలోని పెద్దవాళ్ళవలన తిమోతికి చిన్ననాడే బైబులు గ్రంథంతో పరిచయం గలిగింది. తరువాత తిమోతి పెరిగి పెద్దవాడై చాలయేండ్లు గతించాక పౌలు అతనికి జాబు వ్రాస్తూ "నీవు చిన్ననాడే అలవాటుచేసికొన్న బైబులు పఠనాన్ని అశ్రద్ధ చేయవద్దు సుమా" అని హెచ్చరించాడు -1తిమొ 4,13. మన కుటుంబం జపాల్లోకూడ బైబులు చదువుకొని ప్రార్థనం చేసికొంటే ఎంత బాగుంటుంది! తిమోతిలాగ మన పిల్లలుకూడ చిన్ననాటినుండే బైబులు పఠనానికీ బైబులు ప్రార్థనకీ అభ్యాసపడితే యెంత ముచ్చటగా వుంటుంది!

*3. దివ్యభోజనం*

పునీత అగస్టీను తాను వ్రాసిన "కన్ఫెషన్సు" అనే గ్రంథంలో ఓ సంఘటనం చెప్పాడు. అగస్టీను యౌవనప్రాయంలో చాల పాడుజీవితం జీవించి ఆ పిమ్మట పరివర్తనం చెందాడు. కాని పరివర్తనం చెందాకకూడ అశుద్ధపు కోరికలు అతన్ని నిత్యమూ బాధిస్తుండేవి. ఓదినం అగస్టీను ఈ విషయాన్ని ప్రభుసన్నిధిలో నివేదించుకొని ప్రార్థనం చేసికొంటూండగా అతని అంతరాత్మలో ఓస్వరం వినిపించింది. "నీవు నా శరీరాన్ని చేకొని భుజించు, నీ బాధలు తీరిపోతాయి. కాని ఈ భోజనం మాత్రం నరులను నా లోనికి మారుస్తుంది" అని ప్రభువు అతనితో సెలవిచ్చాడు. తరువాత అగస్టీను దివ్యభోజనాన్ని యోగ్యంగా స్వీకరించి ఆ యశుద్ధపు కోరికలను అరికట్టగల్గానని తన గ్రంథంలో వ్రాసికొన్నాడు. జీవితంలో కష్టాలను ఎదుర్కొనేపుడు మనంకూడ సంస్కారాలద్వారా, విశేషంగా దివ్యభోజన సంస్కారంద్వారా, ఈ శక్తినే పొందవచ్చు. కనుక దంపతులు క్రైస్తవ సంస్కారాలను యోగ్యంగా స్వీకరించి తమ జీవితాన్ని భక్తిమంతంగాను శక్తిమంతంగాను తీర్చిదిద్దుకోవాలి.

*4. అక్విలా, ప్రిస్కా*

పౌలు క్రీస్తును బోధించడంకోసం కోరింతు పట్టణానికి వచ్చాడు. ఆ నగరంలో అక్విలా, ప్రిస్కా అనే యూద క్రైస్తవ దంపతులు వుండేవాళ్ళు. వాళ్లు గుడారపు బట్టలు నేసికొని జీవిస్తుండేవాళ్లు. పౌలు కోరింతులో వున్నంతకాలం ఈ దంపతుల ఇంటిలోనే తలదాచుకున్నాడు. వీళ్ళతోపాటు తానూ గుడారాల బట్టలు నేసాడు. ఈ దంపతులు పౌలునుండి క్రీస్తును నేర్చుకున్నారు. తాము నేర్చుకున్న క్రీస్తును ఇతరులకు బోధించారు. తమ బోధలద్వారానైతేనేం, తాము జీవించే ఆదర్శ క్రైస్తవ జీవితంద్వారానైతేనేం క్రీస్తునకు సాక్ష్యమిచ్చారు. పౌలు తనజాబుల్లో ఈ దంపతులను ఎంతో ఆదరపురస్కారాలతో పేర్కొన్నాడు - రోమ 16,3-4. ఈలాగే మన క్రైస్తవ దంపతులుకూడ భక్తిమంతమైన జీవితంద్వారా క్రీస్తునకు సాక్ష్యమిస్తుండాలి.

# 10. వివాహ జీవితంగూడ పిలుపే

## 1. వివాహ జీవితంగూడ పిలుపే

మామూలుగా మనం గురుజీవితం, కన్యాజీవితం దేవుని పిలుపు అనుకొంటాం. కాని వివాహ జీవితంగూడ దేవునిపిలుపే. అసలు దైవప్రజలందరికి పిలుపు వుంటుంది. ఆ పిలుపులో అంతర్భాగాలే గురుజీవితం, వివాహజీవితం మొదలైనవి. వివాహితులుకూడ పవిత్రజీవనం గడపాలి. వివాహ అంతస్తుకి తిరుసభలో ప్రత్యేకమైనస్థానం వుంది.

తిరుసభలో పలురకాల జీవిత విధానాలు వున్నాయి. వీటన్నిటిని నియమించిన వాడు ప్రభువే. వివాహ వ్యవస్థ కూడ ఓ జీవిత విధానం. దాన్ని ఏర్పరచినవాడు క్రీస్తే. కనుక అదికూడ ఓ పిలుపే. వివాహ వ్యస్థ ఓ దేవద్రవ్యానుమానంచే పరిపూరితమైంది. అది తిరుసభలో క్రీస్తు ద్వారా నూత్నజీవాన్ని కొనివస్తుంది. ఈ వ్యవస్థను చేపట్టే భార్యాభర్తలు ప్రత్యేకమైన పద్ధతిలో పవిత్రులు కావాలి.

భగవంతుడు అందరినీ గురు కన్యాజీవితాలకు పిలువడు. చాలమందిని వివాహ జీవితాలకే పిలుస్తుంటాడు. క్రైస్తవుల్లో నూటికి 99శాతం వివాహితులేగదా! ఈ వివాహ వ్యవస్థను బైబులు పలుతావుల్లో వర్ణిస్తుంది. "దేవుడు తన్ను పోలునట్లుగా మానవజాతిని సృజించాడు. స్త్రీపురుషులనుగా మానవులను చేసాడు. వారిని దీవించి మీరు బిడ్డలను పెక్కండ్రను కని వృద్ధిజెందండని చెప్పాడు" - ఆది 1,27-28. "మా పితరులు దేవుడవైన ప్రభూ! నీకు స్తుతి కలుగునుగాక నీవు ఆదామును సృజించావు. అతనికి భార్యగాను, ఆదరవుగాను, తోడుగాను ఉండడానికి ఏవను చేసావు. వారినుండి మానవజాతి ఉద్భవించింది" తోబీతు 6,5-6. "ప్రారంభంనుండి సృష్టికర్త భార్యాభర్తలను స్త్రీ పురుషులనుగా సృజించాడు. ఈ కారణంచేత పురుషుడు తల్లిదండ్రులను విడనాడి భార్యను హత్తుకుని వుంటాడు. వాళ్ళిద్దరూ ఏకశరీరులై యుంటారు - మత్త 19,4-5.

వాటికన్ మహాసభ ఈలా బోధించింది. భార్యాభర్తలు క్రీస్తుకీ తిరుసభకూ గల ఐక్యతను ప్రేమను జ్ఞప్తికి తెస్తుంటారు. వాళ్ళు పరస్పర ప్రేమతో కలసిమెలసి జీవించడం ద్వారాను, బిడ్డలను కనిపెంచడంద్వారాను పవిత్రులౌతారు. తిరుసభలో వాళ్ళకు ఓ ప్రత్యేకస్థానం వుంది.

వివాహ వ్యవస్థకూడ ఓ ప్రత్యేక పిలుపు అనడానికి ప్రధాన కారణం ఇది. దేవుడు తిరుసభలో కొందరు నరులకు ఓ ప్రత్యేకమైన పని ఒప్పజెప్తాడు. ఆ పని సక్రమంగా జరగడానికిగాను ఓ ప్రత్యేక దేవద్రవ్యానుమానమూ వరప్రసాదమూ వారికి తోడ్పడేలా చేస్తాడు. మనం ఆ నరులు దేవునినుండి ప్రత్యేకమైన పిలుపుని పొందారని చెప్తాం. ఐతే వివాహ వ్యవస్థలో జ్ఞానస్నానం పొందిన స్త్రీ పురుషులిద్దరికీ దేవుడు ప్రత్యేకమైన పనిని ఒప్పజెప్తాడు. ఆపని క్రీస్తు తిరుసభల ఐక్యతను సూచించడం, సంతానాన్ని కని మానవజాతిని అభివృద్ధిచేయడం. ఈ పనిని సాధించడానికిగాను వివాహ దేవద్రవ్యానుమానమూ ప్రత్యేక వరప్రసాదమూ వాళ్ళకు సాయంజేస్తూంటాయి. కనుక వివాహ వ్యవస్థకూడ ప్రత్యేకమైన పిలుపే.

## 2. వివాహ జీవితమూ బ్రహ్మచర్య జీవితమూ

గురువులు మఠకన్యలు గడిపే బ్రహ్మచర్య జీవితానికి ప్రత్యేకమైన విలువ వుంది. ఈలాంటి జీవితం మోక్షంలో మనకు భగవంతునితో సిద్ధించే ఐక్యతను సూచిస్తుంది.

దీనికి భిన్నంగా వివాహ వ్యవస్థ ఈ లోకంలో క్రీస్తుకి తిరుసభతో వుండే ఐక్యతను సూచిస్తుంది. కనుక ఒకటి పరలోకంలోని ఐక్యతను సూచిస్తే, మరొకటి ఈలోకంలోని ఐక్యతను తెలియజేస్తుంది.

గురు జీవితానికి వివాహ జీవితానికీ ఈ వ్యత్యాసం వుంది. గురుజీవితం తిరుసభలో దైవారాధనను కొనసాగించడానికి వుంది. గురువుకి అక్షయమైన ముద్రకూడ లభిస్తుంది. వివాహ జీవితంలో అక్షయమైన ముద్ర యేమీలేదు. భార్యాభర్తలు మాత్రం తమ జీవితకాలమంతా కలసిమెలసి జీవిస్తారు. వివాహ జీవితం బిడ్డలను కనడానికీ, ఆ బిడ్డలను తిరుసభ బిడ్డలనుగా తయారుచేయడానికీ వుంది. వారిని దైవప్రజలనుగాను దేవుని కుటుంబ సభ్యులనుగాను చేయడానికి వుంది. కనుక గురుజీవితం దైవరాధనకొరకు, వివాహజీవితం మానవజాతి మనుగడను ఈ భూమిపై కొనసాగించడం కొరకు.

## 3. వివాహ జీవితానికి పిలుపు

ఎవరైనా వివాహ అంతస్తులో ప్రవేశించవచ్చు. “మీరు పెక్కండ్రు బిడ్డలను కని వృద్ధిచెందండి” అన్న తొలి ఆజ్ఞను దేవుడు నరులందరికీ యిచ్చాడు – ఆది 1,28. ఐతే దేవుడు వివాహము అంతస్తుకిపిల్చే నరుని హృదయంలో ఆ వివాహంపై బలమైన కోరిక పుట్టిస్తాడు. అతన్ని కొన్ని ప్రత్యేక పరిస్థితులద్వారా, కొందరు ప్రత్యేక వ్యక్తులద్వారా ఓ నిర్ణీతవ్యక్తిదగ్గరికి నడిపిస్తాడు. చివరన వాళ్ళిద్దరికి వివాహం జరుగుతుంది. వివాహపు అంతస్తులో ప్రవేశించకముందు స్త్రీపురుషులు తమ హృదయంలోని కోరికలను పరిశీలించి చూచుకోవాలి. దేవుని చిత్తాన్ని గుర్తించాలి. ఆ దేవుడు తనకు నిర్ణయింపబోయే భాగస్వామిని పెద్దలు మిత్రులు మొదలైనవారి సహాయంతో గుర్తుపట్టాలి. ఈలా గుర్తుపట్టటానికి మన తరపున మనకు ప్రార్థన ఆలోచన రెండూ అవసరమే. గురువులను మఠకన్యలనులాగే వివాహితులనుగూడ ప్రభువు ఓ ప్రత్యేక పద్ధతిలో పిలుస్తాడు. ఒక ప్రత్యేక పురుషుణ్ణి ఒక ప్రత్యేక స్త్రీతో జతగూరుస్తాడు. అందరి వివాహాలను ముందుగా నిర్ణయించేది ఆ ప్రభువే.

## 4. వివాహజీవితమూ పావిత్ర్యమూ

వివాహజీవితం గడిపేవాళ్ళుకూడ పవిత్రంగా జీవిస్తారని చెప్పాం. కాని వివాహితుల పావిత్ర్యం వేరు. గురువూ మఠకన్యా ఈలోక విషయాలలోగాక పరలోక విషయాల్లో నిమగ్నులై యుండాలి. వాళ్ళది ప్రధానగా నివృత్తిమార్గం. అనగా లౌకిక విషయాలనుండి వైదొలగడం. ఈలాకాక వివాహితులు ఈలోక విషయాల్లో నిమగ్నులౌతుండాలి. భూమండలమంతట వ్యాపించి దాన్ని వశపర్చుకోండి అన్న వేదవాక్యం

ప్రధానంగా వాళ్ళకు వర్తిస్తుంది - ఆది 1,28. వాళ్ళది ప్రధానంగా ప్రవృత్తి మార్గం. అనగా ఈలోక విషయాల్లో మునిగి వుండడం. వివాహ పావిత్ర్యం భార్యాభర్తలు ఇద్దరు కలసి సాధించేది. లైంగికమైంది. ఐనా శారీరక వ్యామోహాలను జయించేది. క్రీస్తు వరప్రసాదం ద్వారా జంతుప్రేమను దివ్యప్రేమగా మార్చుకొనేది. సంతానంవైపు దృష్టి సారించేది. కుటుంబగతమైది. సామూహికమైంది. క్రీస్తు మనుష్యావతారమెత్తి ఈ భౌతిక ప్రపంచాన్ని పునీతం చేసాడు. వివాహ పావిత్ర్యం ప్రధానంగా ఈ భౌతికలోకానికి చెందింది.

## ప్రార్థనా భావాలు

*1. వివాహం గొప్పతనం*

రెండవ శతాబ్దంలో జీవించిన టెర్టూలియన్ అనే వేదశాస్త్రి పెండ్లిని మెచ్చుకుంటూ ఈలా వ్రాసాడు. "వివాహం ఔన్నత్యాన్ని ఏనాడూ చాలినంతగా కొనియాడలేం. తిరుసభ ఆ సంస్కారాన్ని జరిపిస్తుంది. పూజబలి ఈ దేవ ద్రవ్యానుమానాన్ని ధ్రువపరుస్తుంది. గురువు వధూవరులను ఆశీర్వదిస్తాడు. వివాహ సాంగ్యంలో దేవదూతలే సాక్షులుగా నిల్చివుంటారు. పరలోకంలోని పితే వివాహాన్ని స్థిరపరుస్తాడు." ఇవి ప్రేరణం పుట్టించే వాక్యాలు కదా!

*2. వివాహం తక్కువది కాదు*

4వ శతాబ్దంలో మానిక్కీయులనే పతితవాదులు వివాహాన్ని ఈసడించుకొన్నారు. అది కేవలం శరీరానికి సంబంధించింది కనుక నికృష్టమైంది అన్నారు. జీవమిచ్చేది ఆత్మ, శరీరం నిష్ప్రయోజనమైంది - యోహా 6,63. రక్తమాంసాలు దేవుని రాజ్యంలో ప్రవేశించలేవు - 1కొ 15,50 మొదలైన వాక్యాలను ఉదహరించి వాళ్ళు పెండ్లిచెడ్డదని వాదించారు. కాని ఇది పొరపాటు. క్రీస్తు శరీరధారియై మన శరీరాన్ని పవిత్రం జేసాడు. వివాహ సంస్కారం క్రీస్తు మనుష్యావతారంమీద ఆధారపడి పనిచేస్తుంది.

*5. తిరుకుటుంబం*

మరియా యోసేపుల వివాహం పరమ పవిత్రమైంది. దానిలో లైంగిక ప్రక్రియమాత్రం లేదు. మరియ గర్భాన క్రీస్తు జన్మించడం పవిత్రకార్యం. తిరుకుటుంబం ఎల్లప్పుడు మన క్రైస్తవ కుటుంబాలకు ఆదర్శంగా వుండాలి.

*4. పెండ్లి వుంగరం*

పదియవ భక్తినాథ పాపుగారు అర్చ్యశిష్టులు. ఆయన ఒకసారి తనచేతి వుంగరాన్ని తల్లికి చూపించి అమ్మా! నీవు ఈ వుంగరం ఘనతను గుర్తించావా అని అడిగాడు.

వెంటనే తల్లి తన వ్రేలి ఉంగరాన్ని కుమారునికి చూపించి నాయనా! ఈ వుంగరం లేకపోతే నీవసలు పుట్టివుండేవాడివే కాదు అంది. వివాహంద్వారా దైవసేవకు అంకితమయ్యే గురువులనూ మఠకన్యలనూ కనే తల్లిదండ్రులు ధన్యులు కదా!

*5. పురాతన వ్యవస్థ*

వివాహ వ్యవస్థ మానవజాతి ఎంత ప్రాచీనమైందో అంత ప్రాచీనమైంది. సృష్ట్యాదిలోనే దేవుడు "నరుడు ఒంటరిగా జీవించడం మంచిదికాదు" అనుకొన్నాడు - ఆది 2,18. "మీరు బిడ్డలను పెక్కండ్రనుకని వృద్ధిచెంది భూమండలమంతట వ్యాపించండి" అన్నాడు-1,28. ఆనాడే వివాహ వ్యవస్థకూడ ఏర్పడింది. ప్రాచీనమూ పవిత్రమూ ఐన ఈ వ్యవస్థను మనం అతిగౌరవంతో చూడాలి.

# 11. యువతీ యువకులు

## 1. వివాహమాడబోయే యువతీయువకులు

వివాహం చేసుకోబోయే యువతీ యువకులు తీయని కలలు కంటూంటారు. భావిజీవితాన్ని గురించి గొప్పగా తలంచుకోవడం మంచిదే. కాని మన భావాలు భావిలో సిద్ధించే భార్యనుగాని, భర్తనుగాని యథార్థంగా అర్థంజేసికొనేలా వుండాలి. కాని వివాహానికి ముందే యువకుని గూర్చి యువతి, యువతిని గూర్చి యువకుడు, కొన్ని స్పష్టమైన భావాలు ఏర్పరచుకోవాలి.

## 2. దైవరూపం

యువకునిలాగే యువతికూడ దేవుని ప్రతిబింబం. దేవుని బిడ్డ. అతనితోపాటు ఆమెకూడ ఒకనాడు దేవుని చేరాలి–ఆది 1,27. ఇక ఆమెలాగే అతడూ దేవుని పోలికగా సృజింపబడ్డాడు. అతడూ దేవుని పుత్రుడు. దేవుని చేరి ఆనందించవలసినవాడు. నరునిలోని యీ దేవుని పోలికను మననం జేసికొన్న యువతీ యువకులు ఒకరి విలువను ఒకరు చక్కగా గుర్తిస్తారు.

## 3. సహాయకురాలు - అధిపతి

ఆమెను నరునికి సహాయకురాలినిగా అనుగ్రహించాడు ప్రభువు - ఆది 2,18. అనగా ఆమె పురుషునికి సహచారిణి. ఆమె లేందే అతడు పరిపూర్ణ మానవుడు కాలేదు.

ఆమెతో ఐక్యమైతేనేగాని అతడు తన సృష్ట్యాశయాన్ని సాధించలేడు. బిడ్డల్ని కని సంతానరూపంలో తన జీవితాన్ని పొడిగించుకోలేడు. అంచేత అతడు నిత్యం ఆమెమీద ఆధారపడుతూ వుండాలి.

ఆమె గృహిణి. కాని అతడు గృహపతి. ఆమెకు శిరస్సు, అధిపతి - 1కొరి 11,3. ఆమె అతని దేహాన్నుండి కలిగింపబడింది. ఆమె ఉనికి అతనికోసం. కావున స్త్రీ ఓ దేహంలాంటిది. ఆ దేహానికి శిరస్సులాంటివాడు పురుషుడు - ఎఫె 5,28.

బైబుల్లో శిరస్సు ఆధిపత్యాన్ని నాయకత్వాన్ని సూచిస్తుంది. కావున స్త్రీపై ఆధిపత్యం చూపేవాడు పురుషుడు. గాని ఈ ఆధిపత్యం క్రీస్తు శ్రీసభపట్లచూపే ఆధిపత్యం లాంటిదే- ఎఫే 5,23. బైబుల్లో ఆధిపత్యం చూపడమనగా ఓ వ్యక్తిపై అధికారం చెలాయించడంకాదు. మరి ఆ వ్యక్తి శ్రేయస్సుకోసం పాటుపడ్డం; ప్రేమభావంతో ఆ వ్యక్తిని ఆదరించడం. క్రీస్తు శ్రీసభను ఇలా ఆదరించాడు. భర్తకూడ భార్యను యీలా ఆదరించాలి. వివాహజీవితంలో పురుషుడేమో అధిపతే. స్త్రీయేమో విధేయురాలే - ఎఫే 5,24. కాని యీ యాధిపత్య విధేయతలు ప్రేమ అనే పునాదిపై నిలవాలి.

## 4. ఆమె తల్లి, అతడు తండ్రి

స్త్రీ భార్యగా, తల్లిగా, సార్థక్యం పొందుతుంది. కావున పురుషుడు ఆమెను భార్యగా స్వీకరించాలి. "నా బిడ్డల తల్లి" అన్న భావంతో ఆమెను గౌరవించాలి. బైబులు చివరి గ్రంథములోని స్త్రీ మగబిడ్డని గని మన్నన పొందుతుంది-దర్శ 12,5. రాహేలు బిడ్డలనీయమని భర్త యాకోబును పీడిస్తుంది - ఆది 30,1.

యువకునికి భార్య దొరికినప్పుడు అన్ని మేలులూ కలిగినట్లే - సామె 18,22. ఆమె అతనికి సహాయకురాలు. వృద్ధుడు ఊతకఱ్ఱమీదలా, అతడూ ఆమెమీద ఆనుకొని నడుస్తాడు. పక్షి గూటిలో నివసించినట్లు ఆమెతో కాపురం ఏర్పరచుకొని ఓ యింట్లో నివసిస్తాడు. ఓ యింటివాడు ఔతాడు - సీరా 37,24-26.

ఆమె భార్య, తల్లి కాబోతుందన్నాం. అతడూ భర్త, తండ్రి కాబోయేవాడు. అతని తాతతండ్రులూ, అతనూ తన బిడ్డలయందు కొనసాగిపోతారు. తల్లిదండ్రులం కాబోతున్నాం అనే భావం యువతీయువకుల మనస్తత్వానికి లోతుతనాన్ని, నిబ్బరపు గుణాన్ని ఇస్తుంది.

## 5. కన్య-గురువు

ఇంతవరకూ పూర్వవేదం సూచించిన భావాలు చూచాం. కాని నూత్నవేదం స్త్రీ విషయంలో మరో గొప్ప ఆదర్శాన్ని గూడ సూచించింది. ఆమె భార్యగా, తల్లిగా మాత్రమేగాక

కన్యగాగూడా తన ఆశయాన్ని సాధించుకుంటుంది. వివాహిత భర్తనేలా సంతోషపెట్టాలా అని రేయింబవళ్లు భర్త విషయాలతో సతమతమౌతూ వుంటుంది. కాని అవివాహితయైన మఠకన్య ప్రభువునేలా సంతోషపెట్టాలా అని అహోరాత్రులు ప్రభు విషయాలతో సతమతమౌతూ వుంటుంది. ఈలా కన్యాజీవితం ద్వారా గూడ స్త్రీ ధన్యురాలు ఔతుంది- 1కొ 7,34. ఈలాంటి ఉత్తమ స్త్రీ మరియమాత. ఆమెయందు స్త్రీ ధర్మాలన్నీ కార్యసిద్ధినందాయి.

స్త్రీ భార్యగా మాతగా మాత్రమేగాక, కన్యగాకూడ ధన్యురాలు ఔతుంది అన్నాం. అలాగే పురుషుడూ తండ్రిగా భర్తగా మాత్రమేగాక, అవివాహితుడుగాగూడ ధన్యుడౌతాడు. కాని ఈ యవివాహితత్వం ప్రభువుకోసం ; ప్రభు సామ్రాజ్య వ్యాప్తికోసం, ప్రభువు పునీత ప్రజల్ని పీఠం చుట్టూ సమావేశపరచి దివ్యభోజనంతో పోషించడంకోసం. అనగా అతడు ప్రభుస్థానే నిలచే గురువు - మత్త 19,12 ; 1కొ 7,32-33.

## 6. సవరింపులు

యువతినిగూర్చి యువకులదృష్టి రెండు విపరీతమార్గాల పోవచ్చు. 1. స్వర్గలోకంలోంచి ఊడిపడిందో అన్నట్లు ఆమెను ఓ దేవతలా భావించడం. లేనిపోని గొప్పలు, వట్టి ఆశయాలు ఆమెకు అంటగట్టటడం. ఇది కవులు మొదలయిన కళాకారులు చేసేపని. ఇలాంటి భావాలుగల యువకులు కొద్దిరోజుల్లోనే నిజం తెలుసుకుని నిరుత్సాహపడతారు. 2. మరికొంతమంది యువకులు ఆమెను జంతు దృష్టితో చూస్తారు. తమలోని కామప్రవృత్తికి ఆమెను బలివస్తువుగా వాడుకోగోరుతారు. ఈలాంటివాళ్ళుకూడా అచిరకాలంలోనే అపజయాన్ని పొందుతారు.

పెండ్లి చేసుకునే యువకుడు యువతి విషయంలో యథార్థంగా పెంపొందించుకోవాల్సిన భావాలు రెండు. 1. ఆమె తనకు సహాయురాలు ; స్నేహితురాలు ; సహచారిణి. 2. అతడు తన బిడ్డలకు తండ్రియైనట్లే, ఆమెకూడ ఆ బిడ్డలకు తల్లి.

ఇక యువకుని విషయంలో యువతుల దృష్టికూడ రెండు విపరీత మార్గాల పోవచ్చు. 1. అతనికి పూర్తిగా వశపడిపోయి ఓ బానిసలా ప్రవర్తించడం. అతడు చేసే మంచిపనికీ, చెడు పనికీ సమ్మతిస్తూ వుండడం. అతడే పతి, గతి, దేవుడు అని స్తుతిస్తూ వుండటం. ఈలాంటి ప్రతివ్రతలు వ్యక్తిత్వం లేనివాళ్లు. ఈలాంటి పాతివ్రత్యాన్ని బైబులు ఆమోదించదు. అదృష్టవశాత్తు నేటి స్త్రీలలో ఈలాంటి వెన్నెముకలేని పతివ్రతలు తక్కువమంది. 2. మాటిమాటికి అతనితో పోటీపడ్డం. నీవు ఎక్కువేమిటి, నేను తక్కువేమిటి అనడం. నేనూ నీయంతటిదాన్ని సుమా అన్నట్లు ప్రవర్తించడం. ఈలాంటి స్త్రీ భర్త జీవితాన్ని దుఃఖంపాలు చేస్తుంది. అతని హృదయాన్ని వ్యథతో నింపివేస్తుంది.

పెండ్లి చేసుకొనే యువతి యువకుని విషయంలో పెంపొందించుకోవాల్సిన ప్రధానభావాలు రెండు. 1. ఉత్తమ క్రైస్తవ స్త్రీ భర్తకు ముందుగా నడువదు. భర్తతో సరిసమానంగా ప్రక్కన నడుస్తుంది. కొన్నిసార్లు అణకువతో అతని వెనుకకూడ నడచిపోతూంటుంది. 2. కాని అతడు త్రోవతప్పినపుడెల్ల మెల్లగా పిలుస్తూంటుంది. మృదువుగా భుజాలు తట్టుతూంటుంది. అతడు మళ్ళా త్రోవలో నడిచేలా చేస్తూంటుంది. అతడు అధిపతి, ఆమె సహాయురాలు.

తొలి స్త్రీ ఏవ ఆదాము ఎదుట నిలిచింది. శ్రీసభ తన భర్త క్రీస్తు ఎదుట నిలిచింది. వీళ్ళకు పోలికగా వుండే క్రైస్తవ భార్యకూడ తన భర్త ఎదుట నిలుస్తుంది. అతడు ఆమెవైపు తేరిపారజూస్తాడు. ఆమెకూడ అతనివైపు కన్నులెత్తి చూస్తుంది. అతడు ముందు వెళ్తూంటే అతని ప్రక్కన తాను పోతూంటుంది. వాళ్ళిద్దరి వెంటా బిడ్డలు సాగిపోతారు. ఇది మానవుల మహాయాత్ర.

## ప్రార్థనా భావాలు

*1. ఈసాకు - రిబ్కా*

అబ్రాహాము కొడుకు ఈసాకు. ఇతనికి వధువును వెదకడంకోసం అబ్రాహాము సేవకుడు యజమానుని జన్మదేశానికి వెళ్తాడు. ఆ దేశంలో తనకు ఎదురుపడే బాలికయే ఈసాకునకు భార్య కావాలని ప్రార్థిస్తాడు. అతడు కోరినట్లే రిబ్కా అనే బాలిక బావియొద్ద యెదురుపడి సేవకునకు అంతని యొంటెలకు నీళ్ళు తోడియిస్తుంది. తరువాత ఈసాకు, రిబ్కాలకు వివాహం జరిగిపోతుంది. ఈ రీతినే మన వివాహాలు కూడ కొంతవరకు దైవనిర్ణీతాలు. ప్రభువు మనకోసం ఉద్దేశించిన యువతి లేక యువకుడు ఎక్కడో పెరుగుతూనే వుండాలి - ఆది 24,42-44.

*2. మీకాలు - రాహేలు*

ఒకోమారు యువతీయువకులు తమకిష్టం వచ్చినవారిని పెండ్లి చేసుకోవాలని నిశ్చయించుకుంటారు. కాని ఈ నిర్ణయం తల్లిదండ్రులకు సరిపడదు. ఐనను ప్రత్యక్షదోషముంటేనే తప్ప బిడ్డల నిర్ణయాన్ని తల్లిదండ్రులు కాదనకూడదు. సౌలు కుమార్తె మీకాలు దావీదును ప్రేమించి అతనిని వివాహం చేసికోగోరింది. దావీదంటే సౌలునకు గిట్టదు. ఐనా అతడు ఈ వివాహాన్ని కాదనలేదు -1సమూ 18,20. యాకోబు రాహేలును ప్రేమించి ఆమెకోసం ఏడేండ్లు లాబానుకు సేవలుచేసాడు. లాబాను తొలుత ఇష్టపడలేదు. ఐనా తర్వాత వాళ్ళ వివాహం యథావిధిగా సాగిపోయింది-ఆది 29,15-20

*3. ప్రభు మార్గాలు*

యువతీయువకులు తల్లిదండ్రులపట్ల విధేయతను చూపుతూండాలి. తల్లిదండ్రులూ బిడ్డల కోర్కెలను మన్నిస్తూ వాళ్ళ కోపాన్ని రెచ్చగొట్టకుండా వుండాలి. చిన్ననాటినుండి బిడ్డలను ప్రభుమార్గంలో నడుపుతూ వుండాలి - ఎఫె 6,1-3.

*4. ఈ దేహం :*

ఈ దేహం జ్ఞానస్నానం ద్వారా క్రీస్తుతో ఐక్యమౌతుంది
ఈ దేహాన్ని ప్రభువు నెత్తురు బిందువులు చిందించి రక్షించాడు
ఈ దేహం ప్రభు దేహంతో పోషింపబడుతుంది.
ఈ దేహం పవిత్రాత్మకు ఆలయం
ఈ దేహం ఉత్థానమై మళ్ళా ప్రభు సన్నిధిలో నిలుస్తుంది.
ఈ దేహం ప్రభువుకోసం ఉద్దేశింపబడింది, ప్రభువుది.

ఈ దేహాన్ని - అది స్త్రీ దేహమైనాసరే పురుష దేహమైనాసరే - కామ దృష్టితోగాక పవిత్రదృష్టితో చూడాలి.

*5. పరస్త్రీలు*

భక్తులైన హైందవ కవులు పరస్త్రీలను మాతృదృష్టితో జూడమన్నారు. బమ్మెర పోతరాజుగారి ప్రహ్లాదుడు :

"కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావన సేసి మరలువాడు".

రావిపాటి త్రిపురాంతకుడనే పదునాల్గవశతాబ్ద కవి అంబికాదేవిని యిలా ప్రార్థించాడు.

లాచి పరాంగనల్ వరవిలాస మనోహర విభ్రమంబులన్
జూచిన జూడ దుత్తముడు, చూచిన జూచును మధ్యముండు, దా
జూచిన చూడకుండినను జూచు కనిష్ఠుడు; వీరిలోననన్
జూచిన చూడకుండు గుణి జూచిన చూపున చూడు మంబికా!

*6. ఉత్తమ దాంపత్యం*

ఉత్తమ రామచరితంలో భవభూతి ఉత్తమ దాంపత్యాన్ని ఈలా వర్ణించాడు : "ఉత్తమ దంపతులు సుఖ దుఃఖాలు సమంగా పంచుకుంటారు. కలిమిలోనూ, లేమిలోనూ ఇద్దరూ కలసే వుంటారు." (అద్వైతం సుఖదుఃఖయోః అనుగతం సర్వాసు అవస్థాసు).

# 12. వివాహ ప్రయత్నాలు

ముందటి అధ్యాయంలో వివాహమాడబోయే యువతీ యువకులు పరస్పరం పెంపొందించుకోవలసిన భావాలను వివరించాం. ఈ యధ్యాయంలో వాళ్లు వివాహానికి ఎలా తయారుకావాలో తెలియజేయబడుతుంది. వివాహానికి ముందు యువతీయువకులకు పరస్పర పరిచయం వుంటే మంచిది. తాము వివాహమాడబోయే వ్యక్తిని పూర్ణస్వాతంత్ర్యంతో తామే ఎన్నుకోవడంగూడ అవసరం. వివాహానికి ముందు కొంత ఉపదేశంకూడ వుండాలి. కనుక యీ మూడంశాలను గూర్చి ఇచ్చట ముచ్చటిద్దాం. నేడు మన పెద్దలు దేశమంతటా వివాహ సలహా కేంద్రాలను ఏర్పాటుచేస్తున్నారు. ఈ వివాహ సలహాలను మనసులో పెట్టుకునే ఈ యధ్యాయం తయారుచేసాం.

## 1. యువతీ యువకుల పరిచయాలు

మన ప్రాచీన భారతీయ సమాజంలో యువతీయువకుల పరిచయాలంటూ వుండేవిగావు. కాని నేడు పాశ్చాత్యభావాల వల్ల మన సమాజం చాలవరకు మారిపోయింది. విద్యా సంస్థల్లోనైతేనేం, వివిధ కార్యరంగాల్లోనైతేనేం మన యువతీ యువకులు కలసిపోవడం జరుగుతూంది. ఈ సమ్మేళనాన్ని మనం నివారించలేం. నివారించకూడదు గూడ. ఎందుకంటే ఈ పరిచయం భావిజీవితానికి చాల ఉపకరిస్తుంది. ఈ పరిచయంద్వారా యువతీయువకులు ఒకరినొకరు తెలిసికొని అర్థంచేసుకుంటారు, ఒకరినొకరు సానుభూతితో అంగీకరిస్తారు. నరుని మానసిక జీవితానికి ఇది చాలా అవసరం. కనుక నాయకత్వపు క్యాంపులు, సాంఘికసేవాశిబిరాలు, వినోదకార్యక్రమాలు మొదలైనవి ఏర్పాటుచేసి మన యువతీ యువకులకు పరస్పరం పరిచయం కలిగిస్తూ వుండాలి.

ఇక పెద్దలు జాగ్రత్తగా ఏర్పాటుచేసిన పరిచయ మార్గాలవల్లనైతేనేం, లేక తమంతట తామే పరిచయాలు పెంపొందించుకోవడంవల్లనైతేనేం మన యువతీయువకులు చాలమంది చనువుతో మెలుగుతూంటారు. కాని, ఈ చనువులు ఎంతవరకు పోవచ్చు? యువతీయువకులు పరిచయాలు, స్నేహాలు, భావి స్త్రీ పురుషులు కాబోయేవాళ్ళు ఒకరినొకరు అర్థం జేసికోవడానికి ఉద్దేశింపబడినవి గనుక చాల నిర్మలంగా వుండాలి. జంతుప్రవృత్తికి, దుష్టచేష్టలకు దారితీయకూడదు. ఇది చాల ముఖ్యమైన అంశం గనుక ఒకింత విపులంగా వివరించడం మంచిది.

మొదట యువతీ యువకుల మనోభావాలు పరిశీలిద్దాం. యువతి నిత్యం తన భావిజీవితాన్ని గూర్చి, విశేషంగా తన వివాహాన్ని గూర్చి, ఆలోచిస్తూ వుంటుంది. ప్రాయం వచ్చేకొద్దీ ఆమెలో అందచందాలు, ఆకర్షణా గోచరిస్తాయి. ఆమె వస్త్రధారణ విధానం,

నడకతీరు, ముఖభంగిమలు, మాటలాడే వైఖరి యువకులను ఆకర్షిస్తాయి. తనలోని ఈ యాకర్షణను యువతి వెంటనే గుర్తిస్తుంది. గర్విస్తుందికూడ. కొందరు యువతులు ఈ యాకర్షణను యువకులమీద ప్రయోగించిచూడాలని కూడ కోరుకొంటూంటారు. కాని ఈ ప్రాయంలో ఆమెకు లైంగికవాంఛ అంతగా ఉండదు. ఇక యిదే ప్రాయంలో వున్నా కూడ యువతికున్నంత మానసిక పరిపక్వత యువకునికుండదు. వివాహాన్ని గూర్చికూడ అతడంతగా ఆలోచించడు. ఓ ఉద్యోగాన్ని సంపాదించాలని మాత్రం ఉవ్విళ్ళూరుతూంటాడు. కాని యువతికంటె యువకునికి లైంగికవాంఛ బలంగా వుంటుంది. అతనికి సత్వరంగా వివాహం చేసికోవాలి అనేకోరిక లేకపోయినా యువతిస్నేహం కోసమూ, ఆడపిల్లల అందచందాలను అవలోకించడం కోసమూ ఉవ్విళ్ళూరిపోతూంటాడు. ఇవి యువతీ యువకుల మనస్తత్వాలు. ప్రాయం వచ్చేకొద్దీ ప్రకృతే యువతీయువకుల్లో ఈలాంటి మనస్తత్వాలను సృజించి వాళ్ళను బలంగా ఆకర్షిస్తూంటుంది. కనుక ఇక్కడ ఆశ్చర్యపడవలసిన విషయమేమీలేదు.

ఇక, యౌవనప్రాయంలోని మానసిక భావాలను అనుగుణంగా మన యువతీ యువకులు కొన్ని సద్భావాలను పెంపొందించుకోవాలి. యువకుడు యువతికూడ తనలాగే ఓ మానుషవ్యక్తి అనుకోవాలి. ఆమెపట్ల గౌరవంగా ప్రవర్తించాలి. ఆమెనెప్పుడూ భోగ్యవస్తువుగా భావింపగూడదు. స్త్రీ పురుషులనే జట్టునకు తాను నాయకుడు కావాలి. తన బాధ్యత చాల గొప్పది. కనుక అతడు దుష్టవాంఛలకు పశు ప్రవృత్తికి లొంగిపోకూడదు. సాధారణంగా స్త్రీ పురుషుని వద్దనుండి పరిచయాన్ని, ఆదరాన్ని, అంగీకారాన్ని, అనురాగాన్ని కోరుకుంటుంది. అందుచే యువతి చనువుతో తనవద్దకు వస్తూన్నంతమాత్రాన, లైంగికవాంఛతోనే వస్తుంది అనుకోవడం చాల పొరపాటు. అసలు ఆ ప్రాయంలో యువకుల్లోవుండే లైంగికవాంఛ యువతుల్లో వుండదన్నాం. కనుక యువకుడు ఏదోవిధంగా బలవంతం చేస్తేనేతప్ప, యువతి లైంగిక చేష్టలకు సాధారణంగా సమ్మతించదు.

ఇక యువతి, యువకుడు తనపట్ల గౌరవంగా మెలగేలా చూచుకోవాలి. ఆ ప్రాయంలో ఉద్యోగంమీదనేగాని వివాహంమీద అతనికి దృష్టివుండదు. ఆ ఉద్యోగం దొరికిందాక అతడు ఆడపిల్లలతో కాస్త సరదాగా ఆడుకొంటూ వుండాలని కోరుకొంటాడు – అంతే! ప్రాయంలో కాకపోయినా మానసిక పరిపక్వతలో అతనికంటె ఆమె పెద్దది. తన ఈ పెద్దరికాన్ని యువతి గుర్తించాలి. గుర్తించి జాగ్రత్తగా మెలగాలి. యువకుని చనువూ స్నేహమూ లైంగిక చేష్టలకు దారితీయకుండా వుండేలా చూచుకునే బాధ్యత ప్రధానంగా ఆమెది. ఈ బాధ్యతను విస్మరించిందో యువతి పతనమై పోతుంది. భ్రష్టురాలై తీరుతుంది.

వివాహానికి ముందే లైంగిక క్రియకు సమ్మతించే యువతిని యువకుడు గౌరవంతో చూడడు. గాలితిరుగుళ్లు తిరిగే రకం, తేలిక మనిషి అనుకొని నిర్లక్ష్యం చేస్తాడు. ఆ పిమ్మట వివాహ ప్రస్తావన వచ్చినా అతడు ఆమెను పెండ్లి చేసికోడానికి ఇష్టపడడు – గుణవంతురాలైన మరో కన్యను వెదుకుతాడు. పైగా దుష్టచేష్టలవల్ల యువతి గర్భవతి ఐందో, లెక్కలేనన్ని చిక్కులు వస్తాయి. యువకుడు ఆమెను పరిణయమాడ్డానికి ఒప్పుకోడు. ఒకవేళ, తనవలననే గర్భవతి ఐంది గదా అని జాలివలనగాని, నిర్బంధంవలనగాని ఆమెను పెండ్లాడినా ఆ దాంపత్యజీవితం సుఖవంతం గాబోదు. ఇక పైన నుడివినట్లు యువతి గర్భవతి కాకపోయినా తాను చాల బాధలకు గురౌతుంది. పురుషునికి లైంగికక్రియ అంత లోతైన అనుభవాన్ని కలిగించదు. అది అతనికి ఓ మామూలు పనిలాగే వుంటుంది. కాని స్త్రీకి అలా కాదు. లైంగికక్రియ ఆమెకు గాఢమైన అనుభవాన్ని కలిగిస్తుంది. గొప్ప సంచలనాన్ని, సంక్షోభాన్ని కూడ తెచ్చిపెడుతుంది. ఈ యనుభవాన్ని ఆమె ఇక విస్మరించలేదు. ఓ చిన్నముద్దు, ఓ తాత్కాలిక స్పర్శకూడ స్త్రీకి మరపునకు రాని మనోభావాలను తెచ్చిపెడతాయి. మగవాళ్ళకు ఇదేమీ వుండదు. తాను బిడ్డలతల్లి కాబోతుంది గనుక ప్రకృతే స్త్రీని ఈలా మృదుహృదయనుగా తయారుచేసింది. కనుక వివాహానికిముందే ఓ యువకునితో దుష్టచేష్టలు నడపిన యువతి, తరువాత తన దాంపత్యజీవితంలో పొందికను చూపలేదు. భర్తతో కాపురం జేసేటప్పుడు పూర్వానుభవాలు ఆమెను వేధిస్తాయి, బాధిస్తాయి. ఓమారు ఆమె మానసిక ప్రవృత్తి స్పందించింది, కలుషితమైపోయింది. మళ్లా ఆమె తెప్పరిల్లుకోవడం కష్టం. ఈ కారణాల వలన వివాహానికి ముందలి యువతీ యువకుల పరిచయాలు చాల నిర్మలంగా వుండాలి అన్నాం.

## 2. వివాహ నిర్ణయం

పూర్వకాలంలో తల్లిదండ్రులే వివాహాలు నిర్ణయించేవాళ్లు. ఐనా పూర్వులు వధూవరుల నుద్దేశించిగాక, కుటుంబాల నుద్దేశించే, అనగా కొన్ని కుటుంబాలు ఐక్యమై బలవడ్డంకోసం వివాహాలు నిర్ణయించుకున్నారు. కాని నేడు ఆ పద్ధతి మారిపోయింది. ఈనాడు తరచుగా యువతీయువకులే తమ వివాహాలు నిర్ణయించుకుంటున్నారు.

మామూలుగా వివాహాలను నాల్గు పద్ధతుల్లో నిర్ణయిస్తూ వుంటాడు. 1. బిడ్డలను సంప్రతించకుండా తల్లిదండ్రులే తమ కనుకూలమైన రీతిగా వధూవరులను నిర్ణయించడం. 2. బిడ్డలను సంప్రతించి వాళ్ళ యిష్టాల ప్రకారం తల్లిదండ్రులే వధూవరులను నిర్ణయించడం. 3. తల్లిదండ్రుల సమ్మతితో బిడ్డలు తామే వధూవరులను నిర్ణయించుకోవడం 4. తల్లిదండ్రులను సంప్రతించకుండా బిడ్డలు స్వయంగానే తమ కిష్టమైన వాళ్ళతో వివాహం

నిర్ణయించుకోవడం. వీనిలో 1,4 పద్ధతులు ఉత్తమమైనవి కావు. 2,3 యోగ్యమైన నిర్ణయాలు. 3వది అన్నిటికంటె శ్రేష్ఠమైన పద్ధతి. ఏదిఏమైనా వివాహబంధంలో ప్రవేశించకముందు బిడ్డలు తల్లిదండ్రులను సంప్రతించడమంటూ వుండాలి.

ఇక వివాహాలు పొందికగా వుండాలంటే ముమ్మందు గానే ఇరువైపులవాళ్ళు వధూవరుల గుణగణాలను, వివరాలను తెలిసికొని వుండాలి. ఈ వివరాలుగూడ చాల రంగాలకు వర్తిస్తాయి. 1. మొదట వధువు లేక వరుని కుటుంబ వాతావరణం తెలిసి వుండాలి. పెద్దల అలవాట్లు పిల్లలకు వస్తాయి. అంచేత యెదుటివ్యక్తి కుటుంబంలో ఏవైనా దురభ్యాసాలు ఉన్నాయేమో విచారించి చూడాలి. 2. ఎదుటి వ్యక్తి ఆదర్శాలూ, నైతికజీవితం - అనగా నిజాయితీ, ఋజువర్తనం, శీలసంపత్తి మొదలైన అంశాలను తెలిసికొని వుండాలి. విశేషంగా వరుని విషయంలో ఈ విషయాలను క్షుణ్ణంగా తెలిసికొని ఉండాలి. ఒకమారు పెండ్లయ్యాక, మగవాళ్ళు తమ గుణాలను ఇక మార్చుకోరు. 3. ఎదుటి వ్యక్తిస్థాయి అభిరుచులుగూడ గమనించి వుండాలి. విద్య, ఆర్థికస్తోమత, నాగరికత మొదలైన వాటిల్లో వధూవరులకు కొంత సామ్యం వుండాలి. లేకుంటే కాకి ముక్కుకు దొండపండులా వుంటుందేగాని, పొందికంటూ కుదరదు. 4. మనం మత విషయాలనుగూడ గుర్తించాలి. ఎదుటి వ్యక్తికి మతాచరణంపట్ల పట్టుదల వుందా లేదా అని విచారించాలి. చాల జాగ్రత్తగా ముందు వెనుకలు ఆలోచించిగాని క్రైస్తవేతరులతో వివాహం తలపెట్టరాదు. 5. ఎదుటివ్యక్తి ఆరోగ్య విషయాలనూ గుర్తించాలి. విశేషంగా వంశపారంపర్యంగా సంక్రమించే దీర్ఘవ్యాధులను గూర్చి జాగ్రత్తగా తెలిసికొని వుండాలి. 6. కడన వధువు అందచందాలూ విచారించాలి. అందచందాలు అంత ముఖ్యంకాదు. వాటికంటే శీలసంపత్తి ప్రధానం. రూపానికీ, శీలానికి తరచుగా పొత్తు కుదరదుకూడ. ఐనా సౌందర్యవతియైన యువతి లభించినపుడు యువకుడు కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరించాలి.

ఇక, పై వివరాలను విచారించి తెలుసుకున్నాక, కొన్ని లోపాలువున్నా ఎదుటి వ్యక్తిని అంగీకరించవచ్చు. వివాహం చేసికోవచ్చు. కాని అలాంటప్పుడు వివాహం చేసికునే వ్యక్తి ఈ లోపాలను బుద్ధిపూర్వకంగా అంగీకరించి స్వయంగా ఇష్టపడి పెండ్లిజేసికోవాలి. లేకుంటే తర్వాత మళ్ళా చిక్కులు వస్తాయి. ఇంకో విషయంగూడ. లోకంలో సర్వగుణ సంపూర్ణులైన మానవులెవ్వరూ లేరు. కనుక సంపూర్ణ వ్యక్తికోసం ఎదురుచూస్తూ కూర్చుంటే అసలు పెండ్లి కానేకాదు!

కడన యువతీయువకులు ఈ క్రింది అంశాలను గూడ తెలిసికొని వుండడం మంచిది. వివాహానికిముందు ఎదుటి వ్యక్తిలోని మంచిగుణాలూ గొప్పగుణాలూ మాత్రమే

ప్రచురంగా కన్పిస్తాయి. వివాహమయ్యాక ఆ వ్యక్తిలోని దుర్గుణాలు, అల్పగుణాలుకూడ గోచరిస్తాయి. 2. వివాహమయ్యాక ఎదుటివ్యక్తి వ్యక్తిత్వం ఉన్నది ఉన్నట్లుగా బయటపడుతుంది. ఒకోమారు, ఈ వ్యక్తి నన్ను వంచించి వివాహం చేసికోవడం జరిగింది గదా- అనే భావంకూడ కలుగుతుంది. విశేషంగా యువతికి ఈ యన్యాయం ఎక్కువగా జరుగుతుంది. పెండ్లయ్యాక మగవాళ్లు తమ దుర్గుణాలను సవరించుకోరు, కప్పిపుచ్చుకోరుగూడ. అసలు ఇక వాళ్ళకా యవసరమే కనిపించదు. 3. కడన ప్రేమ సంగతికూడ చెప్పాలి. లోకంలో ఉత్తమప్రేమ లేకపోలేదు. ప్రేమించి పెండ్లి చేసికొని సంతృప్తికరంగా జీవించినవాళ్ళూ లేకపోలేదు. కాని తరచుగా మన యువతీయువకులు ఎదుటివ్యక్తి శారీరక సౌందర్యానికీ, దైహికాకర్షణకూ భ్రమసిపోయి అదే ప్రేమ కాబోలు అని భ్రాంతి పడుతుంటారు. కేవలం శారీరక సౌందర్యానికి లొంగి ఓ వ్యక్తిని పెండ్లాడితే కొద్దిరోజుల్లోనే అసంతృప్తి కలిగి తీరుతుంది. పైయంశాల ఫలితార్థమేమిటంటే, ఎదుటివ్యక్తి గుణగణాలను చక్కగా విచారించి తెలిసికోందే ఆ వ్యక్తితో వివాహం తలపెట్టకూడదు.

## 3. వివాహోపదేశం

వివాహానికి ముందు వధూవరులు తప్పకుండా కొంత ఉపదేశాన్ని కూడ పొందాలి. ఈ వుపదేశంద్వారా తెలిసికోవలసిన ముఖ్యాంశాలు ఇవి : 1. వివాహమూ ప్రేమ జీవితమూ, క్రైస్తవ ప్రేమకుండవలసిన లక్షణాలు. 2. భార్యా భర్తలు ఒద్దికగా జీవించడమూ, లైంగిక జీవితం 3. వివాహం ఓ క్రైస్తవ సంస్కారం. 4. వివాహాన్ని రద్దుచేయగలిగే బాధకాలు. 5. పరిమిత కుటుంబం. 6. బిడ్డల పెంపకం. 7. ప్రార్థన, క్రైస్తవ సంస్కారాలు - మొదలైనవి.

వధూవరులకు వివాహ పూజలోని భావాలను వివరించి చెప్పాలి. పెండ్లి తంతును విశదం చేయాలి. ఈ పూజలోను ఈ తంతులోను వివాహానికి సంబంధించిన ఆదర్శాలు చాల వర్ణింపబడ్డాయి.

పెండ్లి చేసికోబోయే యువతీయువకులు వివాహపు ధ్యానం చేయడం మంచిది. ఈ ధ్యానంలో పై యంశాలన్నీ విపులంగా బోధించవచ్చు. వాటినిగూర్చి నిదానంగా అవధానంగా ప్రార్థనం చేసికోవచ్చు. ప్రార్థనద్వారాగాని వేదసత్యాలు జీర్ణానికి రావు.

వివాహానికి ముందే లైంగిక జీవితానికి సంబంధించినంత మట్టుకు వైద్యజ్ఞానంకూడ సంపాదించి వుండడం మంచిది. నాలుగైదు వివాహాలు జరిగేప్పుడు సులభంగా ఓ డాక్టరునిగాని, ఓ నర్సునిగాని పిలిపించి ఈ వైద్య విషయాలను చెప్పించుకోవచ్చు. పైగా మన యువతులు వంట మొదలైన నిత్యకృత్యాలనుగూర్చి కొంత

గృహిణీ విద్యకూడ అలవరచుకొనివుంటే చాల ఉపయోగకరంగా వుంటుంది. ఈ విషయాలన్నీ విచారించి చూచేందుకు మన పెద్దలు ప్రతి మేత్రాసనంలోను కుటుంబ సలహా కేంద్రాలను అవశ్యంగా ఏర్పాటు చేయాలి.

## ప్రార్థనా భావాలు

*1. వివాహం తాత్కాలికమైంది*

వివాహం ఈ జీవితానికే పరిమితం. మోక్షంలో వివాహం వుండదు. ఈ లోకంలో నరులు చనిపోతూంటారు. కనుక వివాహం ద్వారా నూత్న మానవులను పుట్టించవలసి వచ్చింది. పరలోకంలో చావులేదు కనుక అక్కడ నూత్ననరులను పుట్టించవలసిన అవసరంలేదు. అక్కడివాళ్ళు దేవదూతలతో సమానంగా వుండిపోతారు. కనుక వివాహానికి తాత్కాలిక స్థితేగాని శాశ్వతస్థితి లేదు – లూకా 20,34-36.

*2. వివాహం చెడ్డదికాదు*

ప్రాచీనకాలంలో పతితులు కొందరు వివాహం చెడ్డదని బోధించారు. ఇరెనేయస్ అనే వేదశాస్త్రి వారి వాదాన్ని ఖండించి ఈలా బోధించాడు. "దేవుడు నరదేహాలను సృజించినపుడే లింగ వ్యత్యాసాన్ని ప్రవేశపెట్టాడు. నరులను స్త్రీ పురుషులనుగా సృజించాడు. కనుక ఆదిమకాలంలోనే భగవంతుడు వివాహాన్ని ఉద్దేశించాడు. దేవుడే నిర్ణయించిన పెండ్లి పవిత్రమైనదై యుండాలి.

*2. సొంతభార్య, సొంతభర్త*

పౌలు బోధల ప్రకారం బ్రహ్మచర్యం మెరుగైంది. కాని వివాహం చెడ్డదికాదు. ఆనాడు కొరింతులో వ్యభిచారం బహుళ ప్రచారంలో వుండేది. కనుక పౌలు ఈ దోషానికి దూరంగ వుండమని తన క్రైస్తవులను హెచ్చరించాడు. వ్యభిచారానికి లొంగకుండా వుండడానికై ప్రతి పురుషునికి సొంత భార్య, ప్రతి స్త్రీకి సొంత భర్త వుండాలని ఆదేశించాడు – 1కొ 7,2. నిగ్రహశక్తిలేని అవివాహితులు విధవలు మొదలైనవాళ్లు పెండ్లి చేసికోవడం మంచిదని చెప్పాడు. కామం వలన కాలిపోవడం కంటె పెండ్లియాడ్డం ఉత్తమమని వాకొన్నాడు – 7,9. కనుక వివాహం దానంతట అది మేలైందే.

*4. దైవాశీస్సులు*

వివాహపూజలో వచ్చే ఓ ప్రార్థనం ఇది. "పావన పితా! నీ ప్రణాళికద్వారా స్త్రీ పురుషుల ఐక్యతతో గూడిన వివాహ వ్యవస్థ ఏర్పడింది. నేడు వివాహం ద్వారా తన

భర్తతో ఐక్యమైన ఈ నీ కొమార్తెను కనికరంతో వీక్షించు. ఈమె నీయాశీర్వాదాన్ని అడుగు కొంటూంది. ఈమెకు ప్రేమనూ శాంతినీ ప్రసాదించు. ఈమె ఎల్లవేళల పవిత్రగ్రంథం పేర్కొనే పుణ్యస్త్రీల మార్గంలో నడచునుగాక.

ఈమె భర్త ఈమెను విశ్వసించునుగాక. ఈమె తనకు సరిసమానమనియు, వరప్రసాద జీవితం వలన తనతోపాటు మోక్షానికి వారసురాలనియు గుర్తించునుగాక. క్రీస్తు తన పత్నియైన తిరుసభను ప్రేమించినట్లే ఇతడును ఈమెను సదా ఆదరించి ప్రేమించునుగాక.

పరలోక తండ్రీ! వీళ్ళు సదా నీ యాజ్ఞలను పాటింతురుగాక. వీళ్ళు వివాహబంధంలో పరస్పరం విశ్వసనీయులుగా మెలుగుదురుగాక. తోడి క్రైస్తవులకు ఆదర్శంగా వుందురుగాక. సువిశేష సందేశంనుండి లభించే బలాన్ని పొంది క్రీస్తుకి సాక్షులుగా నిల్తురుగాక. ప్రభూ! వీరికి సంతాన భాగ్యాన్ని దయచేయి. మంచి తల్లిదండ్రులుగా మెలిగే వరాన్ని ప్రసాదించు. వీళ్ళు తమ బిడ్డల బిడ్డలను కాంతురుగాక. వృద్ధాప్యం వరకు సుఖసంతోషాలతో జీవింతురుగాక. అటుపిమ్మట నీ దివ్యరాజ్యంలో అర్చ్యశిష్టులతోపాటు శాశ్వతంగా వసింతురుగాక. మా ప్రభువైన క్రీస్తుద్వారా ఈ మనవిని ఆలించండి, ఆమెన్.

# 13. కుటుంబ దేవాలయాలు

## 1. కుటుంబాలే దేవాలయాలు

బాలయేసు మరియా యోసేపులతో గూడిన తిరుకుటుంబంలో జన్మించి వారి అండదండలలోనే పెరిగాడు. ఈ తిరుకుటుంబం నేటి మన కుటుంబాలన్నిటికీ ఆదర్శంగా వుండాలి. ఇక, నేటి మన తిరుసభకూడ దైవకుటుంబమే. తొలినాళ్ళలో భక్తులు కుటుంబసమేతంగా జ్ఞానస్నానంపొంది తిరుసభగా ఏర్పడ్డారు. ఫిలిప్పిలోని చెరసాల అధిపతి కుటుంబం ఈలాంటిది - అ.చ. 16,31. కొరింతులోని ప్రార్థనామందిరాధికారి క్రిస్పు కుటుంబం ఈలాంటిది - 18,8. ఈ పవిత్ర కుటుంబాలు ఆనాటి అవిశ్వాసాంధకారంలో దీపాల్లా ప్రకాశించాయి.

నేటి లోకంలో విశ్వాసం తగ్గిపోతూంది. ఈ లౌకిక యుగంలో విశ్వాసంతో జీవించే కుటుంబాలు చాల అవసరం. క్రైస్తవ ప్రజల్లో భక్తి, విశ్వాసం సోదరప్రేమ నిలబెట్టేది ఈ కుటుంబాలే. కావుననే రెండవ వాటికన్ మహాసభ ఈ సత్కుటుంబాలను "కుటుంబ దేవాలయాలు" అని పేర్కొంది. ఈపదం మొదట తొలినాటి క్రైస్తవ కుటుంబాలకు వర్తించేది.

ఇంకా రాతిగుళ్ళులేని ఆ ప్రాచీనకాలంలో ఈ ఆదర్శ కుటుంబాలే దేవాలయాలుగా పనిచేసాయి. ప్రాచీన క్రైస్తవులు ఈ యిండ్లల్లోనే గుమిగూడి ప్రార్థనలు చేసికొనేవాళ్లు. పూజబలిని అర్పించేవాళ్లు. కావుననే వాటిని కుటుంబ దేవాలయాలు అన్నారు.

నేటి మన కుటుంబాలుగూడ దేవాలయాలుగా పనిచేయాలి. ఇక్కడ తలిదండ్రులు తమ పిల్లలకు తొలిసారిగా భక్తివిశ్వాసాలు, ప్రార్థన నేర్పాలి. విద్యాబుద్ధులు నేర్పి వారిని భావిజీవితానికి సిద్ధం జేయాలి. ఆ పిల్లల్లో ఎవరికైనా దైవసేవమీద కోరిక పుడితే ఆ కోరికను బలపరచాలి.

## 2. గృహస్థుల యాజకత్వం

తిరుసభలో గురువుల యాజకత్వమూ వుంది, గృహస్థుల యాజకత్వమూ వుంది. కుటుంబంలో తల్లిదండ్రీ బిడ్డలూ అందరూ కలసి గృహస్థ యాజకత్వాన్ని నెరపుతారు. భక్తితో పూజలో పాల్గొని తమ జీవితాలను సజీవయాగంగా దేవునికి అర్పించుకొంటారు - రోమా 12,1. పవిత్ర గ్రంథాన్ని చదివి అది ఆదేశించినట్లుగా దేవుని మార్గాల్లో నడుస్తారు. దైవ సోదర ప్రేమలను పాటిస్తారు. స్వార్థాన్ని అణచుకొని పరోపకారబుద్ధితో జీవిస్తారు. కష్టపడి పనిచేసికొంటారు. తమ పవిత్ర జీవితం ద్వారానే దైవరాజ్యం వచ్చిందని చాటిచెప్తారు. క్రైస్తవ గృహమూ దానిలో వసించే కుటుంబమూ క్రైస్తవ జీవితం ఈలా వుంటుందని లోకానికి చాటిచెప్పేదిగా వుండాలి. క్రీస్తుకీ అతని విలువలకూ సాక్ష్యమిచ్చేదిగా వుండాలి.

జ్ఞానస్నానం ద్వారా క్రైస్తవులు క్రీస్తుతో ఐక్యమై అతని రాజత్వం, ప్రవక్తృత్వం, యాజకత్వం అనే మూడు గుణాల్లో పాలుపొందుతారు. సజీవ శిలలై ఆధ్యాత్మిక దేవాలయంగా రూపొందుతారు - 1పేత్రు 2,5. దేవునిచే ఎన్నుకొనబడినవారు, రాచరికపు గురుకులం, పవిత్ర ప్రజ ఔతారు. చీకటినుండి వెలుగులోనికి వచ్చి, దేవుని అద్భుతకార్యాలను ప్రకటిస్తారు - 2,9.

## 3. తల్లిదండ్రులూ పిల్లలూ

కుటుంబంలో వసించేది తల్లిదండ్రులూ పిల్లలూ. తల్లిదండ్రులు పరస్పర ప్రేమభావంతోను ఐక్యభావంతోను జీవించాలి. క్రీస్తుకీ తిరుసభకీ వుండే పవిత్ర బంధాన్ని తమ దాంపత్యజీవితం ద్వారానే చూపింపగలిగి వుండాలి.

తల్లిదండ్రులు తమ తరపున తాము పిల్లలను ఆప్యాయంగా పెంచి పెద్దజేయాలి. విద్యాబుద్ధులు నేర్పి వారిని భావిజీవితానికి తయారుచేయాలి. ఆ బిడ్డలు తమ బిడ్డలు కాకముందే దేవుని బిడ్డలు. కనుక వారికి విశ్వాసవిద్య దైవభక్తి నేర్పాలి. నైతిక గుణాలూ సచ్ఛీలము అలవర్చాలి. పిల్లలకు మొదటి మతబోధకులు తల్లిదండ్రులే.

పిల్లలు తమ తరపున తాము తల్లిదండ్రులను గౌరవించి ప్రేమించాలి. "నాయనా! నీకు ప్రాణమిచ్చినవారు నీ జననీజనకులు. వారి ఋణాన్ని నేవేలా తీర్చుకొంటావు?" అనే సీరా జ్ఞానగ్రంథ వాక్యాన్ని సర్వదా స్మరించుకొంటుండాలి-7,28. తల్లిదండ్రులకు విధేయులు కావాలి. ముసలిప్రాయంలో వారిని ప్రేమతో ఆదుకోవాలి.

కుటుంబాన్ని ఐక్యపరచేదీ, భక్తిని పెంచేదీ, గొడవలు సమసిపోయేలా చేసేదీ ప్రార్ధనం. కనుక రోజు కొన్ని నిమిషాలపాటు కుటుంబ సభ్యులంతా కలసి ప్రార్ధనం చేసికోవాలి. రోజూ కాసేపు ప్రార్థన చేసికొనే యింటిని పవిత్రాత్మశక్తి ఆవరించి వుంటుంది. చిన్ననాడు కుటుంబంలో ప్రార్థన నేర్చుకోని పిల్లలు పెరిగి పెద్దయ్యాక ప్రార్థన చేయడం అరుదు.

## 4. హిందూసమాజం మధ్యలో వసిస్తున్నాం

ఈ దేశంలో క్రైస్తవులమైన మనం అల్పసంఖ్యాకులం. అధిక సంఖ్యాకులైన హిందువులమధ్య చీకట్లో మినుకుమినుకుమనే దీపాల్లాగ కన్పిస్తూంటాం. మన కుటుంబ జీవితం మన చుట్టుపట్లవుండే హిందువులకు ఆదర్శవంతంగా కన్పించాలి. క్రీస్తు ప్రేమకూ సేవకూ మంచితనానికీ సాక్ష్యంగా వుండాలి. అవకాశం వచ్చినపుడు మనం క్రీస్తుని గూర్చి తోడి హిందువులకు తెలియజేయగలిగి ఉండాలి. మన యింటిలో దైవార్చన క్యాలెండరు, మతపరమైన పటాలు, స్వరూపాలు మొదలైనవి తప్పక ఉండాలి. ఇవి క్రైస్తవ వాలకాన్ని భక్తినీ సూచిస్తాయి.

అంతా కుటుంబ జీవితం మీదనే ఆధారపడి ఉంటుంది. భక్తిగల కుటుంబాలకు ఏ కొరతా రాదు. కానాపూరి కుటుంబంలో లాగ క్రీస్తు వారి కుటుంబంలో నెలకొని వుంటాడు. వారి పిల్లల్లో కొందరు గురువులుగా మఠకన్యలుగా తయారౌతారు. ఇక భక్తిలేని కుటుంబాలకు కలిగే అనర్థం అంతా యింతా కాదు. తాజెడిన కోతి వనమెల్ల చెరిచింది అన్నట్లుగా వాళ్ళు ఇతర క్రైస్తవులనుగూడ చెడగొడతారు. క్రైస్తవ మతానికే తలవంపులు తెస్తారు. ఫలితంగా దేవుని దీవెనకుమారుగా శాపాన్ని కొనితెచ్చుకొంటారు.

## ప్రార్థనా భావాలు

*1. మంచి ఆదర్శం*

మన క్రైస్తవులు తరచుగా బడుగువర్గాలకు చెందినవాళ్లు. పేదజనం. కూలినాలి చేసికొని బ్రతికేవాళ్ళు. అనేక కారణాలవల్ల మన కుటుంబాల్లో త్రాగుడు, దొంగతనం, మోసం, అబద్ధాలు, సోమరితనం మొదలైన దురభ్యాసాలు కన్పిస్తుంటాయి. ఈ

దుర్గుణాలవల్ల మనం క్రైస్తవ మతానికే అపఖ్యాతి తెస్తాం. ఇరుగుపొరుగు హిందువులు మన రోజువారి జీవితంలో క్రీస్తుని చూడలేక పోతుంటారు. మనలో పవిత్రాత్మకు బదులుగా దుష్టాత్మను చూస్తుంటారు. కనుక మన కుటుంబజీవితం ఎంత శుద్ధంగా ఉందా అని పరిశీలించి చూచుకొంటూండాలి.

*2. తల్లి, తండ్రి*

కుటుంబానికి తండ్రి శిరస్సు, అధిపతి. నాయకత్వం వహించేవాడు అతడే. కాని కుటుంబానికి తల్లి హృదయంలాంటిది. గుండె ప్రేమకు చిహ్నం. ఇంటిని ప్రేమతో నింపేది తల్లే. ఇంటికి తండ్రి యజమానుడు, పరిపాలకుడూ ఐతే తల్లి అనురాగంతో ఇంటిల్లిపాదినీ ఐక్యంజేసేది. "ఇంటిని జూడు ఇల్లాలిని జూడు" అన్నట్లుగా గృహశోభ చాలవరకు తల్లిపై ఆధారపడి ఉంటుంది.

*3. నిబంధనం*

వేదశాస్త్రులు వివాహ జీవితాన్ని నిబంధనంతో పోల్చారు. దేవుడు పూర్వవేదంలో యిస్రాయేలీయులతోను నూత్నవేదంలో క్రైస్తవులతోనూ నిబంధనం చేసికొన్నాడు. నిబంధనకర్తలైన దేవుడూ నరజాతీ ఒకరిపట్ల ఒకరు విశ్వసనీయులుగా మెలగాలి. ఇక, వివాహజీవితంలో భార్యాభర్తలే ఒకరితో ఒకరు నిబంధనం చేసికొంటారు. కనుక వాళ్ళిద్దరూ ఒకరిపట్ల ఒకరు విశ్వసనీయులుగా మెలగాలి. ఒకరికొకరు ఉపకారమేగాని అపకారం తలపెట్టగూడదు. ఒకరిపట్ల ఒకరు గాఢానురాగంతో మెలగాలి.

# వివాహ విషయాలు - వేద పఠనాలు

## 1. పూర్వవేదం

| | | |
|---|---|---|
| 1. | నరునిలోను దేవుని పోలిక, సంతానాన్ని కనడం | ఆది 1,26-28 |
| 2. | ఏవ ఆదామునకు సహాయకురాలు, వాళ్ళిద్దరూ ఒకే వ్యక్తిగా ఐక్యంగావాలి | ఆది 2,18-25 |
| 3. | ఒడంబడిక వివాహం లాంటిది | యెష 54,5. 62,1-5 |
| 4. | తోబియా ప్రార్థన | తోబీ 8,5-8 |
| 5. | కుటుంబజీవితం | కీర్త 45,10-11 |
| 6. | ఆదర్శ గృహిణి | సామె 31,10-31 |

| | | | |
|---|---|---|---|
| 7. | భర్త చూపవలసిన ప్రేమ | | సామె 5,15-20 |
| 8. | రంకులాడి | | సామె 7,6-27 |

## 2. నూత్నవేదం

| | | | |
|---|---|---|---|
| 1. | క్రీస్తు-శ్రీసభ | | ఎఫె 5, 21-33 |
| 2. | వివాహితులు | : | 1కొ 7,1-16 |
| 3. | కన్యాజీవితం, గురుజీవితం | { | 1కొ 7,32-34<br>మత్త 19,12 |
| 4. | విధవ జీవితం | : | 1కొ 7,39-40 |
| 5. | ఉత్థానజీవితంలో వివాహం ఉండదు | : | మార్కు 12,25 |
| 6. | క్రైస్తవస్త్రీకి ఉండవలసిన వినయం | { | 1పేత్రు 3,1-6<br>1తిమో 2,9-15 |
| 7. | విడాకులు పనికిరావు | : | మత్త 19,3-9 |
| 8. | వ్యభిచార దోషం | : | 1కొ 6,12-20 |
| 9. | మానసిక వ్యభిచారం | | మత్త 5,28 |

# ఆత్మ శోధనం

ఇంతవరకు వివాహజీవితాన్ని గూర్చి ఆయా విషయాలు విచారించి చూచాం. ఇక, యీ విషయాలు మన జీవితానికి ఏలా వర్తిస్తున్నాయో చిత్తశుద్ధితో పరీక్షించి చూచుకోవాలి. ఇదే ఆత్మశోధనం. ఓ వ్యక్తి తాను భార్యగావచ్చు, భర్తగావచ్చు. ఎవరైనాగాని నేను, నాయిల్లు, నా భర్త లేక భార్య, నా పిల్లలు అనే నాలుగంశాల క్రింద ఈ యాత్మశోధనను కొనసాగించవచ్చు.

# 1. భర్తగా నా బాధ్యతలు

## 1. నేను

1. నా యాకారం ఏలా వుంటుంది? నేను శుభ్రంగా వుంటున్నానా? ధరించే దుస్తులు, తల జుట్టు మొదలైనవి నీటుగా వుంటున్నాయా?
2. నా పనివస్తువులను చిందరవందరగా పారవేస్తున్నానా లేక మట్టసరిగా ఓ ప్రక్కన అమర్చివుంచుకుంటున్నానా?

3. కొన్ని మంచి పుస్తకాలు పత్రికలు చదివి రోజురోజుకు విజ్ఞానం పెంపొందించుకొంటున్నానా?
4. నేను చక్కగా, మర్యాదగా మాటలాడగలనా?
5. నాకు మతవిషయాలు తెలుసా? క్రైస్తవ విశ్వాసం అంటే అభిమానం వుందా?
6. నేను నా కుటుంబంతోపాటు గుడికి వెళ్తుంటానా? పాపోచ్చారణం దివ్యసత్ప్రసాదం మొదలైన సంస్కారాలు పొందుతుంటానా?
7. నాకు బైబులు చదివే అలవాటు వుందా? అసలు ఇంటిలో బైబులంటూ వుందా?
8. ఉదయంగాని, సాయంత్రంగాని కుటుంబ సభ్యులతో పాటు ప్రార్థన జేసికునే అలవాటు వుందా?
9. ఏటేట వడకం చేస్తుంటానా? నన్ను నేను సవరించుకుంటూంటానా?
10. విచారణలోని మతసంబంధ కార్యక్రమాల్లో పాల్గొంటూంటానా? దేవమాతపట్ల విశేషభక్తిని చూపుతుంటానా?
11. వివాహం జగత్ స్థితికోసం ఉద్దేశింపబడిందేగాని, దానికి శాశ్వత స్థితి అంటూ లేదు. ఈ వివాహంద్వారా నన్ను నేను పవిత్రపరచుకొని, నా భార్యనుగూడ పవిత్రపరుస్తుంటానా?

## 2. నా యిల్లు, నా పని

12. నేను ఇల్లూవాకిలి పట్టించుకుంటానా? నా యింటి విషయాలు నేనే స్వయంగా చక్కదిద్దుకుంటూంటానా?
13. ఇంటిలోని వాళ్ళను సంతోషపెడుతుంటానా లేక మాటిమాటికి సుమ్మర్లుపడుతూ గొణుక్కుంటూ వుంటానా?
14. సంతోషంగా వుండడం, శాంతస్వభావం, కలుపుగోలుతనం మొదలైన మంచి గుణాలను ప్రదర్శిస్తూంటానా?
15. భోజనవిషయంలో సంతృప్తి చూపుతుంటానా లేక యెప్పుడూ ఇది బాగలేదు అది బాగలేదు అని గొణుక్కుంటూ వుంటానా?
16. సకాలంలో నా పని ప్రారంభిస్తున్నానా? పూర్తికాలం పనిలో నిమగ్నుణ్ణయి వుంటున్నానా? శక్తికొలది కృషి చేస్తున్నానా?
17. దుర్వ్యమర్శలతోను వేరేవాళ్ళను ఆడిపోసుకోవడంతోను కాలం వెళ్ళబుచ్చుతూన్నానా?
18. పనికాలంలో క్రైస్తవేతరులు నన్ను గమనిస్తూంటారనీ, వాళ్ళకు చక్కని ఆదర్శాన్ని ఈయాలనీ గుర్తిస్తుంటానా?

19. నేను పనిచేసే తావుల్లో మెలిగే స్త్రీలపట్ల, నా భార్యపట్ల ఇతర పురుషులు ఎలా ప్రవర్తించాలని కోరుకుంటానో అలా ప్రవర్తిస్తూంటానా?

20. అసలు పరస్త్రీలపట్ల నా ప్రవర్తన ఏలా వుంటుంది? పరస్త్రీని మోహదృష్టితో జూచినా మానసిక వ్యభిచారం చేసినట్లే అన్నాడు ప్రభువు. ఈ యాజ్ఞ నాపట్ల ఏలా వర్తిస్తుంది.

## 3. నా భార్య

21. స్త్రీ హృదయాన్ని మనస్తత్వాన్ని అర్థం చేసికొని నా భార్యకు అనుకూలంగా నడుచుకుంటున్నానా?

22. నా భార్యను ఇంకా నిండు హృదయంతో ప్రేమిస్తూనే వున్నానా? ఒకవేళ తొలినాటి ప్రేమ వట్టిపోయినట్లయితే కారణమేమై వుంటుంది?

23. నా ప్రేమకు చిహ్నంగా భార్యకు బహుమతులు మన్ననలు ఇస్తూంటానా? వివాహదినం, ఆమె పుట్టినదినం జ్ఞాపకం వుంచుకుంటూంటానా?

24. పిల్లలను కనిపెంచుతూన్నందులకు, ఇల్లూ వాకిలి చక్కబెడుతూన్నందులకు, అన్నం వండిపెడుతూన్నందులకు ఇంకా నూరు సేవలు చేస్తూన్నందులకు ఆమెను మెచ్చుకుంటూంటానా?

25. "స్త్రీని మెచ్చుకుంటూ వుండాలి" అన్న ధర్మాన్ని బట్టి ఆమె రూపాన్ని, దుస్తులను, అలంకరణను, అణకువను, అనురాగాన్ని, వంటను ప్రశంసిస్తూంటానా?

26. ఆమెకు తెలియవలసిన రహస్యాలుకూడ తెలియనీకుండ దాచిపెడుతూంటానా?

27. ఆమెపట్ల మృదువుగా మర్యాదగా ప్రవర్తిస్తుంటానా? ఆమెను అనురాగంతో పిలుస్తుంటానా? కోపం వచ్చినపుడు నాలుకను అదుపులో పెట్టుకుంటానా? లేక కటువుగా దుర్భాష లాడుతూంటానా?

28. ఇతరులముందు ఆమెను స్తుతిస్తూంటానా లేక నిందిస్తూంటానా? ఆమె లోపాలను ఇతరులముందు విమర్శిస్తుంటానా?

29. స్త్రీ వంటింటికీ పడకటింటికీ పనికివచ్చే వస్తువు అనేలా ప్రవర్తిస్తుంటానా? ఆమె నా బిడ్డల తల్లి, నాకు సహాయకురాలు అనే భావం చూపుతూంటానా, లేక చిన్నదానికి పెద్దదానికి ఆమెను ఓ పనికత్తెలాగ వాడుకొంటుంటానా? బడలిక చెందినపుడు ఆమె విశ్రాంతి పొందేలా చూస్తూంటానా?

30. క్రీస్తు–తిరుసభ అనే పోలికను గుర్తించి భార్యకోసమెంత త్యాగమైనా చేయడానికి సంసిద్ధమౌతూంటానా?

31. కుటుంబవిషయాల్లో ఆమెతో కలసి వో నిర్ణయానికి వస్తుంటానా లేక నేనే ఓ నిర్ణయాన్ని చేసుకొని ఆ తరువాత ఆమెకు తెలియజేస్తూంటానా?

32. లైంగికక్రియలో జంతుభావంతో ప్రవర్తిస్తుంటానా? భార్యవద్దనుండి ఎంత సుఖం పొందుదామనే భావమేనా లేక భార్యనూ సుఖపెడదామనే భావంకూడ వుందా?

33. ఆమె కారణపూర్వకంగా దేహదానానికి అంగీకరించనపుడు నిర్బంధం చేస్తూంటానా?

34. లైంగికక్రియలో స్త్రీ మానసిక సుఖాన్ని కోరుకున్నంతగా శారీరక సుఖాన్ని కోరుకోదు. ఈ విషయంలో ఆమెపట్ల మొరటుగాను అసభ్యంగాను ప్రవర్తిస్తుంటానా?

35. ఆమెకు ద్రోహంగా నా హృదయాన్ని అన్యస్త్రీలవైపు మరలుస్తూంటానా? ఆమెను అనవసరంగా శంకిస్తూంటానా?

36. స్త్రీని ఒంటరిగా వదలివేయకూడదు అన్న నియమాన్ననుసరించి ఆమెతో కూడిమాడి వుంటూంటానా లేక యెక్కడెక్కడో కాలక్షేపంచేసి వస్తూంటానా?

37. ప్రేమ అంటే ఈయడంగాని పుచ్చుకోవడంకాదు. ప్రేమను మాటల్లోగాక చేతల్లో చూపించాలి. ఈ రెండు సత్యాలను నా భార్య విషయంలో ఎంతవరకు ఆచరణలో పెడుతున్నాను?

38. ఆమె చుట్టపక్కాలు వచ్చినపుడు వారిని ఆదరిస్తుంటానా?

39. ఆమెకు నాకు భేదాభిప్రాయం కలిగినపుడు నా పట్టేనెగ్గాలి అనేలా ప్రవర్తిస్తుంటానా లేక ఆమె బాధకూడ అర్థంచేసి కుంటూంటానా?

40. మతవిషయాల్లో ఆమెకు సహాయపడుతూంటానా? ఆమె గుడికివెళ్ళి సంస్కారాలు పొందేలా ప్రోత్సహిస్తూంటానా?

41. ఆమె అంగీకరించకపోయినా నిర్బంధంగా సంతాన నిరోధక మార్గాలు ప్రవేశపెడుతూంటానా?

42. ఈ దేహంతోను పాపంచేయకూడదు, ఈ దేహంలోను పాపం చేయకూడదు అన్న పౌలు ఆజ్ఞను పాటిస్తున్నానా?

43. లైంగికక్రియలో నేననుభవించే ఆనందం ఇంద్రియాలతో ఆగిపోతుందా లేక ఆత్మకుకూడ సోకుతుందా? నా ప్రేమలో కామం ఎన్నిపాళ్ళు.

44. ప్రేమ, ఆదుకోలు, పరిచర్య, క్షమాపణ మొదలైన నానాకార్యాల్లో ఆమె నాకు ఋణపడుతుందా లేక నేనే ఆమెకు ఋణపడుతున్నానా?

45. అన్ని కార్యాలతోపాటు లైంగికక్రియనుగూడ ప్రభువుకే సమర్పించి వివాహజీవితాన్ని పునీతం జేసికొంటున్నానా?

## 4. నా పిల్లలు

46. తండ్రిగా నా బాధ్యతలు అర్థంచేసికొంటున్నానా? తండ్రి పదవిని తలంచుకొని సంతోషిస్తున్నానా?
47. భార్యతో సుఖాన్ని అనుభవించిగూడ, ఆర్థికస్తోమతవుండికూడ, కృత్రిమంగా బిడ్డల పుట్టువును అరికడుతున్నానా? బిడ్డల్లో దేవుని రూపం చూడగలుగుతున్నానా?
48. నా భార్య నేను కలసి పిల్లల సమస్యలను స్థితిగతులను ఆలోచించుకుంటున్నామా?
49. పిల్లల యెదుటనే గురువులను ఉపాధ్యాయులను విమర్శిస్తున్నానా?
50. పిల్లలను క్రమశిక్షణకు అలవాటు చేస్తున్నానా లేక ఎక్కువ చనువుతో పాడుచేస్తున్నానా?
51. పిల్లలపట్ల ప్రేమ శ్రద్ధ చూపుతున్నానా? వాళ్ళ విశ్వాసానికి అనురాగానికి పాత్రుణ్ణవుతూన్నానా?
52. వాళ్ళను భావిజీవితానికి, ఓ వుద్యోగానికి తయారుచేస్తూన్నానా? వాళ్ళు వోయింటివాళ్ళయ్యేలా ప్రయాసపడుతున్నానా?
53. నా పిల్లల స్నేహితులు ఉపాధ్యాయులు నాకు తెలుసా? వాళ్ళను ఇంటికి ఆహ్వానిస్తుంటానా?
54. పిల్లల ప్రవర్తనం ఏలావుందో, వాళ్లు ఏమేం చదువుతున్నారో, యెక్కడెక్కడ తిరుగుతున్నారో గమనిస్తున్నానా?
55. పిల్లలు అనుదినం గుడికివెళ్ళి జపం జెప్పుకొని, సంస్కారాలు పొంది, భక్తిమంతమైన క్రైస్తవజీవితం గడిపేలా ప్రోత్సహిస్తున్నానా?
56. నా క్రైస్తవ జీవితం వాళ్ళకు ఆదర్శప్రాయంగా వుంటుందా?
57. నా పిల్లల్లో ఒక్కరైనా దేవుని పిలుపు వినాలని కోరుకుంటున్నానా?

# 2. భార్యగా నా బాధ్యతలు

## 1. నేను

1. నా రూపం ఏలా వుంటుంది? నేను శుభ్రంగా వుంటున్నానా? ఆకర్షణీయంగా కనిపిస్తుంటానా?
2. వస్త్రధారణలోను అలంకరణ విధానంలోను క్రైస్తవనీతిని పాటిస్తుంటానా? నా ప్రాయానికి తగినట్లుగా అలంకరణ చేసికొంటున్నానా?

3. కొన్ని మంచి పుస్తకాలు పత్రికలు చదువుతూంటానా? నాగరికతతో మాటలాడగలనా?
4. దేశంలో ప్రపంచంలో జరిగే సంఘటనలు కొంతవరకైనా తెలిసికుంటుంటానా? లేక బావిలోని కప్పలా వుండి పోతూంటానా?
5. తరచుగా గుడికి వెళ్తుంటానా? పాపోచ్చారణం దివ్య సత్ప్రసాదం మొదలైన సంస్కారాలు పొందుతుంటానా?
6. అనుదిన జపాలు, జపమాల చెప్పుకుంటూంటానా? బైబులు చదువుతూంటానా?
7. నా సంభాషణల్లో వేరేవాళ్ళనుగూర్చి ఆడిపోసుకోవడం, కోపతాపాలూ ప్రచురంగా వుంటాయా? ఊళ్ళో సుద్దులన్నీ నావేనన్నట్లుగా ప్రవర్తిస్తుంటానా?
8. కుటుంబంలోని సభ్యులపట్ల, ఇరుగు పొరుగువారిపట్ల ప్రేమభావంతో ప్రవర్తిస్తుంటానా? నా తలపులు మాటలు పనులు క్రైస్తవ ప్రేమకు ప్రతికూలంగా వుండడం లేదు గదా?
9. నాకు రహస్యాలు దాచిపెట్టడం చేతనౌతుందా?
10. పేదసాదలకు క్రైస్తవ కార్యాలకు ఉదారభావంతో దానధర్మాలు చేస్తుంటానా?
11. పూజబలికి హాజరైనప్పుడు నా భర్తను బిడ్డలను గూడ పరలోక పితకు అర్పించుకుంటూంటానా?
12. వివాహజీవితంలో సిలువలను ఓర్పుతో భరిస్తుంటానా?
13. కుటుంబంలో చిక్కులు కష్టాలు ఎదురైనపుడు వివాహ జీవితంలో లభించే ప్రత్యేక వరప్రసాదంకోసం ప్రార్థిస్తుంటానా?
14. ఇంటిని యింటిలోని సామగ్రిని శుభ్రంగా ఆకర్షణీయంగా అమర్చి వుంచుకుంటున్నానా?

## 2. నాయిల్లు, పని

15. వేకువ జాముననే లేచి పని ప్రారంభిస్తుంటానా?
16. క్రైస్తవ స్వరూపాలు పటాలు మొదలైనవి యింటిగోడలమీద కనిపిస్తుంటాయా? ఇంటిలో క్రైస్తవ వాలకం వుంటుందా?
17. బిడ్డలకు తినుబండారాలకు డబ్బు దూబరాగా ఖర్చు చేస్తుంటానా?
18. అన్నమూ కూరలు వగైరా యింటిలోనివాళ్ళకు రుచించేలా వండుతుంటానా లేక వారంవారం ఒకేరీతిగా వండుకుంటూ పోతూంటానా?

19. భర్త అన్నానికి వచ్చినపుడే నా సుమ్మర్లన్నీ ఏకరువు పెడుతూంటానా?

20. నేను చేసే పని కాస్త సకాలంలో ప్రారంభించి తృప్తికరంగా చేసి ముగిస్తూంటానా.

## 3. నా భర్త

21. నేనింకా నా భర్తను ప్రేమిస్తూనేవున్నానా? నా ప్రేమకు నిదర్శనంగా, తొలినాళ్ళలోలాగ, ఏవేవో ఉపచారాలు చేస్తుంటానా?

22. అతని లోపాలను పస్తాయించుకొని పోతూంటానా? అతన్ని నిత్యం సంస్కరించాలని చూస్తుంటానా? ప్రక్కింటి అమ్మలక్కల యెదుట అతని లోపాలను విమర్శిస్తుంటానా?

23. ఉత్తమ దంపతులు కలిమిలేముల్లోకూడ కలసేవుంటారు అన్నాడు భవభూతి. భర్త ఆర్జన సరిపోనపుడు అతన్ని చులకనగా చూస్తుంటానా?

24. అతన్ని మాటిమాటికి శంకిస్తూంటానా? అతనితో మాటలాడకుండా బెట్టుగా వుండిపోతూంటానా?

25. నిజమైన కారణం లేకపోయినా సాకులతో దేహదానాన్ని నిరాకరిస్తుంటానా?

26. ఆర్థికస్తోమత వున్నాగూడ స్వార్థబుద్ధితో బిడ్డల పుట్టువును అరికడుతున్నానా?

27. భర్త సమీపించినపుడు, లైంగికక్రియ అశుద్ధమైన కార్యం అన్నట్లు ప్రవర్తిస్తుంటానా?

28. లైంగిక క్రియలో స్త్రీ కంటెగూడ పురుషుడు శారీరక సుఖాన్ని అధికంగా కోరుకుంటాడు. ఈ విషయంలో అతన్ని సంతృప్తి పరుస్తున్నానా?

29. ఇతర పురుషులపట్ల చూపగూడని చనువు చూపి అతని హృదయానికి బాధ కలిగిస్తూంటానా?

30. అతని స్నేహితులు బంధువులు ఇంటికి వచ్చినపుడు ఆప్యాయంగా ఆదరిస్తూంటానా?

31. పెద్ద విషయాలకు చిన్న విషయాలకు అతన్ని లెక్క అడుగుతూంటానా? అతనిచే చీవాట్లు తిన్నప్పుడు, నేనే దానికి ఎంతవరకు కారణమై వుంటాను?

32. ఊరంతా అయ్యకు లోకువైతే అయ్య అమ్మకు లోకువ అన్నట్లుగా అతనిమీద పెత్తనం చేస్తుంటానా?

33. క్రీస్తు-తిరుసభ అనే పోలికకు అనుగుణంగా యథార్థంగా అతని స్వాధీనంలో వుంటున్నానా?

34. అతడు ముందు నేను వెనుక అన్నట్లు ప్రవర్తిస్తుంటానా లేక ప్రతిదానికి అతనితో పోటీపడుతుంటానా? అతడు చెడుత్రోవ పట్టినపుడు మృదువుగా మందలిస్తుంటానా?

35. అతడు ఇంటిలో గడిపే నాలుగు గడియలు ఉల్లాసకరంగా గడిపేలా చూస్తుంటానా లేక అవిలేవు ఇవిలేవని నిత్యం సుమ్మర్లు పడుతూంటానా?

36. అతనికి నాకు భేదాభిప్రాయం కలిగినప్పుడు అదేమిటో అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తుంటానా?

37. నిరుత్సాహం మగవాణ్ణి నాశం చేస్తుంది అన్న ధర్మాన్ననుసరించి కష్టదినాల్లో నా భర్తను ప్రోత్సహిస్తుంటానా? అతన్ని బుజ్జగించి పనికి పంపుతుంటానా?

38. ప్రేమ, ఆదుకోలు, సేవ మొదలైన వాటిల్లో నేనతనికి ఋణపడి వుండలేదుగదా?

## 4. నా పిల్లలు

39. నాలోని మాతృభావాలను అర్థం చేసుకుంటున్నానా? తల్లిగా నేను చేయవలసిన త్యాగాలు చేస్తుంటానా?

40. ప్రపంచ సుఖాలను యౌవన భోగాలను అనుభవించడానికి అవకాశముండదేమోనన్న భయంతో తల్లిని కావడానికి నిరాకరిస్తున్నానా?

41. పిల్లలను గూర్చిన సమస్యలు మంచిచెడ్డలు నా భర్తతో ఆలోచించి చూస్తున్నానా?

42. వాళ్ళను అదుపులో వుంచుకుంటున్నానా లేక ఈయగూడని చనువులిచ్చి పాడుచేస్తున్నానా?

43. పిల్లలను ప్రేమభావంతో పెంచి పెద్దజేస్తున్నానా? వాళ్ళ విశ్వాసానికి పాత్రురాలనౌతున్నానా?

44. పిల్లల సమక్షంలో పెద్దలను, ఉపాధ్యాయులను, మఠకన్యలను గురువులను విమర్శిస్తూంటానా?

45. పిల్లలను భావిజీవితానికి తయారుచేస్తూన్నానా? ఆడపిల్లలకు ఇంటిపనులు నేర్పి వాళ్ళను వివాహజీవితానికి చక్కగా తాయరుచేస్తున్నానా?

46. పిల్లల స్నేహితులు స్నేహితురాళ్ళు ఎవరో నాకు తెలుసా? వాళ్ళు ఇంటికి వచ్చినపుడు ఆదరంతో చూస్తుంటానా?

47. పిల్లలు ఇంటిలో వున్నపుడు సంతోషంగా వుంటున్నానా? సమస్యలు వచ్చినపుడు వాళ్లు చనువుతో నా దగ్గరకు వస్తుంటారా?

48. వాళ్ళు బడి పాఠాలను అడిగినపుడు సహాయం చేస్తుంటానా? వాళ్ళు ఉపాధ్యాయులతో పరిచయం కలిగించుకుంటూన్నానా?
49. పిల్లలు సకాలంలో క్రైస్తవ సంస్కారాలు పొందేలా చూస్తున్నానా?
50. వాళ్ళను గుడికి పంపిస్తూంటానా? వాళ్ళచే బైబులు చదివించి ప్రార్థన చేయిస్తుంటానా? అనుదిన జపాలు చెప్పిస్తుంటానా?
51. వాళ్ళ మాట విననపుడు వివేకంతో ప్రవర్తిస్తుంటానా లేక గంపెడంత నోరుచేసికొని ఊరంతా వినేలా మాటలాడుతుంటానా?
52. ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టున మేయదు. నా జీవితం పిల్లలకు ఆదర్శప్రాయంగా వుందా?
53. పిల్లల్లో ఎవరైనా దేవుని పిలుపు వింటే బాగుండు అనే కోరిక నాలో వుందా?
54. పిల్లలు వివాహ జీవితంద్వారా మాత్రమేగాక కన్యా గురు జీవితాల ద్వారాగూడ ధన్యులౌతారు అనే భావాన్ని నేను అర్థంచేసికుంటున్నానా?
55. పిల్లలను విడచి వుండలేనన్న నెపంతో వాళ్ళను దైవసేవకు అర్పించడానికి నిరాకరిస్తున్నానా?

# ప్రశ్నలు

## అధ్యాయం - 1

1. ఆదిదంపతుల జీవితంలో కన్పించే దేవుని పోలిక, సహాయురాలు, సంతానం, పరస్పరప్రేమ అనే నాల్గు భావాలను వివరించండి.

## అధ్యాయం - 2

1. క్రీస్తు తిరుసభల పోలిక క్రైస్తవ భార్యాభర్తల మీద ఏలా సోకుతుంది? సోకి ఏమి చేస్తుంది?

## అధ్యాయం - 3

1. సహజమైన వివాహబంధాన్నే క్రీస్తు సంస్కారంగా మార్చాడని నిరూపించండి.

## అధ్యాయం - 4

1. వివాహ విధిలో ముఖ్యమైంది వధూవరుల అంగీకారమేనని నిరూపించండి.
2. వధూవరులే ఒకరి కొకరు వివాహ సంస్కారాన్ని ఇచ్చుకొంటారని రుజువు చేయండి.

## అధ్యాయం - 5

1. బహుభర్తృత్వం, బహుభార్యాత్వం చెల్లవని నిరూపించండి.
2. క్రైస్తవ వివాహానికి విడాకులు పొసగవని నిరూపించండి.

## అధ్యాయం - 6

1. వివాహం ఆశయాలను విశదీకరించండి.
2. వివాహం సంస్కారం ఇచ్చే ప్రత్యేక వరప్రసాదాన్ని వివరించండి.

## అధ్యాయం - 7

1. వివాహ జీవితం ఎలా ప్రేమసమాజ మౌతుందో తెలియజేయండి.

## అధ్యాయం - 8

1. వివాహ జీవితంలో సిలువలు ఎదురైనపుడు దంపతులు ఏమి చేయాలి?

## అధ్యాయం - 9

1. లైంగిక క్రియలో నిస్వార్థంగా ప్రవర్తించడం అంటే యేమిటి?
2. ప్రార్థన సంస్కారాలు కుటుంబీకులను ఎలా పవిత్రపరుస్తాయి?

## అధ్యాయం - 10

1. గురుకన్యా జీవితాల్లాగ వివాహ జీవితంగూడ ఓ పిలుపేనని నిరూపించండి.

## అధ్యాయం - 11

1. వివాహమాడబోయే యువతీ యువకులకు ఒకరిపట్ల ఒకరికి ఏలాంటి భావాలుండాలి?

## అధ్యాయం - 12

1. పెండ్లికాకముందు యువతీయువకుల పరిచయాలు ఏలా వుండాలి?
2. పెండ్లి చేసికోకముందు వధూవరులు ఒకరిని గూర్చి ఒకరు ఏయే వివరాలను తెలిసికొని వుండాలి?

## అధ్యాయం - 13

1. క్రైస్తవ కుటుంబాలు ఏలా దేవాలయాలుగా రూపొందాలో వివరించండి.

# 2. గురుపట్టం



## విషయసూచిక



## 1. అపోస్తులుల కాలంనాటి యాజకులు

ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం

### 1. అపోస్తులుల కాలంలోనే త్రివిధ యాజకులు ఉండేవాళ్ళు

1. దివ్యసత్ర్పసాదాన్ని సిద్ధంచేయడానికి క్రీస్తు నుండి మొదట అనుమతి పొందినవాళ్ళు అపోస్తులులే. ప్రభువు తొలిసారిగా వాళ్లతో దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి అని చెప్పాడు - లూకా 22,19. క్రీస్తుకిమల్లె అతని శిష్యులైన అపోస్తులులకూ త్రివిధాధికారాలు వుండేవి. అవి ప్రజలను పరిపాలించడం, వారికి బోధ చేయడం, వారిని పవిత్రపరచడం.

అపోస్తులుడు అంటే యెవడు? అతడు క్రీస్తు ఎన్నుకొనిన పండ్రెండుమంది శిష్యుల్లో ఒకడు. లేదా, క్రీస్తు తన ఉత్థానానంతరం స్వయంగా నియమించినవాడు కావచ్చు. పౌలు ఈలాంటివాడు. పండ్రెండుమంది శిష్యులు తమ స్థానాన్ని పూరించడానికి ఎన్నుకొన్నవాడు కావచ్చు. మత్తీయా ఈలాంటివాడు. అపోస్తులులచేత నియమింపబడిన తీతులాంటి శిష్యులుకూడ కావచ్చు. అపోస్తులుల మరణానంతరం వారి స్థానాన్ని పొందిన అనుయాయులు కూడ కావచ్చు. అపోస్తులులుకాని వారి అనుయాయులు కాని ఒక్క ప్రాంతపు తిరుసభకు చెందినవాళ్లుకాదు. వాళ్ళు నిరంతరం పర్యటిస్తూ, ఆయా ప్రాంతాల్లోని క్రైస్తవ సమాజాలన్నిటినీ పర్యవేక్షిస్తుండేవాళ్ళు.

ఈ యపోస్తులులతోపాటు వారి కాలంలోనే క్రైస్తవ సమాజంలో ఇంకా మూడురకాల అధికారులుకూడ వుండేవాళ్లు. వీళ్లే పెద్దలు, పర్యవేక్షకులు, పరిచారకులు. ఇక్కడ ఈ మూడు తెగలవాళ్లను గూర్చి పరిశీలిద్దాం.

1) పెద్దలు. ఆ కాలపు లౌకిక సమాజంలో నగరాధ్యక్షులను "పెద్దలు" అనేవాళ్లు. ఈ పేరునే క్రైస్తవ సమాజంలోని పెద్దలకుగూడ పెట్టారు. (గ్రీకు, ప్రెస్బితెరోయి). పౌలు అతని స్నేహితుడు బర్నబా చాల సమాజాలకు పెద్దలను నియమించారు - అచ 14,23. ఈ పెద్దలు ధర్మంగా వచ్చిన డబ్బును ఆయా అవసరాలకు వినియోగించేవాళ్లు - అచ 11,30. ఇంకా, వేదబోధ చేస్తుండేవాళ్లు. ఆరాధనలో ప్రధానపాత్రను నిర్వహించేవాళ్లు- 1తిమో 5.17. ఈ పెద్దలే రెండవ శతాబ్దంలో నేటి మన గురువులుగా మారారు. ఈ విషయం తర్వాత స్పష్టమౌతుంది.

2) పర్యవేక్షకులు లేక అధ్యక్షులు. అపోస్తలుల నాటి క్రైస్తవ సమాజంలో పెద్దలతోపాటు అధ్యక్షులు లేక పర్యవేక్షకులు అనే అధికారులుకూడ వుండేవాళ్లు. (గ్రీకు, ఎపిస్కొపోయి). వీళ్లకు ఆనాటి క్రైస్తవ సమాజంలో మంచి గుర్తింపు వుండేది -1తిమో 3,2. ఆ కాలపు నగరాల్లో అత్యున్నతాధికారులను "పర్యవేక్షకులు" అని పిల్చేవాళ్ళు. ఈ పేరే క్రైస్తవ సమాజాల్లో అధ్యక్షులకుగూడా పెట్టారు. అపోస్తలులు మొదలైన క్రైస్తవాధికారులు వీరిమీద చేతులు చాచగా వీళ్లు పర్యవేక్షకులు అయ్యేవాళ్ళు-2తి 1,6. వాళ్లు నాటి క్రైస్తవ సమాజాలకు ప్రధాన బాధ్యతను వహించేవాళ్లు-అ.చ. 20,28.

తొలిరోజుల్లో కొన్ని సందర్భాల్లో ఒకే వ్యక్తిని పెద్దఅనీ పర్యవేక్షకుడనీ గూడ పిల్చేవాళ్ళు. కనుక ఈ పేర్లు కొన్నిమార్లు తారుమారవుతుండేవి-అచ 20,17.28. ఈ పర్యవేక్షకులే రెండవ శతాబ్దంలో నేటి మన బిషప్పులుగా మారిపోయారు. ఈ యంశం మీదట స్పష్టమౌతుంది.

3) పరిచారకులు. పై రెండు వర్గాల వారితోపాటు పరిచారకులు అనబడేవాళ్ళుకూడ వుండేవాళ్ళు. (గ్రీకు, దియాకొనోయి). అపోస్తలులు తమకు సాయం చేయడానికి ఈ డీకన్లను నియమించారు-అ.చ.6,1-6. వీళ్ళు అన్నం వడ్డించడం మొదలైన భౌతిక కార్యాల్లోను, సువిశేష బోధ మొదలైన ఆధ్యాత్మిక కార్యాల్లోను సాయం చేస్తుండేవాళ్ళు.

## 2. త్రిముఖమైన పవిత్రాధికారం

పైన మనం పేర్కొన్న పెద్దలు పర్యవేక్షకులు పరిచారకులు అనే వాళ్లకు అపోస్తలులతోపాటు త్రివిధాధికారాలు వుండేవి. అవి వేదబోధ చేయడం, ప్రజలను పరిపాలించడం, ప్రజలను పవిత్రపరచడం. ఫిలిప్పు అనే పరిచారకుడు ఇతియోపీయునికి వేదబోధ చేసాడు- అ.చ. 8,35. తిమోతి ఇతరులమీద చేతులు చాచి వాళ్ళను పెద్దలను చేసాడు-1తిమోతి 5,22.

## 3. అపోస్తలులు వారి అనుయాయులు తమ పవిత్రాధికారాన్ని ఇతరులకు అందించారు.

అపోస్తలులను మొదట క్రీస్తే ఎన్నుకొన్నాడు. ఈ యపోస్తలులు తమ అనుయాయులను తావే ఎన్నుకొన్నారు. ఈ యనుయాయులు మళ్ళా తమ అనుయాయులను ఎన్నుకొన్నారు. ఈవిధంగా యాజకత్వం అపోస్తలుల నుండి శిష్యులకూ, ఆ శిష్యులనుండి వారి శిష్యులకూ సంక్రమిస్తూ వచ్చింది.

ఉదాహరణకు పౌలు తిమోతిమీద చేతులుచాచి ప్రార్థన చేయగా అతడు పర్యవేక్షకుడు (అధ్యక్షుడు) అయ్యాడు-1తిమో 4,14 ; 2తిమో 1,6. పూర్వం మోషే యోషువా మీద హస్తనిక్షేపణం చేయగా మోషే ఆత్మ యోషువా మీదికి దిగివచ్చింది - సంఖ్యా 27,18-23. అలాగే ఇక్కడ పౌలు మరియు ఇతర పెద్దలనుండి పవిత్రాత్మ, వరప్రసాదం తిమోతిమీదికి దిగివచ్చాయి అనుకోవాలి.

పర్యవేక్షకుడైన తిమోతి తాను మరల ఇతరులమీద హస్తనిక్షేపణంచేసి వాళ్ళను పెద్దలను చేసాడు -1తిమొ 5,22. ఈలా పవిత్రాధికారం అపోస్తలుల నుండి శిష్యులకూ, వారి నుండి వారి శిష్యులకూ సాగిపోయింది.

## 4. రెండవ శతాబ్దానికల్లా పై పర్యవేక్షకులు నేటి బిషప్పులుగా మారిపోయారు.

మొదటి శతాబ్దంలో పెద్దలకూ పర్యవేక్షకులకూ వున్న వ్యత్యాసమేమిటో మనకు స్పష్టంగా తెలియదు. కాని రెండవ శతాబ్దంలో పెద్దమార్పు జరిగింది. పర్యవేక్షకులు పెద్దలకు పై యధికారులయ్యారు.

రెండవ శతాబ్దంలో జీవించిన రోమాపురి క్లెమెంటు, అంటియోకయ ఇన్యాశివారు, ఇరెనేయుస్, పొలికార్పు, హిప్పొలీటస్ మొదలైన వారి రచనల వలన మనకు ఈ వివరం తెలుస్తూంది.

పైన మనం పేర్కొన్న పర్యవేక్షకులు రెండవ శతాబ్దంలో బిషప్పులుగా మారిపోయారన్నాం. ఈ బిషప్పులు పూర్వంవలె క్రైస్తవ సమాజాలన్నిటిలోను పర్యటించి పనిచేయడం మానుకొని, ఒక్క ప్రాంతానికి అధికారులయ్యారు. ఉదాహరణకు ఇగ్నేష్యస్ సిరియాకు, పోలికార్పు స్మిర్నాకు, ఇరెనేయుస్ లియోనుకు అధికారులయ్యారు. ఈ బిషప్పుల క్రింద కొందరు పెద్దలు బిషప్పులతో కూడి పనిచేసేవాళ్ళు. ఈ బిషప్పులు అపోస్తలులకు ప్రత్యక్షమైన అనుయాయులు. ఈ యనుయాయిత్వం చాల ముఖ్యమైంది. ఈ బిషప్పులు ఇతర బిషప్పులనూ పెద్దలనూ అభిషేకించారు.

పెద్దల హోదా పెరగలేదు. వాళ్ళు ఒక బృందంగా కూడి ఒక్క బిషప్పు అధికారం క్రింద పనిచేసారు. సంయుక్త పూజలో బిషప్పే ప్రధాన గురువు. పెద్దలు అతనితో కలసి పూజచేసారు. కాని ఈ పెద్దలు, రెండవ శతాబ్దంలోనే, బిషప్పు అనుమతితో, విచారణలోని మారుమూల గ్రామాల్లో కూడ వ్యక్తిగతంగా పూజ చేసేవాళ్లు.

కనుక రెండవ శతాబ్దం నుండి క్రీస్తు యాజకత్వం రెండు ప్రధాన శాఖలుగా చీలింది. ఒకవైపు పర్యవేక్షకులు లేక బిషప్పుల బృందం వుండేది. వీళ్ళు పేత్రు స్థానంలో వుండేవాళ్ళు. మరొకవైపు పెద్దల బృందం వుండేది. బిషప్పులూ పెద్దలూకూడ బృందాలుగానే వ్యవహరించేవాళ్ళు. వీళ్ళందరినీ ఐక్యపరచేవాడు క్రీస్తే. అందరూ అతని యాజకత్వంలోనే పాలుపొందారు. రోము బిషప్పు అందరికీ పెద్ద అయ్యాడు. అతడు క్రీస్తునీ, పేత్రునీ ప్రత్యేకంగా సూచిస్తుండేవాడు. ఈరీతిగా ఇప్పటి పోపుగారు, బిషప్పులు, గురువులు అనే విభజనం రెండవ శతాబ్దం నాటికే వుంది.

# 2. క్రీస్తే స్వయంగా యాజకత్వాన్ని స్థాపించాడు

ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం.

## 1. క్రీస్తే యాజకత్వ సంస్కారాన్ని స్థాపించాడు.

కొందరు ప్రోటస్టెంటుల భావించినట్లుగా గురుపట్టాన్ని తిరుసభ స్థాపించలేదు. క్రీస్తే దాన్ని స్థాపించాడు. పూర్వ వేదకాలంలోనే మలాకీ ప్రవక్త "తూర్పునుండి పడమర వరకు ప్రపంచంలోని ప్రజలందరూ నన్ను గౌరవిస్తారు. వాళ్ళు నాకు సాంబ్రాణిపొగవేసి పవిత్రమైన బలి నర్పిస్తారు" అని వాకొన్నాడు-1,11. ఈ ప్రవక్త సూచించింది నూత్నవేదపు క్రీస్తుబలినీ, క్రైస్తవ యాజకులనీ. ఇక, నూత్నవేదంలో క్రీస్తు స్వయంగా యాజకుడై తన్ను తానే బలిగా అర్పించుకొన్నాడు. అతడు కడపటి విందులో రొట్టెరసాలను తన శరీరరక్తాలుగా అర్పించి, శిష్యులుగూడ ఆ కార్యాన్ని కొనసాగించాలని ఆదేశించాడు. "మీరు దీనిని నా జ్ఞాపకార్థంగా చేయండి" అన్నాడు -1కొ 11,23-26. లూకా 22,19. అనగా అతని కల్వరిబలిని కొనసాగించేవాళ్లూ, దాన్ని ప్రజలమధ్య ప్రత్యక్షం చేసేవాళ్లూ, శిష్యులూ వారి అనుయాయులూను. "మీరు దీనిని నా జ్ఞాపకార్థం చేయండి" అనే వాక్యం ద్వారానే క్రీస్తు గురుపట్టాన్ని స్థాపించాడు. మళ్ళా అతడు ఉత్థానానంతరం శిష్యులకు జ్ఞానస్నానాది సంస్కారాలను దయచేసే హక్కు నిచ్చాడు - మత్త 28,19-20. వారికి పవిత్రాత్మను దయచేసి ప్రజల పాపాలను మన్నించే హక్కు నిచ్చాడు - యోహా 20,22-23. క్రీస్తు గురుపట్టాన్ని ఎప్పుడు స్థాపించాడు అనే ప్రశ్నకు, పై కడపటి భోజన వాక్యాలను ఉత్థానానంతర వాక్యాలనూ కలిపి తీసికోవాలి.

క్రీస్తు శిష్యులకు తర్ఫీదునిచ్చి వాళ్ళను గురుత్వానికి సిద్ధం చేసాడు. వాళ్ళు తన యాజకత్వాన్ని కొనసాగించాలని కోరాడు. వాళ్ళకు తన ఆత్మను ప్రసాదించాడు. లోకాంతం వరకు నేను మీతో వుంటానని మాట యిచ్చాడు-మత్త 28,20. అనగా క్రీస్తు అపోస్తలులతోను వాళ్ళ అనుయాయులతోను వుంటాడు. తండ్రి తన్ను పంపినట్లే తానూ వాళ్ళను పంపాడు - యోహా 20,21. తన తర్వాత వచ్చే ఆత్మ వాళ్ళకు సమస్తవిషయాలు బోధిస్తుంది-14,26. ఈ వాక్యాలన్నిటినిబట్టి రెండు విషయాలు అర్థం చేసికోవాలి. మొదటిది, క్రీస్తు అపోస్తలులనూ వాళ్ళ అనుయాయులనూ గురువులనుగా నియమించాడు. రెండవది, గురుత్వపు బాధ్యతలను నిర్వహించే శక్తిని గూడ వాళ్ళకు దయచేసాడు. వాళ్ళు పవిత్రాత్మనూ ఉత్థాన క్రీస్తు సాన్నిధ్యాన్నీ వరప్రసాదాన్నీ స్వీకరించడం ద్వారా ఈ శక్తిని పొందారనుకోవాలి.

క్రీస్తు గురుత్వమనే సంస్కారాన్ని స్థాపించాడేగాని, దాన్ని ఏలా నిర్వహించాలో చెప్పలేదు. కనుక ఈ సంస్కారాన్ని నిర్వహించే పద్ధతిని, యూదుల సంప్రదాయాన్ననుసరించి అపోస్తలులే నియమించి వుంటారు. అపోస్తలుల కాలంలో అభ్యర్థులకు గురుత్వాన్ని ఇచ్చేపుడు వాళ్ళమీద చేతులు చాచి ప్రార్థన చేసేవాళ్ళు. ఈ రెండు సంజ్ఞలూ నూత్నవేదంలో స్పష్టంగా కన్పిస్తాయి. తిమోతి యాజకత్వాన్ని పొందినపుడు పౌలూ ఇతర పెద్దలూ అతనిమీద చేతులు చాచారు-2తిమో 1,6. ఇంకా, ఆ సందర్భంలో ప్రవక్తలు ప్రవచనాలు కూడ పల్కారు-1తిమో 4,14. ఈ "ప్రవచనాలు" ప్రార్థనలైయుంటాయి. మరో తావులో, పౌలు బర్నబాలు ప్రతి సమాజంలోను పెద్దలను నియమించి వారిమీద చేతులు చాచారనీ, ఉపవాసపూర్వకంగా ప్రార్థనలు చేసారనీ చెప్పబడింది-అ.చ. 14,23. కనుక అభ్యర్థిమీద చేతులుచాచి ప్రార్థనంచేయడం గురుపట్టాభిషేకంలో జరిగే మతకర్మలు. వీటిని అపోస్తలులే నియమించి వుంటారు.

## 2. ఈ యాజకత్వ సంస్కారంలో మూడు అంతస్తులున్నాయి.

గురుత్వం ఒకటే ఐనా దానిలో మూడు అంతస్తులున్నాయి. అవి బిషప్పు, గురువు, పరిచారకుడు అనే పదవులు. ఈ మూడు అంతస్తులను గూర్చి వివరంగా తెలిసికొందాం.

1) బిషప్పు. బిషప్పు గురుత్వం పరిపూర్ణమైంది. గురువు గురుత్వం బిషప్పు గురుత్వం కంటె తక్కువ స్థాయిలోనిది. పరిచారకుని గురుత్వం ఇంకా తక్కువ స్థాయిలోనిది.

బిషప్పుకి పరిపూర్ణమైన యాజకత్వం వుంటుందని చెప్పాం. మొదట "పర్యవేక్షకులు" అనబడేవాళ్ళే రెండవ శతాబ్దంలో బిషప్పులుగా మారిపోయారని పూర్వాధ్యాయంలో వివరించాం. పితృపాదులు బిషప్పు యాజకత్వంలో మొదటి అంతస్తును పొందుతాడని చెప్పారు. పీఠాధిపతి పదవి నిజమైన సంస్కారమని కూడ వాకొన్నారు.

ట్రెంటు మహాసభ ఈలా బోధించింది. బిషప్పు అభిషేకం పొందినపుడు ఆత్మ అతని మీదికి దిగివస్తుంది. అతని హృదయం మీద చెరగని ముద్రపడుతుంది. పవిత్రాత్మే అతన్ని తిరుసభకు పాలకుణ్ణిగా నియమిస్తుంది. అతడు గురువు కంటె అధికుడు. భద్రమైన అభ్యంగమూ, గురుపట్టమూ, ఇచ్చేది అతడే. గురువునకు లేని కొన్ని ఇతరాధికారాలు కూడ అతనికుంటాయి.

రెండవ వాటికన్ సభ ఈలా బోధించింది. "బిషప్పు అభిషేకం ద్వారా పవిత్రాత్మనూ అక్షయమైన ముద్రనూ పొందుతాడు. అతడు ప్రముఖంగాను, కంటికి కన్పించేరీతిలోను క్రీస్తు స్థానాన్ని స్వీకరిస్తాడు. క్రీస్తులాగే తానూ బోధకుడూ, కాపరీ, యాజకుడూ ఔతాడు. క్రీస్తుస్థానంలో వుండే పని చేస్తాడు. తోడి బిషప్పులను అభిషేకించేది అతడే. ఈ వాక్యాలనుబట్టి పీఠాధిపతి స్థానం ఎంత ఘనమైందో ఊహించుకోవచ్చు.

2) గురువు. తొలిరోజుల్లోని పెద్దలే రెండవ శతాబ్దంలో గురువులుగా గుర్తింపు పొందారని చెప్పాం. గురుత్వాన్ని మొదటినుండి దేవద్రవ్యానుమానంగా గుర్తిస్తూ వచ్చారు.

రెండవ వాటికన్ మహాసభ గురుత్వాన్ని గూర్చి ఈలా బోధించింది. గురువులు అభిషేకం ద్వారా ప్రధాన యాజకుడైన క్రీస్తుకి అనురూపంగా గురుపట్టం పొంది బోధకులూ, కాపరులూ, ఆరాధనను నిర్వహించేవాళ్ళూ ఔతారు. వాళ్ళు తమ బిషప్పుతో కలసి ఒకే యాజకత్వంలో పాలుపొందుతారు. ఈ యాజకత్వంలో మాత్రం వేరువేరు అంతస్తులుంటాయి. గురువులు తాము పనిచేసే తావులో తమ బిషప్పుని ప్రత్యక్షంచేసికొంటారు. అతని బాధ్యతలనూ పనులనూ తమవిగా చేసికొంటారు. ఒక బిషప్పు క్రింద పనిచేసే గురువులంతా ఒకే అభిషేకమూ, ఒకే పనీ కలిగి వుండడంవల్ల ఒక్క బృందంగా ఏర్పడతారు. వాళ్లు తమ బిషప్పుకి తోడిపనివాళ్ళు. బిషప్పుతో పాటు తామూ క్రీస్తుచే పంపబడినవాళ్ళు.

3) పరిచారకుడు. తొలిరోజుల్లో పరిచారకులు అపోస్తలులకూ పర్యవేక్షకులకూ సహాయం చేస్తుండేవాళ్ళు. అపోస్తలులు వీళ్ళమీద చేతులు చాచి వీళ్ళకు పరిచారక పట్టాన్ని ఇచ్చారని చదువుతున్నాం. అ.చ. 6:1-6. పౌలు సమాజాల్లో స్త్రీపరిచారికలు గూడా వుండేవాళ్ళు. - రోమా 16,1-2. ఈ పరిచారకులు తొలిరోజుల్లో చేసిన పనులు రెండు. వేదబోధ చేయడం, సేవాకార్యాలు నిర్వహించడం. అపోస్తలులనాడు క్రైస్తవులు యెరూషలేములో కొన్నాళ్ళపాటు ఉమ్మడిజీవితం జీవించారు. ఈ క్రైస్తవులకు పరిచారకులు అన్నమూ మొదలైన భౌతిక వస్తువులను అందజేసేవాళ్ళు. పేదాబిక్కీని పరామర్శించేవాళ్ళు. పేదలకు సేవచేయడం పరిచారకుల బాధ్యతల్లో ముఖ్యమైంది. ఈనాడు కూడ వాళ్లు తిరుసభ పేదవారి పట్ల చూపించే ఆదరణకు సాక్ష్యంగా వుంటున్నారు. తిరుసభ చరిత్రలో

పరిచారకులు క్రమేణ ప్రాముఖ్యాన్ని కోల్పోయారు. నేడు ల్యాటిన్ అమెరికాలో మాత్రమే వీళ్ళు ఎక్కువగా పనిచేస్తున్నారు. మనదేశంలో డీకన్లు అసలులేరు. రెండవ వాటికన్ సభ ప్రపంచమంతటా డీకన్ల అంతస్తును మళ్ళా పునరుద్ధరించాలని కోరింది.

## 3. బిషప్పు యాజకత్వం, గురువు యాజకత్వం

పరిచారకుని అంతస్తు మనకంత ముఖ్యంకాదు. కనుక ఇక్కడ బిషప్పు యాజకత్వానికి గురువు యాజకత్వానికీ గల వ్యత్యాసాన్ని విపులంగా పరిశీలిద్దాం.

1) యాజకత్వం ఒక్కటే. అది క్రీస్తు యాజకత్వం. నరమాత్రులంతా ఈ క్రీస్తు యాజకత్వంలో పాలుపొందే యాజకులౌతారు. కాని బిషప్పు ఈ యాజకత్వాన్ని పరిపూర్ణంగా పొందుతాడు. అతనిది మొదటి అంతస్తు. గురువు అపరిపూర్ణంగా పొందుతాడు. అతినిది రెండవ అంతస్తు.

అభిషేకం ద్వారా బిషప్పు, యాజకుడు ప్రవక్త కాపరి అనే మూడు లక్షణాలను సంపూర్ణంగా పొందుతాడు. ఈ అభిషేకం ద్వారా అతన్ని బిషప్పు బృందంలోనికి ప్రవేశపెడతారు. అలా ప్రవేశపెట్టడం వలన అతడు బిషప్పు ఔతాడు. కనుక అతని అధికారం బృందాధికారంగాని వ్యక్తిగతమైందికాదు. ఈ బృందభావాన్ని సూచించడానికే బిషప్పుని అభిషేకించేపుడు ఒక్కరు కాక ముగ్గురు బిషప్పులు అభిషేకిస్తారు. పైగా తిరుసభ బోధనక్రియలో బిషప్పులంతా గలసి పొరపడనివరం పొందుతారు. ఐనా ఏ బిషప్పుకి గూడా వ్యక్తిగతంగా ఈ వరం వుండదు.

బిషప్పు ప్రముఖంగా క్రీస్తు యాజకత్వాన్ని ఈలోకంలో ప్రత్యక్షం చేసేవాడు. అతడు గొప్ప ఆరాధన కార్యకర్త. స్థానిక తిరుసభకు ప్రధానాధికారి. క్రీస్తు స్థానంలో వుండేవాడు. బిషప్పులంతా కలసి అపోస్తలుల బృందానికి వారసులు. కనుక స్థానిక తిరుసభలో బిషప్పు అపోస్తలులకు ప్రతినిధి. కావుననే సిప్రియన్ భక్తుడు చెప్పినట్లు, బిషప్పు తిరుసభలో నెలకొని వుంటాడు, తిరుసభ బిషప్పులో నెలకొని వుంటుంది. బిషప్పు స్థానిక తిరుసభకు అధిపతిగా వున్నా విశ్వతిరుసభకు ప్రతినిధిగా వుంటాడు. మేత్రాసనం స్థానిక తిరుసభే ఐనా విశ్వతిరుసభను సూచిస్తుంది.

అభిషేకంలో బిషప్పు ప్రముఖంగా ఆత్మను పొందుతాడు. అప్పటినుండి అతనికి బిషప్పు పదవికి తగిన వరప్రసాదం లభిస్తూంటుంది. ఈ యభిషేక వరప్రసాదంద్వారా అతడు శిరస్సు ఔతాడు. కాని ఈ యభిషేక వరప్రసాదం గురువుని బిషప్పుకి సహాయుణ్ణిగా మాత్రమే చేస్తుంది.

2) ఇక గురువు బిషప్పుల బృందం యాజకత్వంలో పాలుపొంది గురువౌతాడు. గురువు తన్నభిషేకించే ఒక్క బిషప్పు యాజకత్వంలో గాక బిషప్పుల బృందం అంతటి

యాజకత్వంలోను పాలుపొందుతాడు. అతినిది రెండవ అంతస్తు మాత్రమే. అతడు ప్రధానంగా బిషప్పుకి సహాయుడు. అతని అధికారంక్రింద పనిచేసేవాడు. అతన్ని తన విచారణలో ప్రత్యక్షం చేసేవాడు. క్రీస్తు మూడు లక్షణాలను బిషప్పు పొందితే మళ్లా బిషప్పునుండి ఈ మూడు లక్షణాలను పొందేవాడు గురువు.

పీఠాధిపతి చుట్టూ యాజకబృందం వుంటుంది. గురువు అభిషేకం ద్వారా ఈ యాజక బృందంలోనికి ప్రవేశిస్తాడు. ఆ మీదట అతనికి ఈ బృందంతో విడివడని సంబంధం వుంటుంది. అందుకే గురువు అభిషేకం పొందేప్పుడు బిషప్పుతో పాటు తోడి గురువులుకూడ అతనిపై చేతులు చాస్తారు. అనగా పీఠాధిపతితోపాటు వాళ్ళూ అతన్ని అభిషేకిస్తారు. కనుక గురువు ఎప్పుడుకూడ యాజకబృందానికి చెందినవాడుగానే పనిచేస్తాడు కాని వ్యక్తిగతంగా పనిచేయడు.

గురువు ప్రధానంగా మేత్రాసనానికి చెందినవాడు. ఈ మేత్రాసనం విశ్వశ్రీసభలో ఒక జీవకణం. దీనికి అధిపతి పీఠాధిపతి. కనుక పీఠాధిపతి ప్రతినిధిగానే గురువు క్రీస్తు యాజకత్వంలో పాలుపొందుతాడు. కావున బిషప్పుకి విధేయుడై యుండడం గురువు ఆధ్యాత్మిక జీవితంలో ప్రధానాంశం. రెండవ శతాబ్దానికిచెందిన అంటియోకయ ఇన్యాసివారు ఇలావ్రాసారు. “వీణతో తంత్రులు ఐక్యమైయున్నట్లే గురువులు తమ బిషప్పుతో ఐక్యమై యుండాలి. క్రీస్తు శరీరం ఒక్కటే. మనం పానంచేసే అతని దివ్యరక్తం ఒక్కటే. బలిపీఠం ఒక్కటే. తన గురుబృందతో ఐక్యమైయుండే బిషప్పుకూడ ఒక్కడే”.

గురువు సేవలు ప్రధానంగా స్థానిక తిరుసభలోని విచారణకు చెందుతాయి. అతడు తన విచారణలోని ప్రజలకు మధ్యవర్తిగా వుంటాడు. వారి తరపున, వారితో కలసి పూజబలి నర్పిస్తాడు.

## 4. యాజకత్వాన్ని గూర్చిన ప్రోటస్టెంటు నాయకుల భావాలు

ప్రోటస్టెంటు నాయకులు నరుల యాజకత్వాన్ని అంగీకరించరు. క్రీస్తు యాజకత్వం ఒక్కటే చాలని వీళ్ళవాదం. వీళ్ళ భావాల ప్రకారం, మనలను రక్షించేది విశ్వాసం కాని గురువు అర్పించే పూజబలి కాదు. బోధకుడు బోధచేసినపుడు మనం దైవవాక్యాన్ని విశ్వసిస్తే చాలు, అదే మనకు రక్షణం ఇస్తుంది. ఇక నరుని యాజకత్వంతో అవసరంలేదు. తిరుసభలో అధికారులు వుండవచ్చు. కాని గురువుల అధికారం అక్కర్లేదు. క్రైస్తవ సమాజాల్లో ఎవరైనా గురువులుగా వ్యవహరిస్తున్నారంటే వాళ్లకా పదవినిచ్చింది క్రైస్తవ సమాజమే కాని క్రీస్తుకాదు. కనుక ఇవ్వాళ్ళ గురువుగావున్న వ్యక్తి రేపు కేవలం గృహస్థుడు కావచ్చు.

లూతరు, కాల్విన్, మొదలైన ప్రోటస్టెంటు నాయకులు గురుపట్టం దేవద్రవ్యానుమానం కానేకాదన్నారు. వాళ్ళ అభిప్రాయం ప్రకారం క్రీస్తు గురుపట్టాన్ని స్థాపించలేదు. క్యాతలిక్ సమాజమే దాన్ని ప్రవేశపెట్టింది. కనుక దాన్ని నిరాకరించాలి.

ఈ ప్రోటస్టెంటు వాదాలను ఖండించి మన తిరుసభ ఈలా బోధించింది. క్రైస్తవులందరూ జ్ఞానస్నానం ద్వారానే క్రీస్తు యాజకత్వంలో పాలు పొందుతారు. కాని ఇదికాక క్రైస్తవుల్లో కొందరికి సేవాత్మకమైన యాజకత్వం గూడ వుంటుంది. దీన్నే గురుపట్టం అంటాం. దీన్ని క్రీస్తు ఏడు దేవ ద్రవ్యానుమానాల్లో ఒకటిగా స్థాపించాడు.

సేవాత్మకమైన యాజకత్వం ఈలోకంలో క్రీస్తు కల్వరిబలిని కొనసాగించుకొని పోవడానికి ఉద్దేశింపబడింది. ఈ యాజకత్వం విశ్వాసులకు సేవచేయడానికిగాని వారిపై పెత్తనం చలాయించడానికి గాదు. తిరుసభలో విశ్వాసులున్నారు కనుకనే క్రీస్తు వారి సేవార్థమై యాజకత్వాన్ని గూడ నెలకొల్పాడు.

గురువుల యాజకత్వం విశ్వాసులు జ్ఞానస్నానం ద్వారా పొందే యాజకత్వాన్ని భంగపరుపదు. పైగా అది విశ్వాసులకు సేవలు చేయడానికే ఉద్దేశింపబడింది. ఈ యాజకత్వం ఉత్థాన క్రీస్తు యాజకత్వంలో ఓ పాలే కాని స్వతంత్రమైంది కాదు. కనుక అది క్రీస్తు యాజకత్వాన్ని గూడ భంగపరుపదు.

# 3. గురుపట్ట సంజ్ఞలు

ఈ యధ్యాయంలో మూడంశాలు పరిశీలిద్దాం.

గురుపట్ట సంజ్ఞలు రెండు. అవి బిషప్పుగారి హస్తనిక్షేపణం, ప్రార్థనం, గురుపట్టాన్నిచ్చేది బిషప్పుగారే.

## 1. బిషప్పుగారి హస్తనిక్షేపణం

బిషప్పుగారు గురుపట్టాన్ని పొందేవ్యక్తిపై చేతులు చాస్తారు. ఈ హస్తనిక్షేపణం భావం ఏమిటి?

తిమోతి పౌలునుండి యాజకత్వాన్ని పొందినపుడు పౌలు ఇతర పెద్దలు అతని మీద చేతులు చాచారు - 2 తిమో 1,6-7; 1తిమో 4,14. ఈ సంజ్ఞద్వారా తిమోతి పవిత్రాత్మను స్వీకరించాడు. అతడు దేవుని వరాన్ని, ఆధ్యాత్మిక వరాన్ని పొందాడు. ఈవరం పవిత్రాత్మే. తిమోతి కూడ తానెన్నుకొనిన అభ్యర్థులపై చేతులుచాచి వారిని యాజకులను చేసాడు -1తిమో 5,22. ఈలాగే అపోస్తలులు స్తెఫను మొదలైన వారిపై చేతులు చాచి వారిని డీకన్లను చేసారు - అ.చ. 6,6.

పూర్వం మోషే యోషువామీద చేతులు చాచి తన అధికారాన్నీ జ్ఞానాన్నీ యోషువాకు అందించాడు. దీనివల్ల యోషువా అతనికి ఉత్తరాధికారి యయ్యాడు - సంఖ్యా 27,18-20, ద్వితీ 34,9.

ఈలాగే మోషే డెబ్బదిమంది పెద్దలను నియమించినపుడు వాళ్లమీద చేతులు చాచాడు. అప్పుడు ప్రభువు తాను పూర్వం మోషేకిచ్చిన ఆత్మలో కొంత తీసికొని ఆ డెబ్బదిమంది పెద్దలకు ఇచ్చాడు-సంఖ్యా 11,25.

ఈ యాలోకనాలన్నిటినిబట్టి హస్తనిక్షేపణం ఆత్మను పొందడానికి గుర్తు అనుకోవాలి. కనుక బిషప్పు గురువు కాబోయే అభ్యర్థిపై చేతులు చాచినపుడు అతడు ఆత్మను పొందుతాడు.

బిషప్పుతోపాటు ఇతర గురువులు కూడ అభ్యర్థిపై చేతులు చాస్తారు. కాని అభ్యర్థి ఈ గురువులనుండి ఆత్మను పొందదు. ఈ క్రియ గురువులంతా కలసి ఓ బృందంగా కూడి పనిచేస్తారనడానికి సూచనం.

## 2. బిషప్పు ప్రార్థనం

బిషప్పుగారు గురుపట్టం పొందే అభ్యర్థిపై కుడిచేయి చాచివుంచి ఈలా అర్థిస్తారు. "సర్వశక్తిగల పితా! ఈ మీ సేవకునికి గురుత్వపు ఘనతను ప్రసాదించండి. ఇతని హృదయంలో పవిత్రాత్మ శక్తిని నూత్నీకరించండి. దీనివలన ఇతడు మీనుండి ఆచార్యత్వంలో రెండవ అంతస్తును పొందునుగాక. నిగ్రహజీవితమును అలవర్చుకొని తన సత్ప్రవర్తనము వలన అందరికి ఆదర్శముగా నుండునుగాక." పై హస్తనిక్షేపణం ద్వారాను ఈ ప్రార్థనంద్వారాను అభ్యర్థి గురువుగా మారిపోతాడు. ఈ రెండు సంజ్ఞల్లోను ఆత్మను పొందడమే ముఖ్యాంశం. ఈ యాత్మశక్తి వల్లనే గురుత్వం లభించేది.

## 3. గురుపట్ట సంస్కారాన్నిచ్చేది బిషప్పే

మామూలుగా గురుపట్టాన్నిచ్చేది బిషప్పుగారే. కాని కొన్ని ప్రత్యేక సందర్భాల్లో కొందరు పాపుగార్లు బిషప్పులు కాని మఠశ్రేష్ఠులకు కూడ గురుపట్టాన్నిచ్చే అధికారాన్ని ఒసగారు. కనుక అరుదుగా, ప్రత్యేకానుమతితో గురువులుకూడ గురుపట్టాన్నీయవచ్చు.

గురువును అభిషేకించడానికి ఒక్క బిషప్పు చాలు కాని బిషప్పుని అభిషేకించడానికి మాత్రం ముగ్గురు బిషప్పులు కావాలి. వారిలో వొకరు ప్రధానాభిషేకకుడుగావున్నా, ఆ ముగ్గురు కలసే నూత్న బిషప్పును అభిషేకిస్తారు. నాల్గవ శతాబ్దంనుండి ఈ నియమం అమలులో వుంది.

# 4. గురుపట్ట ఫలితాలు

ఈ యధ్యాయంలో నాల్గంశాలను పరిశీలిద్దాం.

గురుపట్ట ఫలితాలు మూడు. అవి అక్షయమైన ముద్ర, త్రివిధాధికారం, వరప్రసాదం. ఈ మూడంశాలను క్రమంగా విలోకిద్దాం.

## 1. అక్షయమైన ముద్ర

గురుపట్టంద్వారా గురువు అక్షయమైన ముద్రను పొందుతాడు. ఈ ముద్ర ఏనాటికి చెరగిపోదు. కనుకనే ఒకసారి గురుపట్టాన్ని పొందినవాళ్ళు ఆ దేవద్రవ్యానుమానాన్ని మళ్లా పొందదానికి వీల్లేదు. ఎందుకంటే అది శాశ్వతంగా వుండిపోతుంది.

ఈ ముద్రద్వారా గురువు క్రీస్తుని పోలినవాడవుతాడు. క్రీస్తురూపం అతనిలో నెలకొంటుంది. క్రీస్తు యాజకుడు, బోధకుడు, కాపరి. అనగా ప్రజలను పవిత్రపరచేవాడు, వారికి బోధ చేసేవాడు, వారిని పాలించేవాడు. ఈ త్రివిధ క్రీస్తు లక్షణాలు పై ముద్రద్వారా గురువుకికూడ సంక్రమిస్తాయి.

అసలు గురువులో మూడు ముద్రలుంటాయి. మొదట జ్ఞానస్నానంద్వారా అతనికి ఓ ముద్ర వస్తుంది. దీనిద్వారా అతడు ఇతర క్రైస్తవుల్లాగే తానూ క్రీస్తుతో ఐక్యమై క్రీస్తు బలిని అర్పించడానికి యోగ్యుడౌతాడు. ఇతర దేవద్రవ్యానుమానాలను పొందడానికిగూడ అర్హుడౌతాడు.

తర్వాత అతనికి భద్రమైన అభ్యంగనంద్వారా రెండవ ముద్రవస్తుంది. దీనిద్వారా అతడు ఇతర క్రైస్తవుల్లాగే తానూ క్రీస్తుకి సాక్ష్యం పలికేవాడవుతాడు. క్రీస్తుకోసం వేదసాక్షిగా మరణించేవాడుకూడ అవుతాడు.

కడన అతనికి గురుపట్టపుముద్ర వస్తుంది. దీనిద్వారా అతడు క్రీస్తు మధ్యవర్తిత్వంలో పాలు పొందుతాడు. ఆ క్రీస్తులాగే యాజకుడు, ప్రవక్త, కాపరి అనే త్రివిధాధికారాలను పొందుతాడు. క్రీస్తు గురుత్వంలో పాలుపొంది తానూ "అపరక్రీస్తు" గా మారిపోతాడు.

క్రీస్తు నిరంతరం తన్నుతాను తండ్రికి అర్పించుకొంటాడు. తనతోపాటు నరజాతి నంతటినీ తండ్రికి అర్పిస్తుంటాడు. ఇక గురువు, భూమిమీద ఈ క్రీస్తు అర్పణాన్ని కొనసాగిస్తుంటాడు. తాను క్రీస్తు చేతిలో సాధనమాత్రుడుగా వుండి ప్రజలను క్రీస్తు పాస్క పరమ రహస్యంలోనికి ప్రవేశపెడుతుంటాడు. దివ్యసత్ప్రసాదబలి నర్పించడం ద్వారా అతడీకార్యాన్ని ప్రముఖంగా సాధిస్తాడు.

## 2. త్రివిధాధికారాలు

ఇక గురువు మూడధికారాలను పరిశీలిద్దాం.

### 1) ప్రజలను పవిత్రపరచే అధికారం.

క్రీస్తు యాజకుడు. గురువు క్రీస్తు యాజకత్వంలో పాలుపొంది అతనితో ఐక్యమై దివ్యసత్ర్పసాదబలి నర్పిస్తాడు. ఈ బలిద్వారా అతడు ప్రజలను పవిత్రపరుస్తాడు. ఇంకా జ్ఞానస్నానం పాపోచ్చారణం భద్రమైన అభ్యంగనం మొదలైన సంస్కారాలద్వారాగూడ వాళ్ళను పవిత్రపరుస్తాడు. కాని క్రైస్తవ ప్రజలు గురువుతోపాటు సత్ర్పసాదబలి నర్పించడం ద్వారా ప్రేమలో ఎక్కువగా పెంపుజెందుతారు.

గురువు భగవంతునికీ నరునికీ మధ్య నిలచి దేవుణ్ణి నరుని చెంతకు తీసికొనివస్తాడు. నరుణ్ణీ, ఈ లోకాన్నంతటిని దేవుని చెంతకు తీసికొనిపోతాడు. ఈలా అతడు తన మధ్యవర్తిత్వంద్వారా మానవులను పునీతులను చేస్తాడు.

ఇంకా గురువు రోజూ ఓ 45 నిమిషాలపాటు డివైన్ ఆఫిస్ అనే ప్రార్థనం జపిస్తాడు. ఈ ప్రార్థన స్తుతిబలి. అది అతడర్పించే దివ్యసత్ర్పసాద బలితో కలసిపోతుంది. ఈ ప్రార్థనను అతడు తిరుసభ పేరుమీదిగాను, ప్రపంచంలోని ప్రజలందరి పేరుమీదిగాను జపిస్తాడు. ఈ స్తుతిబలి క్రీస్తు మోక్షప్రార్థనంతో ఐక్యమై (హెబ్రే 7,25) ప్రజలను పవిత్రపరుస్తుంది. ఈ విధంగా అతని ఆరాధనజీవితం, విశేషంగా పూజార్పణం, క్రైస్తవులను పునీతం చేస్తుంది.

### 2) ప్రజలకు బోధచేసే అధికారం.

క్రీస్తు మహాప్రవక్త. గురువు అతని ప్రవక్తృత్వంలో పాలుపొంది బోధకుడౌతాడు. క్రీస్తు పాస్క పరమరహస్యమైన దివ్యసత్ర్పసాదబలినిగాని, ఇతర దేవద్రవ్యానుమానాలను కాని, అసలు దైవసంబంధమైన విషయాలు వేటినైనగాని అర్థంచేసికోవాలంటే వాక్యబోధ, జ్ఞానోపదేశం అనవసరం. వాక్యబోధ వలనకాని తిరుసభను నిర్మించలేం. కనుక గురువులు మీరు ప్రపంచమంతట తిరిగి సువార్తను బోధించండి అన్న ప్రభువు పలుకుల ప్రకారం నిరంతరం వాక్యబోధ చేస్తూండాలి. నరులు క్రీస్తు బోధనువినివిశ్వసించందే వారికి రక్షణంలేదు-మార్కు 16,15-16. వాక్యబోధ వలనగాని క్రైస్తవ సమాజాలు ఏర్పడవు. వినడం వలనకాని విశ్వాసం కలుగదు. బోధకులు క్రీస్తునిగూర్చి బోధిస్తేనేగాని ప్రజలు వినడమనేది జరగదు - రోమా 10,17. అందుచేత వాక్యబోధచేయడం గురువు ప్రధాన బాధ్యతల్లో వొకటి. దేవుని గూర్చిన జ్ఞానాన్ని బోధించడం యాజకుని బాధ్యత - మలాకీ

2,7. దివ్యసత్ప్రసాదమేగాదు వాక్యంగూడ క్రైస్తవులకు భోజనమే. కనుక మొదట వాక్యాన్ని భుజించి తర్వాత దివ్య సత్ప్రసాదాన్ని భుజించడం యుక్తం. అందుకే పూజలో ప్రసంగానికి ప్రముఖమైన స్థానముంది.

బోధకులు ప్రధానంగా బిషప్పులు. పాపుగారును బిషప్పులును కలసి బోధక తిరుసభ ఔతారు. గురువులు దానిలో భాగంగాదు. ఐనా బిషప్పు గురువుని అభిషేకించినపుడే తన బోధనాధికారంలో అతనికి పాలు ఇస్తాడు. కనుక గురువుకూడ ప్రముఖంగా బోధకుడే.

గురువు క్రైస్తవులకూ క్రైస్తవేతరులకూ గూడ బోధించవచ్చు. అతడు అందరినీ పశ్చాత్తాపపడి దేవుని దగ్గరికి రమ్మని ఆహ్వానించాలి.

అతడు దైవవాక్యాన్ని సమకాలిక సమస్యలకు అన్వయించి చూపిస్తూండాలి. కేవలం లౌకికాంశాల్లాగ కన్పించే విషయాలకుకూడ భగవంతునితో సంబంధం వుంటుంది. గురువు తనబోధలో ఈ సంబంధాన్ని స్పష్టంగా చూపించగలిగి వుండాలి. అప్పుడేగాని అతడు ఈ భౌతిక ప్రపంచాన్ని దేవుని కర్పించడు. ఇక, ఇతరులకు బోధించకముందు గురువు వేదవాక్కునూ క్రైస్తవ సత్యాలనూ గంటల తరబడి మననం చేసికొనివుండాలి.

### 3) ప్రజలను పరిపాలించే అధికారం

క్రీస్తు పాలకుడు, కాపరి. అతని పాలనాధికారంలో పాలు పొంది గురువు కూడ మందను నడిపించేవాడవుతాడు. ఈ యధికారాన్ని అతడు క్రీస్తు నుండి బిషప్పుద్వారా పొందుతాడు.

క్రైస్తవ సమాజాలను నిర్మించడం గురువుపని. అతడు తిమోతిలాగే "సహనంతో కూడిన బోధతో ప్రజలను ఒప్పిస్తూ, ఖండిస్తూ, ప్రోత్సహిస్తుండాలి" - 2తిమో 4,2. పేత్రు చెప్పినట్లుగా "గురువు అనిష్టంతోగాక దేవుని చిత్తం అనుకొని ఇష్టపూర్తిగా మందను మేపాలి. దుర్లాభ ఆపేక్షతో గాక మనఃపూర్వకంగా దానిని కాయాలి. తన ఆధీనమందున్న వారిపై అధికారం చలాయించక మందకు మాదిరిగా వుండాలి." అలా చేస్తే ప్రధానకాపరి ప్రత్యక్షమైనపుడు గురువు మహిమాన్వితమైన కిరీటాన్ని పొందుతాడు - 1పేత్రు 5,2-4.

గురువులు ప్రతివానిని దేవుడు వానికి నిర్ణయించిన మార్గంలో నడిపింప గలిగివుండాలి. ప్రజలకు సోదరప్రేమ, సువిశేష బోధల ప్రకారం జీవించడం, ఇతరులకు సేవచేయడం మొదలైన క్రైస్తవ విలువలను నేర్పాలి. గురువు విశేషంగా పేదలనూ రోగులనూ చనిపోయేవాళ్ళనూ యువజనులనూ మఠవాసులనూ పరామర్శిస్తుండాలి. ప్రాత క్రైస్తవులను అశ్రద్ధ చేయకుండా నూత్న క్రైస్తవులను ఎక్కువ శ్రద్ధతో పట్టించుకోవాలి.

క్రైస్తవ సమాజాన్ని నిర్మించే ప్రధాన సాధనం దివ్య సత్ప్రసాదబలి. కనుక అతడు ఈ బలిని యోగ్యంగా అర్పించి తన ఆధీనంలో వున్న స్థానిక క్రైస్తవ సమాజాన్ని పెంపులోనికి తీసికొని వస్తుండాలి.

## 3. వరప్రసాద ప్రాప్తి

గురుపట్టం ద్వారా గురువు పవిత్రాత్మను పొందుతాడు. ఈ యాత్మ సకల వరాలకీ సర్వపావిత్ర్యానికీ మూలం. కనుక ఈ యాత్మద్వారా గురువుకి అపారమైన పావిత్ర్యం లభిస్తుంది. ప్రతి అభిషేకంలోను నరుడు ఆత్మను పొందుతాడు. కనుక యాజకత్వంలోని మూడంతస్తులకూ, అనగా బిషప్పుకీ గురువుకీ డీకనుకీ, ఆత్మ సమృద్ధిగా లభిస్తుంది.

1) గురుపట్టంద్వారా గురువుకి ప్రత్యేకమైన వరప్రసాదం లభిస్తుంది. దీని వలన అతడు క్రీస్తుని పోలినవాడవుతాడు. అపర క్రీస్తుగా మారతాడు. క్రీస్తు నిరంతరం ప్రేమతో తన్ను తాను తండ్రికి అర్పించుకొంటూంటాడు. అతడు పూర్వవేదయాజకుల్లాగ ఏదో బలిపశువునర్పింపడు, తన్ను తానే తండ్రికి అర్పించుకొంటాడు. గురుపట్టం ద్వారా క్రీస్తుకి పోలికగా వుండే గురువులో కూడ ఈ ప్రేమా సమర్పణమూ కన్పించాలి. అతనిలో నిస్వార్థమూ వినయవిధేయతలూ చూపట్టాలి. తన లాభం తాను చూచుకోక దేవునికీ ప్రజలకూ సేవలు చేయాలి. ఈ శక్తి అతని ప్రభువునుండే లభిస్తుంది.

పూజబలిలో అతనికి తన్ను తానర్పించుకొనే శక్తి దేవుణ్ణి ఆరాధించే శక్తీ వస్తుంది. పాపోచ్చారణంలో పాపులపట్ల దయజూపే శక్తి వస్తుంది. అలాగే ఇతర దేవద్రవ్యానుమానాల్లో కూడ.

బోధచేసినపుడు క్రీస్తు ఆత్మ అతన్ని ప్రేరేపిస్తుంది. అతనిచే ప్రజలకు ఉపయోగపడే అంశాలు చెప్పిస్తుంది. అతడు మొదట తాను వాక్యాన్ని ధ్యానం చేసికొని అటుపిమ్మట తాను మననం చేసికొన్న వాక్యాన్ని ఇతరులకు వివరించేలా చేస్తుంది.

తాను మందను నడిపించేపుడు క్రీస్తు ప్రేమా వినయమూ అతనికి ఆదర్శంగా వుంటాయి. కావున అతడు మందపై అధికారం చెలాయింపక దానికి మాదిరిగా వుండగల్గుతాడు -1పేత్రు 5:3. దానికి సేవలు చేయగల్గుతాడు - లూకా 22,26. విశేషంగా, ఇతరులకు బోధించిన పిదప తాను భ్రష్టుడు కాకుండావుండేలా జాగ్రత్తపడ గల్గుతాడు - 1కొ 9:27. ప్రధానయాజకుని అనుంగుతల్లియైన మరియమాత తన కుమారుని సేవకులైన గురువులను విశేషాదరంతో కాపాడుతుంది.

2) కాని వరప్రసాదాలన్నీ గురువుమీద యాంత్రికంగా పనిచేయవు. అతడు వాటితో సహకరించాలి. వాటిని జాగ్రత్తగా వినియోగించుకోవాలి.

గురువులు ప్రధానంగా తమ సేవద్వారానే పవిత్రులు కావాలి. అనగా ప్రజలను పవిత్రపరచడం, వారికి బోధచేయడం, వారిని నడిపించడం అనే త్రివిధ సేవద్వారా వాళ్లు పుణ్యాత్ములు కావాలి. కాని వాళ్లు రేయింబవళ్లు ఏవేవో సేవాకార్యాల్లో మునిగిపోయి వ్యక్తిగతమైన ప్రార్థనం ఆత్మనిగ్రహం మొదలైన వాటిని అశ్రద్ధ చేయకూడదు.

రెండవ వాటికన్ సభ ప్రకారం, గురువులు విశేషంగా వినయవిధేయతలు, బ్రహ్మచర్యం, నిస్సంగత్వం, ఈ లోకపు విలువలపట్ల వివేకం, ఈ ప్రపంచంపట్ల మమకారం లేకుండా వుండడం, దారిద్ర్యం మొదలైన సద్గుణాలు కలిగివుండాలి.

3) గురువు ఆధ్యాత్మిక జీవితం ఏలా వుండాలి? అతడు తన్ను తాను దానం చేసికొనేవాడై యుండాలి. నిరంతరం ఒకవైపు దేవునికీ ఒకవైపు ప్రజలకూ తన్నుతాను అర్పించుకొంటూండాలి.

ఆరాధనపరుడై యుండాలి. క్రీస్తుతో ఐక్యమై పూజబలిని అర్పిస్తుండాలి. ప్రార్థనద్వారా రోజురోజుకి తనలోని స్వార్థాన్ని తొలగించుకొంటూండాలి. తాను బోధించే దైవవాక్కుని తాను ముందుగా మననం చేసికొంటూండాలి.

నిరంతరం ప్రజలదగ్గరికి పంపబడినవాడై యుండాలి. తండ్రినన్ను పంపినట్లే నేను మిమ్ము పంపుతున్నాను అన్న క్రీస్తువాక్యం అతనికి అక్షరాల వర్తిస్తుంది.

తోడి గురువులపట్ల సోదరభావమూ బిషప్పుపట్ల పితృభావమూ కలిగి వుండాలి. అతని మనుగడ తిరుసభతో ముడిపడివుండాలి.

సంగ్రహంగా చెప్పాలంటే, అతని ఆధ్యాత్మిక జీవితం మధ్యవర్తికి చెందిందై వుండాలి. అతడుఎల్లపుడు దేవునికీ నరునికీమధ్య మధ్యవర్తిగా మెలిగేవాడు. కనుక అతనికి గాఢమైన దైవానుభూతి వుండాలి. తన సోదరులైన తోడి ప్రజల కష్టసుఖాల్లో సులువుగా పాలుపంచుకొనే గుణం వుండాలి.

కల్వరిబలియైన పూజబలి నర్పించడం ద్వారా అతడు ప్రధానంగా మధ్యవర్తి ఔతాడు. కనుక ఏ గురువు విలువైన సరే అతడర్పించే పూజబలినిబట్టే కొలవాలి.

## 4. గురువు బాధ్యతలు

“నేను ప్రవితుణ్ణయిన దేవుణ్ణి, నాలాగే మీరూ పవిత్రులుగా వుండండి” అన్న ప్రభువు ఆజ్ఞ ప్రధానంగా గురువుకి వర్తిస్తుంది. అతడు దేవునికి సన్నిహితుడుగా జీవిస్తూ పవిత్రంగా మెలగాలి. ఈ పవిత్రతను సాధించందే గురువు రాజు, ప్రవక్త, కాపరి అనే తన మూడు బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించలేడు. గురువు గురుపట్టం పొందేపుడు బిషప్పుగారు అతని హస్తాలకు క్రిస్మాతైలంతో అభిషేకంచేస్తారు. అప్పటినుండి అతడు

ప్రభువు అభిషిక్తుడుగా చలామణి ఔతాడు. కనుక అతని జీవితంగూడ ఈ యభిషేకానికి తగినట్లుగానే వుండాలి.

గురువు తన స్వార్థం కొరకు తాను జీవించగూడదు. ఇతరుల కొరకు జీవించాలి. అతడు క్రైస్తవ సమాజం కొరకు ఉన్నవాడు. కనుక అతని క్రియలు వ్యక్తిగత లాభానికిగాక క్రైస్తవ సమాజ శ్రేయస్సుకు తోడ్పడేవిగా వుండాలి. ఈ ధ్యేయాన్ని విస్మరించిన గురువు తన ఉన్నత స్థానం నుండి పడిపోయాడనుకోవాలి. లాటిన్ శ్రీసభ గురువు వివాహాన్ని నిషేదిస్తుంది ఎందుకు? వివాహం చెడ్డదనిగాదు. అతడు అవివివాహితుడై వుంటే ఒక్క కుటుంబానికి బదులుగ అనేక కుటుంబాలను పరామర్శిస్తాడు అనే తలంపుతో, అతడు వందలకొలది, వేలకొలది దేవుని బిడ్డలను సాకాలన్న ఉద్దేశంతో. కనుక గురువు ఇతరులకు నేనేపాటి సేవచేస్తున్నానా అని నిరంతరం తన్నుతాను ప్రశ్నించుకొంటూండాలి.

మనదేశంలో అన్ని మతాలవాళ్ళూ క్యాతలిక్ గురువుని గౌరవంతో చూస్తారు. ప్రజలు అతన్ని దేవునికీ నరునికీ మధ్య నిలిచే మధ్యవర్తినిగా గుర్తిస్తారు. అతడు తన ప్రార్థనాబలంతో దేవుని వరాలు తీసికొని రాగలడనీ, అతడు దీవించే దీవెన ఫలించి తీరుతుందనీ నమ్ముతారు. అతడు దేవుణ్ణి అనుభవానికి తెచ్చుకొన్న భక్తుడనీ, దేవుని గ్రంథమైన బైబులును పఠించి దాని భావాన్ని వివరింపగలడనీ ఎంచుతారు. ప్రపంచ వ్యామోహాలను విసర్జించి పరమపవిత్రంగా జీవించే ఋషి అని భావిస్తారు. కోపతాపాలను రాగద్వేషాలను విడనాడి సేవ, దయ, సానుభూతి మొదలైన మార్దవ గుణాలతో లోకకళ్యాణం కొరకు జీవించే పుణ్యపురుషుడని ఎంచుతారు. గురువు ఈ వున్నతాశయాలకు అనుగుణంగా జీవించాలి. అంతేగాని వెర్రిమొర్రిపనులకు పాల్పడి ప్రజలకు తనమీదవున్న సదభిప్రాయం వమ్మయిపోయేలా చేసికోగూడదు. ఐనా నేడు కొందరు గురువులు తమ అంతస్తుకు తగినట్లుగా జీవించలేక తలవంపులు తెచ్చుకొంటున్నారు. ఇది సజ్జనులందరికీ మనస్తాపం కలిగిస్తుంది.

# 3. తిరుసభ

## మనవిమాట

క్రీస్తు స్థాపించిన దైవరాజ్యాన్నే యిప్పుడు తిరుసభ అంటున్నాం. ఉత్థానక్రీస్తు నేడు దానిలో ప్రత్యక్షమైయున్నాడు. అది యెల్లరికీ రక్షణ సాధనం. దైవశాస్త్ర రీత్యా తిరుసభకున్న ప్రాముఖ్యం అంతాయింతా కాదు.

ఈ గ్రంథంలో తిరుసభను గూర్చిన ముఖ్యాంశాలను సంగ్రహంగాను స్పష్టంగాను వివరించాం. ఈ గ్రంథపఠనం ద్వారా గృహస్థులు తిరుసభలో తమకున్న ప్రాముఖ్యాన్ని అర్థంచేసికొని ప్రబోధం చెందవచ్చు. ఇది రెండవ ముద్రణం.

## పారిభాషిక పదాలు

| | | |
|---|---|---|
| Apostles | = | ప్రేషితులు |
| Apocalyptic | = | దార్శనిక |
| College of Bishops | = | పీఠాధిపతుల బృందం, పరిషత్తు |
| Corporate personality | = | సామూహిక వ్యక్తి |
| Counter Reformation | = | ప్రతిసంస్కరణవాదం |
| Definition | = | ప్రకటనం |
| Infallibility | = | పొరపడని వరం |
| Laity | = | గృహస్థులు |
| Liturgy | = | దైవార్చనం, ఆరాధనం |
| Magisterium | = | బోధన సంఘము |
| Primacy | = | ప్రధానత్వం |
| Reformation | = | సంస్కరణవాదం |
| Remnant | = | శేషజనం |
| Revelation | = | శ్రుతి |
| Sacrament of Salvation | = | రక్షణసాధనం, వరప్రసాద సాధనం |
| Successor, Succession | = | వారసుడు, వారసం |
| Synod of Bishops | = | పీఠాధిపతుల సమాఖ్య |
| Zealots | = | ఆసక్తిపరులు |

## విషయసూచిక



# 1. దైవరాజ్యం

సువిశేషాల్లో "తిరుసభ" అనేమాట చాల అరుదుగా కన్పిస్తుంది. ఈ గ్రంథాల్లో తరచుగా కన్పించే మాట "దైవరాజ్యం". "కాలం సమీపించింది. దైవరాజ్యం చేరువలో వుంది" అనే పలుకులతోనే క్రీస్తు తన బోధ ప్రారంభించాడు- మార్కు 1,15. క్రీస్తు ప్రధానంగా బోధించింది ఈ దైవరాజ్యాన్ని గూర్చే. మరి యిప్పుడు లోకంలో వ్యాప్తిలో వున్న తిరుసభ ఎక్కడి నుండి వచ్చింది? అది క్రీస్తు స్వయంగా స్థాపించిందే. దైవరాజ్యాన్ని వ్యాప్తిలోకి తీసుకొని రావడానికే క్రీస్తు తిరుసభను స్థాపించాడు. అది దైవరాజ్యాన్ని ప్రత్యక్షం చేయడానికే వుంది. కనుక తిరుసభను అర్థం జేసికోవాలంటే మొదట దైవరాజ్యాన్ని బాగా అర్థం జేసికోవాలి. ఈ యధ్యాయంలో దైవరాజ్యాన్ని గూర్చి మూడంశాలు పరిశీలిద్దాం.

## 1. పూర్వవేదంలో దైవరాజ్యం

మనం మొదట గమనింపవలసిన అంశం ఇది. దైవ రాజ్యమనేది ఓ స్థలంకాదు, ఓ శక్తి. దేవుడు తన శక్తితో ప్రజలమీద పరిపాలనం చేస్తాడు. కనుక అసలు దైవరాజ్యం అనడం కంటె "దేవుని పరిపాలనం"అనడం మెరుగు. పూర్వవేదంలో దైవరాజ్యం అనే

**భావం** క్రమేణ పెంపుజెందుతూ వచ్చింది. ఇక్కడ దైవరాజ్యాన్ని గూర్చి ఎన్మిదంశాలు గుర్తించాలి.

1. హీబ్రూ బైబుల్లో దైవరాజ్యం అనేమాట అంత ప్రచురంగా కన్పించదు. కాని "ప్రభువు రాజు" "ప్రభువు పరిపాలిస్తాడు" అనే మాటలు విరివిగా కన్పిస్తాయి. యూదుల దృష్టిలో దేవుడు ప్రధానంగా రాజు.

2. యూదులకు చుట్టుపట్ల వున్న కనానీయులు మొదలైన జాతులు కూడ వాళ్ళ దేవుళ్ళను రాజులనుగానే భావించారు. కాని ఈ యన్యజాతుల దేవుళ్లు ఏదో వొక దేశానికి రాజులు. ఐతే యిస్రాయేలీయులు కొల్చిన యావే ప్రభువు ఓ దేశానికి కాక, ఓ ప్రజకు రాజు.

3. నిర్గమన కాలంలో యావే యిస్రాయేలీయులకు కాపరిగాను నాయకుడుగాను వ్యవహరించడం ద్వారా తన రాజత్వాన్ని చాటుకొన్నాడు. ప్రభువే నాయకుడై ఆ ప్రజను ఎడారిగుండ నడిపించాడు. అతని శక్తి అనంతమైంది. అతనికి త్రోవా గమ్యమూ రెండూ తెలుసు. కనుక యిస్రాయేలు జనులు అతన్ని నమ్మి అతనివెంట పయనించారు.

4. యిస్రాయేలీయులు కనాను మండలంలో ప్రవేశించాక షుమారు రెండువందల యేండ్లు న్యాయాధిపతులు వారిని పరిపాలించారు. ఈ నాయకులు రాజులుగా వ్యవహరింపలేదు. ప్రభువే యిస్రాయేలుకు రాజు. అతని పేరు మీదిగానే పండ్రెండు తెగల యిస్రాయేలీయులు ఒక్కప్రజగా ఐక్యమయ్యారు అని న్యాయాధిపతులు భావించారు. ప్రజలు గిద్యోను అనే న్యాయాధిపతిని రాజును చేయబోగా, అతడు నిరాకరించి ప్రభువే మనకు రాజు అని చెప్పాడు - న్యాయాధి 8,23. చివరి న్యాయాధిపతియైన సమూవేలు కాలంలో ప్రజలు ఇతర జాతులకులాగే తమకుకూడ ఓ రాజు కావాలని కోరారు. కాని సమూవేలు ప్రభువే మీకు రాజు కనుక మరోరాజు అక్కరలేదు అన్నాడు - 1సమూ 8,4-6.

5. రాజుల కాలంలోగూడ ప్రభువే ప్రజలకు నిజమైన రాజు అనే భావం వుండేది. సౌలు దావీదు మొదలైన రాజులంతా కేవలం యావే ప్రతినిధులు అనే భావం వుండేది. పాలస్తీనా దేశానికి పొరుగు దేశాలైన ఈజిప్టు బాబిలోనియాల్లో జనులు రాజులను దేవుళ్ళనుగా ఎంచారు. రాజులు దేవుని అవతారాలనుకొన్నారు. కాని యూదులు మాత్రం తమ రాజులను ఎప్పుడూ నరమాత్రులుగానే పరిగణించారు. వాళ్లకు నిజమైన రాజు యావే వొక్కడే. చాల కీర్తనలు యావేను రాజునుగా వర్ణిస్తాయి.

6. యావే ఒక్క యిస్రాయేలీయులకు మాత్రమే కాక లోకంలోని జాతులన్నిటికి రాజు - యిర్మీ 10,7.

7. యావే ఒక్క నరజాతికి మాత్రమే కాక ఈ విశ్వానికంతటికీ రాజు. సృష్టికర్తయైన ప్రభువు జీవకోటికంతటికీ పాలకుడు. ఈ విశ్వమంతా అతని సాన్నిధ్యంతో నిండివుంది - యెష 6,3.

8. ప్రవక్తల కాలంలో యావే ప్రభువును గూర్చి రెండు భావాలు ప్రచారంలోకి వచ్చాయి. మొదటిది, అతని రాజ్యం అంత్యదినాల్లో బాగా వ్యాప్తిలోకి వస్తుంది. రెండవది, అతడు ప్రజల హృదయాల్లో పరిపాలనం జేస్తాడు.

క్రీస్తుపూర్వం 587లో బాబిలోనియా రాజులు యూదుల రాజ్యాన్ని నాశంజేసారు. ఇక యూదులకు ఇహలోక రాజ్యం లేదు. కనుక ప్రవక్తలు అంత్యదినాల్లో యావే యిస్రాయేలును రాజుగా ఏలుతాడు అని బోధించారు. ఇంకా, యిస్రాయేలు రాజులూ ప్రజలూ కూడ నిరంతరం సీనాయి నిబంధనాన్ని మీరుతూ వచ్చారు. కనుక ప్రవక్తలు అంత్యదినాల్లో ప్రభువు యిస్రాయేలీయుల హృదయాలను మారుస్తాడని బోధించారు. కనుకనే యెహెజ్కేలు ప్రభువు జనులలోని రాతిగుండెను తీసివేసి దానికి బదులుగా మాంసపు గుండెను దయచేస్తాడని చెప్పాడు. అనగా అతడు అవిధేయులైన యిస్రాయేలీయులను విధేయులనుగా మారుస్తాడని భావం. వాళ్ల హృదయాల్లో తాను రాజ్యం చేస్తాడని అర్థం - 36, 26-27.

ప్రవక్తలు భవిష్యత్తులో రానున్న దైవరాజ్యానికి చాల వుపమానాలు వాడారు. ఆ రాజ్యం నూత్నసృష్టి, నూత్న నిర్గమనం. ప్రభువు గొర్రెల కాపరికాగా ప్రజలు అతడు మేపే మంద ఔతారు - యెష 39,11. యావే తన ప్రతినిధియైన మెస్సీయాను పంపి అంత్యకాలంలో దైవరాజ్యాన్ని స్థాపింపజేస్తాడు.

ఇంకా ప్రభువు అంత్యకాలంలో సియోను కొండమీద సింహాసనాన్ని స్థాపించుకొని లోకంలోని జాతులనన్నిటినీ ఏలుతాడు. ఈ కొండమీది నుండే అతడు ధర్మశాస్త్రాన్ని బోధిస్తాడు. దాన్ని నేర్చుకోవడానికి లోకంలోని సకలజాతి ప్రజలు యాత్రికులుగా సియోనుకి వస్తారు -

"ఆ ప్రజలు ఈలా పల్కుతారు
మనం ప్రభువు పర్వతానికి వెళ్దాం
యాకోబు దేవుని దేవళానికి పోదాం
అతడు తన మార్గాలను మనకు బోధిస్తాడు
మన మతని త్రోవలో నడుద్దాం
ధర్మశాస్త్రం సియోనునుండి వస్తుంది
ప్రభువు వాక్కు యెరూషలేమునుండి బయల్దేరుతుంది" - యెష 2,2-3.

ఆ కాలంలో ఒక్క నరులకు మాత్రమే కాక ప్రాణికోటికంతటికీ, సృష్టికంతటికీ దేవునితో మళ్ళా రాజీకుదురుతుంది. పూర్వం ఏదెనులో వున్న శాంతి సమాధానాలు మళ్లా నెలకొంటాయి. కనుక ఈ యంత్యకాలం దేవుడు చేసే గొప్పవిందులాంటిది - యెష 25,6-8.

యిస్రాయేలీయులు దేవుని నిబంధనను మీరడంచే అశాంతి యేర్పడింది. అంత్యదినాల్లో దేవునికీ యిస్రాయేలీయులకీ మధ్య మళ్లా శాంతి నెలకొంటుంది. ఆ కాలంలోని ప్రజలంతా తమతోతాము, ప్రకృతితోతాము, శాంతియుతంగా జీవిస్తారు. ప్రభువు కరుణతో ప్రజల పాపాలను మన్నిస్తాడు. కనుక శాశ్వత శాంతి నెలకొంటుంది. అటుతర్వాత ప్రజలు మళ్ళా దేవుని నిబంధనను మీరరు. ఇవన్నీ అంత్యకాలంలో జరుగుతాయి. ఆ కాలం మెస్సీయా వచ్చేకాలం, దైవరాజ్యం పెంపుజెందేకాలం.

## 2. పూర్వవేదాంత కాలంలో దైవరాజ్యం

పైన మనం చూచినవి పూర్వవేద భావాలు. కాని క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దం తర్వాత దైవరాజ్యాన్ని గూర్చిన యూదుల భావాలు క్రమేణ మారాయి. క్రీస్తు బోధించినపుడు ఈ మార్పు చెందిన భావాలే యూదుల్లో ఎక్కువగా ప్రచారంలో వుండేవి. కనుక మనం వీటినిగూర్చి కూడ తెలిసికోవాలి. మనం ఇక్కడచూచే భావాలు క్రీ.పూ.200 నుండి క్రీ.శ.150వరకు ప్రచారంలోవున్నవి. ఇవి బైబులు భావాలు కావు, ఆనాటి యూదుల భావాలు మాత్రమే. ఇక్కడ మూడంశాలు పరిశీలిద్దాం.

### 1) రాజకీయవాదుల దైవరాజ్యం

యూదులు, యావే తన ప్రతినిధియైన మెస్సియాను రాజుగా పంపుతాడు అనుకొన్నారు. అతనికి "దావీదు కుమారుడు" అని బిరుదు. అతడు అన్యజాతుల పాలనంనుండి యిస్రాయేలు రాజ్యాన్ని ఉద్ధరిస్తాడు. యూదుల దారిద్ర్యాన్ని కూడ తొలగిస్తాడు. అతని కాలంలో యూదులు దేవుణ్ణి పూర్ణహృదయంతో సేవిస్తారు. ధర్మశాస్త్రాన్ని పరిపూర్ణంగా పాటిస్తారు. జెకర్యా గీతం ఈ భావాన్నే సూచిస్తుంది. "అతడు మనలను ద్వేషించే శత్రువులనుండి మనలను కాపాడతాడు. జీవితకాలమంతా మనం నీతితోను పవిత్రతతోను దేవుణ్ణి సేవిస్తాం - లూకా 1,71-75. యూదుల్లో "ఆసక్తి వరులు" అనే ఉగ్రవాదుల వర్గంకూడ వుండేది. పాలస్తీనా దేశం రాజకీయ స్వాతంత్ర్యం పొందాలని వీళ్ళ ప్రబల వాంఛ. ఆయుధాలతో శత్రువుల నెదుర్కోవాలని వీళ్ళ సంకల్పం. ఈ ధర్మయుద్ధంలో యావే వీళ్ళ తరపున పోరాడతాడని వీళ్ళ నమ్మకం. కనుక ఆ రోజుల్లో యూదులు దైవరాజ్యమనే భావాన్ని రాజకీయాలతో ముడిపెట్టారు. మెస్సియా

విజయశీలుడుగాను మహిమాన్వితుడును గాను వచ్చి యావే తరపున శత్రువులతో పోరాడి విజయాన్ని సాధించి దైవరాజ్యాన్ని స్థాపిస్తాడు అనుకొన్నారు. ఆరోజుల్లో అన్యజాతులన్నీ యిస్రాయేలీయులకు లొంగిపోతాయనీ లోకంలో న్యాయయుక్తమైన పరిపాలనం నెలకొంటుందనీ ఎంచారు. క్రీస్తు వచ్చినపుడు అతడు ఈ రాజకీయ భావాలను అంగీకరించలేదు. ఐనా నూత్నవేదంలో ఈ రాజకీయ భావాలు అక్కడక్కడా తగులుతాయి. జెబెదయి కుమారులిద్దరు దైవరాజ్యంలో ప్రముఖ పదవులు పొందాలని కోరారు – మార్కు 10,37. క్రీస్తు యెరూషలేము ప్రవేశించేపుడు ప్రజలు దావీదు రాజ్యం రావాలని అరచారు – 11,10. ఎమ్మావు శిష్యులు క్రీస్తు యిస్రాయేలు రాజ్యాన్ని ఉద్ధరిస్తాడు అనుకొన్నారు – లూకా 24,21. ప్రజలు యేసుని రాజుని చేయాలని భావించారు – యోహా 6,15. ప్రభూ! నీవు యిస్రాయేలు రాజ్యాన్ని ఉద్ధరించవా అని శిష్యులు ఉత్థాన క్రీస్తుని అడిగారు – అ.చ. 1,16.

ఈ యుగంలో దైవరాజ్యాన్ని గూర్చిన యూదుల భావాలు సంగ్రహంగా ఇవి. రాజైన మెస్సియా యిస్రాయేలు రాజ్యాన్ని పునరుద్ధరిస్తాడు. అతడు యిస్రాయేలు శత్రువులతో ఘోరయుద్ధం జరిపి వారిని ఓడించిన పిదపనే గాని ఈ రాజ్యస్థాపనం జరగదు. లోకంలోని జాతులన్నీ యిస్రాయేలు రాజ్యంలో చేరి దానికి లొంగి వుంటాయి. ఈ రాజ్యంలో శాంతీ సిరిసంపదలూ దైవభక్తీ సమృద్ధిగా నెలకొంటాయి.

## 2) రబ్బయిలు కోరుకొన్న దైవరాజ్యం

యూదుల బోధకులైన రబ్బయిలు ఈలోకంలో ప్రజలు యావేకు సాక్షులుగా వుండాలని కోరారు. యావేను ఆరాధించడం ద్వారాను, ధర్మశాస్త్రాన్ని పాటించడం ద్వారాను వాళ్ళు అతనికి సాక్షులుగా వుంటారు. ప్రజలు తమ పాపాలకు పశ్చత్తాపపడి ధర్మశాస్త్రాన్ని చక్కగా పాటిస్తే పరాయిపాలనం అంతరించి దైవరాజ్యం త్వరలోనే వస్తుందని రబ్బయిలు బోధించారు. కనుక వీళ్ళ భావాలప్రకారం, ప్రజల విశుద్ధవర్తనమే దైవరాజ్యాన్ని తెచ్చిపెడుతుంది. ఈసందర్భంలో లెవి అనేరబ్బయి ఈలా నుడివాడు. "యిస్రాయేలీయులు ఒక్కరోజు తమ పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొంటేచాలు వాళ్ళకు దాస్యవిముక్తి శీఘ్రమే లభిస్తుంది. దావీదుకుమారుడు కూడ వెంటనే వస్తాడు." రబ్బయిలు, అంత్యకాలంలో మెస్సియా వచ్చి దైవరాజ్యాన్ని స్థాపిస్తాడని చెప్పారు. దైవచిత్తానికి సమ్మతమైనప్పుడుకాని దైవరాజ్యంరాదు అనికూడ బోధించారు.

## 3) దార్శనిక వాదుల దైవరాజ్యం

పైన మనం చూచిన రాజకీయవాదులూ రబ్బయిలూ దైవరాజ్యం ఈ భౌతిక లోకంలోనే, ఈయుగంలోనే వస్తుందనుకొన్నారు. కాని దార్శనిక వాదులు దైవరాజ్యం

ఈ భౌతిక లోకంలోగాక పూర్తిగా మార్పుచెందిన మరోలోకంలో వస్తుందని నమ్మారు. మెస్సీయా ఈ యుగంలోగాక మరోయుగంలో వస్తాడని నమ్మారు. వీళ్ళ భావాల ప్రకారం సూర్యచంద్రాది గ్రహాలు నశిస్తాయి. ఈలోకం అంతరిస్తుంది. నూత్నదివీ నూత్నభువీ ఏర్పడతాయి. ఆ యుగం మన చరిత్రకు సంబంధించింది కానేకాదు. అది క్రొత్తయుగం. క్రొత్త సృష్టి. ఆ యుగంలోగాని దైవరాజ్యం నెలకొనదు. ఆ యుగంలో దేవునికీ దుష్టశక్తులకీ మధ్య ఘోరయుద్ధం జరుగుతుంది. ఆ దుష్టశక్తులన్నీ వోడిపోతాయి. ఈ ప్రస్తుత భౌతికలోకం అంతరిస్తుంది. న్యాయతీర్పు జరుగుతుంది. మృతులు ఉత్థానమౌతారు. అప్పుడేగాని దైవరాజ్యంరాదు. యెషయా 24-27అధ్యాయాలు, దానియేలు 7వ అధ్యాయం ఈ భావాలను పేర్కొంటాయి.

క్రీస్తునాడు యూదుల్లో ఈ మూడు వర్గాలవారి భావాలు కలగాపులగంగా ప్రచారంలో వుండేవి. అప్పుడు అన్యజాతివాళ్ళయిన రోమీయులు పాలస్తీనా దేశాన్ని పరిపాలిస్తుండేవాళ్లు. కనుక ఆనాటి యూదులందరూ దాస్యవిముక్తిని కోరుకొన్నారు. మెస్సీయా శీఘ్రంవే విచ్చేసి రోమీయులను జయించి యూదుల రాజ్యాన్ని స్థాపిస్తాడనుకొన్నారు. అతని ఆగమనం కొరకు వేయి కండ్లతో ఎదురుచూస్తున్నారు. అంతటా అశాంతి నెలకొనివుంది. అలాంటి ఉద్రిక్త పరిస్థితుల్లో క్రీస్తువచ్చి దైవరాజ్యాన్నిగూర్చి బోధించడం మొదలెట్టాడు. ఈ దైవరాజ్యం కొరకే యూదులు గంపెడాశతో ఎదురుచూస్తున్నారు. కనుక అతని బోధలను వాళ్ళు శ్రద్ధతో విన్నారు.

## 3. క్రీస్తు బోధించిన దైవరాజ్యం

క్రీస్తు బోధల్లోని ముఖ్యాంశం దైవరాజ్యమే. "కాలం పరిపూర్ణమైంది. దైవరాజ్యం సమీపించింది. మీ పాపాలకు పరివర్తనంచెంది సువార్తను విశ్వసించండి" అనే వాక్యాలతోనే అతడు తన బోధను ప్రారంభించాడు - మార్కు 1,15. అతని వుపదేశాలన్నీ ఏదో రూపంలో దైవరాజ్యానికి సంబంధించినవే. అంత్యకాలంలో దైవరాజ్యాన్ని గూర్చి బోధించడానికే తండ్రి అతన్ని పంపాడు.

**క్రీస్తునాడు అంత్యకాలంలో దైవరాజ్యం వస్తుందని యూదులంతా** నమ్ముతుండేవాళ్ళు. దానికోసం గంపెడాశతో ఎదురుచూస్తుండేవాళ్లు. ఆ దైవరాజ్యం రానేవచ్చిందని క్రీస్తు బోధించడం మొదలెట్టాడు. కనుక బెల్లానికి ఈగల్లాగ జనమంతా అతనిచుట్టు మూగి అతని బోధలు శ్రద్ధగా విన్నారు.

కాని అంత్యకాలంలో రాబోయే దైవరాజ్యాన్ని గూర్చి ఆనాటి ప్రజలు తలంచిన తీరువేరు, క్రీస్తు తలంచిన తీరువేరు. ప్రజలు రాజకీయమైన దైవరాజ్యం కొరకు

ఎదురుచూచారు. అనగా వాళ్లు కోరింది ప్రధానంగా రోమీయుల పాలనం నుండి విముక్తి. కాని క్రీస్తు కోరింది తండ్రి దయచేసే రక్షణం. అనగా ప్రజలందరికి పాప పరిహారం, శాంతి సంతోషాలు. నరులు తమ స్వీయ శక్తితోగాని, మోషే ధర్మశాస్త్రాన్ని పాటించడం వలనగాని ఈ రక్షణాన్ని సంపాదించలేరు. తండ్రి మాత్రమే దాన్ని దయచేయగలడు.

దైవరాజ్యాన్నిగూర్చి క్రీస్తు చేసిన బోధల్లో ఐదు ముఖ్యాంశాలున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

## 1. దైవరాజ్యం సమీపించింది గనుక నరులు పరివర్తనం చెందాలి

తరతరాల నుండి యూదులు దైవరాజ్యం కొరకూ మెస్సియా రాకడ కొరకూ ఎదురుచూస్తూ వచ్చారు. ఆ పుణ్యకాలం రానే వచ్చింది - లూకా 10,23-24. ఈ రాజ్యంలో చేరాలంటే నరులకు రెండు గుణాలు వుండాలి. అవి పరివర్తనమూ, సువార్తను విశ్వసించడమూ - మార్కు 1,15.

ఈ పరివర్తనం హృదయగతమైంది. అనగా నరుల మనస్సులు పూర్తిగా మారాలి. వాళ్లు తమ పాప కార్యాలను వదలుకొని దేవుని వద్దకు తిరిగిరావాలి.

ఇంకా, వాళ్లు క్రీస్తు బోధించే సువార్తను పూర్తిగా విశ్వసించాలి. ఇక్కడ పరివర్తనమూ విశ్వాసమూ కలసిపోతాయి. పరివర్తనం చెందినవాడు మాత్రమే క్రీస్తు రాకడతో దైవరాజ్యం ప్రారంభమైందని విశ్వసిస్తాడు. అలా విశ్వసించేవాడు తప్పకుండ పరివర్తనం చెందుతాడు. అతడు తన పాపాలను ఒప్పుకొని దేవుని నుండి రక్షణాన్ని కోరతాడు. కనుక క్రీస్తు నరులకు ఈ రెండు గుణాలు అవసరమని చెప్పాడు. ఆనాటి పరిసయులకు పరివర్తనమూ లేదు విశ్వాసమూ లేదు. కనుకనే వాళ్ళు క్రీస్తు కొనివచ్చిన దైవరాజ్యాన్ని అంగీకరించలేదు. కాని పాపులూ సుంకరులూ మాత్రం క్రీస్తు బోధలను విశ్వసించి పశ్చాత్తాపపడి దైవరాజ్యంలో చేరారు.

## 2. రక్షణకాలం రానే వచ్చింది

దైవరాజ్యం రానే వచ్చింది. అది క్రీస్తు ద్వారా వచ్చింది. అసలు అతడే దైవరాజ్యం. తండ్రి ఈ క్రీస్తుద్వారా ప్రజలను రక్షిస్తాడు. కనుక క్రీస్తు రక్షణదాత. అతడు కొనివచ్చే రక్షణంతో నూత్నయుగం ప్రారంభమౌతుంది. కనుకనే అతడు నూత్నయుగంలో మనుష్యకుమారుడు మహిమాన్వితమైన సింహాసనంమీద ఆసీనుడౌతాడని చెప్పాడు-మత్త 19,28.

క్రీస్తు అద్భుతాలు ఈ నూత్నయుగం, ఈ రక్షణకాలం ఆసన్నమైందని నిరూపిస్తాయి. మెస్సియా వచ్చినపుడు అద్భుతాలు జరుగుతాయని ప్రవక్తలు పూర్వమే

చెప్పారు - యెష 35,5-6. రాబోయేవాడివి నీవేనా అని స్నాపక యోహాను శిష్యులు క్రీస్తుని అడిగారు. అనగా నూత్నయుగాన్ని ప్రారంభించేవాడివి నీవేనా అని వాళ్ళ భావం - మత్త 11,3. క్రీస్తు వాళ్లకు తన అద్భుతాలను గూర్చి చెప్పి రక్షణాన్ని ప్రసాదించే నూత్నయుగం వచ్చిందని తెలియజేసాడు.

క్రీస్తుతో నూత్నయుగం ప్రారంభమైందనడానికి కానావూరి వివాహం చక్కని తార్కాణం. ప్రభువు ఇక్కడ నీటిని ద్రాక్షరసంగా మార్చాడు. యూదుల భావాల ప్రకారం ద్రాక్షరసం నూత్న శకాన్ని సూచిస్తుంది. ఉదాహరణకు జల ప్రళయానంతరం నోవా ద్రాక్షలు నాటి క్రొత్త శకాన్ని ప్రారంభించాడు - ఆది 9,20. కనుక కానావూరి అద్భుతంలోని ద్రాక్షరసం క్రొత్త శకానికీ, క్రొత్త జీవితానికీ చిహ్నంగా వుంటుంది. ఇంకా క్రీస్తు కొత్త ద్రాక్షరసపు తిత్తులనూ క్రొత్త బట్టలనూ పేర్కొన్నాడు - మత్త 9,16-17. ఇవికూడ రక్షణంతో కూడిన నూత్నయుగానికి చిహ్నాలే.

## 3. దైవ రాజ్యానికి ముఖ్యమైన గుర్తు దేవుని కరుణే

దైవ రాజ్యానికి ముఖ్యమైన గుర్తు దేవుని కరుణ. అతడు మెస్సియా ద్వారా ప్రజలమీద దయజూపి వాళ్ల పాపాలను మన్నిస్తాడు. పరిసయులు దేవుడు పాపాత్ములను శిక్షిస్తాడని బోధించారు. దీనికి భిన్నంగా క్రీస్తు దేవుడు పాపులను మన్నించి వారికి రక్షణాన్ని దయచేస్తాడని ప్రకటించాడు. అతడు నేను పిలువవచ్చింది పాపులను గాని పుణ్యాత్ములను కాదన్నాడు. వైద్యుడు రోగులకొరకు అన్నాడు - మత్త 9,12-13. ఆ ప్రభువు మత్తయిని సుంకాల శాలనుండి పిలవడం, జక్కయ్య తప్పులను వ్యభిచారిణి పాపాలను మన్నించడం మొదలైన కరుణ కార్యాలన్నీ అతడు కొనివచ్చిన పాపపరిహారానికి చిహ్నాలే. క్రీస్తు చెప్పిన గొప్ప సామెతలు తప్పిపోయిన కుమారుడు తప్పిపోయిన గొర్రె తప్పిపోయిన నాణెం అనేవి - లూకా 15. ఇవికూడ దేవుడు పాపులపట్ల కరుణ జూపుతాడు అనడానికి నిదర్శనాలే. దేవుడే పాపులను వెదుకుకొంటూ వచ్చి వారిని రక్షిస్తాడని ఈ కథల భావం. ఈ విధంగా అంత్య కాలంలో దేవుడు పాపులపట్ల అపారమైన కరుణ జూపుతాడని క్రీస్తు తెలియజేసాడు.

## 4. దైవరాజ్యం తప్పక వ్యాప్తిజెందుతుంది

దైవరాజ్యవ్యాప్తి నరుల శక్తిపైగాక దేవుని శక్తిపై ఆధారపడి వుంటుంది. దేవుని బలానికి అడ్డులేదుకనుక ఆ రాజ్యం తప్పక వ్యాప్తి జెందుతుంది. కనుకనే క్రీస్తు "నీ రాజ్యం వచ్చునుగాక. నీచిత్తం పరలోక భూలోకాల్లోను నెరవేరును గాక" అని మనం

తండ్రికి ప్రార్థన చేయాలన్నాడు - మత్త 6,10.6. అతడు బోధించిన సామెతలుకూడ దైవరాజ్యం తప్పక వ్యాప్తి చెందుతుందనే చెప్తాయి. ఆవగింజ చిన్నది. దానినుండి పెద్దచెట్టు పెరుగుతుంది. పులిసినపిండి పొంగి ఉబ్బుతుంది. రైతు చల్లే విత్తనాలు నూరంతలుగా ఫలిస్తాయి - మత్త 13. సేద్యగాడు విత్తనాలు చల్లగా క్రమేణ పైరు ఎదిగి పంట పండుతుంది - మార్కు 8,26-9. ఇవన్నీ దైవరాజ్యవ్యాప్తిని సూచించేవే. దైవకృపవల్లనే దైవరాజ్యం వ్యాప్తిచెంది, విజయాన్ని సాధిస్తుంది.

## 5. రక్షణ వార్తవిని నరులు సంతోషించాలి

నిధిని కనుగొన్నవాడూ, విలువగల రత్నాన్ని సంపాదించినవాడూ సంతోషించారు. ఈ నిధీ రత్నమూ దైవరాజ్యాన్ని సూచిస్తాయి. వాటిని సంపాదించినవాళ్ళు సంతసిస్తారు - మత్త 13,44-46. క్రీస్తుకి త్రోవను సిద్ధంజేసిన స్నాపక యోహాను తల్లి కడుపులో వున్నపుడే మెస్సియా రాకడను గాంచి ఆనందంతో ఎగిరి గంతేసాడు - లూకా 1,44. అటుతర్వాత అతడు పెండ్లికుమారుని స్వరాన్నివిని సంతోషించాడు - యోహా 3,29. అనగా యోహాను క్రీస్తునీ క్రీస్తురాజ్యాన్నీ చూచి ఆనందించాడు. దైవరాజ్యం నూత్న శకాన్ని కొనివస్తుంది. దేవుని కరుణనీ పాపపరిహారాన్నీ తీసికొనివస్తుంది. దైవరాజ్యమంటే దైవపరిపాలనం ప్రారంభం కావడం. కనుక ఆ రాజ్యంలో చేరేవాళ్ళంతా సంతోషిస్తారు.

పైన దైవరాజ్యాన్ని గూర్చిన పూర్వవేదబోధలూ, పూర్వవేదాంత కాలంలోని యూదుల భావాలూ, క్రీస్తు బోధలు కూడ పరిశీలించాం. కడన ఒక్కప్రశ్న. ఈ దైవరాజ్యం ఎప్పుడు వస్తుంది? కొందరు ఆధునిక వేదపండితులు అది లోకాంతంలోగాని రాదన్నారు. మరికొందరు అది పూర్తిగా రానేవచ్చింది అన్నారు. కాని ఈ రెండు భావాలు సరైనవిగావు.

పై ప్రశ్నకు తృప్తికరమైన జవాబు ఇది. దైవరాజ్యం క్రీస్తుతోనే పాక్షికంగా వచ్చింది. లోకాంతంలో పరిపూర్ణంగా వస్తుంది. తిరుసభ ఈ మధ్యకాలంలోవుంది. కనుక ఇప్పుడు మనం ఇదివరకే కొంతవరకు వచ్చిన, లోకాంతంలో పరిపూర్ణంగా రానున్న దైవరాజ్యాన్ని చూస్తున్నాం. ఆ వచ్చిన దానికీ రానున్న దానికీ గూడ క్రీస్తేపునాది. అతడే దైవరాజ్యం.

క్రీస్తు మరణోత్థానాలతోనే దైవరాజ్య స్థాపనం జరిగింది. అతని బోధలూ అద్భుతాలూ అతడు దయచేసిన పాపపరిహారమూ దాని స్థాపనాన్ని తెలియజేస్తాయి. కాని మానుష క్రీస్తులాగే దైవరాజ్యంకూడ ఈ లోకంలో గుప్తంగా, దైన్యంగా వుంటుంది. ప్రజలు దాన్ని అట్టేగుర్తించరు. ఉత్థానానంతరం క్రీస్తుకి గుర్తింపూ మహిమా వచ్చినట్లే లోకాంతంలోగాని దైవరాజ్యానికి మహిమరాదు. అప్పుడుగాని అది పరిపూర్ణ విజయాన్ని సాధించదు.

క్రీస్తుని నమ్మేవాళ్ళంతా ఇప్పుడే దైవరాజ్యంలో ప్రవేశిస్తారు. లోకాంతంలో ఆరాజ్యంలో పరిపూర్ణంగా సుఖిస్తారు. ఈలోక జీవితంలో శోధనలూ పాపమూ అడ్డువస్తుంటాయి. కనుక ఎవరూ ఇక్కడ పరిపూర్ణంగా దైవరాజ్యసభ్యులు కాలేరు. పరిపూర్ణత అనేది పరలోకంలోగాని సిద్ధించదు.

### ప్రార్థనా భావాలు

1. ఆదికాండం 27లో యాకోబు యేసావులకథ వస్తుంది. అక్కడ పెద్దకొడుకైన యేసావుకి రావలసిన తండ్రి దీవెనను చిన్నకొడుకైన యాకోబు దక్కించుకొన్నాడు. యూదసమాజం ఏసావుకీ, తిరుసభ యాకోబుకీ చిహ్నంగా వుంటాయి. యూదసమాజం దేవునికి ప్రథమ పుత్రుని లాంటిది. ఐనా క్రీస్తుని నిరాకరించడం వల్ల ఆ సమాజం తన దీవెనను పోగొట్టుకొంది. తిరుసభ ఆ దీవెనను సంపాదించుకొంది.

2. దైవరాజ్యమే తిరుసభ. కాని కొందరు తిరుసభలో చేరకుండానే దేవుని చేరుకోవచ్చునంటారు. మాకు క్రీస్తు చాలు. తిరుసభ అక్కరలేదు అంటారు. కాని ఇది పొరపాటు. మూడవ శతాబ్దంలో జీవించిన సిప్రియన్ భక్తుడు "తిరుసభను తల్లిగా స్వీకరించనివాడు దేవుణ్ణి తండ్రిగా స్వీకరించలేడు" అని వ్రాసాడు. నరులు తల్లిపట్ల చూపే ప్రేమాభిమానాలను మనం తిరుసభపట్ల చూపాలి.

## 2. తిరుసభ స్థాపనం

పూర్వాధ్యాయంలో దైవరాజ్యమంటే యేమిటో చూచాం. క్రీస్తు దైవరాజ్యాన్ని స్థాపించడానికే వచ్చాడు. ఈ దైవరాజ్య స్థాపనమే తిరుసభ స్థాపనకు దారితీసింది. క్రీస్తు కోరిక ప్రకారమే తిరుసభ పుట్టింది. అంతేగాని అతడు అనుకోని విధంగా అది ఆవిర్భవించలేదు. కాని అతడు తన జీవితకాలంలో, అనగా తన మరణోత్థానాలకు ముందే, తానే స్వయంగా తిరుసభను స్థాపించలేదు. అతని ఉత్థానానంతరం ఆత్మ దిగివచ్చాక కాని అది పుట్టలేదు. ఐనా క్రీస్తు జీవించి వుండగానే తన బోధలద్వారా నైతేనేమి, కొన్ని ప్రత్యేక క్రియలద్వారా నైతేనేమి, భవిష్యత్తులో తిరుసభ పుడుతుందని సూచించాడు. అనగా తిరుసభ పుట్టాలని క్రీస్తు తన మరణానికి ముందే సంకల్పించుకొన్నాడు. అతని వుత్థానానంతరం అది రూపుతాల్చింది. పాపపరిహారాత్మకమైన అతని మరణమూ, వరప్రసాద సహితమైన అతని వుత్థానమూ తిరుసభకు పునాదులయ్యాయి.

క్రీస్తు దైవరాజ్యాన్ని మాత్రమే ఉద్దేశించాడనీ, అతని వుద్దేశానికి భిన్నంగా తర్వాత పౌలు తిరుసభను ఏర్పాటు చేశాడనీ, కొందరు ప్రోటస్టెంటు పండితులు వ్రాసారు. ఈ భావం తప్పు. క్రీస్తే తిరుసభ పుట్టుకను కోరాడు.

ఈ యధ్యాయంలో రెండు భాగాలున్నాయి. మొదటి భాగంలో క్రీస్తు వుత్థానానికి ముందటి తిరుసభను చూస్తాం. ఇక్కడ నాల్గంశాలున్నాయి. రెండో భాగంలో క్రీస్తు ఉత్థానం తర్వాతి తిరుసభను చూస్తాం. ఇక్కడ ఆరంశాలున్నాయి.

# మొదటి భాగం

## 1. యూదులు క్రీస్తుని నిరాకరించడం

యూదులు క్రీస్తుని నిరాకరించినప్పటి నుండి అతడు తిరుసభ పుట్టుకకోసం కృషిచేస్తూ వచ్చాడు. అతడు గలిలయలో బోధిస్తుండగా యూదులు అతన్ని నిరాకరించడం మొదలెట్టారు. విశేషంగా అతడు రెండవసారి రొట్టెలనూ చేపలనూ పెంచి వేలకొలది ప్రజలకు ఆహారం పెట్టినపుడు ఈ నిరాకరణం ఎదురైంది. యోహా 6,60-69 ఈ సంగతిని తెలియజేస్తుంది. ఇక్కడ యూదులు క్రీస్తుని అనుసరించడం మానివేసారు - 6,66. ఇంకా, మత్తయి 16,13-16 కూడ ఈ విషయాన్ని పేర్కొంటుంది. ఇక్కడ క్రీస్తు నరులు తన్నెవరినిగా భావిస్తున్నారని పేత్రుని అడిగాడు. పేత్రు జవాబుని బట్టి ప్రజలు అతన్ని అద్భుతాలు చేసేవాణ్ణిగానో లేక ఎవరో వొక ప్రవక్తనుగానో భావిస్తూ వచ్చారు. అంతేగాని అతన్ని మెస్సీయానుగా మాత్రం అంగీకరించడంలేదు.

యూదులు తన్ను మెస్సీయానుగా అంగీకరించడంలేదని రూఢిగా తెలిసాక క్రీస్తు తన మరణోత్థానాలను గూర్చి మాట్లాడ్డం మొదలెట్టాడు - మత్త 16,21. యెరూషలేములో సంభవింపబోయే క్రీస్తు మరణోత్థానాల ద్వారాగాని తండ్రి సంకల్పించిన దైవరాజ్యం రాదు. అదే తిరుసభకూడ. అతడు యెషయా పేర్కొన్న బాధామయ సేవకుల్లాగ అనేకుల కొరకు తన ప్రాణాలను ధారపోస్తాడు - 53. క్రీస్తు యెరూషలేములో చనిపోవడం దైవచిత్తం. మరణానంతరం తండ్రే అతనికి మహిమను దయచేస్తాడు.

యూదులు తన్ను నిరాకరించాక క్రీస్తు ఒంటరిగాడయ్యాడు. అనుచరులు లేని మెస్సీయా ఐపోయాడు. యూదులు తన్ను విడనాడారు. వారికి బదులుగా అతడు నూత్న సమాజాన్ని తయారుచేసికోవాలి. ప్రాత యిస్రాయేలుకి బదులుగా నూత్న యిస్రాయేలు ఉద్భవించాలి. ఈ నూత్న యిస్రాయేలే తర్వాత తిరుసభ ఔతుంది. తండ్రి ఆ ప్రాత సమాజాన్ని వదలివేసి ఈ క్రొత్త సమాజం ద్వారా తన రక్షణ కార్యాన్ని కొనసాగించుకొని పోతాడు. ఈ విధంగా తిరుసభ రక్షణ నిర్వాహక సమాజమౌతుంది.

క్రీస్తు తన జీవిత కాలమంతా తిరుసభను ఏర్పాటుచేయాలనే ప్రయత్నంలోనే వున్నాడు. విశేషంగా అతడు పన్నెండుమంది శిష్యులను నియమించడం, పేత్రుకి ఆధిపత్యం దయచేయడం, సత్ప్రసాదాన్ని స్థాపించడం అనే మూడు క్రియలు అతడు తిరుసభ పుట్టుకను ఆశించాడని రుజువు చేస్తాయి. కనుక ఈ మూడంశాలను క్రమంగా పరిశీలిద్దాం.

## 2. పన్నెండుమంది శిష్యుల నియామకం

"క్రీస్తు పర్వతమెక్కి తాను కోరుకొన్న వారిని పిలవగా వాళ్ళు అతని దగ్గరికి వచ్చారు. అతడు పన్నెండుమందిని ఎన్నుకొని వారికి ప్రేషితులు అని పేరు పెట్టాడు. తనతో వుండడానికి, సువార్తను బోధించడానికి, దయ్యాలను వెళ్ళగొట్టడానికి క్రీస్తు వారిని నియమించాడు" - మార్కు 3,13-15.

ఈ వేదవాక్యాల్లో చాల భావాలున్నాయి. వాటిని విపులంగా పరిశీలిద్దాం.

1. క్రీస్తు కొండమీదికి వెళ్ళి అక్కడ రాత్రంతా ప్రార్థనలో గడిపాడు. ఆ పిమ్మట శిష్యులను ఎన్నుకొన్నాడు - లూకా 6,12-13. వారి యెన్నిక అతడు చేపట్టిన ముఖ్యమైన కార్యాల్లో వొకటి. పూర్వం మోషే కొండమీదనే దేవుని నుండి ధర్మశాస్త్రాన్ని స్వీకరించాడు. క్రీస్తు కొండమీదనే మారురూపం పొందాడు. కనుక బైబుల్లో కొండ దైవసాన్నిధ్యానికి గుర్తు. ఇక, క్రీస్తు రాత్రంతా ప్రార్థన చేయడం దైవచిత్తాన్ని తెలిసికోవడానికి. ఇక్కడ క్రీస్తు శిష్యులు క్రీస్తుని ఎన్నుకోలేదు. క్రీస్తే శిష్యులను ఎన్నుకొన్నాడు - యోహా 15,16.

ఈ యెన్నిక క్రీస్తు గలిలయ బోధకు, అక్కడ ప్రజలు తన్ను తిరస్కరించడానికీ ముందే జరిగింది.

ప్రభువు ఎన్నుకొనిన పండ్రెండుమంది శిష్యులూ పండ్రెండు తెగల యిస్రాయేలీయులను సూచిస్తారు. వాళ్లు ప్రాత యిస్రాయేలీయుందరికి సంగ్రహరూపం. నూత్న యిస్రాయేలీయులకు నాంది. వీళ్ళ ద్వారానే తిరుసభ ప్రారంభమౌతుంది.

క్రీస్తుకి చాలమంది శిష్యులుండేవాళ్లు. అతడు వాళ్ళల్లో పండ్రెండు మందిని మాత్రమే ఎన్నుకొన్నాడు లేక "నియమించాడు". పూర్వవేదంలో యాజకులను ఎన్నుకొన్నపుడు కూడ ఈ నియమించడం అన్న పదాన్నే వాడేవాళ్ళు. కనుక నూత్నవేద ప్రేషితులు పూర్వవేద యాజకుల్లాంటివాళ్లు అని భావం.

2. ఈ పండ్రెండు మందిని పిల్వడంలో క్రీస్తు ఉద్దేశాలు రెండు. మొదటిది, వాళ్లు తనతో వుండాలి. ప్రేషితులు క్రీస్తుతోవుండి అతని జీవిత విధానాన్ని నేర్చుకొంటారు. అతనితో ప్రయాణాలు చేస్తారు. అతని బోధలు వింటారు. అద్భుతాలు చూస్తారు. ఇతర శిష్యులు క్రీస్తుని విడనాడి వెళ్ళిపోయినా వీళ్ళుమాత్రం అలా వెళ్ళిపోరు. కనుక వీళ్లు క్రీస్తుకి ముఖ్యమైనవాళ్ళు.

రెండవది, వాళ్లు క్రీస్తు సువార్తను గూర్చీ దైవరాజ్యాన్ని గూర్చీ ప్రజలకు బోధిస్తారు. క్రీస్తుతోనే దైవరాజ్యం వచ్చింది కనుక పిశాచాలను వెళ్ళగొట్టి వాటి రాజ్యాన్ని కూలద్రోస్తారు. ఒకవిధంగా వాళ్లు క్రీస్తు పనిని కొనసాగిస్తారు. అతడు పోయాక అతని స్థానాన్ని పొందుతారు.

నూత్నవేదంలో ప్రేషితులపేర్లు విన్పించే జాబితాలన్నిటిలోను పేత్రు పేరు మొదట, యూదా పేరు కడపట వస్తాయి.

3. పూర్వవేదంలో "షాలువా" అనే హీబ్రూపదం ఒకటుంది. (బహువచనం, షెలుహిం). ఈ పదానికి "ప్రతినిధి" అని అర్థం. రాజకీయ కార్యాల్లో, వ్యాపారాల్లో, మతబోధల్లో పై యధికారులు తమ ప్రతినిధులను క్రిందివారి దగ్గరకి పంపేవాళ్ళు. వీళ్ళు తమ్ము పంపిన అధికారుల ఉద్దేశాలను ఆ ప్రజలకు తెలియజేసేవాళ్లు. తమ్ము పంపినవారి అధికారమంతా ఈ ప్రతినిధులకుకూడ వుండేది. ఈ దృష్టిలో పూర్వవేదంలోని ప్రవక్తలు దేవుని ప్రతినిధులు – షెలుహిం. క్రీస్తు ఈ పూర్వవేద ప్రతినిధులను మనసులో పెట్టుకొనే తన పండ్రెండుమంది శిష్యులను ప్రేషితులనుగా నియమించాడు. (తెలుగులో ప్రేషితుడు అంటే పంపబడినవాడు అని అర్థం. అపోస్తలుడు అనే గ్రీకు మాటకు సరైన తెలుగు పదం ఇది.) కనుకనే అతడు తండ్రి నన్ను పంపినట్లే నేను మిమ్ము పంపుతున్నాను అని వాకొన్నాడు – యోహా 20,21. అనగా వాళ్ళు తన దైవరాజ్య బోధను కొనసాగించేవాళ్ళని భావం.

ఈ పండ్రెండుమంది క్రీస్తు ఉత్థానానంతరం దైవరాజ్యబోధకులుగా పనిచేయడం మొదలెట్టారు. ఉత్థానక్రీస్తు మీరు వెళ్ళి సకల జాతిజనులకు నా శిష్యులనుగా చేయండి అని చెప్పాడు–మత్త 28,19–20. తండ్రి నన్ను పంపినట్లే నేను మిమ్ము పంపుతున్నాను అన్నాడు – యోహా 20,21. వాళ్లు అతని ప్రతినిధులుగా, అతనికి సాక్షులుగా పితనుగూర్చి బోధిస్తారు.

4. ప్రేషితులకు ఉండవలసిన అర్హతలు మూడు. మొదటిది, వాళ్ళు ఉత్థానక్రీస్తును చూచినవాళ్ళయి వుండాలి–1కొ 9,1. రెండవది, క్రీస్తే వాళ్ళను బోధచేయమని ఆజ్ఞాపించి వుండాలి–లూకా 24,47–48. ఉత్థానానికి పూర్వంకూడ క్రీస్తు కొందరిని వేదబోధకు పంపాడు, కాని అది ప్రేషిత లక్షణంకాదు– మత్త 10,5. మూడవది, ఇహలోకంలో వాళ్లు క్రీస్తుతో తిరిగిన వాళ్ళయివుండాలి– అ.చ. 1,21. అనగా వాళ్లు చారిత్రక క్రీస్తునీ ఉత్థానక్రీస్తునీ ఎరిగినవాళ్లయి అతడు సాధించిన రక్షణ సంఘటనను అర్థం జేసికొన్న వాళ్లయి వుండాలి.

పైన ప్రభువే శిష్యులను పిలచి వాళ్లను తన పనికొరకు నియమించాడని చెప్పాం. ఉత్థాన క్రీస్తు ఆత్మ వారిమీదకి దిగివచ్చి వాళ్లు రక్షణ సంఘటనను పరిపూర్ణంగా అర్థం జేసికొనేలా చేసింది. ఈ శక్తితోనే వాళ్ళు తర్వాత క్రీస్తుని గూర్చి బోధింప గలిగారు.

పూర్వవేద ప్రవక్తలకీ నూత్న వేద ప్రేషితులకీ దగ్గరి సంబంధం వుంది. ప్రవక్త మొదట దర్శనాల్లో దేవుణ్ణి చూస్తాడు. అతని సందేశాన్ని వింటాడు. తర్వాత ఆ సందేశాన్ని ప్రజలకు బోధిస్తాడు - యెష 6,1-9. ఈలాగే నూత్నవేద ప్రేషితులు కూడ మొదట ఉత్థాన క్రీస్తుని చూచి అతని సందేశాన్ని వింటారు. తర్వాత ఆ ప్రభువు వాళ్ళను వేదబోధకు పంపుతాడు. పేత్రు పౌలు మొదలైన ప్రేషితులంతా ఈలాంటివాళ్లే.

నూత్నవేదంలో ప్రేషిత శబ్దాన్ని కొన్నిచోట్ల విస్తృతార్థంలో వాడారు. పన్నెండుమందిలో చేరని వాళ్ళను గూడ ప్రేషితులని పిల్చారు. బర్నబా, యాకోబు మొదలైనవాళ్లు ఈలాంటివాళ్లు.

ప్రేషితుల పదవి విశిష్టమైంది. తొలి పన్నెండు మందేగాని ఇతరులు ఆ పదవికి అర్హులు కారు. కనుక యాకోబు మరణానంతరం అతని స్థానాన్ని ఇతరులెవరూ పొందలేదు - అ.చ. 12,2. తొలి పన్నెండుమంది గతించడంతో ఆ పదవి కూడ గతించింది.

5. ఇంతవరకు మనం చూచిన అంశాల సారాంశం ఇది. కీస్తు గలిలయ బోధకుముందే పన్నెండుమంది అనుచరులను ఎన్నుకొన్నాడు. అతడు ప్రారంభించిన దైవరాజ్యబోధను కొనసాగించడం వాళ్ళ బాధ్యత. గలిలయ బోధకాలంలో యూదులు క్రీస్తుని నిరాకరించాక ఈ పన్నెండుమందికి నూత్న ప్రాముఖ్యం వచ్చింది. క్రీస్తు ప్రాతయిస్రాయేలీయులను విడనాడి నూత్న యిస్రాయేలీయులను ఎన్నుకొన్నాడు. ఆ నూత్న యిస్రాయేలు మొదట ఈ పండ్రెండుమందితోనే ప్రారంభమైంది. క్రీస్తు ఉత్థానానంతరం వీళ్ళు ఏకబృందంగా ఐక్యమయ్యారు. ఆత్మ వీళ్ళను ప్రబోధించింది. అటుపిమ్మట ఇతరులుకూడ ఉత్థానక్రీస్తుని విశ్వసించి వీళ్ళతో చేరిపోయారు. వీళ్ళంతా కలసి క్రీస్తు సమాజమయ్యారు. ఈ సమాజమే తిరుసభగా రూపొందింది. ఈలా క్రీస్తు సంకల్పం ప్రకారమే తిరుసభ పుట్టింది.

## 3. పేత్రుకి ఆధిపత్యం

తిరుసభకు మూలస్తంభాలుగా వుండడానికిగాను క్రీస్తు పండ్రెండుమందిని ఎన్నుకొన్నాడని చెప్పాం. వీరిలో మళ్లా పేత్రుకి ప్రత్యేకస్థానం వుంది. క్రీస్తే అతనికి ప్రత్యేకమైన బాధ్యతను ఒప్పజెప్పాడు. పేత్రు అనే పునాదిమీద తిరుసభ అనే భవనం నిలుస్తుంది. ఈ యంశాన్ని విపులంగా పరిశీలిద్దాం.

పేత్రు ఆధిపత్యాన్ని సూచించే ప్రధాన వాక్యాలు మత్తయి 16,17-19లో వున్నాయి. ఈ యాలోకనంతో పాటు లూకా 22,31-34, యోహాను 21,15-17 కూడ ముఖ్యమైనవే. కాని యిక్కడ మనం మొదటి ఆలోకనాన్ని చూస్తేచాలు. అది యిది.

"16,17. యోనా కుమారుడవైన సీమోనూ! నీవు ధన్యుడివి. నీకు ఈ విషయాన్ని తెలియజేసింది పరలోకంలోని నా తండ్రేకాని, నీ సహజశక్తికాదు. 18. నీవు రాయివి (కేఫావి). ఈ రాతిమీద నేను నా తిరుసభను నిర్మిస్తాను. మరణశక్తులు దాన్ని జయించలేవు. 19. నేను పరలోకరాజ్యపు తాళపు చెవులు నీకిస్తాను. భూలోకంలో నీవు దేనిని బంధిస్తావో అది పరలోకంలోను బంధింపబడుతుంది. భూలోకంలో నీవు దేనిని విప్పుతావో అది పరలోకంలోను విప్పబడుతుంది."

1. మొదట పేత్రు పేరును పరిశీలిద్దాం. అతని పేరు సీమోను. క్రీస్తు ఆ పేరుని కేఫాగా మార్చాడు - యోహా 1,42. క్రీస్తు మాట్లాడిన అరమాయిక్ భాషలో కేఫా అంటే రాయి. ఈ కేఫా పదాన్నే నూత్నవేద రచయితలు గ్రీకు భాషలో "పేత్రోస్"గా అనువదించారు. క్రీస్తు పేత్రుతో "నీ పేరు రాయి (కేఫా). నేను ఈరాతిమీద నా తిరుసభను నిర్మిస్తాను" అని చెప్పాడు - 16,18. కనుక క్రీస్తు స్థాపించబోయే తిరుసభకు పేత్రు పునాదిరాయి. అనగా ముఖ్యనాయకుడు.

అరమాయిక్ భాషలో కేఫా అంటే రాయి అని చెప్పాం. కాని ఈ పదాన్ని ఆ భాషలో మనుష్యులు పేరుగా వాడేవాళ్లుకాదు. క్రీస్తే మొదటిసారిగా దాన్ని ఓ మనిషిపేరుగా వాడాడు. ఎందుకు? అతని దృష్టిలో ఆ పేరుతో పిలువబడే సీమోనుకి ప్రత్యేక ప్రాముఖ్యముంది. అతనికి తిరుసభలో ప్రత్యేకమైన పదవి లభిస్తుంది.

క్రీస్తు నిర్మింపబోయే తిరుసభ పూర్వవేద సమాజానికి బదులుగా వచ్చే నూత్న సమాజం. ఈ సమాజాన్ని క్రీస్తు ఓ భవనంలా కడతాడు. ఈ భవనానికి పేత్రు పునాదిరాయి ఔతాడు. దేవుడు అబ్రాహామనే పునాది రాతిమీద ఈ లోకాన్ని నిర్మించాడనీ, పండ్రెండుమంది పితరులనే పునాది రాతిమీద యిస్రాయేలు అనే భవనాన్ని నిర్మించాడనీ పూర్వవేద రబ్బయిలు వాకొన్నారు. ఈ పలుకుబళ్ళను ఆధారంగా జేసికొనే క్రీస్తు, పేత్రు నూత్న సమాజానికి మూలరాయి అని అన్నాడు.

పైగా పేత్రుకి శిష్యుల్లో అతి ప్రముఖస్థానం వుంది. పౌలుకూడా పేత్రు ప్రాముఖ్యాన్ని గుర్తించాడు. ఆత్మ దిగివచ్చాక ప్రేషితులకు నాయకుడై వారి తరపున యెరూషలేములో మాట్లాడింది పేత్రు - అచ 2,14. అతడే క్రీస్తు పేరుమీదిగా కుంటివాణ్ణి నడిపించాడు-3,6-8. వ్యాధులు నయం చేసాడు - 5,15. క్రీస్తు పేత్రుని ప్రేషితులకు నాయకుణ్ణిగా నియమించబట్టే అతడు వాళ్ళకు అధిపతిగా వ్యవహరించాడు.

2. ఈ విషయాలన్నీ తెలిసికొన్నాక పై మత్తయి 16,17-19 వాక్యాలమీద వివరణం చూద్దాం. "యోహాను కుమారుడవైన సీమోను! నీవు ధన్యుడివి. నీకు ఈ విషయాన్ని తెలియజేసింది పరలోకంలోని నా తండ్రేకాని, నీ సహజశక్తి కాదు" - 16,17. 16వ వాక్యంలో పేత్రు, క్రీస్తు మెస్సీయా అనీ సజీవుడైన దేవుని కుమారుడనీ ప్రకటించాడు. ఈ సత్యాన్ని అతడు తన సహజ శక్తివలన గ్రహించలేదు. క్రీస్తు మెస్సీయా అని గ్రహించే వరాన్ని దేవుడే అతనికి దయచేసాడు. దేవుడు పేత్రుకి ఈ విశ్వాసాన్ని దయచేసి అతన్ని తిరుసభకు మూలస్తంభాన్ని చేసాడు.

"నీవు రాయిని (కేఫావి). ఈ రాతిమీద నేను నా తిరుసభను నిర్మిస్తాను" - 16,18. క్రీస్తు సీమోను పేరు పేత్రుగా మార్చాడని చెప్పాం. బైబుల్లో ఆయా వ్యక్తుల పేర్లు వాళ్ళు చేసే పనిని సూచిస్తాయి. కొన్ని సార్లు దేవుడే నరులపేర్లు మారుస్తుంటాడు. ఆ నరులు ఆ మీదట ఓ ప్రత్యేకమైన కార్యాన్ని నిర్వహిస్తారు. ఉదాహరణకు, దేవుడు అబ్రాము పేరుని అబ్రాహాముగా మార్చాడు. అబ్రాము అంటే గొప్పవాడయిన తండ్రికి పుట్టినవాడని భావం. అబ్రాహామంటే చాల జాతులకు తండ్రి అని భావం. ఈలా పేరు మార్చాకనే అబ్రాహాము అనేక జాతులకు తండ్రి అయ్యాడు - ఆది 17,5. ఈ సంప్రదాయం ప్రకారం క్రీస్తు సీమోను పేరుని కేఫాగా మార్చాడు అంటే, అతనికి కొత్తపనినీ కొత్తబాధ్యతనీ ఒప్పజెప్పాడని భావం. ఇక్కడ క్రీస్తు సీమోనుకి ఒప్పజెప్పిన కొత్తపని అతడు నూత్న సమాజానికి అధిపతి కావడమే. ఈ నూత్న సమాజం తిరుసభే కనుక పేత్రు దానికి నాయకుడౌతాడు. ప్రభువు "ఈ రాతిమీద నేను నా తిరుసభను నిర్మిస్తాను" అన్నాడు. అది నరమాత్రులు స్థాపించే సమాజం కాదు. క్రీస్తే దాన్ని నెలకొల్పాలి. క్రీస్తు దాన్ని ఇంకా నెలకొల్పలేదు. అతని వుత్థానానంతరం ఆపని జరుగుతుంది.

"మరణ శక్తులు దాన్ని జయించలేవు" -16,18. (కొందరు నరకశక్తులు లేక పాతాళశక్తులు అని అనువదిస్తారు). మరణం ఈలోకానికి సంబంధించింది. కనుక ఈ లోకపు దుష్టశక్తులు పేత్రు అనే పునాదిమీద నిల్చిన తిరుసభ అనే భవనాన్ని నాశం చేయలేవు. అది యీ లోకంలో వున్నా ఇక్కడే క్రీస్తు ఉత్థానశక్తిలో పాలు పంచుకొంటుంది. ఫలితార్థమేమిటంటే, తిరుసభ పునాది బలమైంది. ఏదుష్ట శక్తీ దాన్ని కూలద్రోయలేదు. అది అజేయమైంది.

"నేను పరలోక రాజ్యపు తాళపు చెవులు నీకిస్తాను" - 16,19. ఇక్కడ తాళపు చెవులంటే సంపూర్ణాధికారం అని భావం. యెషయా 22,19-22లో ప్రభువు ఎల్యాకిముకి రాజప్రాసాదం తాళపు చెవులు ఇచ్చాడు. అనగా ఎల్యాకిము ఆ ప్రాసాదానికి సంపూర్ణాధికారి అయ్యాడని భావం. అలాగే ఇక్కడ క్రీస్తు తిరుసభమీద సంపూర్ణాధికారాన్ని దయచేసాడని

అర్థం జేసికోవాలి. ఈలోకంలోని తిరుసభలో పేత్రు క్రీస్తు ప్రతినిధి. అతనికి మించిన అధికారి మరొకడు లేడు.

"భూలోకంలో నీవు దేనిని బంధిస్తావో.... విప్పుతావో అది పరలోకంలోను బంధింపబడుతుంది, విప్పబడతుంది" - 16,19. బంధించడం, విప్పడం అనేవి రబ్బయి వాడే పారిభాషిక పదాలు. బంధించడం అంటే నిషేధించడం. విప్పడం అంటే అనుమతించడం. కనుక ఇక్కడ పేత్రు నిషేధించేది నిషేధింపబడుతుంది. అనుమతించేది అనుమతింపబడుతుంది అని అర్థం. కాని అతడు నిషేధించేదీ అనుమతించేదీ ఏమిటి? నరులు క్రీస్తు స్థాపించిన దైవరాజ్యంలో చేరాలంటే పాపపరిహారం అవసరం. కనుక ఇక్కడ ప్రభువు పేత్రుకి పాపాలను పరిహరించడానికీ పరిహరించక పోవడానికీ గూడ అధికారాన్ని దయచేసాడని భావం. ఈ సందర్భంలో మత్తయి 18,18 యోహాను 20,23 ఆలోకనాలు కూడ చూడదగ్గవి.

పేత్రు చేతిలో దైవరాజ్యపు తాళపు చెవులు వున్నాయి. అనగా అతడు తిరుసభలో పరిపూర్ణాధికారం కలవాడు. కనుక అతడు తిరుసభలో ఎవరి పాపాలనైనా మన్నించవచ్చు, ఎవరి పాపాలనైనా మన్నించక పోవచ్చు. అది ఆయాపాపుల హృదయాల్లో పశ్చాత్తాపం వుందా లేదా అనేదాన్ని బట్టి వుంటుంది.

మీద మనం చూచిన భావాల సారాంశం ఇది. క్రీస్తు భవిష్యత్తులో క్రైస్తవ సమాజాన్ని స్థాపించగోరాడు. అది కొనసాగాలంటే దానికి ఓ అధికారి అంటూ వుండాలి. ఆ యధికారి పేత్రు. ఈ భవిష్యత్ సమాజం తీరుతెన్నులు క్రీస్తు అప్పుడే సవివరంగా నిర్ణయించలేదు. భవిష్యత్తులో ఆత్మ వచ్చాక ఈ తీరుతెన్నులు రూపుతాలుస్తాయి. పేత్రు మాత్రం ఈ సమాజానికి తిరుగులేని అధిపతి. ఈ సమాజమే తిరుసభ. పేత్రు ఆధిపత్యం అతని అనుయాయులకు కూడ సంక్రమిస్తుంది. ఈ విషయాన్ని మీదట చూస్తాం.

## 4. దివ్యసత్ప్రసాద స్థాపనం

అంత్య భోజనమూ దివ్యసత్ప్రసాద స్థాపనమూ క్రీస్తు తిరుసభను నెలకొల్ప గోరాడని రుజువు చేస్తాయి. కనుక ఇక్కడ ఈ రెండంశాలను పరిశీలిద్దాం. మొదట అంత్య భోజనాన్ని చూద్దాం.

అంత్యభోజన వాక్యాలు మూడు సువిశేషాల్లోను వున్నాయి. ప్రస్తుతానికి మనం లూకా పౌలుల వాక్యాలను తిలకిస్తే చాలు.

"అపుడు యేసు రొట్టెను అందుకొని కృతజ్ఞతా స్తోత్రాలు చెల్లించి, దాన్ని త్రుంచి శిష్యులను ఒసగుతూ ఇది మీ కొరకు అర్పింపబడనున్న నా శరీరము. దీన్ని నా జ్ఞాపకార్థం

చేయండి అన్నాడు. అలాగే అతడు భోజనానంతరం పాత్రను అందుకొని ఇది మీ కొరకు చిందబడనున్న నూత్న నిబంధనం యొక్క నారక్తం అన్నాడు - లూకా 22,19-20.

"మీరు ఈ రొట్టెను తిన్నపుడెల్ల, ఈ ప్రాంతంనుండి త్రాగినపుడెల్ల, ప్రభువు వచ్చేవరకు ఆయన మరణాన్ని ప్రకటిస్తారు - 1కొ 11,26.

1. మీది వాక్యాల్లో క్రీస్తు "ఇది నూత్న నిబంధనం యొక్క నా రక్తం" అన్నాడు. పూర్వవేదంలో నెత్తురు చిలకరించడం ద్వారానే సీనాయి నిబంధనం జరిగింది. అక్కడ మోషే కోడె నెత్తుటిని పీఠంమీదా ప్రజల మీదా చిలకరించి "ఇది ప్రభువు మీతో చేసికొనిన నిబంధనం యొక్క రక్తం అన్నాడు - నిర్గ 24,8. ఈ వాక్యాన్ని మనసులో పెట్టుకొనే క్రీస్తు అంత్యభోజన సమయంలో "ఇది నూత్న నిబంధనం యొక్క నా రక్తం" అన్నాడు. అక్కడ బలిపశువు నెత్తురుద్వారా నిబంధనం జరిగితే ఇక్కడ క్రీస్తు సొంత నెత్తురుద్వారానే నిబంధనం జరిగింది. ఆ నిబంధనం ద్వారా యిస్రాయేలీయులు ప్రభువు సొంత ప్రజలు, పవిత్రజనులు, యాజకరూపమైన రాజ్యం అయ్యారు - నిర్గ 19,5-6. ఇక్కడ ఈ నిబంధనంద్వారా మనం క్రీస్తు ప్రజలం ఔతాం. ఆ పూర్వవేద ప్రజల లక్షణాలే నేడు మనకుకూడ సంక్రమిస్తాయి - 1పేత్రు 2,9.

ఈ సందర్భంలో క్రీస్తు "నూత్న" నిబంధనం అనే మాటను పత్ర్యేకంగా వాడాడు. సీనాయి నిబంధనం ప్రాతది. యూదులు దాన్ని మీరుతూ వచ్చారు. కనుక ఆ నిబంధనంవల్ల ఇక ప్రయోజనంలేదు. కావుననే ప్రభువు కొత్త నిబంధనను నెలకొల్పవలసి వచ్చింది. పూర్వవేదంలో యిర్మీయా ప్రవక్త ఈ నూత్న నిబంధనను గూర్చి ముందుగానే తెలియజేసాడు- 31,31-33. ఆ ప్రవచనాన్ని మనసులో పెట్టుకొనే క్రీస్తు తనది "నూత్న" నిబంధనం అని చెప్పాడు.

క్రీస్తు నెలకొల్పిన ఈ నూత్న నిబంధనంద్వారా నూత్న సమాజం, మెస్సీయా సమాజం ఏర్పడింది. అదే తిరుసభ. పాత నిబంధనం పాత ప్రజనూ కొత్త నిబంధనం కొత్త ప్రజనూ తయారుచేసాయి. క్రీస్తు పాస్క పండుగ సందర్భంలో అంత్యభోజనాన్ని ఆరగించాడు. యూదులు ఈ పాస్కపండుగను జరుపుకొనేపుడు సీనాయి నిబంధనాన్ని స్మరించుకొనేవాళ్ళు. ఆ పాస్క పండుగ సందర్భంలోనే క్రీస్తు నూత్న నిబంధనను నెలకొల్పాడు. దీని భావమేమిటి? ఇక ఆ పాతనిబంధన చెల్లదు. దానికి మారుగా నూత్ననిబంధనం వచ్చింది. రక్షణ చరిత్రలో పాతశకంపోయి నూత్నశకం వచ్చింది. ఈ నూత్నశకమే తిరుసభ. ఈలా క్రీస్తు అంత్యభోజనం ద్వారా తిరుసభ స్థాపనాన్ని సూచించాడు.

2. ఇంతవరకు అంత్య భోజనాన్ని గూర్చి చూచాం. ఇక దివ్యసత్ప్రసాదాన్ని పరిశీలిద్దాం. నూత్న నిబంధనంతో నూత్న ఆరాధనం కూడ ఏర్పడింది. పూర్వ నిబంధనం కలిగినప్పుడు ప్రభువు యూదులకు ఒక ఆజ్ఞనిచ్చాడు. అదియిది. ప్రజలు ఆ నిబంధనాన్నీ,

ఆ యూజిప్తు నిర్గమనాన్నీ తాము చేరుకొనే కనాను దేశంలో గూడ ఏటేట జ్ఞప్తికి తెచ్చుకోవాలి. ఈలా జ్ఞప్తికి తెచ్చుకోవడానికే యూదులు పాలస్తీనా దేశంలో ఏటేట పాస్క పండుగ జరుపుకొన్నారు - నిర్గ 12,25-27. అదే వాళ్ళ ముఖ్యారాధన. ఇదే విధంగా క్రీస్తు కూడ తన నూత్న నిబంధన బలిని గూర్చి అనగా దివ్యసత్ప్రసాదబలిని గూర్చి "దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి" అని చెప్పాడు - లూకా 22,19. ఇందుకోసమే మనం రోజురోజు పూజబలిని సమర్పించేది. ఈ పూజబలిలో మనం క్రీస్తు మరణాన్ని తండ్రికి జ్ఞాపకం చేస్తాం. తన కుమారుని మరణాన్ని జూచి తండ్రి నేడుకూడ మన పాపాలను మన్నిస్తాడు. ఈ జ్ఞాపకాన్ని మనం క్రీస్తు రెండవసారి తిరిగి వచ్చేదాకా గూడ కొనసాగించుకొనిపోవాలి - 1కొ 11,26. నూత్న నిబంధన కాలంలో నూత్న ప్రజల ఆరాధనమే దివ్యసత్ప్రసాదబలి. ఈ నూత్న ప్రజలే తిరుసభ. యూదుల ఆరాధనం పాస్కబలి. మన ఆరాధనం దివ్యసత్ప్రసాద బలి.

ఈ దివ్యసత్ప్రసాద ఆరాధనంలో స్త్రీ పురుషులు ఐక్యభావంతో, ఏక కుటుంబంగా పాల్గొంటారు. ఏక సమాజమౌతారు. ఈ కార్యం తిరుసభలో జరుగుతుంది. దైవ ప్రజలంతా సత్ప్రసాద పీఠంచుట్టూ ప్రోగైనపుడు తిరుసభ పరిపూర్ణతను పొందుతుంది. కనుక "దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి" అన్న ప్రభువు వాక్యాన్ని స్మరించుకొని మనమంతా సంతోషంగా పూజబలికి హాజరు కావాలి. ఈలా హాజరు కావడం ద్వారా తిరుసభ వృద్ధి చెందుతుంది.

ప్రభువు తన మరణానికి ముందు ప్రేమాజ్ఞను ఇచ్చిపోయాడు. "నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరినొకరు ప్రేమించండి" అన్నాడు-యోహా 13,34-35. దివ్యసత్ప్రసాదబలిలో ఈ ప్రేమాజ్ఞ పరిపూర్ణంగా నెరవేరుతుంది. నూత్న నిబంధనకూ తిరుసభకూ ప్రధానమైంది ఈ ప్రేమాజ్ఞే.

ఈవిధంగా అంత్యభోజనం ద్వారా, దివ్యసత్ప్రసాద స్థాపనం ద్వారా, క్రీస్తు తిరుసభను స్థాపించ దలచాడని అర్థం జేసికోవాలి.

## రెండవ భాగం

క్రీస్తు తిరుసభను స్థాపించాలని ఉద్దేశించాడు. దాని ఆదిమ సభ్యులైన ప్రేషితులనూ వారి నాయకుడైన పేత్రునీ ఎన్నుకొన్నాడు. తిరుసభ ఆరాధన కొరకు దివ్యసత్ప్రసాదాన్ని స్థాపించాడు. ఐనా తిరుసభ అతని జీవితకాలంలో నెలకొనలేదు. క్రీస్తు ఉత్థానానంతరం, ఆత్మ దిగివచ్చాక అది పుట్టింది. ఈ విషయాన్ని ఇక్కడ క్లుప్తంగా పరిశీలిద్దాం. అపోస్తుల చర్యలు అనే గ్రంథం నుండి తిరుసభ ఏలా పుట్టి ఏలా పెంపుచెందిందో తెలిసికోవచ్చు. ఇక్కడ ఆ చరిత్రను చూద్దాం.

## 1. ఆత్మ దిగిరాకముందు ఉన్న పరిస్థితి - అ.చ.1

క్రీస్తు ఉత్థానమయ్యాక గూడ శిష్యులు అతడు ఎందుకు చనిపోయాడో, ఎందుకు ఉత్థానమయ్యాడో అర్థం జేసికోలేదు. అతడు యూదులకు రాజకీయ స్వాతంత్ర్యాన్ని తెచ్చిపెడతాడనే వాళ్ళ భావం. కనుకనే ప్రభువు మోక్షారోహణానికి ముందుకూడ వాళ్ళు నీవు యిస్రాయేలు రాజ్యాన్ని ఉద్ధరించవా అని అడిగారు – అ.చ. 1,6 క్రీస్తు ఉత్థానానంతరం వాళ్ళు యెరూషలేములో ఓ యింటి మీదిగదిలో కూడి ప్రార్థనం చేసికొంటూండేవాళ్లు. దేవదూత చెప్పినట్లుగా ఉత్థానక్రీస్తు స్వర్గంనుండి మళ్లా తిరిగి వస్తాడనుకొంటూండేవాళ్లు – 1,11. అప్పటికింకా రొట్టె విరవడం (దివ్యసత్ప్రసాదం) అనేది లేదు. భవిష్యత్తులో ఏమి జరుగుతుందో కూడ వాళ్లకు స్పష్టంగా తెలియదు.

## 2. ఆత్మ దిగివచ్చాక పరిస్థితి - 1.చ.2-5

ఆత్మ దిగివచ్చాక శిష్యుల్లో పెద్దమార్పు వచ్చింది. అంతకు ముందు వాళ్లు క్రీస్తు మళ్ళా తిరిగిరావడంతో మెస్సీయాకాలం ప్రారంభమౌతుంది అనుకొన్నారు. కాని ఇప్పుడాకాలం ఆత్మ దిగిరావడంతో ప్రారంభమైందని గ్రహించారు. వాళ్ళు క్రీస్తు తిరిగివచ్చి యిస్రాయేలు రాజ్యాన్ని ఉద్ధరిస్తాడు అనుకొంటూంటే ఇప్పుడు తలవని తలంపుగా ఆత్మ దిగివచ్చింది. పూర్వవేదంలో "శేషజనం" అనే ప్రజలు వున్నారు. వీళ్లు మెస్సీయా కోసం ఎదురు చూస్తుండేవాళ్లు. ఇప్పుడు ప్రేషితులే ఈ శేషజనమయ్యారు. యోవేలు ప్రవక్త చెప్పినట్లుగా ఆత్మ వీరిమీదికి దిగివచ్చి వీరిని తన శక్తితో నింపింది - యోవేలు 2,28-32. అ.చ. 2,17-18.

ఆత్మ దిగిరాగానే శిష్యులకు క్రీస్తుని అన్యులకు బోధించాలనే తపన పుట్టింది. ఈబోధ మొదట యెరూషలేములోనే యిస్రాయేలీయులకే జేయాలి - 2,41. యూదులుకాని అన్యజాతివారికి గూడ క్రీస్తుని బోధించాలనే తలంపు శిష్యులకు అప్పటికింకా లేదు. యూదులు మాత్రమే క్రీస్తు శిష్యులు ఔతారని వాళ్ళ ఆలోచన.

రోజురోజుకి శిష్యుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. యెరూషలేములోని ఆదిమ క్రైస్తవ సమాజం ఆదర్శ వంతమైన జీవితం గడిపింది. ఆ సమాజంలో మూడంశాలు గమనించదగ్గవి. 1. శిష్యులు క్రీస్తుని గూర్చి బోధిస్తూ అతని పేరుమీదుగా అద్భుతాలు చేసేవాళ్లు. దీనివల్ల యూదులు రోజురోజుకీ అధికాధికంగా క్రైస్తవ మతంలోచేరుతూ వచ్చారు 2. ఆదిమ సమాజంలోని సభ్యులు ఉమ్మడి జీవితం గడిపారు. 3. భక్తులంతా కలసి రొట్టెవిరచి క్రీస్తుని ఆరాధించారు. ఈ యారాధనం భక్తుల యిండ్లల్లోను యెరూషలేము దేవాలయంలోను కూడ జరిగేది - 2,42-47.

## 3. ఆదిమ సమాజంలో తగాదాలు, స్తెఫను పాత్ర - అ.చ.6-7

అ.చ.6వ అధ్యాయం ఆదిమ క్రైస్తవ సమాజంలోని తగాదాలను వర్ణిస్తుంది. యూదుల్లో పాలస్తీనా యూదులు, అన్యదేశాల్లో స్థిరపడిన యూదులు అని రెండు తెగలవాళ్ళు ఉండేవాళ్ళు. భోజన సమయంలో మొదటి తెగవాళ్ళు బాగాతిని రెండవ తెగవాళ్ళకు తక్కువగా పెట్టారు. కనుక రెండవ తెగవాళ్ళు జగడమాడారు. పేత్రు ఈ సమస్యను చక్కదిద్దడానికి ఏడ్గురు పరిచారకులను నియమించాడు. అందరికి సరిసమానంగా భోజనం వడ్డించడం వీరి బాధ్యత. వీరిలో ప్రముఖుడు స్తెఫను. ఇతడు భోజన పరిచారకుడు మాత్రమే కాక గొప్ప వాక్యపరిచారకుడుకూడ.

స్తెఫను బోధవల్ల అతనికి శత్రువులు తయారయ్యారు. యెరూషలేము దేవాలయమూ ధర్మశాస్త్రమూ ప్రజలను రక్షించవనీ, క్రీస్తుమాత్రమే జనులను రక్షిస్తాడనీ, ఇతడు బోధించాడు. అందుచే యూదులు ఇతన్ని చంపజూచారు. ఇతడు యూదులకూ క్రీస్తు భక్తులకూ ఇక పొత్తుకుదరదని కూడ సూచించాడు. అంతవరకు శిష్యులుకూడ యూదవర్గంగానే చలామణి ఔతూవచ్చారు. ఇప్పుడు క్రీస్తు భక్తులూ యూదులూ వేరువేరు వర్గాలనే భావం ఏర్పడింది.

యూదులు స్తెఫనుని రాళ్ళతోకొట్టి చంపారు. క్రీస్తు భక్తులను కూడ హింసించడం మొదలుపెట్టారు. అందుచే ఈ భక్తులు యెరూషలేమునుండి అన్య ప్రాంతాలకు వలసపోయారు. కాని వాళ్ళు తాము పోయినకాడల్లా క్రీస్తుని గూర్చి బోధించడం మొదలుపెట్టారు. ఈ విధంగా క్రైస్తవమతం యూదయా సమరయాల్లో చాలా ప్రాంతాల్లో వ్యాప్తి చెందింది - 8,1-2.

## 4. అన్యజాతి ప్రజలుకూడ క్రైస్తవులు కావడం - అ.చ.10-11

వేదహింసవల్ల పారిపోయిన క్రైస్తవులు ఫినీష్యా సైప్రను అంటియోకయాల్లో వేదప్రచారం చేసారు. అంటియోకయాలో గ్రీకుప్రజలు కూడ క్రీస్తుని విశ్వసించారు. కనుక అన్యజాతివాళ్ళు కూడ క్రైస్తవ మతంలో చేరే సమయం వచ్చింది. అంతవరకు క్రైస్తవులంతా యూదులు మాత్రమే. అన్యజాతులను తిరుసభలోకి రాబట్టడానికి ప్రభువు సౌలుని ప్రత్యేకంగా ఎన్నుకొన్నాడు. అతని కథ 9వ అధ్యాయంలో వుంది.

పదవ అధ్యాయం కొర్నేలి అనే రోమను సైన్యాధిపతి కుటుంబ సమేతంగా క్రైస్తవ మతంలో చేరిన ఉదంతాన్ని వర్ణిస్తుంది. మొదటిసారిగా క్రీస్తు శిష్యుడైన అన్యజాతివాడు ఇతడే. ఇతడు కైసరయ నివాసి. అంతవరకు క్రైస్తవులైన యూదులు మోషే ధర్మశాస్త్రాన్ని కూడ పాటిస్తూ వచ్చారు. కాని యిప్పుడు అన్యజాతివాళ్ళు ఈ ధర్మశాస్త్రాన్ని పాటింపవలసిన

అవసరం లేకుండానే క్రైస్తవులయ్యారు. ఐనా కొందరు యూద క్రైస్తవులు మాత్రం అన్యజాతివాళ్ళు కూడ ధర్మశాస్త్రాన్ని పాటించాలని వాదిస్తుండేవాళ్ళు.

## 5. అంటియోకయ క్రైస్తవులు

అంటియోకయలో యూదులు మాత్రమేకాక అన్యజాతివాళ్లయిన గ్రీకులు కూడ క్రీస్తుని విశ్వసించారు - 11,19-21. ఈ యన్యజాతివాళ్ల సమస్యను పరిశీలించడానికి యెరూషలేము సమాజం బర్నబాను అంటియొకయకు పంపింది. అతడు ఆత్మ ప్రేరణం వల్లనే వీళ్ళు క్రైస్తవమతంలో చేరారని ధ్రువపరచాడు. ఇతడు తార్సు నుండి సౌలుని అంటియొకయకు తీసుకొని వచ్చాడు. ఈ యిద్దరూ ఆ నగరంలో ఒకయేడు వేదబోధ చేసారు. తర్వాత ఇద్దరూ ఇతర ప్రాంతాల్లోని అన్యజాతి వాళ్లకు బోధచేయడానికి అంటియొకయ నుండి పయనమైపోయారు - 13,1-3.

అంటియొకయ భక్తులనే మొట్టమొదటిసారిగా "క్రైస్తవులు" అని పిల్చారు - అ.చ. 11,26. అంతవరకు యూదులు అన్యజాతివాళ్ళు అనే రెండు వర్గాల ప్రజలున్నారు. ఇప్పుడు క్రైస్తవులనే మూడవ వర్గం ప్రజ ఏర్పడింది. ఈ మూడవ వర్గంలో యూదులూ అన్యజాతివాళ్లూ కూడ సభ్యులు. దీనివల్ల యూదులు మాత్రమేకాక అన్యజాతివాళ్ళుకూడ తిరుసభలో చేరతారనే అంశం స్పష్టమైంది. కాని ఈ విషయం యెరూషలేములో కాక అంటియోకయలో విశదమైంది. అప్పటినుండి తిరుసభ అన్ని జాతులకు చెందింది, విశ్వవ్యాప్తమైంది అనే భావం ప్రచారంలోకి వచ్చింది.

## 6. పౌలు పాత్ర

తిరుసభ విశ్వవ్యాప్తమైంది అనే భావాన్ని బాగా ప్రచారంలోకి తెచ్చినవాడు పౌలు. యూదులు తన బోధను నిరాకరింపగా ఇతడు అన్యజాతులకు బోధ చేయడం మొదటపెట్టాడు - అ.చ.46-47. క్రీస్తుని గూర్చిన బోధ మొదట యెరూషలేములో ప్రారంభమైంది. తర్వాత యూదియా సమరయాల్లో జరిగింది. అటుతర్వాత భూదిగంతాల వరకు వ్యాపించింది - 1,8. ఈలా నేల నాల్గుచెరుగుల వరకు క్రీస్తుని బోధించినవాడు పౌలే. నేడు మనం యూరప్ అని పిల్చే ప్రాంతంలో మొదట వేదబోధ చేసినవాడు ఇతడే.

యూదయా క్రైస్తవులు మొదట యూదులంతా క్రైస్తవ మతంలో చేరతారనీ, తమ జీవిత కాలంలోనే ప్రభువు రెండవసారి వేంచేసి వస్తాడనీ భావించారు. కాని ఈ రెండుకార్యాలు నెరవేరలేదు. కనుక పౌలు ఈ రెండు భావాలను గూర్చి లోతుగా ఆలోచించాడు. అతడు క్రీస్తు తన జీవితకాలంలో రాడనీ, యూదులంతా క్రీస్తుని అంగీకరించరనీ గ్రహించాడు. యూదులూ అన్యజాతి ప్రజలూ కూడిందే తిరుసభ అని

అర్థం చేసికొన్నాడు. ఇంకా, తిరుసభే దైవరాజ్యానికి మార్గమని కూడ తెలిసికొన్నాడు. కనుక తిరుసభను నిరాకరించడమంటే దైవరాజ్యాన్ని నిరాకరించడమేనని నమ్మాడు. యూదులూ అన్యజాతివాళ్ళూ తిరుసభలో చేరిందాకా దైవరాజ్యం పరిపూర్ణంగా రాదని విశ్వసించాడు. యూదులు క్రీస్తుని నిరాకరించడంవల్లనే తాను అన్యజాతుల వద్దకు వెళ్ళగలిగానని కూడ అర్థంజేసికొన్నాడు. పౌలు పరిచర్యవల్ల క్రైస్తవమతం ఒక్క యూదసమాజానికీ యెరూషలేము దేవాలయానికీ మాత్రమే పరిమితమై వుండక విశ్వవ్యాప్తమైన మతంగా తయారైంది.

ఇంతవరకు మనం చూచిన చరిత్ర సారాంశమిది. ఆత్మ దిగిరాకముందు శిష్యులకు భవిష్యత్తులో ఏమి జరుగుతుందో తెలియదు. వాళ్లు మోక్షారోహణం చేసిన క్రీస్తు రెండవసారి వేంచేసి వస్తాడన్న నమ్మకంతోనే వున్నారు. ఆత్మ దిగివచ్చాక వాళ్లు మెస్సీయా కాలం వచ్చిందనీ తాము క్రీస్తునిగూర్చి బోధించాలనీ గ్రహించారు. ఆ మీదట ఆత్మే తిరుసభను నడిపిస్తూ వచ్చింది. శిష్యులు మొదట యూదులు మాత్రమే క్రైస్తవ మతంలో చేరతారనుకొన్నారు. క్రమేణ అన్యజాతివాళ్ళుకూడ ఆ మతంలో చేరడం చూచారు. అంటియోకయలో మొదటిసారిగా తిరుసభ అన్యజాతులకుకూడ చెందింది అనే భావం గుర్తింపులోకి వచ్చింది. తిరుసభను యూదుల పరిధిలోనుండి తప్పించి విశ్వవ్యాప్తం చేసినవాడు పౌలు.

## ప్రార్థనా భావాలు

1. దేవుడు నిద్రిస్తూన్న ఆదాము ప్రక్కనుండి ఏవను పుట్టించాడు - ఆది 2,21-22. అలాగే సిలువపై నిద్రిస్తూన్న రెండవ ఆదామైన క్రీస్తు ప్రక్కనుండి తిరుసభ పుట్టుకవచ్చింది. క్రీస్తే తిరుసభ స్థాపకుడు.

2. రెండవ శతాబ్దంలో జీవించిన వేదశాస్త్రి ఇరెనేయస్ అపోస్తుల వారసుల జాబితాను తయారుచేసాడు. రోముకి మొదటి పీఠాధిపతి పేత్రు. లీనస్, అనక్లీటస్, క్లెమెంట్, ఎవరెస్టస్, అలెగ్జాండర్, సిస్టస్, టెలెస్ఫోరస్, హిగీనస్, పయస్, అనీసీటస్, సోటెర్, ఎలుతేరస్ అనేవాళ్లు క్రమంగా అతనికి వారసులయ్యారు. కనుక ఇప్పటి మన తిరుసభ పేత్రు మొదలైన ఆదిమ ప్రేషితులతో సంబంధం కలది. ఈ సంబంధం అన్ని క్రైస్తవ శాఖలకూ లేదు.

# 3. దైవరాజ్యమూ తిరుసభా

పూర్వాధ్యాయంలో ఆదిమ శిష్యబృందం ఆత్మవలన ప్రబోధితమై తిరుసభగా ఏర్పడిన తీరును చూచాం. కాని ఈ తిరుసభకీ మనం గ్రంథారంభంలోనే పేర్కొన్న దైవరాజ్యానికీ సంబంధం ఏమిటి? ప్రపంచానికి రక్షణ భాగ్యాన్ని ప్రసాదించేది

దైవరాజ్యంగాని తిరుసభకాదు. మరి తిరుసభ దేనికి? ఈ యధ్యాయంలో తిరుసభకీ దైవరాజ్యానికీగల సంబంధాన్ని తెలుసుకొందాం.

1. పూర్వ వేదశాస్త్రుల తిరుసభా దైవరాజ్యం ఒకటేనని చెప్పారు. చాలమంది పోపుగార్లుకూడ ఈ యభిప్రాయాన్నే వ్యక్తం చేసారు. కాని యిప్పుడు రెండవ వాటికన్ సభా, ప్రస్తుత వేదశాస్త్రులూ ఈ యభిప్రాయాన్ని అంగీకరించరు. వీళ్ళ దృష్టిలో ఈ రెండిటికీ సామ్యమూ తేడా రెండూ వున్నాయి. తిరుసభ దైవరాజ్యం కొరకు వుంది. అది ఆ రాజ్యాన్ని ప్రజలకు తెలియజేస్తుంది, బోధిస్తుంది. తన సేవలద్వారా ఆ రాజ్యం ఈ లోకంలో నెలకొనేలా చేస్తుంది. తిరుసభ పూవైతే దైవరాజ్యం దానినుండి పుట్టిన ఫలం.

దైవరాజ్యాన్ని క్రీస్తే నెలకొల్పాడు. తిరుసభ ఆత్మ ప్రేరణంతో ఇప్పుడా దైవరాజ్యాన్ని ప్రజలకు ఎరుకపరుస్తుంది.

నూత్నవేద బోధల ప్రకారం తిరుసభ ఇప్పుడు వున్నది. దైవరాజ్యం లోకాంతంలో వచ్చేది. తిరుసభ ఈ లోకంలో యాత్రచేసేది, తాత్కాలికమైంది. దైవరాజ్యం ఆ యాత్ర ముగిసాక శాశ్వతంగా నెలకొనేది. మొదటిదానిలో పాపులూ పుణ్యాత్ములూకూడ వుంటారు. రెండవదానిలో పుణ్యాత్ములు మాత్రమే వుంటారు.

తిరుసభా దైవరాజ్యమూ ఒకటికాదు. అవి రెండూ ఒకదానికొకటి విరోధులూ కావు. వాటి రెండిటికీ పరస్పర సంబంధం వుంది. తిరుసభ దైవరాజ్యాన్ని బోధించి అది త్వరలో రూపొందేలా చేస్తుంది.

"మీ రాజ్యం వచ్చునుగాక" అన్నపుడు దైవరాజ్యం రావాలని కోరుకొంటాం. ఈ దైవరాజ్యమే నూత్నవేదంలో వివాహ విందుగా, భూమిలో దొరికిన నిధిగా, ఆణిముత్యంగా, పొంగినపిండిగా, ఆవచెట్టుగా వర్ణింపబడింది. తిరుసభ తర్వాత దైవరాజ్యం వస్తుంది. తిరుసభలో సిలువావుంది, వుత్థానమూ వుంది. దైవరాజ్యంలో ఉత్థానమూ మహిమా మాత్రమే వుంటాయి.

తిరుసభ తనకొరకు తాను లేదు. దైవరాజ్యాన్ని స్థాపించడం కొరకు వుంది. కనుక అది నిరంతరమూ దైవరాజ్యాన్ని బోధిస్తుంది. ఆ రాజ్యానికి పరిచర్యలు చేస్తుంది.

తిరుసభ దైవరాజ్యాన్ని సూచిస్తుంది. ప్రకటిస్తుంది. ఎరుకపరుస్తుంది. తన బోధ, సేవలు, కరుణకార్యాలు, ప్రేమ మొదలైనవాటిద్వారా దైవరాజ్యాన్ని వ్యాప్తిజేస్తుంది. దైవరాజ్యవ్యాప్తికి తిరుసభ సాధనం.

ఇప్పుడు తిరుసభ నెలకొనివున్న తావులోనే దైవరాజ్యంకూడ ఎక్కువగా నెలకొనివుంది. కాని దైవరాజ్యం లోకాంతంలోగాని పరిపూర్ణంగాదు. ఐనా తిరుసభలేందే దైవరాజ్యం లేదు. ఇదే తిరుసభ గొప్పతనం.

2. తిరుసభకంటె దైవరాజ్యం విస్తృతమైంది. తిరుసభ అంటే క్రీస్తుని విశ్వసించి అతనిలోనికి జ్ఞానస్నానం పొందిన క్రైస్తవ సమాజం మాత్రమే. దైవరాజ్యమంటే

ఇతరమతాల్లో వున్నా క్రీస్తు వరప్రసాదం సోకిన సజ్జనుల బృందంకూడ. ఇప్పుడు ఇవిరెండూ లోకంలో నెలకొని వున్నాయి. తిరుసభ సంపూర్ణంగా దైవరాజ్యంలో ఇమిడి వుంది. కాని దైవరాజ్యం తిరుసభలో ఇమడదు. అవిరెండూ వేరువేరు సంస్థలు.

నరులంతా సువిశేష విలువల ప్రకారం జీవించాలి. ఈ విలువలు తిరుసభలో ఎక్కువగా వుంటాయి. కాని యివి అన్యమతాల్లోగూడ వుండవచ్చు. ఇవి వున్నచోటల్లా దైవరాజ్యం కూడ వుంటుంది.

మనం చేరవలసిన చివరి గమ్యం తిరుసభ కాదు, దైవరాజ్యం. తిరుసభ తన బోధలద్వారా సేవలద్వారా సాక్ష్యంద్వారా మనలను దైవరాజ్యంలోనికి చేరుస్తుంది. అసలు తిరుసభ మనలను దైవరాజ్యానికి సిద్ధం చేయడానికే వుంది.

3. లోకాంతంలో తిరుసభ ఏమౌతుంది? లోకాంతంలో దైవరాజ్యం వచ్చినపుడు తిరుసభ అంతంకాదు. తానూ ఆ దైవరాజ్యంలో లీనమైపోతుంది. నూత్నవేదం తిరుసభ అంతాన్ని ఓ వివాహంగా భావిస్తుంది. లోకాంతంలో క్రీస్తు తిరుసభ అనే వధువుని పరిణయమాడతాడు - 2కొ 11,2. అనగా తిరుసభ క్రీస్తుతోను అతని దైవరాజ్యంతోను ఐక్యమైపోతుందని భావం. దర్శనగ్రంథం తిరుసభను క్రీస్తుతోడి వివాహానికి సిద్ధమైన వధువునుగా వర్ణిస్తుంది - 19,7.21,2. ఈ వధువుకి పరలోకపు యెరూషలేమని పేరు. ఇదే పరిపూర్ణమైన తిరుసభ. ఇదే దైవరాజ్యంకూడ.

ఈ విధంగా ఇహలోక జీవితంలో తిరుసభ దైవరాజ్యానికి సాధనంగా వుంటుంది. పరలోక జీవితంలో తానూ ఆ రాజ్యంలో కలసిపోతుంది.

## ప్రార్థనా భావాలు

1. బైబులు తిరుసభకు చాల వుపమానాలు వాడుతుంది. అది క్రీస్తు అనే కాపరి మేపే మంద - యోహా 10,11. దేవుడు నాటిన ద్రాక్షతోట - మత్త 21,33-43. దేవుడు నిర్మించిన భవనం - 1కొ 3,9. ఈ భవనంలోనే మనం వసిస్తాం. ఇంకా అది గొర్రెపిల్ల వధువు - దర్శ 19,7. 21,2. మనకందరికి తల్లి. ఈలాంటి తిరుసభపట్ల మనకెంతో భక్తి వుండాలి.

2. ఇప్పుడు మనం ఆరాధనకు దేవాలయానికి వెళ్తాం. కాని తొలిరెండు శతాబ్దాల్లోను రాతిగుళ్ళు లేవు. క్రైస్తవులు కొందరు భక్తుల యిండ్లల్లోనే ప్రోగై ఆరాధన జరుపుకొనేవాళ్ళు. ఆయిండ్లే తొలినాటి దేవాలయాలూ తిరుసభలూ కూడాను. ఈ గృహ దేవాలయాల పద్ధతిని నేడు మళ్లా పునరుద్ధరించాలి. క్రైస్తవులు ఆయా భక్తుల యిండ్లల్లో ప్రోగై ప్రార్థనలు జరుపుకొంటే క్రైస్తవ సమాజాలు బలపడతాయి. తిరుసభలో ఐక్యత పెరుగుతుంది. దైవసాన్నిధ్యం బలంగా నెలకొంటుంది. మౌలికసంఘాలు వృద్ధిలోకి వస్తాయి.

# 4. తిరుసభ ఎల్లరికీ రక్షణసాధనం

ముందటి అధ్యాయంలో తిరుసభ దైవరాజ్యానికీ సాధనంగా వుంటుందని చెప్పాం. రెండవ వాటికన్ సభ అది యెల్లరికీ రక్షణసాధనమని చెప్తుంది. ఈ యధ్యాయంలో అది యెల్లరికీ రక్షణ సాధనం ఏలా ఔతుందో పరిశీలిద్దాం. ఇక్కడ మూడంశాలు వున్నాయి.

అందరూ రక్షణం పొందాలనే దేవుని కోరిక - 1తిమో 2,4. అతడు సమస్తాన్ని క్రీస్తుకి పోలికగానే సృజించాడు. కనుక అందరూ క్రీస్తుని చేరాలనే దేవుని కోరిక - కొలో 1,15-16. క్రీస్తు పుట్టకముందే, యిస్రాయేలీయులు పుట్టకముందే, దేవుడు మానవ రక్షణాన్ని ప్రారంభించాడు. కనుక తిరుసభకు వెలుపలా, తిరుసభ పుట్టక ముందుకూడ రక్షణం వుంది. ఐనా ఈ రక్షణాన్ని గూర్చిన దివ్యశ్రుతి మాత్రం ఒకదేశంలో, ఒకకాలంలో, ఒకజాతితో ప్రారంభమైంది. అది యిస్రాయేలు జాతి. ఆ ప్రజనే దేవుడు తన దాన్నిగా యెన్నుకొన్నాడు. ఆ జాతిలోనే క్రీస్తు పుట్టాడు. దేవుడు అతన్ని రక్షణ కర్తనుగా నియమించాడు. ఆ క్రీస్తు రక్షణ సాధనంగా తిరుసభను ఏర్పాటు చేసాడు. ఐనా ప్రాచీనకాలంలోగాని ఆధునికకాలంలోగాని ఈ తిరుసభను గూర్చి కొద్దిమందికే తెలుసు. మరి అది యెల్లరికి రక్షణ సాధనం ఏలా ఔతుంది?

తిరుసభ అందరికి రక్షణ సాధనం అన్నాం. మొదట "రక్షణం" అంటే యేమిటో చూద్దాం. ఇక్కడమనం పేర్కొనే రక్షణం కేవలం పాపపరిహారం మాత్రమేకాదు. రక్షణమంటే ఇహపరాల్లోను శాంతి, ఆనందం, సౌభాగ్యం అనుభవించడం. ప్రభువు తానొచ్చింది జీవమీయడానికీ ఆజీవాన్ని సమృద్ధిగా ఈయడానికీ అన్నాడు - యోహా 10,10. కనుక ఇహపరాల్లోను క్రీస్తునుండి శాశ్వత జీవాన్ని పొందడమే రక్షణం.

ఇక తిరుసభ "రక్షణ సాధనం" అంటే యేమిటో చూద్దాం. తిరుసభ అందరికీ రక్షణ చిహ్నం లేక వరప్రసాదచిహ్నం ఔతుంది. అనగా అది అందరి రక్షణానికి గురుతుగాను సాధనంగానూ వుంటుంది. అంటే అందరు దానినుండే రక్షణం పొందుతారని భావం.

## 1. క్రీస్తే మొట్టమొదటి రక్షణసాధనం

దేవుడే క్రీస్తుని రక్షణ కర్తనుగా నియమించాడు. అతడు తండ్రికి ప్రతినిధి. తండ్రి ప్రేమకు గురుతు. క్రీస్తుని చూస్తే తండ్రిని చూచినట్లే. అనగా దేవుడు అతనిద్వారా మనకు దర్శనమిస్తాడు - యోహా 14,9. ఈ క్రీస్తు దేవుడూ నరుడూ కూడ. కనుక అతడు దేవునికీ నరునికీ మధ్య మధ్యవర్తి అయ్యాడు. తండ్రి అతనిద్వారా అన్నిటినీ తనతో రాజీ పరచుకొన్నాడు - కొలో 1,20.

క్రీస్తు మొదటి రక్షణ సాధనం కావడం వల్లనే అతని నుండి దేవద్రవ్యానుమానాలు తిరుసభ మొదలైన ఇతర రక్షణ సాధనాలు పుట్టాయి. నేడు మనం వీటిల్లో క్రీస్తుని కలసికొని అతడు అందించే రక్షణాన్ని పొందుతున్నాం.

## 2. తిరుసభ ఎల్లరికీ రక్షణ సాధనం

తిరుసభ ఎల్లరికీ రక్షణ సాధనం ఎందుకౌతుందంటే, దానిలో మనం ఉత్థాన క్రీస్తునీ అతని ఆత్మనూ కలసికొని రక్షణాన్ని స్వీకరిస్తాం. దానిలో క్రీస్తు సాన్నిధ్యం సంపూర్ణంగా వుంటుంది. ఆ సాన్నిధ్యం మనమీద సోకి మనకు వరప్రసాదాన్ని దయచేస్తుంది. మనలను దైవ రాజ్యానికి సిద్ధం చేస్తుంది.

తిరుసభ నానా రక్షణ సాధనాల్లో ఒకటి మాత్రమే కాదు. ఏకైక రక్షణ సాధనం. ఎందుకంటే ఏకైక మధ్యవర్తియైన క్రీస్తు దానిద్వారా మాత్రమే రక్షణ కార్యాన్ని నిర్వహిస్తాడు - 1తిమొ 2,5. ఎల్లరూ దానినుండి వరప్రసాదాన్ని పొందవలసిందే. ఇతర మతాల్లో కూడ క్రీస్తునుండీ, అతని తిరుసభనుండీ వచ్చే వరప్రసాదమే రక్షణాన్నిస్తుంది.

తిరుసభ తాను క్రీస్తునుండి పొందిన రక్షణాన్నే ఇతరులకు అందిస్తుంది. కనుక అది పవిత్రంగా జీవిస్తూ క్రీస్తు వరప్రసాదాన్ని పరిపూర్ణంగా పొందుతుండాలి. అందుచే అది నిరంతరమూ తన పాపాలకు తాను పశ్చాత్తాప పడుతుండాలి. తన కల్మషాలను తాను అధికాధికంగా కడిగివేసుకొంటుండాలి. అప్పుడేగాని క్రీస్తు ఆత్మ దానిలో బలంగా పనిచేయదు.

నరులంతా తన సొంత ప్రజలూ, పవిత్రాత్మ వసించే దేవాలయమూ, క్రీస్తు దేహమూ, కావాలనే తండ్రి కోరిక. క్రీస్తు నరులందరికీ శిరస్సు. నరులు అతని దేహం. ఆ శిరస్సూ దేహమూ రెండూ కలసి తన్ను ఆరాధించాలనే తండ్రి చిత్తం. తిరుసభ ఈ దైవచిత్తాన్ని నెరవేర్చడానికి వుంది. అందుకే అది అందరికీ రక్షణ సాధనమౌతుంది. ఎల్లరూ దాని ద్వారానే దైవరాజ్యంలో చేరాలి.

తిరుసభ ఈలోకంలో చిన్నమందే. ఐనా ఐక్యత ప్రేమ విశ్వాసాలనే పుణ్యాల ద్వారా అది నరజాతి కంతటికీ రక్షణ సాధనమౌతుంది. అది లోకానికి వెలుగూ, ఉప్పుగా వుంటుంది - మత్త 5,13-14.

## 3. అన్యమతాల స్థానం

కాని తిరుసభ ఏకైక రక్షణ సాధనమైతే, అన్యమతాల స్థానం ఏమిటి? అవి నరులకు రక్షణ సాధనాలు కావా?

రెండవ వాటికన్ సభ అన్యమతాల్లో కూడ పవిత్రత, న్యాయం, సత్యం, మంచితనం అనే విలువలున్నాయని రూఢిగా ప్రకటించింది. దేవుడు అందరి రక్షణాన్నీ కోరేవాడు కనుక అతని ఆత్మ ఒక్క తిరుసభలోనే కాక దానికి వెలుపల కూడ పనిజేస్తూ వచ్చింది.

క్రైస్తవేతరులకు కూడ రక్షణం వుంటుందని ఈ సభ స్పష్టంగా బోధించింది. ఈ బోధలో నాల్గంశాలున్నాయి. 1. నరులు పాపంలో పడిపోయాక గూడ దేవుడు వారిని చేయి విడువడు. వారి రక్షణకు అవసరమైన వరప్రసాదాన్ని వారికి ఇస్తూనే వుంటాడు. 2. ఆ ప్రభువు మనకు తెలియని పద్ధతిలో క్రీస్తు మరణోత్థానాల ప్రతిఫలమైన రక్షణం అన్యమతస్థుల మీదకూడ సోకేలా చేస్తాడు. క్రీస్తు అందరు నరుల కొరకు చనిపోయాడుకదా! కనుక మనకు తెలియని రీతిలో అతని మరణోత్థానాలు అందరిమీద సోకుతాయి. 3. దేవుని రక్షణం దేవద్రవ్యానుమానాలకూ తిరుసభకూ మాత్రమే కట్టుపడి వుండదు. వీటి ప్రమేయం లేకుండా గూడ అది పనిచేయవచ్చు. క్రీస్తు రాకముందే, అతడు ఉత్థానం కాకముందే, పవిత్రాత్మ లోకంలోని నరులమీద తన ప్రభావాన్ని చూపుతూ వచ్చింది. 4. తమ అంతరాత్మ ప్రకారమూ దేవుని చిత్త ప్రకారమూ జీవించేవాళ్ళు ఎవరైనా ఎక్కడైనా రక్షణాన్ని పొందుతారు. అంతరాత్మ నరుని హృదయంలోని పవిత్రదేవాలయం. దానిలో నరులకు దేవుని స్వరం వినిపిస్తుంది. ఆ స్వరం ఆదేశం ప్రకారం జీవించేవాళ్లకు తప్పక రక్షణం లభిస్తుంది.

ఈ సూత్రాల ప్రకారం అన్యమతాల్లో కూడ సత్యమూ వరప్రసాదమూ వుంటాయి. కనుక అన్యమతాల నుండి కూడ రక్షణం లభిస్తుంది. అనగా తిరుసభకు వెలుపలకూడ రక్షణం వుంది. మరి అప్పుడు తిరుసభ ఏకైక రక్షణ సాధనం అనడంలో భావం ఏమిటి?

రెండవ శతాబ్దంలో జీవించిన ఓరిజిన్ అనే వేదశాస్త్రి "తిరుసభకు వెలుపల రక్షణం లేదు" అని చెప్పాడు. ఐదవ శతాబ్దంలో సిప్రియన్ భక్తుడు ఈ సూత్రాన్ని బాగా ప్రచారం చేసాడు. అతని దృష్టిలో తిరుసభ నోవా వోడలాంటిది. ఆ వోడను ఎక్కని వాళ్లెవరూ రక్షణం పొందరు. శతాబ్దాల పొడుగునా తిరుసభకూడ ఈ సూత్రాన్ని తన బోధల్లో అధికార పూర్వకంగా పునరుద్ఘాటిస్తూ వచ్చింది.

ఇంతవరకు మనం చూచినదాన్నిబట్టి తిరుసభకు వెలుపలకూడ రక్షణం వుంటుందని ఒక సూత్రం చెప్తుంది. తిరుసభకు వెలుపల రక్షణం లేదని ఇంకో సూత్రం చెప్తుంది. ఈ రెండు సూత్రాలను సమన్వయపరచడం ఏలా?

ఇక్కడ రెండంశాలను గమనించాలి. 1. తిరుసభకు వెలుపల రక్షణం లేదు అంటే భావం ఇది. క్రీస్తే "మీరు వెళ్లి అందరిని నా శిష్యులను చేయండి. వారికి నా

పేరిట జ్ఞానస్నానం ఈయండి" అని ఆదేశించాడు - మత్త 28,19. దీన్నిబట్టి అందరూ తిరుసభలో చేరాలని విశదమౌతుంది. కనుక ఎవరైనా సరే తిరుసభను దేవుడే ఏర్పాటు చేసాడని తెలసికూడ దానిలో చేరకపోతే వారికి రక్షణంలేదు. కాని తెలియక తిరుసభలో చేరకపోతే వారికి రక్షణం వుండవచ్చు. 2. రక్షణం పొందాలంటే నరులు వస్తుతః తిరుసభలో చేరి వుండనక్కరలేదు. హృదయంలోని కోరికద్వారా దానికి చెందివుంటే చాలు. ఈ కోరిక స్పష్టంగా వుండనక్కరలేదు. అస్పష్టంగా వున్నా చాలు. అనగా నరునికి తాను దైవచిత్తప్రకారం జీవించాలనే కోరిక వుంటే చాలు రక్షణం లభిస్తుంది. అందరికీ తిరుసభలో చేరే అవకాశం లేకపోవచ్చుకదా!

ఫలితార్థమేమిటంటే, తిరుసభ ఏకైక రక్షణ సాధనమని తెలిసికొన్నవాళ్లకి అది వొక్కటే రక్షణ సాధనం. వాళ్లకు అన్యమతాల ద్వారా రక్షణం లభించదు. కాని అలా తెలియనివాళ్ళకు అన్యమతాల ద్వారా గూడ రక్షణం లభిస్తుంది. ఐనా ఈ రక్షణం క్రీస్తునుండీ తిరుసభనుండీ వచ్చిందే.

ఇక్కడ "తెలిసికొన్న వాళ్ళకు" అంటే కేవలం బుద్ధిశక్తితో తెలిసికోవడం మాత్రమే కాదు. నరునికి తిరుసభను గూర్చి క్షుణ్ణంగా తెలిసికొనే అవకాశమూ వుండాలి. దానిలో చేరే అవకాశమూ వుండాలి. మనదేశం, మన పూర్వుల మతం అనే దురభిమానాలు అడ్డురాకుండా వుండాలి. బంధుమిత్రులు మతం మార్చిడిని అంగీకరించాలి. ఈలాంటి అవకాశాలన్నీ వున్నవారికి తిరుసభ ఒక్కటే రక్షణ సాధనం ఔతుంది. ఇవిలేనివారికి ఇతర మతాలు కూడ రక్షణ సాధనాలు కావచ్చు. ఈలా అన్యమతాల ద్వారా రక్షణను పొందే సజ్జనులను నేటి వేదశాస్త్రులు "క్రైస్తవులనే పేరులేని క్రైస్తవులు" అని పేర్కొంటున్నారు. అనగా వీళ్లు వస్తుతః క్రైస్తవులు కాకపోయినా నిజజీవితంలో క్రైస్తవులుగా జీవించేవాళ్లు.

ఇప్పుడు మనం "తిరుసభకు వెలుపల రక్షణం లేదు" అంటే ఈ తిరుసభను క్యాతలిక్ తిరుసభనుగా మాత్రమే అర్థం చేసికోగూడదు. క్రీస్తు మరణోత్థానాలు సోకినవారి బృందంగా అర్థం చేసికోవాలి. అప్పుడు "తిరుసభ వెలుపల రక్షణం లేదు" అన్నా "తిరుసభ ఎల్లరికి రక్షణ సాధనం" అన్నా భావం ఒకటే ఔతుంది. క్రీస్తు మరణోత్థానాలు నరులందరిమీదా సోకుతాయి. కనుక ఈ విశాలార్థంలో అందరికీ రక్షణం లభించవచ్చు. అప్పుడు క్రీస్తు మరణోత్థానాల ఫలితమైన రక్షణాన్ని బుద్ధిపూర్వకంగా నిరాకరించిన వాళ్లు మాత్రమే రక్షణను కోల్పోతారు.

తిరుసభ తన బోధద్వారా, సేవద్వారా, పవిత్రతద్వారా అందరికీ తన్నుతాను ఎరుకపరచుకోవాలి. అప్పుడు అందరూ దానిలో చేరి పరిపూర్ణంగా రక్షణను పొందే అవకాశం లభిస్తుంది.

తిరుసభ ఉత్సాహంతో సకలజాతి జనులకూ క్రీస్తుని బోధించాలి. ఈ యన్యజాతుల మతాల్లోని మంచి సూత్రాలను తానూ గ్రహించాలి. సత్యమంతా తిరుసభలోనే లేదు. ఇతర మతాల్లో కూడ వుంది. ఇంకా, తిరుసభ ప్రపంచంలోని నానా జాతుల్లోను వారి సంస్కృతుల్లోను వేరు బాతుకోవాలి. ఈ దేశ క్రైస్తవులు ఈ దేశ సంస్కృతిని ఆదరించాలి అనడానికి ఇది ముఖ్యకారణం. పైగా తిరుసభ అన్యమతాలతో సంప్రతింపులు ప్రారంభించి వాటిలోని సత్యాలను గ్రహించడానికి సిద్ధంగా వుండాలి. పెక్కు మతాలతో కూడిన మనదేశంలో ఈ సూత్రాల ప్రాముఖ్యం అంతాయింతా కాదు.

## ప్రార్థనా భావాలు

1. ప్రాచీన వేదశాస్త్రులు తిరుసభను నోవా నిర్మించిన ఓడతో పోల్చారు - ఆది 8. ఆ వోడ నెక్కిన వాళ్ళంతా బ్రతికారు. తతిమ్మా వాళ్ళంతా జలప్రళయంవల్ల నాశమయ్యారు. అదే విధంగా తిరుసభలో చేరిన వాళ్ళకు రక్షణం వుంటుంది. తతిమ్మా వాళ్లు నాశమైపోతారు.

2. క్రీస్తు సేవకుడు - మార్కు 10,45. అతడు స్థాపించిన తిరుసభ కూడ సేవకురాలు కాని యజమానురాలు కాదు. తిరుసభలో అధికారమూ నాయకత్వమూ వున్నాయి. కాని ఇవి రెండూ సేవలు చేయడానికే గాని పెత్తనం చలాయించడానికి కాదు. బిషప్పులూ గురువులూ కన్యలూ ప్రధానంగా సేవలు చేయడానికే వున్నారు. తిరుసభలో అందరూ అందరికీ సేవలు చేయాలి. సేవక తిరుసభ ప్రజలను మెప్పిస్తుంది, ఆకర్షిస్తుంది. మదర్ తెరీసా లాంటి మాన్యులు ఈ రంగంలో మనకు ఆదర్శంగా వుంటారు.

# 5. తిరుసభ ప్రేషితసేవ

క్రీస్తు ప్రధానంగా ప్రేషితుడు (పంపబడినవాడు). అతడు నెలకొల్పిన తిరుసభకూడ ప్రేషిత సమాజం. క్రీస్తు ప్రేషిత సేవను కొనసాగింపమని ఆత్మ నిరంతరమూ తిరుసభను ప్రేరేపిస్తూంటుంది. ఈ యధ్యాయంలో తిరుసభ ప్రేషితసేవను పరిశీలిద్దాం. ఇక్కడ మూడంశాలు చూద్దాం.

## 1. క్రీస్తే తిరుసభను పంపుతాడు

క్రీస్తు ప్రేషితసేవను రకరకాలుగా వర్ణించవచ్చు. అతడు దైవరాజ్యాన్ని నెలకొల్పేవాడు. నరులను దేవునితో రాజీపరచేవాడు. పేదలకు సువార్తను బోధించేవాడు. పాపులను శిక్షించడానికిగాక రక్షించడానికి వచ్చినవాడు. సేవలు చేయించుకోవడానికీ కాక చేయడానికి వచ్చినవాడు. తిరుసభకూడ క్రీస్తులాగే రకరకాల ప్రేషిత సేవలకు పూనుకొంటుంది. అది క్రీస్తుని నేడు మన మధ్యలో కొనసాగించేది.

తండ్రి క్రీస్తుని దైవరాజ్యాన్ని బోధించడానికి పంపాడు. క్రీస్తు కూడా తన తరపున తాను తిరుసభను దైవరాజ్యబోధకు పంపుతాడు. కనుకనే అతడు శిష్యులతో మీరు లోకం నలుమూలలకు పోయి నరులందరికి సువిశేషాన్ని బోధించండి అని చెప్పాడు - మార్కు 16,15. మీరు పోయి ఎల్లరిని నా శిష్యులనుగా జేయండి. నా పేరిట వారికి జ్ఞానస్నానమీయండి అన్నాడు - మత్త 28,19. తండ్రి నన్ను పంపినట్లే నేనూ మిమ్ము పంపుతున్నాను అని పల్కాడు - యోహా 20,21. ఈ శిష్యులే ఆదిమ తిరుసభ.

ఇంకా, తండ్రి తనకిచ్చిన అధికారాన్ని క్రీస్తు తిరుసభకిచ్చాడు. కనుకనే అతడు శిష్యులతో మీ మాటలు వినేవాడు నా మాటలు వింటాడు. మీ పలుకులు విననివాడు నా పలుకులు వినడు అని పల్కాడు - లూకా 10,16. నేడు తిరుసభ ముఖ్యమైన పని క్రీస్తు ప్రేషితసేవను కొనసాగించడమే.

క్రీస్తు ప్రేషిత కార్యాన్ని కొనసాగించే తిరుసభ అతని రక్షణాన్ని అందరికీ అందిస్తుంది. దైవరాజ్యాన్ని ఎల్లెడల నెలకొల్పుతుంది. సువార్త వెలుగును అంతట ప్రసరింపజేసి నరులందరిని, జాతులన్నిటిని, ఏకకుటుంబంగా ఐక్యంజేస్తుంది. ఆర్థిక సాంఘిక విషయాలతో గూడిన లౌకిక రంగాన్ని గూడ సువిశేష ప్రకాశంతో నింపి పునీతం జేస్తుంది.

## 2. తిరుసభ క్రీస్తు మూడు లక్షణాల్లో పాలుపొందుతుంది.

క్రీస్తులాగే తిరుసభకూడ మూడు రంగాల్లో ప్రేషిత సేవ చేస్తుంది. అతడు రాజు, ప్రవక్త, యాజకుడు.

రాజుగా క్రీస్తు కాపరి, నాయకుడు. అతడు ప్రజలను నడిపించాడు. వారి మేలుకోరి వారికి సేవలు చేసాడు. క్రీస్తు కార్యాన్ని కొనసాగించే తిరుసభ కూడ ప్రజలకు నాయకత్వం వహించి వారికి పరిచర్యలు చేస్తుంది. విద్యవైద్యం ఆర్థిక సాంఘికాది అభివృద్ధి కార్యక్రమాలు మొదలైన నానారంగాల్లో తిరుసభ అందించే సేవలు మనం రోజూ చూస్తూనే వున్నాం.

ప్రవక్తగా క్రీస్తు దైవరాజ్యాన్ని బోధించాడు. తిరుసభకూడ నేడు ఈ బోధన సేవను కొనసాగిస్తుంది. పూజలో జరిగే సువిశేషబోధ, జ్ఞానోపదేశ సేవ, దైవశాస్త్రబోధ, మతగ్రంథ ప్రచురణం మొదలైన నానా రూపాల్లో నేడు బోధన సేవ కొనసాగుతూంది.

యాజకుడుగా క్రీస్తు సిలువపై ఆత్మార్పణం చేసికొని ప్రజలను పవిత్ర పరచాడు. తిరుసభ ముఖ్యంగా దేవ ద్రవ్యానుమానాలద్వారా ఈ పవిత్రీకరణాన్ని కొనసాగిస్తుంది. విశేషంగా క్రీస్తు సిలువబలిని మన మధ్య కొనసాగించడం ద్వారా ప్రజలను పునీతులను చేస్తుంది.

క్రీస్తే మొదటి సువిశేష బోధకుడు. క్రీస్తు ఆజ్ఞద్వారా ఆ పరిచర్యను నేడు తిరుసభ కొనసాగిస్తుంది. ఈ సేవలో పైన పేర్కొన్న రాజత్వం ప్రవకృత్యం యాజకత్వం అనే మూడు గుణాలు ఇమిడేవున్నాయి. సువిశేష పరిచారం ద్వారా తిరుసభ లోకానికి తెలియజేసే ముఖ్యాంశాలు ఇవి. తండ్రి క్రీస్తుద్వారా మనలను ప్రేమించాడు. క్రీస్తుద్వారా మనకు నిత్యజీవం దయచేసాడు. క్రీస్తు ద్వారా మనకు తండ్రి రక్షణమూ వరప్రసాదమూ కృపా లభిస్తాయి.

## 3 ఆధ్యాత్మిక లౌకిక రంగాల్లో తిరుసభ సేవలు :

తిరుసభ సేవ ప్రధానంగా ఆధ్యాత్మిక రంగంలో వుంటుంది. అది ముఖ్యంగా నరులకు దైవరాజ్యాన్ని బోధించేది. ఐనా ఈ నరులు దేహాత్మలతో కూడినవాళ్ళు. వారికి ఈలోక జీవితం కూడ ముఖ్యమే. కనుక తిరుసభ కేవలం ఆధ్యాత్మిక రంగాన్ని మాత్రమే పట్టించుకొని లౌకిక రంగాన్ని అనాదరం చేయదు. అందుకే అతి ప్రధానంగా ఆధ్యాత్మిక రంగంలో పనిచేసినా, లౌకికరంగాన్ని కూడ విలువతో జూస్తుంది. జాతీయ అంతర్జాతీయ సంఘటనలు, కుటుంబజీవితం, శాంతి, సమాచార సాధనాలు, అభివృద్ధి కార్యక్రమాలు, మానవ హక్కులు మొదలైన నానారంగాల్లో కృషి చేస్తుంది.

ఇటీవల తిరుసభ పేదసాదలకు జరిగే అన్యాయాలను చక్కదిద్దడం అనే రంగంలో ఎక్కువ శ్రద్ధ చూపుతూంది. పేదల విమోచనం కొరకు ఎన్నో పథకాలను రూపొందిస్తుంది. ఇండియాలాంటి పేద దేశాల్లో సాంఘిక అన్యాయాలూ అసమానతలూ ఎన్నయనా వుంటాయి. మనదేశంలో వెనుకబడిన వర్గాల అభివృద్ధి కొరకు తిరుసభ ఎనలేని సేవలు చేస్తుంది. ఈ సభ పరిచర్యల ద్వారా దళిత వర్గాల ప్రజలు ఎంతో అభివృద్ధిలోకి వచ్చారు.

తిరుసభ అహింసా మార్గాన్ని, వ్యక్తి స్వేచ్ఛను, మత స్వేచ్ఛను సమర్థిస్తుంది.

## ప్రార్థనా భావాలు

1. తిరుసభలో మఠవాసినులైన కన్యలు ఓ ముఖ్యభాగం. ఐదవ శతాబ్దంలో జీవించిన సిప్రియన్ భక్తుడు వీరినిగూర్చి ఈలా నుడివాడు. "కన్యలు తిరుసభ అనే చెట్టు మీద పూచిన పూవుల్లాంటివాళ్లు. వరప్రసాదంతో అలంకృతమైనవాళ్ళు. భగవంతునికి ప్రతిబింబాలుగాను ఆ ప్రభువు పావిత్ర్యానికి చిహ్నాలుగాను నిల్చేవాళ్లు. వీళ్లు క్రీస్తు మందలో అతి శ్రేష్ఠమైన భాగం. తల్లియైన తిరుసభ తన పుత్రికలైన వీరినిజూచి ఆనందిస్తుంది". ఈ మఠకన్యలు తమ అంతస్తుకి తగినట్లుగా భక్తి శ్రద్ధలతో జీవించాలని ప్రార్థిద్దాం.

2. తిరుసభలో మఠవాసులుకూడ ఓ వర్గం. గురువుల వర్గంనుండీ సహోదరుల వర్గంనుండికూడ సభ్యులు ఈ మఠవాసుల్లో చేరతారు. వీళ్లు దారిద్ర్యం విరక్తత్వం విధేయత అనే వ్రతాలద్వారా దేవునికి పరిపూర్ణంగా నివేదితులౌతారు. సేవామార్గాన్ని చేపట్టి తిరుసభ అభివృద్ధి కొరకు నిరంతరం కృషిచేస్తారు. నిర్మలజీవితం గడుపుతూ తిరుసభ పావిత్ర్యానికి గురుతుగా వుంటారు. వీరి కృషివల్ల తిరుసభ ఇంకా అభివృద్ధిలోకి రావాలని ప్రార్థిద్దాం.

# 6. తిరుసభకు ఉపమానాలు

ఓ వైపునుండి చూస్తే తిరుసభ మానవ సమాజం. దానిలో అంతస్తులూ అధికారాలూ పరిపాలనమూ వున్నాయి. లోపాలూ పాపాలూ కూడ వున్నాయి. ఈ దృష్టితోజూస్తే అది మన కంటికి కన్పించేది, మనకు అర్థమయ్యేది. మన మానుష సంస్థల్లాంటిది. కాని మరోవైపునుంచి చూస్తే అది దేవుడు నెలకొల్పినన సమాజం. ఉత్థానక్రీస్తు ఆత్మ దానిలో వుండి దాన్ని నడిపిస్తూంటుంది. వరప్రసాదంవల్ల అది యేనాటికీ నాశమైపోదు. ఈ దృష్టితో జూస్తే అది మనకంటికి కన్పించేదీకాదు, మనకు అర్థమయ్యేదీకాదు. దైవశక్తితో నడచే దివ్యసంస్థ.

దైవసంస్థకూడ కనుకనే తిరుసభను దైవరహస్యం అన్నారు. దైవరహస్యం అంటే యేమిటి? ఏదైనా ఓ వేద సత్యం వుందనుకొందాం. అది మనంతట మనకు తెలియదు. బైబులుద్వారా తెలుస్తుంది. కాని బైబులుద్వారా తెలుసుకొన్నాకగూడ ఆ వేద సత్యం మనకు పూర్తిగా అర్థంకాదు. మన బుద్ధిశక్తి దాన్ని గ్రహించలేదు. దాన్ని మనం విశ్వాసంతో నమ్మవలసిందే. ఉదాహరణకు పరిశుద్ధత్రీత్వం, క్రీస్తు మనుష్యావతారం దైవరహస్యాలు. తిరుసభకూడ ఈలాంటి దైవరహస్యమే. మనం దాని మానవస్వభావాన్ని గ్రహించగలమేకాని దివ్యస్వభావాన్ని గ్రహించలేం. దానిలోని దైవసాన్నిధ్యాన్ని ఆత్మశక్తినీ వరప్రసాదబలాన్నీ మనం పూర్తిగా అర్థంజేసికోలేం.

దేవుడు నరుడై జన్మించినపుడు ఆనాటి ప్రజలు అతని మానవత్వాన్ని గుర్తించారేకాని దైవత్వాన్ని గుర్తించలేదు. అలాగే నేడు మనం తిరుసభలోని మానవగుణాలను చూస్తామే కాని దైవగుణాలను చూడలేం. కనుక అది మనకు దైవరహస్యంగానే మిగిలిపోతుంది. మరి తిరుసభను అర్థంజేసికోవడం ఏలా?

బైబులూ ప్రాచీన వేదశాస్త్రులూకూడ తిరుసభలోని దైవరహస్యాన్ని తెలియజేయానికి కొన్ని వుపమానాలు వాడారు. వీటి సహాయంతో మనకు అర్థంకాని తిరుసభను కొంతవరకైనా అర్థంజేసికోవచ్చు. ఇవి నూరుదాకా వున్నాయి. వీటన్నిటినీ

మనమిప్పుడు పరిశీలించి చూడలేం. వీటిల్లో ముఖ్యమైనవి ఏడెన్మిది వున్నాయి. వీటిల్లో ప్రస్తుతానికి మూడింటిని మాత్రం పరిశీలిద్దాం. అవి దైవప్రజ, క్రీస్తుదేహం, పవిత్రాత్మకు ఆలయం అనేవి.

## 1. తిరుసభ దైవప్రజ

తిరుసభలోని ప్రజలందరు, అనగా పోపుగారు కార్డినళ్లు బిషప్పులు గురువులు మఠవాసులు గృహస్థులు అందరు దైవప్రజలే. దైవప్రజలైనంతవరకు వీళ్ళందరు సరిసమానులే. దేవుడే వీళ్ళందరిని కరుణతో ఎన్నుకొని తన ప్రజలనుగా జేసికొన్నాడు. దైవప్రజలంతా దేవునికి అంకితమైనవాళ్లు. ఆ ప్రభువుని స్తుతించి కీర్తించి సేవించడం, అతన్ని ఇతరులకు గూడ చూపించడం వారి బాధ్యత. పూర్వనూత్నవేదాలు కూడ ఈ దైవప్రజను గురించి సవిస్తరంగా పేర్కొంటాయి.

### 1. పూర్వవేదంతో దైవప్రజ

పూర్వవేదం దైవప్రజను గూర్చి ఐదంశాలు చెప్తుంది. వీటిని క్రమంగా పరిశీలిద్దాం.

1. సీనాయి నిబంధనం ద్వారా యూదులు దైవప్రజలయ్యారు. కనుక వాళ్ళ జీవితంలో ఈ నిబంధనం ముఖ్యాతిముఖ్యమైంది. ఈ నిబంధనం చేసికొన్నపుడు ప్రభువు యూదులకు చెప్పిన వాక్యాలివి. “మీరు నా మాట విని నా నిబంధనను జాగ్రత్తగా పాటిస్తే సకల జాతుల్లోను మీరే నావారు, నా సొంతప్రజలు ఔతారు. ఈ భూమండలమంతా నాదే కదా! మీరే నాకు యాజకరూప రాజ్యం, మీరే నా పవిత్ర ప్రజ” - నిర్గ 19,5-6.

యిస్రాయేలీయులు నిబంధనం ద్వారా ఏలా యావే ప్రజలయ్యారో ఈ వాక్యాలు తెలియజేస్తాయి. ఈ నిబంధన కాలంనుండి “మీరు నా ప్రజలు, నేను మీ దేవుణ్ణి” అనే పలుకుబడి ప్రచారంలోకి వచ్చింది.

ప్రభువు యూదుల మంచితనాన్ని బట్టిగాని సంఖ్యనుబట్టిగాని వాళ్ళను తన వారినిగా ఎన్నుకోలేదు. కేవలం తన ప్రేమనుబట్టి మాత్రమే వారిని తన ప్రజనుగా జేసికొన్నాడు - ద్వితీ 7,7-8.

ప్రభువు తన సేవకుడైన మోషేద్వారా యూదులకు ధర్మశాస్త్రాన్ని దయచేసాడు. వాళ్లు ఆ ధర్మశాస్త్ర విధులను ఖండితంగా పాటించాలి. ఈలా పాటించడం నిబంధనంలో ఓ భాగం.

ప్రభువు యిస్రాయేలు సమాజంలో వసిస్తాడు - నిర్గ 29,45-46. వాళ్ళను కాచి కాపాడతాడు. ఈ దైవసాన్నిధ్యాన్నే యూదులు ఇమ్మానువేలు అని పిల్చారు. ఆ ప్రజలు దైవ మందసం చుట్టూ ప్రోగై ఈ యిమ్మానువేలు దేవుణ్ణి ఆరాధించారు. ఈ యారాధనలో వాళ్లు ఆ ప్రభువు తమ్ము ఐగుప్తు దాస్యంనుండి విడిపించుకొని వచ్చి సీనాయి కొండదగ్గర తమతో నిబంధనం చేసికొన్న వుదంతాన్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నారు.

2. ప్రభువు యిస్రాయేలీయులను ఎన్నుకొంది వాళ్లు తన్ను స్తుతించి కీర్తించడానికి, అన్యప్రజలకుగూడ ఆ దేవుణ్ణి తెలియజేసి వాళ్ళనుగూడ ఆ ప్రభువు దగ్గరికి రాబట్టడానికి - యెష 43,21. లోకంలోని జాతుల్లో యిస్రాయేలు ముఖ్యమైంది. దీనిద్వారా అన్యజాతులు యావే దగ్గరికి రావాలి. ప్రభువు మొదట యిస్రాయేలును రక్షిస్తాడు. దానిద్వారా అన్యజాతులను గూడ రక్షిస్తాడు. యెహెజ్కేలు ప్రవక్త చూచిన జలప్రవాహం దేవాలయం నుండి అన్ని దిశలకు పారుతుంది. అనగా ప్రభువు రక్షణం యూదులనుండి అన్నిజాతులకూ వ్యాపిస్తుందని భావం - 47,1-12. యూదులకు జాతిపితయైన అబ్రాహాము దీవెనలు అన్ని జాతులకూ లభిస్తాయి - ఆది 12,2-3. కనుక యిస్రాయేలు అన్యజాతులకు మధ్యవర్తి, దీపం, నిబంధనం ఔతుంది - యెష 42,6. ఈ విధంగా యూదులు దేవుణ్ణి పూజించి అన్యులు కూడ అతన్ని పూజించేలా చేస్తారు. ఇందుకే దేవుడు వాళ్లను ఎన్నుకొంది.

3. దైవప్రజలకు గుర్తు ఏమిటి? మొదట వీళ్లు అబ్రాహాము ఈసాకు యాకోబులనే పితరుల వంశానికి చెందివుండాలి. అటుతర్వాత అబ్రాహాము కాలంనుండి ఆచరణలో వున్న సున్నతిని పొందివుండాలి. ఇంకా, ప్రభువు ధర్మశాస్త్రాన్ని పాటించాలి. విశేషంగా దానిలో పవిత్రతకు సంబంధించిన నియమాలనూ, అతిముఖ్యంగా విశ్రాంతి దిననియమాన్నీ పాటించాలి. ఈ బాహ్య లక్షణాలతో పాటు యావే ప్రభువుని ఏకైక హృదయంతో సేవించాలి. ఇది ఆంతరంగికమైన లక్షణం - నిర్గ 20,1-3. ఈలాంటి వాళ్ళకు అబ్రాహాము దీవెనలు లభిస్తాయి.

4. యిస్రాయేలీయులకు వ్యక్తీ ముఖ్యమే సమాజమూ ముఖ్యమే. సమాజం పాపపుణ్యాలు వ్యక్తినీ, వ్యక్తి పాపపుణ్యాలు సమాజాన్నీ ప్రభావితం చేస్తాయి. కనుక వాళ్ళంతా పరస్పర సంబంధం కలవాళ్లు. కావున ఏకంగా యిస్రాయేలు సమాజమూ ముఖ్యమే, వ్యస్తంగా ఆ సమాజంలోని ప్రతివ్యక్తీ ముఖ్యమే.

5. యూదులు దేవుడు చేసిన నిబంధనను మీరారు. యావేను నిరాకరించారు. ప్రభువు వాళ్ళను రోసి మీరు నా ప్రజలు కాదు నేను మీ దేవుణ్ణి కాదు అని పల్కాడు - హోషే 1,9. సీనాయి నిబంధనను రద్దుచేసాడు. కాని యూదులంతా యావేను నిరాకరించరు. "శేషజనం" అనే చిన్న వర్గం అతన్ని భక్తితో కొలుస్తుంటుంది - యెష

10,21-22. వీళ్లు "నూత్న యిస్రాయేలు" ఔతారు. ప్రవక్తల బోధల ప్రకారం ప్రభువు అంత్యకాలంలో యూదప్రజల హృదయాన్ని మారుస్తాడు. వాళ్ళతో నూత్న నిబంధనం చేసికొంటాడు - యిర్మీ 31,31. అప్పుడు మళ్లా యూదులు ప్రభువు ప్రజలౌతారు, అతడు వాళ్లు కొలిచే దేవుడౌతాడు. పూర్వవేదాంత కాలంలో భక్తులు ఈ నూత్న నిబంధన కొరకు ఎదురుచూస్తున్నారు. ఆ నిరీక్షణం క్రీస్తు ద్వారా ఫలిస్తుంది.

పైన మనం పేర్కొన్న ఐదంశాల సారాంశం ఇది. 1. దేవుడు కేవలం తన ప్రేమవల్లనే యిస్రాయేలును ఎన్నుకొన్నాడు. 2. దేవుడు వారిని ఎన్నుకొంది తన్ను పూజించే పవిత్ర ప్రజను తయారుచేయడానికే. యూదులు ప్రధానంగా యావేను పూజించే యాజకులు. 3. నిబంధనం ద్వారా యూదులు యావే ప్రజలయ్యారు. యిస్రాయేలు ప్రభువును నిరాకరించినా అతడు వాళ్ళను నిరాకరించడు. అతడు అంత్యకాలంలో నూత్న నిబంధనం ద్వారా మళ్లా నూత్న ప్రజను తయారుచేస్తాడు.

## 2. నూత్న వేదంలో దైవప్రజ

ప్రవక్తలు అంత్యకాలంలో నూత్న నిబంధనం జరుగుతుందనీ నూత్నప్రజ పుడుతుందనీ తెలియజేసారు. పూర్వవేదం సూచించిన ఈ యంత్యకాలప్రజ క్రైస్తవ ప్రజలేనని చెప్తుంది నూత్నవేదం. పూర్వవేదం యూద ప్రజకు చెప్పిన లక్షణాలన్నీ నూత్నవేదం క్రైస్తవ ప్రజలకు గూడ వర్తింపజేస్తుంది.

ఇక, పూర్వవేద ప్రజలుపోయి నూత్నవేద ప్రజలు ఏలా వచ్చారో పరిశీలిద్దాం. ఇక్కడ ఐదంశాలు చూద్దాం.

1. చారిత్రకంగా జరిగిన సంగతి యిది. పూర్వవేదప్రజ పోయి నూత్నవేద ప్రజ వచ్చిందని తొలినాటి యెరూషలేము క్రైస్తవులు క్రమేణ గుర్తించారు. వాళ్లు క్రమేణ తాము కొత్త యిస్రాయేలుమని అర్థం జేసికొన్నారు.

తొలుత యూదులు యూదక్రైస్తవులు కలసే వుండేవాళ్ళు. యూద క్రైస్తవులు కూడ ధర్మశాస్త్రాన్ని పాటించారు, దేవాలయారాధనలో పాల్గొన్నారు. కాని వాళ్ళకు ఉత్థాన క్రీస్తుపట్ల విశ్వాసం వుంది. ఆ విశ్వాసమే వాళ్ళు తాము నిజమైన యిస్రాయేలుమని గుర్తించేలా చేసింది.

ఈ క్రైస్తవ సమాజం జ్ఞానస్నానాన్ని స్వీకరించి తమ యిండ్లల్లోనే ప్రార్థన జరిపి దివ్యసత్ప్రసాద బలిని సమర్పించింది. పేత్రు నాయకత్వం క్రింద ఉమ్మడి జీవితం గడిపి క్రీస్తు నేర్పిన ప్రేమ సూత్రాన్ని పాటించింది. ఈ కార్యాలేవీ యూద సమాజంలో లేవు. వీటివల్లగూడ తొలినాటి క్రైస్తవులు తాము వేరే సమాజమని గుర్తించారు. పూర్వవేదం పేర్కొన్న అంత్యకాలపు దైవప్రజ తామేనని గ్రహించారు.

స్తెఫను హింసతో యెరూషలేములోని క్రైస్తవ యూదులు చెల్లాచెదరై యితర ప్రాంతాలకు పారిపోయి అక్కడ అన్యజాతులకు గూడ క్రీస్తుని బోధించారు. విశేషంగా అంతియోకయ కేంద్రంలో చాలమంది గ్రీకు ప్రజల క్రైస్తవ సమాజంలో చేరారు - 1.చ. 11,20-21. దీనితో తొలినాటి క్రైస్తవ బృందానికి నూత్నజ్ఞానం కలిగింది. క్రొత్త యిస్రాయేలులో యూదులు మాత్రమే కాక అన్యజాతుల వాళ్ళుకూడ వుంటారని అర్థమైంది. పూర్వవేద ప్రజలు యూదులు మాత్రమే. కాని నూత్న యిస్రాయేలు అన్ని జాతులతో కూడింది.

2. పూర్వవేద ప్రజ పోయి నూత్నవేద ప్రజ వచ్చింది అని చెప్పాం. ఈ నూత్నవేద ప్రజ పూర్వవేద ప్రజల పవిత్ర లక్షణాలను తనకూ అన్వయించుకొంది. 1పేత్రు 2,9-10లో ఈ యన్వయం స్పష్టంగా కన్పిస్తుంది. "మీరు ఎన్నుకొనబడిన జాతి. రాచరికపు గురుకులము. పవిత్ర జనము. దేవుని సొంత ప్రజలు."

సీనాయి నిబంధనలో యిస్రాయేలు ప్రజలకు వర్తించిన లక్షణాలే (నిర్గ 19,5-6). ఇక్కడ క్రైస్తవ ప్రజలకు కూడ వర్తిస్తాయని ఈ వాక్యాల భావం. ఈ పట్టున మనం నాల్గు లక్షణాలను పరిశీలిద్దాం. 1. క్రైస్తవులు "దేవుడు ఎన్నుకొనిన జాతి". ఇది పూర్వవేద యూదుల లక్షణం - నిర్గ 19,5. ఇప్పుడు అదే లక్షణం క్రైస్తవులకూ వర్తిస్తుంది. 2. వారు "రాచరికపు గురుకులం." ఇది నిర్గమ కాండంలోని యాజక రూపమైన రాజ్యం అనేదానికి సమానం 19,6. పూర్వవేదపు యూదుల దేవుణ్ణి పూజించే శ్రేష్ఠమైన యాజకులు. అలాగే క్రైస్తవులు కూడ క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది ఆ ప్రభువుని పూజించే శ్రేష్ఠులైన యాజకులౌతారు. 3. వారు "పవిత్రప్రజ". పూర్వవేద జనులు పవిత్ర ప్రజలు 19,6. వాళ్ళు పవిత్రుడైన దేవునికి అంకితులై అతన్ని కొల్చారు. కనుక పవిత్రప్రజ లయ్యారు. సీనాయి నిబంధనం వాళ్ళను ఇతర జాతులనుండి వేరుచేసి ప్రభువుకి అంకితం చేసింది. దీనివల్ల వాళ్లు పవిత్ర ప్రజలయ్యారు. నూత్నవేదంలో మనం జ్ఞానస్నానం ద్వారా క్రీస్తు ప్రజలమై అతనికి అంకితమౌతాం. కనుక పవిత్ర ప్రజలమౌతాం. 4. క్రైస్తవులు "దేవుని సొంత ప్రజలు." పూర్వవేద కాలంలో ఎన్నో జాతులు వుంటే దేవుడు యిస్రాయేలునే తన సొంత ప్రజగా ఎన్నుకొన్నాడు - 19,6. అలాగే నూత్నవేదంలో పలు జాతుల మధ్య మనం క్రీస్తుకి సొంత ప్రజలమౌతాం. మన జ్ఞానస్నానమే దీనికి కారణం.

ఈ యాలోకనాన్ని బట్టి తొలినాటి క్రైస్తవులు తామే అంత్యకాలపు దైవప్రజలమని అర్థం జేసికొన్నారు అనుకోవాలి. అంత్యకాలపు ప్రజలను గూర్చిన ప్రవచనాలు తమ విషయంలో నెరవేరాయని ఎంచారు అనుకోవాలి.

3. పూర్వ నూత్నవేదాల ప్రజలకు తేడా ప్రధానంగా ఒక్క అంశంలోనే వుంది. అది వుత్థాన క్రీస్తు ఆరాధనం. దేవుడు ఈ యంత్యకాలపు ప్రజను క్రీస్తు చిందించిన రక్తం ద్వారా సంపాదించుకొన్నాడు - అ.చ. 20,28. క్రీస్తు అనేకులకొరకు తన రక్తాన్ని చిందించాడు - మార్కు 14,24. ఈ యనేకులు యూదులూ అన్యజాతివాళ్లు కూడాను. వీళ్ళంతా క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది అతనిద్వారా తండ్రిని ఆరాధించే నూత్నప్రజ ఔతారు. కనుక క్రీస్తుద్వారా నూత్నవేద ప్రజ పూర్వవేద ప్రజకంటె భిన్నమైనదౌతుంది.

4. రెండవ వాటికన్ మహాసభ నూత్నవేద ప్రజల లక్షణాలను నాల్గింటిని పేర్కొంటుంది.

మొదటిది, నూత్నవేద ప్రజలంతా ఏకప్రజ. అనగా పోపుగారు బిషప్పులు గురువులు మఠవాసులు గృహస్థులూ అందరూ దైవప్రజలే. ఈ దృష్టితో జూస్తే వీళ్లల్లో తారతమ్యాలు లేవు. అంతా దైవప్రజ. అందరి విలువా సరిసమానమే. అందరూ దేవునికి అంకితమైన ఏకప్రజే.

రెండవది, ఈ ప్రజ నూత్నప్రజ. పూర్వవేదపు యూదులకు మారుగా వచ్చిన క్రొత్తప్రజ. క్రీస్తు సిలువబలి వీళ్ల ఆవిర్భావానికి కారణం. పూర్వ నూత్నవేద కాలాల్లో గూడ దేవుడు తలంచుకొంటే వ్యక్తులను వ్యక్తులనుగా రక్షించేవాడే. కాని అతడు పూర్వ నూత్నవేద ప్రజలనుగూడ సమాజాలనులాగే రక్షించాడు. ఇప్పుడు మనం క్రైస్తవ వ్యక్తులంగాము, క్రైస్తవ సమాజానిమి.

మూడవది, నూత్నవేద ప్రజలకు వ్యత్యాసం క్రీస్తు వల్లనే వచ్చింది. వాళ్ళ క్రీస్తు ఆత్మార్పణం వలన ఆవిర్భవించినవాళ్ళు. పూర్వవేద ప్రజలు దేవుని దాసులు. వీళ్ళు క్రీస్తుద్వారా దేవునికి దత్తపుత్రులు. మెస్సీయా ప్రజలు. వీళ్ల ద్వారా ఇప్పుడు లోకంలోని జాతులన్నీ దీవెనలు పొందుతాయి.

నాల్గవది, నూత్నవేద ప్రజ యాత్రికప్రజ. పూర్వం యూదులు ఈజిప్టునుండి వాగ్దత్త భూమికి యాత్ర చేసారు. ఇప్పుడు మనం ఈ లోకంనుండి పరలోకానికి యాత్రచేస్తున్నాం. ఈ లోకంలో తిరుసభ పాప భూయిష్ఠంగా వుంటుంది. కనుక అది మాటిమాటికీ పశ్చాత్తాపపడి తన పాపమాలిన్యాన్ని కడిగివేసుకొంటూండాలి. తన తప్పిదాలకు నిరంతరమూ దేవునినుండి మన్నింపు పొందుతూండాలి. ఈ పశ్చాత్తాపం ద్వారా తన వినయాన్ని ప్రకటించుకొంటూండాలి.

5. ఇప్పుడు ఎవరు, ఏ విధంగా తిరుసభకు చెందుతారు? ఇప్పుడు క్యాతలిక్ క్రైస్తవులూ వున్నారు. ప్రోటస్టెంటు క్రైస్తవులూ వున్నారు. అన్యమతాలకు చెందిన క్రైస్తవేతరులూ వున్నారు. వీళ్ళంతా ఏవిధంగా తిరుసభకు చెందుతారు? ఈ మూడువర్గాల

ప్రజలకు తిరుసభతో వుండే సంబంధాన్ని గూర్చి రెండవ వాటికన్ సభ ఈలా తెలియజేస్తుంది.

క్యాతలిక్ ప్రజలు పూర్తిగా తిరుసభలో చేరినవాళ్ళు. క్రీస్తు స్థాపించిన తిరుసభ, ఆదిమ క్రైస్తవ సమాజం, నేడు ఈ సభలోనే కొనసాగుతుంది.

ప్రోటస్టెంటు సమాజాల ప్రజలు తిరుసభతో కలసినవాళ్ళు. క్రీస్తుపట్ల విశ్వాసం వల్లా జ్ఞానస్నాన దివ్యసత్ర్పసాదాలవల్లా బైబులును అంగీకరించడంవల్లా వీళ్ళకు తిరుసభతో దగ్గరి సంబంధం వుంది. కనుక వీళ్ళు ఆ సభలో కలసిన వాళ్ళవుతారు.

అన్యమతాల ప్రజలు తిరుసభతో సంబంధం వున్నవాళ్ళు. వీళ్ళంతా దేవుణ్ణి కొల్చేవాళ్లే. ఆ దేవుని పేరు మీదిగా తోడి నరుణ్ణి అంగీకరించేవాళ్లే. కనుక ఏదోరూపంలో వీళ్ళకుకూడ తిరుసభతో సంబంధం వుంటుంది.

## 2. తిరుసభ క్రీస్తు శరీరం

తిరుసభ దైవప్రజ అనడం ఎంత సబబో క్రీస్తు శరీరం అనడంకూడ అంత సబబు. ఈ భావం విశేషంగా పౌలు జాబుల్లో వస్తుంది. ఇక్కడ మూడంశాలు చూద్దాం

### 1. శరీరమూ, సామూహిక వ్యక్తీ

మనం మామూలుగా నరుల్లో దేహమూ ఆత్మా రెండూ వుంటాయని చెప్తాం. దేహాత్మలు కలసి నరుడు లేక వ్యక్తి ఔతాడు అంటాం. కాని హీబ్రూ ప్రజలు నరుణ్ణి ఈలా విభజించలేదు. వాళ్ళకు నరుడు ఏకవస్తువు. ఈ యేకవస్తువునే వాళ్ళు శరీరం (బసార్) అనికాని లేక ప్రాణం (నఫేష్) అనికాని పిల్చారు. కనుక హీబ్రూ ప్రజల దృష్టిలో "శరీరం" అంటే మనం అనుకొనే నరుడు లేక వ్యక్తి. కనుకనే యెషయా 52,10లో "సకల శరీరులు మన దేవుని రక్షణాన్ని చూస్తారు" అంటే, సకల జనులు దేవుని రక్షణాన్ని చూస్తారని అర్థం.

హీబ్రూ ప్రజల్లో ఇంకో భావంకూడ వుంది. వాళ్లకు సామూహిక వ్యక్తులు అనేవాళ్ళున్నారు. ఈ వ్యక్తి ఒక సమూహానికి నాయకుడు. అతడు ఆ సమూహాన్నంతటినీ సూచిస్తాడు. దాన్నంతటినీ తనలో ఇముడ్చుకొంటాడు. అతడు ఆ సమూహంలో వుంటాడు, ఆ సమూహంగూడ అతనిలో వుంటుంది. ఉదాహరణకు, ఆదాము ఓ సామూహిక వ్యక్తి. అతడు నరజాతికి శిరస్సు లేక నాయకుడు. నరజాతి అంతా అతనిలో ఇమిడి వుంటుంది. అతడూ నరజాతిలో ఇమిడి వుంటాడు. యాకోబుకి యిస్రాయేలని మరోపేరు వుంది. ఈ యిస్రాయేలు కూడ ఓ సామూహిక వ్యక్తి. యిస్రాయేలీయులంతా అతనిలో ఇమిడివున్నారు. అలాగే క్రీస్తుకూడ సామూహిక వ్యక్తి. క్రైస్తవులంతా అతనిలో ఇమిడివున్నారు. ఈ రెండవ

భాగాన్ని అర్థం జేసికోవాలంటే మనం పైన పేర్కొన్న "శరీరం" "సామూహిక వ్యక్తి" అనే రెండు భావాలను జాగ్రత్తగా గమనించి వుండాలి.

తిరుసభ క్రీస్తు శరీరం అని పౌలు తన జాబుల్లో 91సార్లు తెలిపాడు. ఉదాహరణకు "క్రీస్తు తన శరీరమైన తిరుసభకు శిరస్సు" - కొలో 1,18. పౌలు ఈ యంశాన్ని ఇన్నిసార్లు చెప్పాడు అంటే అతని భావం ఏమైయుండాలి? తిరుసభ అంటే క్రీస్తుని విశ్వసించి అతనిలోనికి జ్ఞానస్నానం పొందిన క్రైస్తవ ప్రజలు. అనగా క్రైస్తవ సమాజం. ఇక క్రైస్తవ సమాజం క్రీస్తు శరీరం అంటే భావం ఏమిటి? హీబ్రూ ప్రజలు నరుణ్ణి లేక వ్యక్తిని శరీరం అనేవాళ్ళని చెప్పాం. కనుక క్రైస్తవ సమాజం క్రీస్తు శరీరం అంటే, క్రైస్తవులు క్రీస్తు అనే వ్యక్తి ఔతారని భావం.

కాని క్రైస్తవులు క్రీస్తనే వ్యక్తి ఏలా ఔతారు? హీబ్రూ ప్రజలకు "సామూహిక వ్యక్తి" అనే భావంకూడ వుందని చెప్పాం. ఓ సమూహమంతా తమ నాయకుళ్లో ఇమిడివుంటుంది. అతనితో ఐక్యమై వుంటుంది అని చెప్పాం. ఈ భావం ప్రకారం క్రైస్తవులంతా తమ నాయకుడైన క్రీస్తుతో కలసి ఏకవ్యక్తి ఔతారు. ఇక, తిరుసభ అంటే ఈ క్రైస్తవులే. కనుక తిరుసభ లేక క్రైస్తవ సమాజం తమ నాయకుడైన ఉత్థాన క్రీస్తు రూపంలో లోకంలో కన్పిస్తూంటుంది. లేదా, ఉత్థాన క్రీస్తే తిరుసభ రూపంలో కన్పిస్తాడు. ఉత్థాన క్రీస్తే తిరుసభ, తిరుసభే ఉత్థాన క్రీస్తు.

పౌలు తిరుసభలో ఓ సభ్యుడు. పై తిరుసభే ఉత్థాన క్రీస్తు కనుక అతడు "నాకు జీవించడమంటే క్రీస్తుని జీవించడమే" అని చెప్పుకొన్నాడు - ఫిలి 1,21. "ఇప్పుడు నేనుకాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు అనికూడ చెప్పికొన్నాడు - గల 2,20. పౌలులాగే క్రీస్తుపట్ల భక్తితో జీవిస్తే నేడు మనం కూడ ఈలాగే చెప్పుకోవచ్చు.

## 2. మూడు ముఖ్య భావాలు

తిరుసభ క్రీస్తు శరీరం అనడంలో పౌలు ఉద్దేశించిన భావం, క్రైస్తవులూ, ఉత్థానక్రీస్తూ కలసి ఏకవ్యక్తి ఔతారని.

తిరుసభ క్రీస్తు శరీరం అని చెప్పడంద్వారా పౌలు మూడు ప్రధాన భావాలను సూచించాడు. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

1) క్రీస్తు తిరుసభ అతి సన్నిహితంగా ఐక్యమౌతారు. వాళ్లిద్దరు కలసి ఏక శరీరం (ఏకవ్యక్తి) ఔతారు. ఈ యైక్యతకు పౌలు వివాహం, జ్ఞానస్నానం, దివ్యసత్ప్రసాదం అనే మూడు ఉదాహరణలు చెప్పాడు.

స్త్రీ పురుషులు లేక భార్యాభర్తలు లైంగికంగా కలసికొన్నపుడు ఏలా ఏక శరీరమౌతారో క్రీస్తు తిరుసభా కలసి అలా ఏక శరీరమౌతారు. నరుడు వేశ్యతో కలసినప్పుడు వాళ్లిద్దరు కలసి ఏకవ్యక్తి ఔతారు. అలాగే క్రీస్తు క్రైస్తవుడు కలసి ఏకవ్యక్తి ఔతారు - 1కొ 6,16-17.

క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందడం వల్లకూడ అతడూ మనమూ కలసి ఏక శరీరమౌతాం - రోమా 6,3-4.

క్రీస్తుని దివ్యసత్రసాదంగా స్వీకరించడం ద్వారా కూడ అతడూ మనమూ కలసి ఏక శరీరమౌతాం - 1కొ 10,17. ఈ మూడు ఉదాహరణల్లోను ఐక్యత ప్రాముఖ్యం చెప్పబడింది.

2) తిరుసభలోని సభ్యులంతా క్రీస్తుతో కలసి ఏకశరీరం (ఏకవ్యక్తి) ఔతారు. ఈ శరీరానికి క్రీస్తే శిరస్సు. తిరుసభ సభ్యులే అవయవాలు. దేహంలో ఒక్కో అవయవం ఒక్కో పనిచేసి శరీరాభివృద్ధికి తోడ్పడుతుంది. అలాగే తిరుసభలోని ఒక్కో సభ్యుడూ ఒక్కొ పనిచేసి క్రీస్తు శరీరాభివృద్ధికి తోడ్పడాలి - 1కొ 12,12-13. ఇక్కడ అవయవాల ప్రాముఖ్యం చెప్పబడింది.

3) క్రీస్తూ క్రైస్తవులూ కలసి ఏక శరీరం (ఏకవ్యక్తి) ఔతారు. ఈ దివ్య శరీరానికి క్రీస్తు శిరస్సు. తిరుసభ సభ్యులు అవయవాలు - ఎఫే 1,22-23. ఇక్కడ "శిరస్సు" అంటే నాయకుడు. క్రీస్తుతో ఐక్యమైన తిరుసభను క్రీస్తు నాయకుడే నడిపిస్తాడని భావం. ఇక్కడ శిరస్సు ప్రాముఖ్యత చెప్పబడింది.

పై పౌలు వాక్యాల సారాంశమేమిటంటే ఉత్థానక్రీస్తూ క్రైస్తవులూ ఒకేవ్యక్తి ఔతారు. కాని ఈ యైక్యతను ఏలా అర్థంజేసికోవాలి? ఇది భౌతికమైన ఐక్యత కాదు. ఉత్థానక్రీస్తూ మనమూ వేర్వేరు వ్యక్తులుగానే వుండిపోతాం. ఒకరితో ఒకరం భౌతికంగా కలసిపోం. కనుక ఇది ఆధ్యాత్మికమైన ఐక్యత. మనం జ్ఞానస్నాన విశ్వాసాల ద్వారా ప్రభువుతో ఐక్యమైనపుడు అతని వరప్రసాదం మనమీద పనిచేస్తుంది. క్రీస్తు ఆత్మ మనలను ప్రభువుతో జోడిస్తుంది. దీనివల్ల మనలోని జంతుప్రవృత్తి, పాపస్వభావం క్రమేణ అంతరిస్తాయి. క్రీస్తు స్వభావం అతని దివ్యగుణాలు మనలో నెలకొంటాయి. దీనిద్వారా ప్రాకృతిక మానవుడు క్రమేణ ఆధ్యాత్మిక మానవుడుగా మారిపోతాడు. బైబులు ఉపమానాలతో చెప్పాలంటే ఈ యైక్యత భార్యాభర్తల ఐక్యతలా వుంటుంది - ఎఫె 5,30-31. చెట్టు కొమ్మల ఐక్యతలా వుంటుంది - యోహా 15,5. పునాదిరాయి దానిమీద కట్టబడిన భవనం ఐక్యతలా వుంటుంది - 1పేత్రు 2,5. దేహంలోని శిరస్సు అవయవాల ఐక్యతలా వుంటుంది - 1కొరి 12,12.

## 3. ఏక శరీరమనే భావం ప్రాముఖ్యం

తిరుసభ క్రీస్తు శరీరమన్నాం. అనగా క్రీస్తూ మనమూ కలసి ఏకవ్యక్తిమౌతామని అర్థం అని చెప్పాం. ఇక ఈ భావం ప్రాముఖ్యమేమిటో, అది మనకు ఏలా ప్రేరణం పుట్టిస్తుందో తెలిసికొందాం.

ఉత్థాన క్రీస్తు కరుణతో మనలను తనతో ఐక్యం జేసికొంటాడు. అతడు తిరుసభ రూపంలో, అనగా మన మానవరూపంలో ఈ లోకంలో కన్పిస్తాడు. నరమాత్రులమైన మనం అతని దివ్యసత్ప్రసాదంలో పాలుపొందుతాం. అంతేకాదు, అల్పప్రాణులమైన మనం దేవుణ్ణి ఈ లోకంలో ప్రత్యక్షం చేస్తాం. అతడే మనం, మనమే అతడు కదా! ఈలా క్రీస్తుని ఈ లోకంలో కన్పించేలా చేయడం మన అదృష్టం, మన భాగ్యం.

కాని ఈ భాగ్యం మనకు గొప్ప బాధ్యతను గూడ తెచ్చిపెడుతుంది. మనం క్రీస్తుని లోకానికి చూపించాలి. కనుక మన ప్రవర్తనం యోగ్యంగా వుండాలి. మన తరపున మనం వళ్లు దగ్గర బెట్టుకొని నడవాలి. ఏలా?

క్రీస్తుతో ఏక వ్యక్తులమై మనం ప్రభువులాగే ఇతరులకు సేవలు చేయాలి. ఇతరులమీద పెత్తనం చెలాయించకూడదు. ఆ ప్రభువులాగే మనమూ సరళత్వమూ పేదరికమూ వినయవిధేయతలూ అలవర్చుకోవాలి. విశుద్ధంగా జీవించాలి. అతనిలాగే మనమూ నిరంతరమూ దైవరాజ్యాన్ని బోధించాలి. సంగ్రహంగా చెప్పాలంటే ఈ లోకంలో మనమూ క్రీస్తులాగే ప్రవర్తించాలి. ఆ ప్రభువు తలంపులు పలుకులు చేతలు మన తలపుల్లో పలుకుల్లో చేతల్లో ప్రతిఫలించాలి. మనం నిరంతరమూ, అతనితో ఐక్యమై అతనిలా దివ్యజీవితం గడపాలి. "ఇప్పుడు నేనుకాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు" అన్నట్లుగా వుండాలి. కనుక మనం క్రీస్తు శరీరమై వుండడం ఓ భాగ్యమూ, ఓ బాధ్యతా కూడ.

ఇంకా, తిరుసభ క్రీస్తు శరీరం గనుక ప్రభువు ఆ తిరుసభ అంతటా ప్రత్యక్షమై వుంటాడు. విశేషంగా తిరుసభ వాక్యబోధ చేసేపుడు, దేవద్రవ్యానుమానాలు ఇచ్చేపుడు, ఆరాధనం జరిపేపుడు ఉత్థాన క్రీస్తు సాన్నిధ్యం దానిలో బలంగా వుంటుంది.

క్రీస్తు తిరుసభకు శిరస్సు, లేక నాయకుడు. కనుక తిరుసభ వ్యక్తిగతంగాను సామూహికంగాను గూడ క్రీస్తుమీద ఆధారపడి వుండాలి. మనం స్వీయ శక్తితోగాక క్రీస్తు వరప్రసాద బలంతో పనిచేసేవాళ్లం. మనం పడిపోయినపుడల్లా ఆ ప్రభువు నెనరుతో మన పాపాలను మన్నించి మనలను మళ్లా పైకి లేపుతాడు.

క్రీస్తు శిరస్సు. మనం అవయవాలం. దేహంలోని అవయవాల్లో ఐక్యత వుంటుంది. అలాగే క్రీస్తులోకి ఐక్యమైన మనలోమనకు ఐక్యత వుండాలి. అనగా మనం సోదరప్రేమతోను

సహకార భావంతోను జీవించాలి. మనలో మనకు తగాదాలూ విభేదాలూ ముఠాలూ పనికిరావు. కులం వర్గం ఆడుమగ అనే భేదభావాలు ఉండకూడదు.

క్రీస్తు ఆత్మే మనలను ఆ ప్రభువుతోను పరస్పరమూను ఐక్యం చేస్తుంది. ఈ యాత్మ వరప్రసాదం వల్లనే మనం స్వార్థాన్ని జయిస్తాం. పాపానికి దూరంగా వుంటాం. దేవుణ్ణి ఆరాధిస్తాం. తోడివారిని అంగీకరిస్తాం. నమ్మకంతో ప్రభువు రెండవ రాకడ కొరకు వేచివుంటాం.

## 3. తిరుసభ ఆత్మకు ఆలయం

1. ఆత్మకు హీబ్రూ భాషలో "రువా" అనిపేరు. ఈ పదానికి గాలి, ఊపిరి, ప్రాణం అనే వివిధార్థాలున్నాయి. సృష్ట్యాదిలో ఆత్మ ఆదిమ జలాలమీద పక్షిలా ఎగిరి ప్రాణికోటిని పుట్టించింది – ఆది 1,2. దేవుడు మట్టిముద్దలోనికి ఈ యాత్మను వూదగా అది జీవంగల ప్రాణి ఐంది. అతడే ఆదాము – ఆది 2,7. ఈ విధంగా ఆత్మ ప్రాణిసృష్టికి కర్త ఐంది.

ఈ యాత్మ నూత్న జీవానికీ నూత్న సృష్టికీ గూడ కర్త. ప్రభువు బాబిలోనియా ప్రవాసంలో వున్న యూదులతో "నేను నా యాత్మను మీ మీదికి పంపి మీరు మళ్లా జీవించేలా చేస్తాను" అంటాడు – యెహె 37,14. అనగా ప్రవాసంలో చిక్కి చచ్చినవాళ్లలా వున్న యూదులకు ప్రభువు ఆత్మ నూత్నజీవాన్ని దయచేస్తుందని భావం. ఈ జీవం ఆ యాత్ముడు పూర్వం ఆదాముకి దయచేసిన జీవంలాంటిది. కనుక ఇది నూత్నసృష్టి.

మెస్సీయా కాలం వచ్చినపుడు ప్రభువు నరులందరి మీద తన ఆత్మను కుమ్మరిస్తాడని యోవేలు ప్రవక్త నుడివాడు – 2,28. ఒక్క మెస్సీయా కాలపు ప్రజలేకాక, మెస్సీయాకుగూడ ఈ యాత్మ లభిస్తుంది. ఆత్ముడు మెస్సీయాకు సప్తవరాలు దయచేస్తాడు – యెష 11,2-5. ఆత్మశక్తితోనే అతడు పేదలకు సువార్తను బోధించి న్యాయాన్ని నెలకొల్పుతాడు – 61,1-2.

2. నూత్నవేదంలో యెరూషలేములోని ఆదిమ క్రైస్తవ సమాజమే మెస్సీయా ప్రజలు. మెస్సీయా వీళ్ళ నాయకుడు. కనుక ఆత్మ మొదట ఇతన్ని నడిపిస్తుంది. యెషయా చెప్పినట్లు ఆత్మ మెస్సీయా శిశువుమీదికి దిగివచ్చింది. ఆత్మశక్తి వల్లనే మరియ గర్భంతాల్చి మెస్సీయా శిశువునుకంది – లూకా 1,35. జ్ఞానస్నాన సమయంలో ఆత్మ అతనిమీదికి పావురంలా దిగివచ్చింది – 3,22. ఇది ఆదిమ జలాలమీద ఎగిరిన ఆత్మే. ఆత్మబలంతోనే క్రీస్తు దైవరాజ్యాన్ని బోధించాడు, అద్భుతాలు చేసాడు. మరణానంతరం అతడు ఆత్మశక్తితోనే ఉత్థానమయ్యాడు – 1కొ 15,45.

ఉత్థానక్రీస్తు తన ఆత్మను పెంతెకోస్తు దినాన యెరూషలేములోని మెస్సీయా ప్రజలమీదికి పంపాడు. ఆ యాత్మ వారిమీదికి గాలిలా నిప్పులా నాలుకల్లా దిగివచ్చింది - అ.చ. 2,2-4. తర్వాత పేత్రు యెరూషలేములో బోధిస్తూ యోవేలు ప్రవచనం నెరవేరి ఆత్మ తమమీదికి దిగివచ్చిందని నొక్కిచెప్పాడు - 2,16-18. పూర్వవేదం సూచించిన శేషజనమూ, మెస్సీయాజనమూ, అంత్యకాలపు జనమూ తామేననిగూడ విశదంచేసాడు.

ఈ సమాజాన్ని ఆత్మే సృజించింది. ఆత్మ లోకాదిలో సృష్టి జరిగించింది. ఇప్పుడు ఈ మెస్సీయా సమాజాన్ని నెలకొల్పడం ద్వారా నూత్నసృష్టిని కావించింది. పూర్వం మెస్సీయాను మరియ గర్భంలో రూపొందించిన ఆత్మే ఇప్పుడు ఈ మెస్సీయా సమాజాన్నిగూడ రూపొందించింది. జ్ఞానస్నానానంతరం క్రీస్తుని దైవబోధకు పంపిన ఆత్మే ఇప్పుడు యెరూషలేం సమాజాన్ని కూడ వేదబోధకు పంపుతుంది. జ్ఞానస్నానానంతరం ఆత్మ క్రీస్తుని చైతన్యవంతుణ్ణి చేసింది. ఇప్పుడు పెంతెకోస్తు సంఘటనం తర్వాత ఆత్మ శిష్యులనుకూడ చైతన్యవంతులను చేసింది.

ఆత్మ తొలినాటి క్రైస్తవ సమాజాన్ని నడిపించినతీరు అపోస్తలుల చర్యలు అనే గ్రంథం సవిస్తరంగా వివరిస్తుంది. కనుకనే ఈ గ్రంథానికి "ఆత్మచర్యలు" అనికూడ పేరు.

3. ఇక ఆత్మ దేవాలయంలోలాగ తిరుసభలో నెలకొనివుండే తీరును పరిశీలిద్దాం. తిరుసభ దేవుడే నిర్మించిన దేవాలయం అనే భావం నూత్నవేదంలో వుంది. క్రీస్తు తన తిరుసభను పేత్రు అనే పునాది రాతిమీద ఓ మందిరంలా నిర్మిస్తానన్నాడు - మత్త 16,18.

పూర్వవేదంలో యెరూషలేం దేవాలయం దైవసాన్నిధ్యానికి నిలయం. నా ఆలయం ప్రజలందరికి ప్రార్థనాలయమౌతుంది అన్నాడు ప్రభువు - యెష 56,7. పూర్వవేద ప్రజకు ఓ దేవాలయమున్నట్లే నూత్న వేదప్రజకుగూడ ఓ దేవళం అవసరం. కాని నూత్నవేదంలో మెస్సీయా అతని ప్రజలూ కలసి ఈ దేవళమౌతారు. కనుక ఇక్కడ రాతిగుడికి బదులుగా ఉత్థానక్రీస్తూ అతన్ని ఆరాధించే క్రైస్తవ ప్రజ అనే దేవళం వచ్చింది. క్రైస్తవ భక్తసమాజమే దేవాలయమైంది.

క్రీస్తు మీరు ఈ దేవాలయాన్ని పడగొట్టండి. నేనుదాన్ని మళ్ళా మూడురోజుల్లో లేపుతానన్నాడు. ఉత్థానక్రీస్తే ఈ దేవాయలం - యోహా 2,21. ఉత్థానక్రీస్తూ అతన్ని ఆరాధించే భక్తసమాజమూ కలసి ఓ మందిరమౌతుంది. నూత్నవేదంలో ఈ సమాజమే దైవసాన్నిధ్యానికి నియలం. ఈ మందిరం ఆత్మశక్తిద్వారా ఏర్పడుతుంది. కనుక ఈ దేవాలయం ఆత్మాలయంకూడ. నూత్నవేద ప్రజలంతా కలసి ఆత్మకు ఆలయం. ఉత్థానక్రీస్తు ఆత్మద్వారా ఈ దేవాలయంలో నెలకొనివుంటాడు. భక్తజనులను ప్రేరేపిస్తూంటాడు.

కడన, క్రైస్తవ సమాజాన్ని దేవాలయంగా వర్ణించే పౌలు బోధలను రెండింటిని తిలకిద్దాం. మొదటిది 1కొ 3,16-17. "మీరు దేవుని ఆలయమనీ, దేవుని ఆత్మకు నివాసమనీ మీకు తెలియదా? మీరే దేవుని ఆలయం". ఇక్కడ పౌలు పేర్కొనే ఈ ఆలయం కొరింతులోని క్రైస్తవ సమాజం. ఆత్మ కొరింతు ప్రజల్లో వసిస్తుంది కనుక వాళ్లు దేవాలయమయ్యారు. కోరింతు క్రైస్తవుల లోపాలు వారికున్నాయి. ఐనా ఉత్థానక్రీస్తు అతని ఆత్మా వారిలో నెలకొని వున్నారు. వారిని దేవాలయం చేసారు. పూర్వం దేవుని సాన్నిధ్యం యెరూషలేములోని రాతిగుడిలో వుండేది. ఇప్పుడు ఆ సాన్నిధ్యం క్రైస్తవ సమాజంలో వుంటుంది. ఇక ఆ రాతిగుడితో పనిలేదు. ఇప్పుడు ప్రజలే ఆధ్యాత్మిక దేవాలయం. కొరింతు క్రైస్తవ సమాజమే దేవాలయం గనుక, ఆ సమాజంలోని ప్రజలు బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి. వారిలో వుండేది పవిత్రమైన దైవసాన్నిధ్యం గనుక వాళ్ళ జీవితంగూడ పవిత్రంగా వుండాలి.

1 కొరింతీయులు 6,19 ప్రతి క్రైస్తవుడు వ్యక్తిగతంగా కూడ దేవాలయమేనని చెప్తుంది. కాని పౌలుకి ఈ వ్యక్తి అనేది ముఖ్యాంశం కాదు. సమాజంలోని ఆత్మ సాన్నిధ్యమే వ్యక్తిలోకి వస్తుంది. అతని ప్రధాన భావం, సమాజమే దేవాలయమనేది. రాతిగుడికి బదులుగా సమాజ దేవాలయం వచ్చింది అనేది అతని నూత్న భావం. ఇక్కడ కొరింతులోని స్థానిక తిరుసభను పౌలు దేవాలయంగా వర్ణించాడు. ఈలాంటి స్థానిక తిరుసభలను అతడు చాల స్థాపించాడు. అవన్నీ దేనికది దేవాలయాలే.

ఇక, పౌలు ఒక్క స్థానిక తిరుసభనే కాక తిరుసభ నంతటినీ ఆత్మకు ఆలయంగా పేర్కొన్న వేదభాగం ఎఫెసీయులు 2,18-22. ఇక్కడ అతడు క్రైస్తవ సమాజాన్నంతటినీ ఓ దేవాలయంగా వర్ణించాడు. ఈ దేవాలయానికి ప్రవక్తలూ అపోస్తలులూ కలసి పునాది ఔతారు. క్రైస్తవ సభ్యులంతా దేవాలయ నిర్మాణంలో వాడిన శిలలు ఔతారు. ఈ శిలల్లో యూదక్రైస్తవులూ అన్యజాతి క్రైస్తవులూ కూడవున్నారు. క్రీస్తు ఈ దేవళానికి మూలరాయి. ఈ రాయి పునాదిలో కాక భవనం కప్పులో వుంటుంది. భవనాన్నంతటినీ కలిపి వుంచుతుంది. ఈ మందిరంలో దేవుడు తన ఆత్మద్వారా నెలకొని వుంటాడు. కనుకనే ఇది దేవాలయమైంది. ఆత్మే ఈ దేవాలయన్ని పదిలంగా కాపాడుతుంది. ఇక, పూర్వవేదంలో యూదులు ప్రధానంగా దేవుణ్ణి స్తుతించి కీర్తించడానికి వున్నారు - యెష 43,21. అలాగే నూత్నవేద యిస్రాయేలైన క్రైస్తవులు కూడ క్రీస్తుద్వారా తండ్రిని స్తుతించడానికే వున్నారు. ఈ స్తుతి క్రైస్తవ సమాజంలో జరగాలి. ఈ సమాజం యూదులతోను అన్యజాతి వాళ్లతోను కూడిన భక్తబృందం. ఈ భక్తబృందంలో విశేషంగా జ్ఞానస్నానం దివ్యసత్ప్రసాదం అనేవాటిద్వారా ఈ స్తుతీ ఆరాధనా కొనసాగుతాయి. ఆత్మయందు క్రీస్తుద్వారా తండ్రికి ఈ యారాధనం జరుగుతుంది.

నేడు మనం రాతిగుడిని మాత్రమే దేవాలయంగా భావిస్తున్నాం. దివ్యసత్ప్రసాదం దానిలో పదిలపరుస్తున్నాం. దాన్ని సుందరంగా కడుతున్నాం. కాని తొలినాటి క్రైస్తవులు రాతిగుడిని కాక క్రైస్తవ భక్త సమాజాన్నే దేవాలయంగా భావించారు. దైవసాన్నిధ్యాన్ని ప్రధానంగా ఆ సమాజంలోనే చూచారు. మనం మళ్లా ఈ సామాజిక దేవాలయం అనే భావానికి రావాలి. ఆత్మద్వారా దైవసాన్నిధ్యం నెలకొని వుండేది ప్రధానంగా క్రైస్తవ సమాజంలోనేనని గుర్తించాలి. అప్పుడే సోదరప్రేమ పెరుగుతుంది. తోడివారిని విలువతోను ఆప్యాయంగాను చూస్తాం.

## ప్రార్థనా భావాలు

1. ఇరెనేయస్ భక్తుడు ఈలా వ్రాసాడు. “తిరుసభ వున్నచోట పవిత్రాత్మ వుంటుంది. ఆత్మ వున్నచోట తిరుసభా, సకల వరప్రసాదాలూ వుంటాయి”. కనుక మామూలుగా తిరుసభకు చెందకుండా ఆత్మను పొందలేం.

2. పవిత్రాత్మ క్రైస్తవుల్లో ఒక్కొక్కనికి ఒక్కో వరం దయచేస్తుంది. ఈ వరాలతో క్రైస్తవులు తిరుసభకీ, లోకానికంతటికీ సేవలు చేయాలి. తిరుసభలోని అధికారులు విశ్వాసుల వరాలను అణచివేయకూడదు. తిరుసభ క్షేమాభివృద్ధికి వాటిని వాడుకోవాలి - 1 తెస్స 5,19-21. ప్రతి క్రైస్తవుడు తన ప్రత్యేక వరాలతో తిరుసభ అభివృద్ధికి పాటుపడాలి.

3. రెండవ శతాబ్దానికి చెందిన గ్రీకు భక్తుడొకడు ఆనాటి సుప్రసిద్ధ వ్యక్తియైన డయొగ్నీటస్‌కి లేఖవ్రాస్తూ తిరుసభను గూర్చి ఈలా వాకొన్నాడు. “దేహంలో ఆత్మయేలాగో ఈ లోకంలో క్రైస్తవులు ఆలాగు. ఆత్మ దేహంలోని ప్రతి భాగంలోను వుంటుంది. అలాగే క్రైస్తవులు ప్రపంచంలోని భాగాలన్నిటిలోను వసిస్తున్నారు. ఆత్మ దేహంలోనే వసించినా అది దేహానికి సంబంధించినది కాదు. అలాగే క్రైస్తవులు ఈ లోకంలో వసించినా వాళ్లు ఈ లోకానికి చెందినవాళ్ళు కాదు. కంటికి కన్పించే దేహంలో నెలకొనివున్నా ఆత్మ తాను మాత్రం కంటికి కన్పించదు. అట్లే లోకంలోని క్రైస్తవులు కంటికి కన్పిస్తున్నా వారి ఆరాధనం ఎవరికీ కన్పించదు. ఆత్మ దేహాన్ని సుఖభోగాలను అనుభవించనీయదు. కనుక శరీరం ఆత్మను హింసిస్తుంది. అదే విధంగా క్రైస్తవులు లోకాన్ని సుఖభోగాలు అనుభవించనీయరు. కనుక లోకం వారిని హింసిస్తుంది. శరీరం తన్ను ద్వేషించినా ఆత్మ మాత్రం శరీరాన్ని ప్రేమిస్తుంది. అలాగే క్రైస్తవులు తమ్ము ద్వేషించే ఈ లోకపు ప్రజలను ప్రేమిస్తారు. ఆత్మ దేహంలో

బంధింపబడి వుంటుంది. ఐనా అది దేహంలోని అవయాలన్నిటినీ ఒక్కటిగా బంధిస్తుంది. అలాగే క్రైస్తవులు ఈ లోకంలో బంధింపబడి వున్నారు. ఐనా వాళ్ళు లోకాన్నంతటినీ బంధించి వుంచుతారు. నాశంలేని ఆత్మ నాశమయ్యే దేహంలో నెలకొని వుంటుంది. అలాగే క్రైస్తవులు నాశమయ్యే ఈలోక వస్తువులు మధ్య వసిస్తున్నా వారి ఆత్మలు మాత్రం అవినాశమైన పరలోకం మీదనే దృష్టి నిల్పి వుంటాయి". ఈ రచయిత తిరుసభ స్వభావాన్ని చక్కగా వర్ణించాడు. మనంకూడ ఈ భక్తుడు చెప్పిన సూత్రాల ప్రకారం జీవించాలని ప్రభువుని వేడుకొందాం.

# 7. తిరుసభ లక్షణాలు

ఈ యధ్యాయంలో నిజమైన తిరుసభ లక్షణాలను నాల్గింటిని పరిశీలిద్దాం. ఈ లక్షణాలు కొంతవరకు ప్రొటెస్టెంటు సమాజాల్లో కూడ కన్పించవచ్చు. కాని యివి పరిపూర్ణంగా క్యాతలిక్ తిరుసభలో మాత్రమే కన్పిస్తాయి. తిరుసభలో ఏకత, విశ్వవ్యాప్తత, పవిత్రత, ప్రేషితులకు వారస సమాజంగా వుండడం అనే ముఖ్య లక్షణాలు నాల్గు కన్పిస్తాయి. విశ్వాస సంగ్రహంలో మనం ఈ లక్షణాల నుద్దేశించే "ఏక, పవిత్ర, కతోలిక, అపోస్తలిక తిరుసభను విశ్వసించుచున్నాను" అని చెప్తాం.

## 1. ఏకత

తిరుసభతోపాటు లోకంలో ప్రొటస్టెంటు సమాజాలు కూడ వున్నాయి. మనకు వీటితో పొత్తులేదు. కనుక నేడు క్రీస్తు స్థాపించిన తిరుసభలో అనైక్యత, విభజనం వుందని చెప్పాలి. అటువైపు చాలమంది ప్రోటస్టెంటు క్రైస్తవులూ, ఇటువైపు చాలమంది క్యాతలిక్ క్రైస్తవులూ క్రైస్తవ సంఘాలన్నీ ఐక్యంగావాలనే కోరుకొంటున్నారు. దీనికొరకు కృషి చేస్తున్నారు కూడ. కాని ఈ యైక్యత నేటివరకు సిద్ధించలేదు. క్రైస్తవుల్లోని ఈ అనైక్యత కారణంగా అన్యమతస్థులు క్రైస్తవమతాన్ని చిన్నచూపు చూస్తున్నారు. క్రీస్తుకోరిన ఏక సమాజం ఏదీ అని అడుగుతున్నారు. కనుక ఈ యైక్యతను సాధించడం క్రైస్తవులందరి బాధ్యత.

నూత్నవేదం చాల తావుల్లో, క్రీస్తు స్థాపించిన తిరుసభలో ఐక్యత వుండాలని బోధిస్తుంది. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన వాళ్ళల్లో లింగభేదం వర్గభేదం జాతిభేదం వుండకూడదు. వాళ్ళంతా క్రీస్తునందు సరిసమానం, ఏకసమాజం కావాలి - గల 3,27-28. దేహంలోని అవయవాలన్నీ కలసి ఒక్క శరీరమౌతాయి. అలాగే క్రీస్తు అవయవాలమైన మనమంతా కలసి ఆ ప్రభువునందు ఒక్క తిరుసభ కావాలి - రోమా 12,4-5.

యోరూషలేము క్రైస్తవులంతా ఒకే మనసూ ఒకే హృదయమూ కలిగి ఏక సమాజంగా జీవించారు. అ.చ.4,32. క్రీస్తు ఒకేమందా ఒకేకాపరీ వుండాలని కోరుకొన్నాడు - యోహా 10,16. తండ్రీ క్రీస్తూ ఏకమై యున్నట్లుగా శిష్యులు కూడ తమలోతాము ఏకమై యుండాలని క్రీస్తు అభిమతం - 17,21-23. క్రైస్తవులకు ఒకే ప్రభువు ఒకే విశ్వాసం ఒకే జ్ఞానస్నానం ఒకేతండ్రియైన దేవుడు ఒకేఆత్మ ఒకే సమాజం వుందికనుక వాళ్ళంతా ఏకమై యుండాలి - ఎఫె 4,5-6. ఈ వేద వాక్యాలన్నీ కూడ మనలో మనం ఐక్యమై యుండాలని, అనైక్యత దైవసమాజ లక్షణం కాదనీ బోధిస్తున్నాయి.

తిరుసభ ఐక్యత నరమాత్రులు సాధించేదికాదు. పవిత్రాత్మే దాన్ని క్రైస్తవులకు వరంగా ప్రసాదించాలి. ఆత్మ మనలో మనం ఐక్యమయ్యేలాను, మనమంతా కలసి క్రీస్తుతో ఐక్యమయ్యేలాను చేస్తుంది.

తిరుసభలో ముఖ్యమైన అంశాల్లో ఐక్యత వుంటేచాలు. అనగా దానిలో ఒకే విశ్వాసం, ఒకే దేవద్రవ్యానుమానాల సముదాయం, ఒకే ఆరాధన, అందరూ ఒకే అధికారానికి లోబడి వుండడం అనే గుణాలు వుండాలి. ఇక్కడ అధికారానికి లోబడి వుండడమంటే, స్థానికంగా బిషప్పులకీ, విశ్వవ్యాప్తంగా పోపుగారికీ లోబడివుండాలి. ఈ ముఖ్యగుణాలన్నీ క్యాతలిక్ తిరుసభలో వుంటాయి. కనుక దానిలో ఐక్యత వుంది. ప్రోటస్టెంటు సమాజాల్లో ముఖ్యంగా చివరి లక్షణం లోపిస్తుంది. వాళ్ళు పోపుగారి అధికారాన్ని అంగీకరించరు. ఈ యంశం క్రైస్తవ సమైక్యతకు పెద్ద ఆటంకంగా వుంది. కాని ఆత్మ ప్రేరణంవల్ల ఈ యాటంకం వెంటనే కాకపోయినా క్రమేణ తొలగిపోవచ్చు.

క్రైస్తవ సమాజంలో ఐక్యత అంటే అన్ని క్రైస్తవ సమాజాలు మూస పోసినట్లుగా ఒకేరీతిగా వుండాలని భావంకాదు. సమాజాలకూ సమాజాలకు అప్రధాన విషయాల్లో వ్యత్యాసం వుండవచ్చు. ప్రధాన విషయాల్లో మాత్రం ఐక్యత వుండాలి. పౌలునాడే యూద క్రైస్తవుల తిరుసభలూ, గ్రీకు క్రైస్తవుల తిరుసభలూ భిన్నభిన్నంగా వుండేవి. నేడు కూడ ల్యాటిన్ క్రైస్తవుల తిరుసభకూ, గ్రీకు క్రైస్తవుల తిరుసభకూ సిరియా క్రైస్తవుల తిరుసభకూ వ్యత్యాసాలు వున్నాయి. ఈ తేడాలు విశేషంగా ఆరాధన విధానంలోను క్రమశిక్షణ విధానంలోను ఆధ్యాత్మిక సాధన విషయంలోను వేదశాస్త్రాంశాల విషయంలోను కన్పిస్తాయి.

క్రైస్తవ సమాజాలన్నీ ఒకే విధంగా వుంటే చూడ్డానికి విసుగుపుడుతుంది. కనుక అప్రధాన విషయాల్లో భిన్నత్వం మంచిది. ఈ భిన్నత్వం వలన ఒక్కో క్రైస్తవ సమాజం ప్రత్యేకంగాను ఆకర్షణీయంగాను కన్పిస్తుంది. స్థానిక సంస్కృతులు కూడ తిరుసభలోకి రావచ్చు. అందుకే ప్రాచీనకాలంలోనే అగస్టీను భక్తుడు "భిన్నత్వం వలన తిరుసభలో శోభ హెచ్చింది" అని చెప్పాడు.

## 2. విశ్వవ్యాప్తత

విశ్వాస సంగ్రహంలో "కతోలిక తిరుసభను విశ్వసిస్తున్నాను" అంటాం. "కతోలికోస్" అనేది గ్రీకుమాట. ఈ పదానికి విశ్వమంతట వ్యాపించి వున్నది అని అర్థం. అన్ని తావుల్లోను వ్యాపించి వుండడమనేది తిరుసభ రెండవ లక్షణం.

బైబులు బోధలను పరికిస్తే, ప్రభువు అబ్రాహాం ద్వారా అన్ని జాతులు దీవెనలు పొందుతాయని ఆదికాండంలోనే ప్రమాణం చేసాడు - ఆది 12,3. ఉత్థాన క్రీస్తు మీరు వెళ్ళి ప్రపంచమందంతటా, అందరు ప్రజలకూ సువార్తను బోధించండి అని చెప్పాడు - మార్కు 16,15. ఇంకా అతడు మీరు భూదిగంతాల వరకూ నాకు సాక్షులుగా వుంటారు - అనగా నన్ను గూర్చి బోధిస్తారు అని చెప్పాడు - అ.చ.1-8. తొలిరోజుల్లోనే పౌలు ఆనాటి యూరపు ఖండమంతటా వేదబోధచేసి సకలజాతి ప్రజలను విశ్వాసరంగంలో క్రీస్తుకి విధేయులనుగా జేసాడు - రోమా 1,5. ఈ విధంగా తిరుసభ తాను పుట్టినప్పటినుండి అన్ని జాతుల్లోను వేళ్ళుపాతుకొంది.

విశ్వవ్యాప్తతలో మూడంశాలున్నాయి. 1. తిరుసభ అన్ని తావుల్లోను వ్యాపించి వుండాలి. 2. అన్ని కాలాల్లోను వ్యాపించి వుండాలి. 3. తిరుసభ అన్ని కాలాల్లోను అన్ని తావుల్లోను ఒకే విశ్వాసాన్ని సంపూర్ణంగా బోధించి వుండాలి.

ఈ లక్షణాలు క్యాతలిక్ తిరుసభకు చాలవరకు వర్తిస్తాయి. ప్రారంభంనుండే అది అన్ని తావుల్లోను, అన్ని శతాబ్దాల్లోను వ్యాపిస్తూ వచ్చింది. లోకంలోని నరులందరూ కాకపోయినా చాలమంది దానిలో చేరారు. ప్రారంభంనుండే అన్ని తావుల్లో కాకపోయినా అది చాలా తావుల్లో వ్యాప్తి చెందింది. తొలి శతాబ్దాలనుండి తిరుసభ ముఖ్యమైన బోధ ఒకే విధంగా వుంది. కాని ఆయా కాలాల్లోని సమస్యలను పురస్కరించుకొని తిరుసభ బోధల్లో నూత్న విషయాలు చేరుస్తూ వచ్చారు. కనుక ఆ బోధ కాలక్రమేణ పెరుగుతూ వచ్చింది.

8వ శతాబ్దంలో గ్రీకు క్రైస్తవులూ, 16వ శతాబ్దంలో ప్రోటస్టెంటు క్రైస్తవులూ ఆదిమ తిరుసభనుండి చీలిపోయి క్రొత్త క్రైస్తవశాఖలను ఏర్పరచుకొన్నారు. ఈలా చీలిపోయిన శాఖలకు పై విశ్వవ్యాప్తత అనే లక్షణం అంతగా వర్తించదు. అవి కొన్ని కాలాల్లో కొన్ని తావుల్లో మాత్రమే ఉన్న శాఖలు.

విశ్వవ్యాప్తత అనేది ఉత్థానక్రీస్తు అతని ఆత్మా తిరుసభకు దయజేసిన వరం. ఆత్మ అన్ని కాలాల్లోని ప్రజలకు అన్ని తావుల్లోని ప్రజలకు క్రీస్తుని ప్రత్యక్షం చేస్తుంది. దీనివల్ల తిరుసభ అంతటా వ్యాపించింది. అన్ని జాతులవాళ్ళు ఆ సభలోచేరి తమ ప్రత్యేక

సంస్కృతినీ శక్తి సామర్థ్యాలనూ ఆ సభలోనికి తీసుకవచ్చారు. ఇందుచే తిరుసభ ఎంతో వృద్ధిలోకి వచ్చింది. స్థానిక తిరుసభలు విశ్వ తిరుసభను సుసంపన్నం చేసాయి. విశ్వ తిరుసభ స్థానిక తిరుసభల ప్రత్యేకతను గౌరవించింది. ఒక్క ఇండియానే తీసికొంటే, ఇక్కడ ఎన్నిరాష్ట్రాలు ఎన్ని భాషలు ఎన్ని సంస్కృతులు లేవు? ఇవన్నీ తిరుసభను సుసంపన్నం చేసాయి కదా! ఈలా ఎన్ని దేశాల్లో విశ్వతిరుసభ వ్యాపించిందో అన్ని దేశాల్లోను అది సుసంపన్న మౌతూనే వుంటుంది కదా! ఐనా వింతయేమిటంటే, విశ్వతిరుసభ ఎన్నిదేశాల్లో, ఎన్ని కాలాల్లో వ్యాపించినా దాని విశ్వాసం ఒకేరీతిగా వుంటుంది. అది అందరు ప్రజలకు ఒకే రక్షణ సువార్తను బోధిస్తుంది.

## 3. పవిత్రత

తిరుసభ క్రీస్తుకి గుర్తుగా వుండేది కనుక ఆ ప్రభువులాగే అదికూడ పవిత్రమైంది. ఎఫెసీయులు 5,25-27. తిరుసభను నిష్కళంకమైన క్రీస్తు వధువునుగా వర్ణిస్తుంది. 1కొరింతీయులు 3,16-17. దాన్ని దేవుని పవిత్రమందిరంగా వర్ణిస్తుంది. తిరుసభ సభ్యులు పునీతులు. వాళ్ళ పునీత ప్రజ, పవిత్రయాజకులు 1 పేత్రు 2,9. పవిత్రాత్మే తిరుసభను పవిత్ర సమాజాన్నిగా తీర్చిదిద్దుతుంది.

1. బైబులు భావాల ప్రకారం దేవుడు పరమ పవిత్రుడు. అతని పవిత్రత ప్రధానంగా పాపానికీ పాపపు లోకానికీ దూరంగా వుండడంలో వుంటుంది. నరులమైన మనం క్రియలద్వారా పవిత్రులమౌతాం. కాని దేవుడు తన వునికిద్వారానే పవిత్రుడు.

దేవుడు తన పవిత్రతను పంచియిస్తేనే తప్ప ఏ ప్రాణి, ఏ వస్తువూ పవిత్రంకాదు. కనుక దేవునితో సంబంధం కలిగించుకోవడంద్వారా నరుడు పవిత్రుడౌతాడు.

బైబులు దేవునికి అంకితమైన నరులుగాని వస్తువులుకాని పవిత్రులౌతారని చెప్తుంది. ఈ యంకితం కావడంలో రెండంశాలున్నాయి. మొదటిది, పాపపు ప్రపంచంనుండి వేరుచేయబడ్డం. రెండవది, పవిత్రుడైన భగవంతుని సేవకు సమర్పింపబడ్డం. యాజకులు, ప్రవక్తలు, దేవాలయం, మందసం ఈలాంటివి.

పూర్వవేదంలో యిస్రాయేలు సమాజం ఇతరజాతుల నుండి వేరుచేయబడి, దేవుని సేవకు అంకితం కావింపబడింది. కనుక ఆ ప్రజ పవిత్రమైంది - నిర్గ 19,5-6. వాళ్ళు పవిత్రుడైన దేవుళ్ళాగే పరిశుద్ధంగా వుండవలసినవాళ్ళు.

నూత్నవేద ప్రజయైన తిరుసభకూడ పాపపు లోకంనుండి వేరుచేయబడి క్రీస్తు సేవకు అంకితమైంది. కనుక పవిత్రమైంది - 1పేత్రు 2,9. ఈ పవిత్రత ప్రజలు తమంతట తాము సాధించేది కాదు. దేవునినుండి పొందేది. ఎప్పుడుకూడ దేవుని ఆత్మే మనలను పవిత్రులను చేస్తూంటుంది.

తిరుసభ పవిత్రత మనం కంటితో చూచేదికాదు. విశ్వాసంతో నమ్మేది. తిరుసభలో ఓవైపు పాపాత్ములూ మరోవైపు పరమ పవిత్రులూ కూడ వున్నారు. పునీతులు వేదసాక్షులు కన్యలు స్తుతీయులు మతస్థాపకులు మొదలైనవాళ్ళంతా తిరుసభ పావిత్ర్యాన్ని చాటిచెప్పేవాళ్ళు.

తిరుసభ అంతా కలసి పవిత్రమైంది. తిరుసభ సభ్యులమైన మనంకూడ వ్యక్తిగతంగా పవిత్రులం కావడానికి నిరంతరం కృషి చేయాలి. మనం పుణ్యకార్యాలు చేసినపుడల్లా ఆత్మ తన వరప్రసాదబలంతో మనలను పునీతులను చేస్తుంది. మన సత్కార్యాలద్వారా తిరుసభ పవిత్రత లోకంలో చీకటిలో దీపంలా ప్రకాశిస్తుంది. మదర్ తెరీసా ఈలాంటి మాన్యురాలు.

2. తిరుసభ పవిత్రమైందని చెప్పాం. ఐనా అది పాపాత్ములతో కూడిన తిరుసభ. కనుక అది పాపాపూరితమైంది కూడ. మనం ఓవైపు పవిత్రంగా వుండాలని ప్రయత్నం చేసినా మరోవైపు పాపకార్యాలు చేస్తూనే వుంటాం. ఈలాగే తిరుసభ అంతాకూడ పాపకార్యాలు చేస్తూనే వుంటుంది. ఆ సభ నాయకుల్లో అధికార దాహమూ, సుఖభోగాలూ, ధనవాంఛా, లౌకిక విలువలూ, ఆత్మప్రబోధాన్ని పెడచెవిని పెట్టడం, క్రీస్తు బోధలను విస్మరించడం అనే నానాపాపాలు వున్నాయి. ఆత్మ ప్రేరణంతోపాటు పిశాచ ప్రేరణం కూడ తిరుసభలో ఎప్పుడూ కన్పిస్తూనే వుంటుంది.

నూత్నవేదం తిరుసభ కళంకమైంది అని చెప్తుంది. వలలో చిక్కిన చేపల్లో మంచివీ పాడువీకూడ వున్నాయి - మత్త 13,47-50. క్రైస్తవుల్లో ఎవరైనా మాకు పాపంలేదు అని చెప్తే వాళ్లు తమ్ముతామే మోసగించుకొన్నట్లవుతుంది - 1యోహా 1,8. మనమంతా చాలసార్లు పొరపాట్లు చేస్తాం - యాకో 3,2. ఈలాంటి వేదవాక్యాలన్నీ తిరుసభ పాపాన్ని నిరూపిస్తాయి. పాపాత్ములు ఆ సభలో ఎప్పుడూ వుంటారు. వారి పాపాలు క్రీస్తు శరీరాన్ని కళంకితం చేస్తాయి. దాన్ని గాయపరుస్తాయి. అది కూలి పడిపోయేలా చేస్తాయి. దాన్ని రోగగ్రస్తం చేస్తాయి. ఈ మచ్చ దానికి దేవునినుండిరాదు. తన సభ్యులనుండే వస్తుంది.

తిరుసభ దోషి కనుక తన పాపాలకు తాను పశ్చాత్తాపపడాలి. తన తప్పిదాల కొరకు తపస్సుచేసి ప్రాయశ్చిత్తం చేసికొని దోషవిముక్తిని పొందాలి. ఆత్మనుండి నూత్నత్వాన్ని సంపాదించుకోవాలి.

తిరుసభ ఒకవైపు పాపాత్మురాలు, మరోవైపు పవిత్రురాలు. అందుకే విశ్వాససంగ్రహంలో "పవిత్ర తిరుసభను విశ్వసిస్తున్నాను" అంటాం. ఈ లోకంలో యాత్ర చేస్తూన్నంత కాలం అది ఓవైపు తన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొంటూనే వుండాలి. మరోవైపు పావిత్ర్యంలో అభివృద్ధి చెందుతూనే వుండాలి. మోక్షాన్ని చేరుకొని మహిమను పొందినపుడేగాని తిరుసభ పాపాన్ని పూర్తిగా విడనాడి సంపూర్ణమైన పావిత్ర్యాన్ని పొందలేదు.

మన తరపున మనం తిరుసభ పవిత్రతనీ మాలిన్యాన్నీ కూడ గుర్తిస్తుండాలి. ఇంకా మనలోని వెల్తురునీ చీకటినీ కూడ నిరంతరం గమనిస్తూండాలి. రోజురోజుకీ ఆ చీకటిని తగ్గించుకొని వెల్తురుని పెంచుకొంటూండాలి.

## 4. ప్రేషితులకు వారస సమాజం

పేత్రు యోహాను మొదలైన తొలి పండ్రెండుమంది ప్రేషితులు నెలకొల్పిన తొలి క్రైస్తవ సమాజనికి వారసంగా వచ్చింది తిరుసభ. తొలి పండ్రెండుమంది శిష్యులు స్థాపించిన తిరుసభ వారితో అంతరించలేదు. అది నేటి తిరుసభలో ఇంకా కొనసాగుతూనే వుంది. ప్రస్తుత తిరుసభ అనే గొలుసు ఆ తొలి తిరుసభ అనే కొక్కానికి అతుక్కొని వుంది. అందుకే విశ్వాస సంగ్రహంలో “అపోస్తోలిక తిరుసభను విశ్వసిస్తున్నాను” అంటాం. అనగా ఇప్పటి తిరుసభ తొలి పండ్రెండుమంది అపోస్తలులతో ప్రత్యక్ష సంబంధం కలది అని భావం. ఈ సభ ఎప్పుడో, ఎక్కడో క్రొత్తగా వూడిపడలేదని అర్థం.

దైవరాజ్యాన్ని బోధించడానికి మొదట తండ్రి క్రీస్తుని పంపాడు. క్రీస్తు తన తరపున తాను శిష్యులను పంపుతూ తండ్రి నన్ను పంపినట్లే నేనూ మిమ్ము పంపుతున్నాను” అన్నాడు - యోహా 20,21. వాళ్ళను వెళ్లి సకల జాతులకు తన్ను గూర్చి బోధించమని చెప్పాడు. తాను లోకాంతం వరకు వాళ్ళతో వుంటానని హామీ యిచ్చాడు - మత్త 28,19-20. వాళ్ళ తర్వాత వాళ్ళ శిష్యులూ ప్రశిష్యులూ వాళ్ళు స్థాపించిన తిరుసభను కొనసాగిస్తూ వచ్చారు. అదే నేటి మన తిరుసభ. క్రీస్తు ప్రారంభించగా అపోస్తలులు వ్యాప్తి చేసిన దైవరాజ్యమే నేడు తిరుసభగా కొనసాగుతూంది. తొలి మూడు గుణాలవలె ప్రేషితులకు వారసంగా వుండడమనే ఈ నాల్గవ గుణం కూడ తిరుసభకు ఆత్మనుండే లభించింది.

కాని ఏ ముఖ్య విషయంలో తిరుసభ అప్తోలులకు వారస సమాజంగా వుంటుంది? అపోస్తలులకు ప్రత్యేక భాగ్యాలున్నాయి. వాళ్లు క్రీస్తుతో కలసి జీవించారు. ఉత్థాన క్రీస్తుని చూచారు. అతని ఆజ్ఞవల్లనే దైవరాజ్యబోధకు పూనుకొన్నారు. ఈ కార్యాలన్నిటిద్వారా వాళ్ళు తిరుసభకు పునాదిలాంటి వాళ్ళయ్యారు. ఈలా పునాదిగా వుండడం అనే లక్షణం అపోస్తలులతోనే అంతరించింది. ఆ లక్షణం వాళ్ల అనుయాయులకు రాదు.

కాని అపోస్తలులు క్రీస్తు బోధనకు కొనసాగించవలసిన పూచీకలవాళ్ళు. ఈ పూచీ, దైవరాజ్యబోధ అనే పని, అపోస్తలులతోపాటు వారి అనుయాయులకు గూడ సంక్రమించింది.

అపోస్తలులు తమనాడు క్రీస్తునీ అతని మరణోత్థానాలనూ అతని సందేశాన్నీ నానాజాతులకు బోధించారు. అది వారి సువిశేషబోధ. నేడు తిరుసభకూడ ఈ యపోస్తలుల బోధనే కొనసాగించాలి. అది ఈ కార్యాన్ని విశ్వసనీయంగా నెరవేర్చాలి. ఈ కార్యంలో కల్తీ వుండకూడదు. అనగా తిరుసభ లోక విలువలకు లొంగకుండా స్వచ్ఛమైన క్రీస్తు విలువలనే ప్రచారం చేయాలి.

సువిశేషబోధ సేవాకార్యం. ఈ సేవను తిరుసభ వొళ్ళు దగ్గరపెట్టుకొని నిర్వహించాలి. తిరుసభ అధికార దాహానికి లొంగకుండా నిరంతరం సేవక తిరుసభగా మెలగాలి. దాని లక్షణం ఊడిగం చేయడంకాని దొరతనం కాదు. ఇంకా అవసరమైతే తొలి అపోస్తలులలాగే నేటి తిరుసభకూడ కొన్ని వేదహింసలు అనుభవించాలి.

తిరుసభ సభ్యులంతా తొలి పండ్రెండు మంది శిష్యులకు వారసులే. పవిత్రాత్మ మనలను ఆ తొలి నాయకులకు వారసలనుగా జేసి నేడు మనమూ వారి సేవను కొనసాగించేలా చేస్తుంది. కాని ఇది విస్తృతార్థంలో మాత్రమే.

ఖండితార్థంలో పీఠాధిపతుల బృందం మాత్రమే తొలి పండ్రెండుమంది ప్రేషితులకు వారసులు. పోపుగారుకూడ ఈ బృందంలోకే వస్తారు. వీళ్లు మాత్రమే అపోస్తలుల పారంపర్యాన్నీ అధికారాన్నీ బోధనీ సేవనీ కొనసాగించేవాళ్లు. వీళ్ళే నేటి తిరుసభను నడిపించే నాయకులు.

ఇప్పటి బిషప్పులు ఏవొక్క ప్రత్యేక అపోస్తులునికి కాక ఉమ్మడిగా అపోస్తలులందరికీ కలిసి వారసులౌతారు. తొలి అపోస్తులులందరికీ విశ్వసనీయులైన వారసులుగా వుండడం బిషప్పుల ప్రధానధర్మం. అనగా తొలి పండ్రెండుమంది విశ్వాసమే బిషప్పులకీ వుండాలి.

క్యాతలిక్ తిరుసభ అపోస్తలుల తిరుసభకు వారసంగా వచ్చింది అని చెప్పాం. రెండవ శతాబ్దంలోనే ఇరనేయస్ అనే వేదశాస్త్రి అపోస్తలుల తర్వాత రోమాపురికి బిషప్పులుగా పనిజేసినవాళ్ళ జాబితాను తయారుచేసాడు. వీళ్ళనే ఇప్పుడు మనం పోపుగార్లు అంటున్నాం. ఈ పోపుగార్లు అపోస్తలుల తర్వాత అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వచ్చారు. వాళ్ళు నడిపించేదే నేటి మన తిరుసభ.

8వ శతాబ్దంలో ఏర్పడిన గ్రీకు క్రైస్తవశాఖల్లో కాని, 16వ శతాబ్దంలో ఏర్పడిన ప్రొటస్టెంటు శాఖల్లోకాని ఈలా తొలి అపోస్తులులతో సంబంధం కలిగివుండడం అనే లక్షణంలేదు. ఇది క్యాతలిక్ తిరుసభకు ప్రత్యేకం.

1. క్రీస్తు అంగీని కుట్లు లేకుండ ఏకవస్త్రంగా నేసారు. సైనికులు అతని వస్త్రాలను నాల్గు భాగాలుగా విభజించి తమలోతాము పంచుకొనేపుడు ఆ యంగీని చించలేదు. అదృష్టపు చీట్లు వేయగా అది సైనికుల్లో ఒకరికి వచ్చింది. యోహా 19,23-24. ప్రాచీన వేదశాస్త్రులు ఈ కుట్టులేని అంగీని తిరుసభతో పోల్చారు. క్రీస్తు ధరించిన అంగీలాగే తిరుసభ కూడ ఐక్యతా భావం కలది. దానిలో శాఖలు మఠాలు విభేదాలు వుండకూడదు.

2. చాలమంది క్రైస్తవులకు తిరుసభనుండి తీసికోవడం మాత్రమే తెలుసు. వీరి దృష్టిలో తిరుసభ పెద్ద సాంఘిక సంక్షేమ సంస్థ. దీన్ని ఆసరాగా బెట్టుకొని పొట్టబోసికోవచ్చు, వుద్యోగాలు సంపాదించుకోవచ్చు, పేరు తెచ్చుకోవచ్చు అని వీళ్ళ భావన. వీళ్ళు వట్టి స్వార్థపరులు. మంచి క్రైస్తవుడు తిరుసభనుండి తీసికొనేపుడు తీసికొన్నా, ఇచ్చేపుడు ఇస్తాడు. అతడు తిరుసభ వ్యాప్తికి తోడ్పడతాడు. దానికి సేవలు చేస్తాడు. దాన్ని తల్లిగా భావించి దానిపట్ల అభిమానంతో మెలగుతాడు.

3. మన తిరుసభ విదేశాల ధనసహాయంమీద అతిగా ఆధారపడుతూంది. ఏకారణంచేతనైనాసరే ఈ ధనసహాయం ఆగిపోతే తిరుసభ కుప్పకూలిపోతుంది. కనుక ఈలా ఆధారపడ్డం చెడ్డపద్ధతి. మన సామాన్యావసరాలకు మనదేశంలోని క్రైస్తవులే ధనసహాయం చేసికోవాలి. మనకాళ్ళమీద మనం నిలబడాలి. అప్పుడే తిరుసభ ఈ దేశంలో వేళ్ళుబాతుకొని అభివృద్ధి చెందేది.

# 8. తిరుసభలో గృహస్థులు

ఇంతవరకు తిరుసభ ఆంతరంగిక స్వభావాన్ని పరిశీలించి చూచాం. ఇకమీదట తిరుసభలోని వివిధ వర్గాల ప్రజలను గూర్చి విచారించాలి. తిరుసభ క్రీస్తు శరీరమని ముందే చెప్పాం - 1కొరి 12,27. ఈ శరీరంలో వివిధ అవయవాలున్నాయి. అన్ని అవయవాలు దేహం శ్రేయస్సు కొరకే పనిచేస్తాయి. ఈ అవయవాలే వివిధవర్గాలప్రజలు. వీరిని గూర్చి మనం క్షుణ్ణంగా తెలిసికోవాలి.

తిరుసభ దైవప్రజలతో కూడింది. ఈ ప్రజలంతా క్రీస్తుచే రక్షించబడినవాళ్లు. అతన్ని విశ్వసించేవాళ్ళు. అతనిచే దైవరాజ్య బోధకు పంపబడినవాళ్ళు. ఈ దృష్టితోజూస్తే ఈ ప్రజలంతా సరిసమానులే. గురువులూ గృహస్థులూ అందరికీ ఒక్కటే విలువ.

క్రైస్తవులంతా క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినవాళ్లే. ఈ జ్ఞానస్నానం ద్వారానే మనం తిరుసభలో చేరతాం. జ్ఞానస్నానం ద్వారా అందరమూ క్రీస్తు యాజకత్వంలో పాలుపొందుతాం - 1పేత్రు 2,9-10. జ్ఞానస్నానం పొందిన వాళ్లందరికీ జ్ఞానస్నాన యాజకత్వం వుంటుంది. ఈ జ్ఞానస్నాన యాజకత్వం ద్వారా మనమందరమూ సరిసమానులమౌతాం. కనుకనే అగస్టీను భక్తుడు ఆనాటి ప్రజలనుద్దేశించి "మీతోపాటు నేనూ క్రైస్తవుణ్ణే. ఐనా మీ కొరకు నేను పీఠాధిపతిని" అని చెప్పాడు. ఓ వ్యక్తి గురువో బిషప్పో ఐనపుడు క్రైస్తవుడు కాకుండా వుండడు. జ్ఞానస్నానం ద్వారా అతడు తోడి క్రైస్తవులకు సరిసమానుడౌతాడు. కాని యాజకత్వం ద్వారా తోడి క్రైస్తవులకు అధికుడౌతాడు. ఐనా తిరుసభ గురువులదీ బిషప్పులదీ పోపుగారిదీ మాత్రమే కాదు. క్రైస్తవులందరిదీకూడ. తిరుసభ సభ్యులందరికీ ఓ సామాన్య బాధ్యత వుంది. అది దైవరాజ్య వ్యాప్తి. ఈ బాధ్యత ద్వారా తిరుసభలోని సభ్యులంతా సరిసమానులే ఔతారు. మనందరికీ ఒకే ప్రభువు, ఒకే జ్ఞానస్నానం, ఒకే విశ్వాసం వున్నాయి - ఎఫె 4,5. క్రీస్తులోనికి ఐక్యమైన ప్రజల్లో జాతి లింగ వర్గభేదాలు లేవు - గల 3,28.

తిరుసభలోని ప్రజలందరూ విలువలో సరిసమానులైనా వారిలో వివిధ అంతస్తులున్నాయి. మొదటి అంతస్తు గృహస్థులది. కనుక మొదట వారిని గూర్చి విచారిద్దాం.

## 1. చారిత్రకంగా గృహస్థుల పాత్ర

గృహస్థులు తిరుసభకు చెందినవాళ్లు మాత్రమే కాదు. వాళ్లుకూడ తిరుసభే. గృహస్థులంటే ఎవరు? తిరుసభలో గురువులూ మఠసభలకు చెందినవాళ్లూ వున్నారు. ఈ రెండు వర్గలకు చెందని వాళ్ళంతా గృహస్థులే.

క్రైస్తవ సమాజంలో గృహస్థుల పాత్ర శతాబ్దాల పొడుగున క్రమేణ దిగజారిపోయింది. ఆ వైనాన్ని క్లుప్తంగా తెలిసికొందాం.

తొలి రెండు శతాబ్దాల్లో తిరుసభలో యాజకులు సామాన్య క్రైస్తవులు అని రెండు వర్గాల ప్రజలు మాత్రమే వుండేవాళ్ళు. ఈ వుభయ వర్గాలకు విలువలో తేడాలేదు. వీళ్ళు చేసే పనుల్లో మాత్రం వ్యత్యాసముండేది.

మూడవ శతాబ్దానికల్లా సన్యాసులనే మరో వర్గం వచ్చింది. వీళ్ళు నేడు మఠసభలకు చెందినవారితో సమానం. సన్యాసులు లోకం కొరకుగాక దేవునికొరకు జీవించేవాళ్లు. లోక వ్యామోహాలను వదలుకొన్నవాళ్లు కనుక వీళ్లు జనావాసాలకు దూరంగా, ఏకాంతంగా వసించేవాళ్లు. వీళ్ళ పాలు లోకవస్తువులు కాదు, ప్రభువే. కనుక వీళ్లు

దేవుని మీదనే ఆధారపడి జీవించేవాళ్లు. గురువులు విశేషంగా దేవద్రవ్యానుమానాల సేవకూ, పూజబలిని అర్పించడానికీ, ఉద్దేశింపబడినవాళ్లు. ఈ సేవకుగాను వీళ్లకు గురుపట్టం అవసరమైంది. ఇక గృహస్థులు లోకంలో జీవిస్తూ లోక వ్యవహారాలను పట్టించుకొంటూ తమ రక్షణ కార్యాన్ని తాము చూచుకొనేవాళ్లు. కనుక వీళ్లను లౌకికులు అన్నారు.

క్రమేణ పై గురువులూ సన్యాసులూ కలసిపోయి ఏక వర్గమయ్యారు. గృహస్థులు ఏకవర్గమయ్యారు. కనుక తొమ్మిదవ శతాబ్దం నుండి రెండు వర్గాల ప్రజలు వుండేవాళ్లు. గురువర్గం మతవిషయాలు చూచుకొనేది. గృహస్థ వర్గం లౌకిక విషయాలు పట్టించుకొనేది. కాలక్రమేణ గురువర్గంలోనివాళ్లు విద్యావంతులుగా చలామణి అయ్యారు. వాళ్లు వేద శాస్త్రాలూ లౌకికశాస్త్రాలూ కూడ బోధించేవాళ్లు. గృహస్థ వర్గంలోనివాళ్లు అవిద్యావంతులుగా చలామణి అయ్యారు. వాళ్ళు కేవలం లోకజీవనం గడిపేవాళ్లు. 12వ శతాబ్దానికల్లా గృహస్థుల్లో అవిద్య ఇంకా పెరిగింది. వాళ్ళ విలువకూడ తగ్గింది. చదువు లేకపోవడమే దీనికి కారణం.

12వ శతాబ్దంలో వర్ధిల్లిన గ్రేష్యన్ అనే తిరుసభ న్యాయశాస్త్రవేత్త "దేవుణ్ణి తమ పాలుగా ఎన్నుకొని దైవరాజ్యంకొరకు జీవించేవాళ్లు గురువులు. వీళ్లు ఇతరులకు నీతినీ ధర్మాన్నీ బోధిస్తారు. లోకాన్ని తమ పాలుగా ఎన్నుకొని లోకవ్యవహారాల్లో జీవించేవాళ్ళు లౌకికులు. వీళ్ళు పాపాన్ని విడనాడితే రక్షణను పొందవచ్చు" అని వ్రాసాడు.

గురువులు దైవకార్యాల్లో నిమగ్నులౌవుంటారు. కనుక వీళ్ళను "ఆధ్యాత్మిక వర్గం" అన్నారు. గృహస్థులు ఇహలోక కార్యాల్లో నిమగ్నులై వుంటారు కనుక, వాళ్ళను "లౌకిక వర్గం" అన్నారు. క్రమేణ గురుజీవితం మాత్రమే ఆదర్శవంతమైంది, అది మాత్రమే క్రీస్తుని అనుసరించేది అనే భావం ప్రచారంలోకి వచ్చింది. బ్రహ్మచారులుగావుండి గురుజీవితం గడపడానికి శక్తి లేనివాళ్ళు దానికంటె తక్కువస్థాయికి చెందిన గృహస్థ జీవితం గడపవచ్చు అనే అభిప్రాయంకూడ వ్యాప్తిలోకి వచ్చింది. కనుక ఆదర్శవంతమైంది గురుజీవితం. దాన్ని అందుకోలేనివాళ్లు గృహస్థులుగా వుండిపోతారు. వీళ్ళస్థాయి తక్కువది. గురుజీవితం బలవంతుల కొరకు. బలహీనులకు సంసారజీవితం. సంసారులు లోక వ్యవహారాల్లో వుండేవాళ్లు కనుక వాళ్ళకు మతపరమైన పవిత్రకార్యాలతో సంబంధంలేదు. 12వ శతాబ్దంలో వ్యాప్తిలోవున్న భావాలు ఇవి.

ఇక, గురుజీవితం గొప్పది గృహస్థుల జీవితం తక్కువది అనేభావాన్ని 16వ శతాబ్దంలో లూతరు సవాలుచేసాడు. అప్పటికి తిరుసభతో గురువర్గం ప్రాముఖ్యం బాగా ప్రబలిపోయింది. గృహస్థుల ప్రాముఖ్యం బాగా తగ్గిపోయింది. కాని లూతరు తీవ్రవాదాన్ని

అవలంబించి తిరుసభలో అసలు గురువర్గమే వుండకూడదన్నాడు. గురుపట్టమనే ప్రత్యేక దేవద్రవ్యానుమానమే లేదన్నాడు. తిరుసభ సభ్యులంతా గృహస్థులే అన్నాడు. లూతరు వర్గంవాళ్లు సంస్కరణ వాదులయ్యారు.

ఈ తీవ్రవాదాన్ని ఖండించడానికి క్యాతలిక్ సమాజం నుండి ప్రతిసంస్కరణ వాదులు ముందుకి వచ్చారు. వీళ్లు గృహస్థుల పాత్రను మరీ తగ్గించారు. వీళ్ళకు జ్ఞానస్నాన యాజకత్వంగూడ లేదన్నారు. గురువులుపొందే గురుపట్ట దేవద్రవ్యానుమానం స్థాయిని మరీ హెచ్చించారు.

రానురాను తిరుసభలో గృహస్థుల స్థానం పూర్తిగా దిగజారిపోయింది. గృహస్థులు కేవలం లౌకికులు కనుక వాళ్ళకు దైవరాజ్యాన్ని బోధించి దాన్ని వ్యాప్తిచేసే బాధ్యత లేదనుకొన్నారు. సంసారులు గురువులనుండి ఆత్మరక్షణకు అవసరమైన సహాయాలూ వరప్రసాదాలూ పొందితేచాలు అనుకొన్నారు. ఈ విధంగా గృహస్థుల పాత్ర పూర్తిగా దిగజారిపోయింది. ఈ పరిస్థితే ఇంచుమించు రెండవ వాటికన్ సభ వరకు కొనసాగుతూ వచ్చింది.

## 2. రెండవ వాటికన్ సభ బోధలు

రెండవ వాటికన్ సభ సాధించిన ముఖ్యకార్యాల్లో ఒకటి, గృహస్థుల స్థానాన్ని పునరుద్ధరించడం. తొలి శతాబ్దాల్లో గృహస్థులకున్న ప్రాముఖ్యాన్ని ఈ సభ మళ్లా వెలుగులోకి తెచ్చింది. సంగ్రహంగా ఈసభ బోధలు ఇవి. గృహస్థులు జ్ఞానస్నానంద్వారా క్రీస్తు దేహమైన దైవప్రజలౌతారు. పరిపూర్ణంగా తిరుసభ సభ్యులౌతారు. వాళ్ళ పద్ధతిలోవాళ్లు క్రీస్తు యాజకత్వంలోను రాజత్వంలోను ప్రవక్తృత్వంలోను పాలుపొందుతారు. వాళ్ళకు చేతనైనట్లు వాళ్లు దైవరాజ్యబోధకూ దాని వ్యాప్తికీ పూనుకొంటారు. గురువులు ఆధ్యాత్మిక రంగంలో కృషిచేస్తూ దైవరాజ్యాన్ని వ్యాప్తిచేస్తారు. పులిపిడి పదార్థం పిండిని పొంగజేస్తుంది. అలాగే గృహస్థులు లౌకికరంగంలో పులిపిడి పదార్థంలా పనిచేస్తూ ప్రాపంచిక విషయాలను పునీతం చేస్తారు.

గృహస్థులకుకూడ ప్రేషితసేవచేసి దైవరాజ్యాన్ని వ్యాప్తిచేసే హక్కువుంది. ఈ హక్కు వాళ్ళకు తిరుసభలోని అధికారులైన గురువులు బిషప్పులు మొదలైన వాళ్ళనుండిరాదు. జ్ఞానస్నానంనుండే వస్తుంది. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందడంద్వారా వీళ్లు యాజకులౌతారు. గురువులది దేవద్రవ్యానుమాన సేవకొరకు ఉద్దేశింపబడిన ప్రత్యేక యాజకత్వం. గృహస్థులది జ్ఞానస్నానంవల్ల లభించే సామాన్యయాజకత్వం. ఆ యాజకత్వం

ఈ యాజకత్వాన్ని అణచివేయకూడదు. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందడంద్వారా వీళ్లుకూడ ఆ ప్రభువు యాజకత్వంలోను, ప్రవక్తృత్వంలోను, రాజత్వంలోను పాలుపొందుతారు. గురువులకంటే భిన్నమైన పద్ధతిలో వీళ్లుకూడ ఈ మూడు రంగాల్లో సేవలు చేస్తారు.

1. గృహస్థులు యాజకులుగా వ్యవహరిస్తూ గురువులతోపాటు తాముకూడ పూజబలిని సమర్పిస్తారు. వాళ్లు తమ కుటుంబజీవితాన్నీ లోకంలో తాముచేసే కృషినీ తమ కష్ట సుఖాలనూ గురువు సమర్పించే క్రీస్తు బలితో చేర్చి పరలోక పితకు అర్పిస్తారు. దీనిద్వారా వీళ్ళ లౌకిక జీవితం పవిత్రమౌతుంది. దేవునికి మహిమ చేకూరుతుంది.

2. గృహస్థులు ప్రవక్తలుగా వ్యవహరిస్తారు. అనగా దైవరాజ్యాన్ని బోధిస్తారు. వీళ్లు మొదట తమ ఆదర్శవంతమైన జీవితంద్వారానే దైవరాజ్యాన్ని బోధించాలి. అటుతర్వాత వాక్యబోధకూడ చేస్తారు. కానీ వీళ్లు ప్రధానంగా తమకుటుంబం, వృత్తి, లౌకికరంగం మొదలైన వాటిద్వారానే క్రీస్తుని బోధించాలి. ఈ బోధను సంతృప్తికరంగా నిర్వహించడానికి వీళ్ళకు దైవశాస్త్రాంశాల్లో తర్ఫీదు అవసరం. ఇంకా విజ్ఞానవరం ఆత్మానుగ్రహం మొదలైనవికూడ అవసరం.

3. గృహస్థులు రాజులుగా, అనగా నాయకులుగా వ్యవహరిస్తారు. వీళ్ళ నాయకత్వం ప్రధానంగా లౌకికరంగంలో వుంటుంది. వివిధ వృత్తులు ఆర్థిక సాంఘిక రంగాలు సంస్కృతి అభివృద్ధి కార్యక్రమాలు జాతీయాంతార్జీతీయ సంఘటనలు శాస్త్రరంగం సమాచార సాధనాలు మొదలైన నానా లౌకిక కార్యాల్లో వీళ్లు నాయకత్వం నెరపాలి. ఈ లౌకిక రంగాన్ని దైవసాన్నిధ్యంతో నింపి అది క్రీస్తువల్ల ప్రభావితమయ్యేలా చేయాలి. ఈలా గృహస్థులు కూడ దైవరాజ్యాన్ని వ్యాప్తిచేయాలి. న్యాయం, శాంతి, ప్రేమ, సత్యం, పవిత్రత, వరప్రసాదం మొదలైన దివ్యగుణాలతో గూడిన దైవరాజ్యాన్ని వాళ్ళు కూడ వ్యాప్తి చేయాలి.

ఈలా వాటికన్ సభ గృహస్థుల అంతస్తును పూర్తిగా పునరుద్ధరించింది. కాని ఈ సభ జరిగి నలభై యేండ్లయినా దీని బోధలు మన దేశంలో నేటికీ ప్రచారం కాలేదు. అందువల్ల మనదేశంలో ఇప్పుడు కూడ గృహస్థులు ముందుకు వచ్చి తమ బాధ్యతను సంతృప్తికరంగా నిర్వహించలేకపోతున్నారు. వీళ్ళకు ఎంతో తర్ఫీదు అవసరం. మన గురువులు గృహస్థులకు తోడి పనివాళ్ళనుగా వాడుకోవాలి. గృహస్థులు కూడ బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి. గృహస్థుల ప్రేషితసేవ అనే రంగంలో మనం సాధించింది చాల తక్కువ. ఇంకా ఎంతో కృషి జరగాలి.

1. తిరుసభ అంటే యెవరు? మామూలుగా మనం పోపుగారు బిషప్పులు గురువులు మొదలైన అధికార వర్గమే తిరుసభ అనుకొంటాం. అనధికార వర్గమైన గృహస్థులు తిరుసభలో ముఖ్యమైన సభ్యులుకారు అనుకొంటాం. ఇది పొరపాటు. అధికారవర్గమూ అనధికారవర్గమూ అందరూ తిరుసభే. అందరూ పరిపూర్ణంగా ఆ సభ సభ్యులే. అందరూ క్రీస్తులోనికి జ్ఞానస్నానంపొంది అతని మూడు లక్షణాల్లో పాలు పొందినవాళ్లే. పై వుభయవర్గాల వాళ్లు చేసే పనుల్లో తేడా వుండవచ్చు. కాని వాళ్ళ విలువమాత్రం సరిసమానమే.

2. ప్రస్తుతం ఇండియాలోని తిరుసభ విదేశ తిరుసభలా వుంది. మన గుళ్లూ బళ్లూ శిల్పమూ సంగీతమూ ఆరాధనా ఆచార వ్యవహారాలూ మొదలైనవి పాశ్చాత్య నమూనాల్లో వున్నాయి. అసలు మన తిరుసభలో పాశ్చాత్య సంస్కృతే గాని భారతీయసంస్కృతి కానరాదు. కనుక హిందువులు మన క్రైస్తవమతం, మన తిరుసభ పాశ్చాత్య దేశాల నుంచి దిగుమతి అయ్యాయని అంటుంటారు. మనది పరాయి మతమని వెక్కిరిస్తారు. దీనిలో కొంత సత్యం లేకపోలేదు. మనం క్రీస్తుని నమ్మినా వేషభాషల్లో సంస్కృతిలో భారతీయులంగానే వుండాలి. మనం భారతీయ క్రైస్తవులం అని మర్చిపోకూడదు. మనం ఈ దేశ సంస్కృతిని ఎంతత్వరగా స్వీకరిస్తే అంత మంచిది.

# 9. తిరుసభలో అధికారం సేవకొరకే

పూర్వాధ్యాయంలో క్రీస్తు దేహమైన తిరుసభలోని సభ్యులందరికీ ఒకేవిలువ వుంటుందని చెప్పాం. కాని ఈ సభ్యులకు భిన్నమైన పరిచర్యలున్నాయి. ఒక్కోవర్గంవాళ్లు ఒక్కో సేవ చేస్తారు. జ్ఞానస్నానంద్వారా అందరు సరిసమానమైనా తాముచేసే సేవనుబట్టి తిరుసభ సభ్యుల్లో వ్యత్యాసాలున్నాయి. ఈ యధ్యాయంలో తిరుసభలో అధికారమంటే యేమిటో తెలిసికొందాం. తిరుసభలోని గురుపదవి ఏలా మూడంతస్తుల అధికారంగా చలామణిలోకి వచ్చిందో గూడ పరిశీలిద్దాం.

## 1. తిరుసభలో అధికారులు

ఆత్మే తిరుసభను నెలకొల్పింది. కనుక అది దైవ నిర్మితమైన సమాజం. ఐనా తిరుసభ మానవ నిర్మితమైన సమాజంకూడ. దాని సభ్యులు మానవ మాత్రులు. ఇక,

మానవ సమాజాలకు నాయకులు ఉండాలి, లేకపోతే అవి కొనసాగవు. తిరుసభ కూడ మానవసమాజం గనుక దానికి గూడ మానవనాయకులుండాలి. ఈ నాయకులే గురుత్వమనే దేవద్రవ్యానుమానాన్ని పొందిన గురువులు.

ఈ నాయకులకు తిరుసభను నడిపించే వరాన్ని దేవుని ఆత్మే దయచేస్తుంది. ఇది ప్రత్యేక వరం. ఈ వరం కలవాళ్ళు తిరుసభను దేవుని మార్గాల్లో నడిపిస్తారు. దానిలోని కార్యకలాపాలను క్రమబద్ధం చేస్తారు. దానిలోని ప్రజలు ఆత్మ తమకు దయచేసిన వరాలను సద్వినియోగం చేసికొనేలా చేస్తారు. గురుపట్టం ద్వారా గురువులు తిరుసభకు నాయకులౌతారు. ఈ గురుపట్టం అధికారయుతమైంది. ఐనా సేవాత్మకమైంది.

తిరుసభలోని అధికారానికి కొన్ని లక్షణాలున్నాయి. అది ఆత్మ ప్రేరితమైంది. దేవుని ఆత్మే కొందరు వ్యక్తులను ఎన్నుకొని వారిని గురుజీవితానికి ఆహ్వానిస్తుంది. వీళ్ళు తర్వాత ఆ సభలో అధికారం నాయకత్వం చేపడతారు. దేవుడు ఆహ్వానించందే ఎవరూ తమంతట తాము గురువులు కాలేరు. ఇంకా, ఈ పవిత్ర సమాజంలో నాయకత్వం శాశ్వతమైంది. గురువైన వ్యక్తి శాశ్వతంగా గురువుగానే వుంటాడు. గురుత్వం అతనిమీద శాశ్వతమైన ముద్రను వేస్తుంది. అతడు క్రీస్తు స్థానంలో వుండి తిరుభలో పనిచేస్తాడు. పైపెచ్చు ఈ దివ్య సమాజంలో నాయకత్వం బహిరంగమైంది. గురువు గురుపట్టం ద్వారా అధికారాన్ని బహిరంగంగానే పొందుతాడు. తర్వాత ఆ యధికారాన్ని బహిరంగంగానే నిర్వహిస్తాడు.

తిరుసభలో అధికారులు లేక నాయకులు లేక గురువులు క్రీస్తు స్థానంలో వుండేవాళ్లు. క్రీస్తులాగే మంద కొరకు ప్రాణాలు అర్పించేవాళ్లు. గురువు తన కొరకు తాను కాక క్రీస్తు మంద కొరకు వున్నవాడు.

గురువు ప్రధాన బాధ్యత దైవరాజ్యాన్ని గూర్చి ప్రజలకు బోధించి దాన్ని వ్యాప్తి చేయడం. ఆ రాజ్యానికి సాక్షిగా వుండడం. అతడు ఈ లోకంలో క్రీస్తు మధ్యవర్తిత్వాన్ని కొనసాగిస్తాడు. పూజబలి ద్వారా క్రీస్తుని విశ్వాసులకు ప్రత్యక్షం చేస్తాడు.

ఈ గురుపదవిలో పీఠాధిపతి, గురువు, పరిచారకుడు (డీకన్) అని మూడు అంతస్తులున్నాయి. మన దేశంలోగాని, ల్యాటిన్ తిరుసభలోగాని జీవితాంతం డీకన్లుగా వుండేవాళ్లు ఎవరూ లేరు. గ్రీకు తిరుసభలో వున్నారు. ఇక, దైవశాస్త్ర రీత్యా గురుపదవి భావమేమిటో చూద్దాం.

## 2. అధికారం సేవ కొరకే

తిరుసభలో అధికారాన్ని లేక నాయకత్వాన్ని సేవ అంటారు. ఈ నాయకత్వానికి నూత్నవేదం వాడిని గ్రీకుమాట "డియాకోనియా". ఈ మాటకు మొదట అన్నం వడ్డించడం

అని అర్థం. అన్నం వడ్డించడం అనే మూలార్థం నుంచి సేవచేయడం అనే భావం క్రమేణ వ్యాప్తిలోకి వచ్చింది. కనుక తిరుసభలో అధికారమంటే సేవ.

క్రీస్తు తిరుసభలోని నాయకులు సేవకులుగా వ్యవహరించాలని కోరాడు. వాళ్ళు ప్రజలకు సేవలు చేయడానికే జీవించాలని ఆజ్ఞాపించాడు. ఈ సేవాభావం లోకంలోని నాయకుల్లో లేదు. వాళ్ళు పెత్తనం చలాయిస్తారు - మార్కు 10,42-45. సేవకులంగా మెలగడం మనకు కష్టం. కనుక క్రీస్తే స్వయంగా శిష్యుల కాళ్ళు కడిగి మనకు ఓ ఆదర్శాన్ని చూపించాడు. మామూలుగా శిష్యులు గురువు కాళ్ళు కడగాలి. కాని గురువే శిష్యుల కాళ్ళు కడిగి తాను సేవకుణ్ణని రుజువు చేసికొన్నాడు - యోహా 13,5. నేను మీమధ్య సేవకుణ్ణిగా వున్నానని చెప్పుకొన్నాడు - లూకా 22,27.

కనుక తిరుసభలో నాయకులు అధికారులు ఐన గురువులు ఏనాడూ యజమానులుగాను పెత్తనం చలాయించే వాళ్ళుగాను మెలగకూడదు. అది లోకంలో, రాజకీయాల్లో చెల్లుతుందిగాని క్రీస్తు సమాజంలో చెల్లదు. గురుత్వం పదవి, గౌరవం, పలుకుబడి, పెత్తనం, స్వార్థలాభం మొదలైనవాటికొరకు ఉద్దేశింపబడింది కాదు. భక్తితో వినయంతో క్రీస్తు మందకు సేవలు చేయడం కొరకు ఉద్దేశింపబడింది.

గురువు గురుపట్టాభిషేక సాంగ్యంలో బిషప్పు "క్రీస్తు సేవలు చేయడానికేగాని జేయించుకోవడానికి రాలేదు. అతడు తప్పిపోయిన గొర్రెలను వెదకి రక్షించడానికి వచ్చాడు. నీవు ఎల్లప్పుడు ఆ మంచి కాపరిని ఆదర్శంగా పెట్టుకో" అని నూత్న గురువును హెచ్చరిస్తారు. "దేవుని దాసులకు దాసుడు" అని పోపుగారికి బిరుదం. తిరుసభలోని అధికారులు దేవుడు తమకు ఒప్పగించిన మందమీద పెత్తనం చలాయించకూడదని చెప్తుంది మొదటి పేత్రు జాబు 5,1-3.

తిరుసభలోని అధికారులనూ ప్రజలనూ గూర్చి చెప్పేపుడు నూత్నవేదం వాడే ఉపమానాలు కాపరి-మంద, భర్త-భార్య అనేవి. మంచి కాపరి తన మందకొరకు ప్రాణాలు అర్పిస్తాడు - యోహా 10,11. క్రీస్తు తిరుసభ అనే వధువు పాపమాలిన్యాన్ని తొలగించడానికి సిలువమీద ప్రాణాలు అర్పించాడు - ఎఫె 5,25-27. గురువులు తిరుసభలో క్రీస్తుస్థానంలో వుండేవాళ్ళు. కనుక వాళ్ళు క్రీస్తులాగే మందకు సేవలు చేయాలి. ఆ మందకొరకు తమ ప్రాణాలను గూడ అర్పించాలి. ఇదే మొదట మనం పేర్కొన్న డియాకోనియా లేక సేవ అన్న మాటకు అర్థం. కనుక మందను తన స్వార్థానికి వాడుకొనేవాడు దుష్ట గురువు. అతడు గురువు పదవికి అర్హుడుకాదు.

## 3. గురుత్వంలో మూడంతస్తులు

ఇక గురుపదవి చరిత్రను పరిశీలిద్దాం. గురుత్వంలో పీఠాధిపతి, గురువు, పరిచారకుడు అని మూడంతస్తులున్నాయి. క్రీస్తు మొదట గురుత్వాన్ని స్థాపించినపుడు

ఈ మూడంతస్తులులేవు. అవి క్రమేణ పరిణామం చెందాయి. కాని ఈ పరిణామం క్రీస్తు కోరికను అనుసరించే జరిగింది.

1. క్రీస్తు గురుత్వంలోని మూడు మెట్లను స్వయంగా స్థాపించలేదు. అతడు అపోస్తలులనే గురువులుగా నియమించాడు. 2. క్రీస్తు అభిమతం ప్రకారమే ఈ గురుత్వం క్రమేణ మూడు మెట్లుగా పరిణామం చెందింది. అతడు అపోస్తలులతో పాటు 72 శిష్యులను గూడ ఎన్నుకొన్నాడు. దివ్యసత్ప్రసాదాన్ని గూడ స్థాపించాడు. కనుక గురుత్వం ఏక శాఖగా కాక భిన్న శాఖలుగా వుండాలని అతని కోరికై వుండవచ్చు. 3. క్రీస్తు ఉత్థానానంతరం అతడు స్థాపించిన గురుత్వం మూడు శాఖలుగా పరిణామం చెందింది. ఆనాటి తిరుసభ అవసరాలను బట్టి ఈ పరిణామం అవసరమైంది. పైగా తిరుసభలో నెలకొనివున్న ఆత్మ ప్రేరణం ద్వారానే ఈ పరిణామం జరిగింది. మనకు తెలిసినంతవరకు ఈ పరిణామం వివరాలివి.

అపోస్తలులతోపాటు కొందరు పెద్దలుకూడ యెరూషలేములో సమావేశమై ఆనాటి తిరుసభలో నిర్ణయాలు చేసారు - అ.చ. 15,22. తిమోతి తీతు జాబుల్లో తొలినాటి తిరుసభ అధికారుల్లో పర్యవేక్షకులు (ఎపిస్కోపోయి) పెద్దలు (ప్రెస్బితెరోయి) పరిచారకులు (డియాకొనోయి) అని మూడు వర్గాలవాళ్లు కన్పిస్తారు. పర్యవేక్షకులు పెద్దలు సరిసమానమైన అధికారాన్ని నిర్వహించినట్లు కూడ తెలుస్తుంది. అనగా వారి పదవులు సరిసమానమైనవి. వీళ్లుగాక ఇంకా ప్రవక్తలు బోధకులు అనే వాళ్లుకూడ తిరుసభలో వుండేవాళ్లు.

క్రీ.శ. 95లో క్లెమెంటు అనే తిరుసభ అధికారి తాను వ్రాసిన జాబులో పర్యవేక్షకులు పెద్దలు అపోస్తలులకు వారసులు అని చెప్పాడు. అనగా అప్పటి తిరుభలోని వివిధాధికారుల్లో ఈ వుభవయ వర్గాలవాళ్ళు ముఖ్యులు అనుకోవాలి.

క్రీ.శ. 110 ప్రాంతంలో అంటియోకయ బిషప్పయిన ఇగ్నేష్యస్‌గారు చాల జాబులు వ్రాసారు. ఈ జాబులు పైన మనం పేర్కొన్న పర్యవేక్షకులను తిరుసభలోకెల్ల ఉన్నతాధికారులుగా వర్ణిస్తాయి. అనగా అప్పటికల్లా పర్యవేక్షకులు అనబడేవాళ్లు పీఠాధిపతులు అయ్యారు. పెద్దలు అనబడేవాళ్లు వాళ్లక్రింద పనిచేసే గురువులయ్యారు. పరిచారకులు అనబడేవాళ్లు మూడవ అంతస్తులో వున్నారు. ఇగ్నేష్యస్ గారు "ఒక్క దివ్యసత్ప్రసాదం, ఒక్క పాత్రం, ఒక్క బలిపీఠం, పెద్దల బృందంతోను పరిచారక బృందంతోను కూడిన పీఠాధిపతి" అని వ్రాసారు. కనుక ఆనాడు ఒక్కో పీఠాధిపతి ఆధీనంలో ఓ గురు బృందమూ ఓ పరిచారక బృందమూ పనిచేస్తూ వుండివుండాలి. ఈ రీతిగా ఇప్పటి పీఠాధిపతులు గురువులు పరిచారకులు అనే మూడంతస్తుల క్రమం రెండవ శతాబ్దం ప్రారంభంలో ఏర్పడింది.

రెండవ శతాబ్దం మధ్య కాలంలో వర్ధిల్లిన ఇరెనేయస్ అనే వేదశాస్త్రి వ్రాతల ప్రకారం తిరుసభ అధికారుల్లో పీఠాధిపతి ముఖ్యమైనవాడు. ఇతడే అపోస్తలులు స్థాపించిన తిరుసభకు వారసుడుగా వుండేవాడు. ఇతని ద్వారానే ఆయా క్రైస్తవ సమాజాలు తొలి అపోస్తలులు స్థాపించిన ఆదిమ తిరుసభతో సంబంధం కలిగివుండేవి. ఈ వేదశాస్త్రి రోము పీఠాన్ని పరిపాలించిన పీఠాధిపతుల జాబితాను కూడ తయారుచేసి వాళ్ళు తొలి పండ్రెండుమంది అపోస్తలుల తర్వాత కొనసాగుతూ వచ్చినవాళ్ళని చెప్పాడు. ఈలా పీఠాధిపతుల స్థానం క్రమేణ ప్రాముఖ్యంలోకి వచ్చింది.

## ప్రార్థనా భావాలు

1. తిరుసభలో మూడు భాగాలున్నాయి. ఈ లోకంలో వున్నది యుద్ధ తిరుసభ. ఇది పిశాచంతో పోరాడేది. మోక్షంలో వున్నది విజయ తిరుసభ. ఉత్తరించే స్థలంలో వున్నది బాధామయ తిరుసభ. ఈ మూడు భాగాలకు పరస్పర సంబంధం వుంది. మోక్షంలోని భక్తులు తమ ప్రార్థనల ద్వారా ఈలోకంలో పోరాడే మనకు సాయం చేస్తుంటారు. మోషే యిస్రాయేలీయుల కొరకు ప్రార్థన చేసాడు. స్తెఫను తన్ను హింసించేవారి కొరకు జపించాడు. తుఫానులో చిక్కిన పౌలు ఓడలోని తోడి ప్రయాణికుల కొరకు మనవిచేసాడు. కాని ఈ భక్తులంతా మోక్షానికి వెళ్లాక తమ ప్రార్థనను మానివేయరు కదా! కనుక మోక్షంలోని వాళ్ళు మన కొరకు జపిస్తారు. మన తరపున మనం నమ్మకంతో వారి ప్రార్థనా సహాయాన్ని అడుగుకోవాలి.

2. మోక్షంలోని అర్చ్యశిష్టులను పూజించడం వలన ఈ లోకంలోని తిరుసభకు మూడు లాభాలు కలుగుతాయి. ఆ భక్తులు తమ పుణ్యజీవితం ద్వారా మనకు ఓ మంచి ఆదర్శాన్ని చూపిస్తారు. ఈ భూమిమీద వున్న మనకు మోక్షంలోని పునీతులతో సహవాసం లభిస్తుంది. వాళ్లు తమ ప్రార్థనల ద్వారా మనకు సహాయం చేస్తారు.

# 10. పీఠాధిపతులు

గృహస్థులూ గురువుల తర్వాత పీఠాధిపతులను గూర్చి చెప్పాలి.

మొదటి వాటికన్ సభ పోపుగారి పదవిని గూర్చి సవిస్తరంగా బోధించిందిగాని పీఠాధిపతులను గూర్చి ఏమీ చెప్పలేదు. రెండవ వాటికన్ సభ బిషప్పుల అధికారాన్ని గూర్చి సవిస్తరంగా బోధించింది. ఈ సభ ముఖ్యబోధల్లో బిషప్పుల అధికారంకూడ ఒకటి. ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం.

# 1. పీఠాధిపతులు క్రీస్తు అధికారంలో పాలుపొందుతారు

పీఠాధిపతుల పదవి తిరుసభలో అతిప్రాచీనమైనది. వీరిద్వారానే తిరుసభలో అపోస్తలులతోడి సంబంధం కొనసాగుతూ వచ్చింది. ఇరెనేయస్ వేదశాస్త్రి చెప్పినట్లుగా "తొలి ప్రేషితులు స్వయంగా నియమించిన వారసుల ద్వారాను వారి వారసులద్వారాను తిరుసభలో ఆ మొదటి ప్రేషితుల సంప్రదాయం కొనసాగుతూ వచ్చింది."

బిషప్పులు తొలి ప్రేషితులతో నేరుగా సంబంధం కలవాళ్లు. వీళ్లు ఆ ప్రేషితుల బోధనే కొనసాగించి ప్రజలను దైవరాజ్యంలోనికి చేర్చారు. అపోస్తలుల చర్యలు 20,28, తీతు 1,6-9 వీళ్ళ ప్రాముఖ్యాన్ని తెలియజేస్తాయి. తిరుసభ నాల్గులక్షణాల్లో వొకటి, తొలి ప్రేషితులతో సంబంధం కలిగివుండడం. వారికి వారస సమాజమై వుండడం. ఈ కార్యం బిషప్పుల ద్వారానే నెరవేరుతుంది.

మేత్రాణులనుగూర్చి రెండవ వాటికన్ సభ ఈలా బోధించింది. క్రైస్తవ సమాజంలో బిషప్పులు క్రీస్తుస్థానంలో వుంటారు. క్రీస్తు పేరుమీదిగా కార్యాలు నిర్వహిస్తారు. నేడు క్రీస్తు బిషప్పులద్వారాను వారి అనుచరులైన గురువులద్వారాను తన వుద్యమాన్ని కొనసాగించుకొనిపోతాడు. క్రీస్తు ప్రతినిధులుగా, రాయబారులుగా మేత్రాణులు ఆయా స్థానిక తిరుసభలను పరిపాలిస్తుంటారు. వీరిద్వారానే క్రీస్తు ఆయా తిరుసభల్లోని క్రైస్తవుల్లో ప్రత్యక్ష మౌతూంటాడు.

మంచి కాపరియైన క్రీస్తు స్థానంలో వుండే ఈ పీఠాధిపతులపట్ల విశ్వాసులు ప్రేమభావంతో మెలగాలి. తిరుసభ క్రీస్తుకీ, క్రీస్తు తండ్రికీ అంటిపెట్టుకొని వున్నట్లే విశ్వాసులు కూడ తమ పీఠాధిపతికి అంటిబెట్టుకొని వుండాలి. అతన్ని తండ్రినిలాగ గౌరవించాలి.

పీఠాధిపతులు క్రీస్తు స్థానంలో వుండి విశ్వాసులకు అతన్ని ప్రత్యక్షం చేసేవాళ్లు గనుక, క్రీస్తు మూడు లక్షణాలైన ప్రవకృత్వం, యాజకత్వం, రాజత్వం వారికికూడ సమృద్ధిగా లభిస్తాయి. ఈ లక్షణాలద్వారానే వాళ్ళు క్రీస్తు అధికారంలో పాలుపొందుతారు.

1. బిషప్పు ప్రవక్త. సువిశేషబోధ పీఠాధిపతి ముఖ్యకార్యాల్లో వొకటి. బిషప్పుకి అభిషేకం జరిగేప్పుడు నూత్నవేదాన్ని అతని తలమీద పెడతారు. అతడు ప్రధానంగా దైవరాజ్య బోధకుడని దీని భావం. తొలిప్రేషితులు పవిత్రాత్మ దిగివచ్చినపుడు వాక్శక్తిని పొందింది ఈ బోధకొరకే - అచ 2,4.

బిషప్పుల బృందం తమకు శిరస్సుయిన పోపుగారితో కలసి బోధించిన వేదసత్యాలకు పొరపాటుపడని వరం వుంటుంది. బిషప్పుల బోధలు నైతిక విశ్వాసరంగాలకు

పరిమితమై వుంటాయి. వాళ్లు క్రీస్తు పేరుమీదుగా బోధిస్తారు. కనుక విశ్వాసులు ఈ బోధలను పూర్ణహృదయంతో స్వీకరించాలి.

2. బిషప్పు యాజకుడు. తన మేత్రాసనంలో అతడు ప్రధాన యాజకుడు. అభిషేకంద్వారా అతనికి పరిపూర్ణమైన యాజకత్వం లభిస్తుంది. దీనిద్వారా అతడు ప్రజలకు క్రీస్తు రక్షణభాగ్యాలను పంచిపెట్టే గృహనిర్వాహకుడు ఔతాడు. మేత్రాసనంలో దైవార్చనను క్రమబద్ధం చేసేదీ, వ్యాప్తి చేసేదీ అతడే.

దివ్యబలి ఆరాధనలో అధ్యక్షుడు అతడే. ఆయా విచారణల్లో గురువుల పూజబలులు అర్పించేపుడు అతని ప్రతినిధులుగానే అర్పిస్తారు. అవసరమైనప్పుడు బిషప్పు ఒక గురువుకి పూజబలిని అర్పించడానికీ అనుమతిని నిరాకరించవచ్చు.

బిషప్పు ముఖ్యంగా ప్రధాన యాజకుడు. మేత్రాసనంలోని విచారణలు స్థానిక తిరుసభను సూచిస్తాయి. మేత్రాసనం విశ్వవ్యాప్తమైన తిరుసభను సూచిస్తుంది. కనుక పీఠాధిపతి తన మేత్రాసనానికంతటికీ, ఒకవిధంగా విశ్వ తిరుసభకీ కూడ పూచీపడతాడు.

మామూలుగా భద్రమైన అభ్యంగనాన్ని ఇచ్చేది పీఠాధిపతే. గురువులకు పాపసంకీర్తన దేవద్రవ్యానుమానాన్ని జరిపించే అధికారాన్ని ఇచ్చేది అతడే. గురువుని తన మేత్రాసనానికి చెందినవాణ్ణిగా చేసేదికూడ అతడే.

అతడు తన మేత్రాసనంలోని మందకొరకు ప్రత్యేకంగా ప్రార్థనలు చేయాలి. ఆదివారాల్లోను అప్పుపండగల్లోను వారి శ్రేయస్సు కొరకు పూజబలి నర్పించాలి. అతడు పవిత్రంగాను వినయంగాను సరళంగాను సోదరప్రేమతోను జీవిస్తూ, తన మందకు ఆదర్శంగా వుండాలి.

3. బిషప్పు నాయకుడు. పీఠాధిపతి తన మేత్రాసనానికి ప్రధానకాపరి, లేక నాయకుడు. అపోస్తలులకు వారసుడు కనుక బిషప్పు తన మేత్రాసనంలో అన్ని అధికారాలు పొందుతాడు. అతడు కేవలం పాపుగారికి ప్రతినిధిగాకాక, క్రీస్తు ప్రతినిధిగానే తన మేత్రాసనాన్ని పరిపాలిస్తాడు.

కాని మేత్రాసనంలో అతని అధికారం పెత్తనం చలాయించే రూపంలో వుండకూడదు. అతడు కాపరిగా, తండ్రిగా, సేవకుడుగా ప్రజలకు పరిచర్యలు చేయాలి. అంతేగాని సేవలు చేయించుకొనేవాడు కాకూడదు.

తిరుసభలో అధికారం సేవకొరకు ఉద్దేశింపబడిందని చెప్పాం. బిషప్పు అధికారంగూడ ఈ సేవకొరకేవుంది. సేవకుడూ మంచికాపరీఐన క్రీస్తే పీఠాధిపతికి ఆదర్శం.

## 2. పీఠాధిపతుల బృందం

ప్రపంచంలోని బిషప్పులంతా కలసి ఒక్క బృందం ఔతారు. ఈ బృందానికి శిరస్సు లేక నాయకుడు పోపుగారు. ఈ పోపుగారు కూడ బిషప్పుల్లో ఒకరే. ఆ విషయం తర్వాత వస్తుంది. తొలిరోజుల్లో పేత్రూ శిష్యులూ కలసి ఒక్క ప్రేషిత సంఘమయ్యారు. అలాగే పేత్రు వారసుడూ రోమాపురి బిషప్పు ఐన పోపుగారూ, ఇతర బిషప్పులూ కలసి ఒక్క సంఘమౌతారు. ఆ ప్రేషిత సంఘమూ ఈ పీఠాధిపతుల సంఘమూ కూడ క్రీస్తు ఆజ్ఞవల్లనే ఏర్పడ్డాయి.

ఈ బిషప్పుల బృందానికి తిరుసభమీద సమగ్రమైన అధికారం వుంటుంది. ఈ సంఘానికి శిరస్సు లేక అధిపతి పోపుగారు. సభ్యులు బిషప్పులు. అభిషేకంద్వారానే బిషప్పుకి ఈ సభ్యత్వం వస్తుంది. ఈ బృందమంతా కలసే తొలి అపోస్తలులకు వారసులు. వీళ్ళద్వారానే అపోస్తలుల సంప్రదాయం తిరుసభలో కొనసాగుతుంది. ఈ బిషప్పుల సంఘమంతా కలసి విశ్వవ్యాప్తమైన తిరుసభను పరిపాలిస్తుంది. తిరుసభలో ఈ సంఘానిదే పై యధికారం. అనగా ఈ సంఘానికి మించిన అధికారం మరెవరికీ లేదు.

పీఠాధిపతిని అభిషేకించడానికి ఒక్క బిషప్పు చాలరు, ముగ్గురుకావాలి. ఈ క్రియ బిషప్పు ఎప్పుడూ ఏక వ్యక్తిగాగాక, ఒక బృందానికి చెందినవాడుగా పరిగణింపబడతాడని సూచిస్తుంది.

బిషప్పుల పరిషత్తు (పాపుగారు బిషప్పులు కలసి) ఏకగ్రీవంగా బోధించిన వేదసత్యాలు తిరుగులేని వౌతాయి. వాటికి పొరపాటు పడని వరం వుంటుంది. పరిశుద్ధాత్మే ఈ పరిషత్తును నడిపిస్తుంది, ప్రబోధిస్తుంది. కనుక తిరుసభ సభ్యులు ఈ వేద సత్యాలను సంపూర్ణంగా అంగీకరించాలి.

మామూలుగా ఈలాంటి వేదసత్యాలను బిషప్పుల పరిషత్తు ఎక్యుమెనికల్ సభల్లో వెల్లడి చేస్తుంది. ఈ సభలు పోపుగారితోను అందరు బిషప్పులతోను కూడి వుంటాయి. ఐనా అందరు బిషప్పులూ ఈ సభలకు వ్యక్తిగతంగా హాజరు కానక్కరలేదు. వారు తమతమ తావుల్లో వుండే తమ సమ్మతిని వెల్లడి చేయవచ్చు. రెండవ వాటికన్ మహాసభ ఈలాంటి ఎక్యుమెనికల్ కౌన్సిల్.

వాటికన్ మహాసభ తర్వాత "బిషప్పుల సమాఖ్య" అనేది కూడ వచ్చింది. దీనిలో అందరు బిషప్పుల తరపున కొందరు బిషప్పులు మాత్రమే పాల్గొంటారు. వీళ్లు పోపుగారి నాయకత్వం క్రింద సమావేశమై తిరుసభలోని ఆయా సమస్యలను గూర్చి చర్చిస్తారు. తమ బోధలనూ సూచనలనూ పరిష్కారాలనూ తిరుసభ కంతటికీ అందిస్తారు. ఈ సమాఖ్య

ద్వారా బిషప్పులు విశ్వవ్యాప్తమైన తిరుసభ బాగోగులకు పూచీపడతారు. పోపుగారితో తమకున్న సంబంధాన్ని కూడ బలపర్చుకొంటారు. బిషప్పుల సమాఖ్య ఎప్పుడూ పోపుగారి ప్రమేయం లేకుండా పనిచేయదు. శిరస్సు లేకుండా వట్టి అవయవాలు పనిచేయవుకదా!

పీఠాధిపతి వ్యక్తిగతంగా తన మేత్రాసనాన్ని పరిపాలిస్తాడు. ఇతర మేత్రాసనాల మీదగాని, విశ్వ తిరుసభమీదగాని అతనికి అధికారం వుండదు. కాని అతడు ఎప్పుడూ బిషప్పుల పరిషత్తుకు చెందినవాడే కనుక, విశ్వతిరుసభ అవసరాలపట్ల గూడ శ్రద్ధ జూపిస్తాడు. మేత్రాణులు మామూలుగా తిరుసభలోని విశ్వాసం క్రమశిక్షణ భక్తి మొదలైన కార్యాలను పట్టించుకొంటారు. ఒక స్థానిక తిరుసభ అవసరాల్లోగాని హింసల్లోగాని వుంటే దానికి సాయం జేస్తారు. వేద బోధలో శ్రద్ధ జూపుతారు. ఎవరి స్థానిక తిరుసభను వాళ్ళు వృద్ధిలోకి తీసుకవస్తారు. దీని వలన విశ్వతిరుసభ అభివృద్ధి చెందుతుంది. బిషప్పు వ్యక్తిగతంగా తన మేత్రాసనానికే బాధ్యుడు ఐనా, బిషప్పుల పరిషత్తుకు చెందినవాడుగా విశ్వ తిరుసభకు కూడ బాధ్యుడు ఔతాడు.

## 3. స్థానిక తిరుసభ లేక మేత్రాసనం

మేత్రాసనానికే స్థానిక తిరుసభ అనిపేరు. బిషప్పు ఎప్పుడుకూడ తన మేత్రాసనాన్ని విశ్వతిరుసభలో బాగంగా గణించాలి. అది విశ్వతిరుసభతో సంబంధం లేని ముక్క అనుకోగూడదు. తన మేత్రాసనం దానంతట అదే నిలుస్తుంది అనుకోగూడదు. అతడు తన మేత్రాసనంలో ఏక, పవిత్ర, విశ్వవ్యాప్త, ప్రేషిత తిరుసభను ప్రత్యక్షం చేయాలి. స్థానిక తిరుసభలో విశ్వతిరుసభ ఇమిడే వుంటుంది. చాలా స్థానిక తిరుసభలు చేరేకదా విశ్వతిరుసభ అయ్యేది? కనుక అతడు స్థానిక తిరుసభను అభివృద్ధి చేస్తూ దానిద్వారా పరోక్షంగా విశ్వతిరుసభను అభివృద్ధి చేయాలి.

విశ్వతిరుసభలో లాగే స్థానిక తిరుసభలోని ప్రజలనందరినీ ఐక్యంజేసేది పవిత్రాత్మే. ఈయాత్మ మేత్రాసనంలోని సభ్యులందరికీ ఎవరికిచ్చే వరాలను వారికిస్తుంది. బిషప్పు ఈ వరాలను సద్వినియోగం జేసికొని స్థానిక తిరుసభను అభివృద్ధిలోకి తీసుకరావాలి. స్థానిక తిరుసభలోని బలానికీ ఐక్యతకూ కంటికి కన్పించని చిహ్నంగా వుండేది పవిత్రాత్మ. అదే గుణాలకు కంటికి కన్పించే చిహ్నంగా వుండేవాడు బిషప్పు. కనుక మేత్రాసనం బాగోగులు చాలవరకు అతని మీద ఆధారపడివుంటాయి.

బిషప్పు తన గురువుల బృందంతో కలసి పనిచేయాలి. వారిని ప్రోత్సహించాలి. వారి సహకారం లేందే మేత్రాసనం వృద్ధిలోకి రాదు. అతనికీ తోడి గురువులకీ వుండే సంబంధం, పెద్దన్నకీ తమ్ముళ్ళకీ వుండే సంబంధం లాంటిది. ఎప్పుడుకూడ బిషప్పులకీ గురువులకీ మధ్య ఐకమత్యం సహకారం అవసరం.

బిషప్పు గురువులతోపాటు గృహస్థులను కూడ ప్రోత్సహించాలి. వాళ్ళ వరాలను గూడ గుర్తించి వాళ్ళ సేవలను గూడ వినియోగించుకోవాలి. వాళ్ళచేత కూడ దైవరాజ్య వ్యాప్తి చేయించాలి. అప్పుడే స్థానిక తిరుసభ వృద్ధి చెందేది. తిరుసభలో 99 పాళ్లు గృహస్థులే కదా!

మొత్తంమీద బిషప్పు ఈ కాలపు అవసరాలనూ, ఈ కాలపు గురుతులనూ గ్రహించిన నాయకుడై యుండాలి.

## 4. పీఠాధిపతి పరిపూర్ణమైన గురుపట్టం

అభిషేకం ద్వారా పీఠాధిపతికి పరిపూర్ణమైన గురుపట్ట దేవద్రవ్యానుమానం లభిస్తుంది. గురువుకి పరిపూర్ణమైన గురుపట్టంలేదు. అతనికి దానితో రెండవస్థానం మాత్రమే లభిస్తుంది. పరిచారకుడికి మూడవ స్థానం లభిస్తుంది. కాని బిషప్పుకి మొదటి స్థానం లభిస్తుంది.

బిషప్పు అభిషేకం పొందేపుడు తోడి బిషప్పులు అతని మీద చేతులు చాచి ఆత్మను ఆవాహనం చేస్తారు. ఈ సాంగ్యం ద్వారా అతడు పీఠాధిపతి ఔతాడు. క్రీస్తు ప్రతినిధియై ఆ ప్రభువు మూడు లక్షణాలను స్వీకరిస్తాడు.

గురువు పీఠాధిపతి నుండి గురుపట్టం పొందుతాడు. అతడు పీఠాధిపతి యాజకత్వం ద్వారా క్రీస్తు యాజకత్వంలో పాలుపొందుతాడు.

### ప్రార్థనా భావాలు

1. భాసిల్ భక్తుడు తిరుసభలోని పీఠాధిపతులను గూర్చి చెప్తూ ఈలా వ్రాసాడు. "పొట్టేళ్లు మందకు ముందుగా నడుస్తూ గొర్రెలను నడిపించుకొని పోతాయి. అలాగే తిరుసభ అధికారులు కూడ క్రైస్తవ ప్రజలకు ముందుగా నడుస్తూ వాళ్ళను నడిపించుకొని పోతారు. ఆ ప్రజలచే ఆధ్యాత్మిక బోధలనే మేతను తినిపిస్తారు. ఆత్మ జలాలనే నీటిని త్రాగిస్తారు". నేటి తిరుసభకు కూడ ఈలాంటి అధికారులూ బోధకులూ లభిస్తే ఎంత బాగుంటుంది!

2. క్లెమెంటు భక్తుడు ఆదిమ క్రైస్తవ సమాజంలోని బిషప్పులను గూర్చి ఈలా చెప్పాడు. "తిరుసభలోని అధికారులు లౌకిక అధికారుల్లాగ పరిపాలనం చేయకూడదు. వాళ్లు సేవకులై మందకు ఉపచారాలు చేయాలి. ప్రజలకు తండ్రులై ఆదరభావాన్ని ప్రదర్శించాలి. వైద్యులై ప్రజలను సందర్శించాలి. కాపరులై ప్రజలను కాపాడాలి. సంగ్రహంగా చెప్పాలంటే అధికారులు నిరంతరం ప్రజల క్షేమం కొరకు కృషిచేయాలి" నేటి తిరుసభకు కూడ ఈలాంటి బిషప్పులు లభించాలని ప్రార్థిద్దాం.

# 11. పోపుగారి ప్రధానత్వం

పూర్వాధ్యాయంలో చెప్పినట్లుగా బిషప్పులంతా కలసి అపోస్తలులకు వారసులు. కాని ఈ యపోస్తలులకు పేత్రు పెద్ద. రోము బిషప్పుగారయిన పోపుగారు ఈ పేత్రుకి వారసుడు. కనుక బిషప్పులందరిలోను ఆయన ప్రథముడు, ప్రముఖుడు, ప్రధానుడు. ఈ యధ్యాయంలో పోపుగారి ప్రధానత్వాన్ని పరిశీలిద్దాం. ఇక్కడ మూడంశాలు వున్నాయి.

## 1. బైబులు బోధలు

గ్రీకు పదమైన "పాపాస్" ల్యాటినులో "పాపా" ఐ ఇంగ్లీషులో "పోప్"గా మారింది. ఈ శబ్దానికి తండ్రి, నాన్న అని అర్థం. ఈ పదాన్ని మొదట బిషప్పులకూ మఠాధిపతులకు గూడ వాడేవాళ్లు. 6వ శతాబ్దం తర్వాత ఇది రోమాపురి బిషప్పుకి మాత్రమే పరిమితమైంది.

పోపుగారికి చాల బిరుదాలున్నాయి. వీటిల్లో "పేత్రుకి వారసుడు" అనేది ముఖ్యమైంది. దీన్నిబట్టే ఆయన విశ్వ తిరుసభకు అధికారి అయ్యాడు. బిషప్పుల బృందానికి శిరస్సు అయ్యాడు.

కాని పోపుగారి ప్రధానత్వం అంటే ఏమిటి? పోపుగారు తిరుసభలోని బిషప్పులుకీ విశ్వాసులకీ అందరికీ అధిపతి. తిరుసభ అంతటిమీద ఆయనకు సర్వోన్నతమైన అధికారం వుంది. ఆయన పేత్రుకి వారసుడు. పేత్రు రోమాపురి మేత్రాసనానికి బిషప్పు. పేత్రుని అపోస్తలులకు పెద్దనుగా నియమించిన ప్రభువు నుండే పోపుగారికి ప్రధానత్వం కూడ వచ్చింది. పోపుగారి ప్రధానత్వాన్ని మొదటి వాటికన్ సభ అధికార పూర్వకంగా ప్రకటనం చేసింది. రెండవ వాటికన్ సభ దృఢపరచింది. కనుక నేడు మనమందరం దీన్ని తిరుగులేని విశ్వాస సత్యంగా అంగీకరించాలి.

పోపుగారి ప్రధానత్వం పేత్రునుండి సంక్రమించింది. ఈ పేత్రు ప్రాచీనాధారాల ప్రకారం రోములోనే వేదసాక్షిగా మరణించాడు. ఇక్కడ మనం మొదట నూత్నవేదం నుండి పేత్రు అపోస్తలులందరికీ పెద్ద అనే సత్యాన్ని నిరూపించాలి. తర్వాత పేత్రుకి వారసుడూ రోమాపురి బిషప్పు ఐన పోపుగారికి ఈ పెద్దరికం సంక్రమించిందని చారిత్రకంగా రుజువు చేయాలి. ఈ రెండంశాలు క్రమంగా చూద్దాం.

## 1. పేత్రు ప్రధానత్వం

నూత్నవేదం అపోస్తలుల జాబితాలను పేర్కొనేపుడల్లా పేత్రు పేరే మొదట వస్తుంది - మార్కు 3,16-19. ఇతర ప్రేషితుల తరపున అతడు మాటలాడుతూంటాడు - మత్త 16,16. ఉత్థాన క్రీస్తు శిష్యులందరిలోను మొదట పేత్రుకే దర్శనమిచ్చాడు - 1కొరి 15,5.

నూత్నవేదంలో మూడు ప్రధాన సందర్భాలు పేత్రు పండ్రెండుమంది శిష్యుల్లో ప్రధానుడని రుజువు చేస్తాయి. మొదటిది, మత్తయి 16,13-19. ఇక్కడ క్రీస్తు సీమోను నామాన్ని కేఫాగా (రాయి) మార్చాడు. తాను నిర్మింపబోయే తిరుసభకు అతన్ని పునాది రాతిని చేసాడు. ఇంకా అతినికి పరలోక రాజ్యపు తాళపుచెవులు (పూర్తి అధికారం) ఇచ్చాడు. వేటినైనా బంధించడానికీ విప్పడానికీ అధికారమిచ్చాడు (సర్వాధికారం). అనగా క్రీస్తు గృహానికి క్రీస్తే యజమానుడు కాగా, పేత్రు ఆ యజమానునికి ప్రతినిధి ఔతాడని భావం. వీటన్నిటిని బట్టి పేత్రు అపోస్తలులలో ప్రధానుడని అర్థం చేసికోవాలి.

రెండవది, లూకా 22,31-32. ఇక్కడ పిశాచం క్రీస్తు మరణ సందర్భంలో అపోస్తలులందరినీ శోధించింది. పేత్రుతో పాటు అందరూ పడిపోయారు. కాని క్రీస్తు ప్రార్థనా బలంవల్ల పడిపోయిన పేత్రు మళ్లా లేస్తాడు. అలా లేచాక అతడు తన సోదరులను బలపరుస్తాడు. ఇక్కడ "సోదరులు" అంటే క్రీస్తుని విశ్వసించే ఇతర అపోస్తులులంతా. వీళ్లందరినీ బలపరచే పేత్రు వీళ్లకు నాయకుడు ఔతాడు కదా! పేత్రు బలహీనుడైనా ప్రభువు అతనికి ఈ నాయకత్వాన్ని దయచేసాడు.

మూడవది, యోహాను 21,15-17. ఇక్కడ క్రీస్తు మూడు పర్యాయాలు తన మందను కాయమని పేత్రుకి చెప్పాడు. అనగా అతన్ని ఖండితంగా తన మందకు నాయకుణ్ణి చేసాడు. క్రీస్తే తన మందకు మంచి కాపరి - 10,10. పూర్వవేద ప్రజలకు యావే కాపరి. అనగా నాయకుడు. ఐనా న్యాయాధిపతులూ రాజులూ నాయకులూ కూడ ప్రజలకు కాపరులే. వీళ్లు యావే అధికారంలో పాలుపొంది యిస్రాయేలు ప్రజలకు నాయకులు అయ్యారు. అలాగే ప్రధాన కాపరియైన క్రీస్తుకూడ పేత్రుకి తన నాయకత్వంలో పాలు పంచియిచ్చాడు. అతడు క్రీస్తనే ప్రధాన కాపరి క్రింద పనిచేసే ఉపకాపరి. ఇంకా ప్రభువు, ఒకే మంద, ఒకే కాపరి అన్నాడు - 10,16. ఈ వొకే కాపరి మొదట పేత్రే. ఈ వొకే కాపరిద్వారా క్రీస్తు మందకు ఐక్యత సిద్ధించింది.

పై మూడు వేదభాగాలు పేత్రు శిష్యుల్లో ప్రధానుడనీ, క్రీస్తు అతనికి ప్రత్యేకాధికారం ఒప్పజెప్పాడనీ రుజువుచేస్తాయి. పేత్రు గొప్పతనం వల్ల అతనికి ప్రత్యేకాధికారం రాలేదు. క్రీస్తు కరుణవల్ల వచ్చింది. క్రీస్తు మెస్సీయా. అతడు పేత్రుని మెస్సీయా సమాజానికి శిరస్సునిగా నాయకుణ్ణిగా నియమించిపోయాడు.

అపోస్తులుల కార్యాలు తొలి 8 అధ్యాయాలు పేత్రు తొలినాటి క్రైస్తవ సమాజంలో ఏలా నాయకత్వం వహించిందీ వివరిస్తాయి. మత్తీయాను పండ్రెండవ అపోస్తలుణ్ణిగా ఎన్నుకోవడంలో, ఆత్మ దిగివచ్చాక యెరూషలేములో ఉపన్యసించడంలో, కుంటివాణ్ణి స్వస్థపరచాక దేవళంలో మాట్లాడటంలో పేత్రు నాయకత్వం వహించాడు. ఈ పేత్రు ప్రధానత్వం తర్వాత పోపుగారికి లభించింది.

## 2. పేత్రు స్థానంలో పోపుగారు

ఇంతవరకు శిష్యుల్లో పేత్రు ప్రధానుడని రుజువు చేసాం. ఇక, ఈ ప్రధానత్వం పోపుగారికి ఏలా సంక్రమించిందో పరిశీలిద్దాం. ఇక్కడ మనకు ఆధారం చరిత్రే.

క్యాతలిక్ తిరుసభ నమ్మకం ప్రకారం రోము బిషప్పయిన పోపుగారు పేత్రుకి వారసుడు. రోము బిషప్పే పేత్రుకి ఎందుకు వారసుడు కావాలి? ఇతర బిషప్పులు ఎందుకు కాకూడదు? పేత్రు రోము పీఠానికి అధిపతిగా వుండి అక్కడే వేదసాక్షిగా చనిపోయాడు కనుక. కాని పేత్రు రోము పీఠానికి అధిపతి అని మనకెలా తెలుసు?

అపోస్తలుల చర్యలు 12,17 పేత్రు యెరూషలేము నుండి "వేరొక చోటికి" వెళ్లాడు అని చెప్తుంది. ఈ వేరొకచోటు రోమే ఐయుండాలి. ఎందుకంటే, మొదటి పేత్రు జాబు 5,13. "బాబిలోనియాలోని తిరుసభ మిమ్ము అడిగినట్లు చెప్తుంది" అని నుడువుతుంది. ఈ "బాబిలోనియా" రోమే. ఈ రోముకి పీఠాధిపతియైన పేత్రు వ్రాసిన జాబే యిది.

తొలి రెండు శతాబ్దాల్లోని వేదసాక్షులూ భక్తులూ పేత్రు రోము పీఠాధిపతి అని రూఢిగా చెప్తున్నారు. అంటియోకయా బిషప్పయిన ఇన్యాసివారు రోమీయులకు వ్రాసిన జాబులో "అపోస్తలులయిన పేత్రు పౌలుల్లాగ నేను మీకు ఉపదేశం చేయలేను" అని వ్రాసాడు. పేత్రు రోముకి బిషప్పని ఇగ్నేష్యస్‌కి తెలుసు. కోరింతులో వసించిన డయొనీష్యస్ అనే భక్తుడు పేత్రుపౌలులు రోములో వేదబోధచేసి అక్కడే వేదసాక్షులుగా మరణించారని నుడివాడు. ఇరెనేయస్ వేదశాస్త్రి వ్రాతల ప్రకారం పేత్రు పౌలులు రోములోని తిరుసభను స్థాపించారు. రోములోని ఇప్పటి పేత్రు పెద్దగుడి అడుగున పేత్రు సమాధి కూడ వుంది. ఈలాంటి ఆధారాలనుబట్టి పేత్రు రోముకి బిషప్పుగావుండి అక్కడే ప్రాణాలు విడిచాడని అర్థం జేసికోవాలి. ఈ సత్యాన్ని క్యాతలిక్, ప్రొటస్టెంటు క్రైస్తవులు కూడ అంగీకరిస్తారు.

కాని పేత్రు యెరూషలేమునుండి రోముకి ఎందుకువెళ్లాడు? మనకు రూఢిగా తెలియదు. బైబులు ఏమీ చెప్పదు. ఆ రోజుల్లో రోము ప్రపంచంలో ముఖ్యమైన నగరం. మొదట అక్కడ క్రైస్తవ బోధ జరిగితే తర్వాత ప్రపంచంలోని ఇతర ప్రాంతాలకు కూడ ప్రాకుతుంది. కనుక పవిత్రాత్మే పేత్రుని ప్రేరేపించి రోముకి తీసికొనిపోయి వుండవచ్చు. అతనితో క్రైస్తవ కేంద్రం యెరూషలేమునుండి రోముకి మారింది. పేత్రు అపోస్తలులకు పెద్ద కనుక సహజంగానే రోముకి బిషప్పయ్యాడు. పేత్రు తర్వాత రోముకి బిషప్పులైనవాళ్లు సహజంగానే అతనికి వారసులయ్యారు. వీళ్లే పోపుగార్లు. పేత్రు అపోస్తలులలో ప్రధానుడు కనుక ఆ ప్రధానత్వం అతని వారసులకు కూడ లభించింది. కనుక రోమాపురి బిషప్పులు

(పోపుగార్లు) తిరుసభ అంతటిమీద అధికారం నెరపుతూ వచ్చారు. **తొలి శతాబ్దాల్లోనే** విశ్వతిరుసభలోని మేత్రాసనాలన్నీ రోము అధికారాన్ని గుర్తించాయి. ఈమేత్రాసనాల్లో తగాదాలు కాని సందేహాలు కాని వచ్చినప్పుడు రోము బిషప్పు జోక్యం జేసికొని వాటిని పరిష్కరించేవాడు. ఉదాహరణకు కొరింతుసభలో గొడవలు రాగా రోముకి బిషప్పయిన క్లెమెంటు జోక్యం జేసికొని వాటిని చక్కదిద్దాడు. అంటియోకయ బిషప్పయిన ఇగ్నేష్యస్ రోమను క్రైస్తవులకు జాబు వ్రాస్తూ "రోము ప్రేమతో అధ్యక్షతను వహిస్తుంది" అని వాకొన్నాడు. ఇరెనేయుస్ వేదశాస్త్రి "రోముపీఠాన్ని పేత్రు పౌలులు స్థాపించారు కనుక దానికి ఓ ప్రత్యేకత వుంది. అపోస్తలుల సంప్రదాయం దానిలోనే కొనసాగుతుంది. కనుక తిరుసభలోని మేత్రాసనాలన్నీ రోముని ఆదర్శంగా పెట్టుకోవాలి" అని వ్రాసాడు. సిప్రియన్ రోము బిషప్పు పేత్రుస్థానాన్ని పొంది అతని సింహాసనాన్ని ఎక్కుతాడని చెప్పాడు. రోముతో ఐక్యమైయున్నంత వరకే ఇతర తిరుసభలకు విలువ వుంటుదని ఒప్టేటస్ వాకొన్నాడు. పేత్రు ఎక్కడున్నాడో అక్కడే తిరుసభ కూడ వుంటుంది అని ఆంబ్రోసు నుడివాడు. ఈ యాధారాలనుబట్టి రోము బిషప్పుల ప్రాధాన్యాన్ని అర్థం చేసికోవచ్చు. పేత్రు స్థానాన్ని పొందడం వల్లనే వాళ్ళకు ఈ ప్రాముఖ్యం వచ్చింది. ప్రాచీన కాలంలో ఒక్క రోము **పీఠం** తప్ప మరేపీఠంగూడ తనకీ ప్రాముఖ్యం ఉన్నట్లుగా చెప్పుకోలేదు.

నాల్గవ శతాబ్దంనుండి ఆయా మేత్రాసనాల్లోని బిషప్పులు చిక్కులు వచ్చినపుడల్లా రోము సహాయాన్ని అర్థించేవాళ్లు. తిరుసభనుండి విడిపోయిన పతితులు మళ్లా దానిలోనికి వచ్చినపుడు ముందుగా రోము అనుమతిని పొందేవాళ్ళు. రోము జ్ఞానస్నాన విధానమే ఇతర మేత్రాసనాలుకూడ అనుసరించాయి. వేదగ్రంథాలసంఖ్యను నిర్ణయించింది రోము పీఠమే. తొలి శతాబ్దాల్లోని పతితులతో తీవ్రంగా పోరాడింది రోమే. వీటన్నిటిని బట్టి రోము పీఠాధిపతుల అధికారము అర్థంజేసికోవచ్చు.

## 2. మొదటి వాటికన్ సభ ప్రకటనం

1870లో మొదటి వాటికన్ మహాసభ పోపుగారి ప్రధానత్వాన్ని అధికారపూర్వకంగా ప్రకటించింది. సంగ్రహంగా ఈ సభ ప్రకటనం ఇది. పోపుగారికి తిరుసభ అంతటి మీద సంపూర్ణమూ సర్వోన్నతమూ ఐన అధికారం వుంది. ఈ యధికారం విశ్వాసానికీ నైతికాంశాలకూ మాత్రమేగాక తిరుసభ క్రమశిక్షణకూ పరిపాలనకూగూడ వర్తిస్తుంది. ప్రతి మేత్రాసనంలోను బిషప్పులమీదా విశ్వాసులమీదా పోపుగారికి సంపూర్ణాధికారం వుంటుంది.

ఈసభ ఉద్దేశం ప్రకారం పోపుగారి అధికారం పేత్రునుండీ, పేత్రు అధికారం క్రీస్తునుండీ వస్తాయి. పోపుగారు బిషప్పుల్లో ప్రథముడు మాత్రమేకాదు. ప్రధానుడు కూడ. ఆయనకు తిరుసభ సభ్యులందరి మీద సంపూర్ణాధికారం వుంది. ఆ అధికారం బిషప్పులమీద ఆధారపడదు. అది ఆయనకు క్రీస్తు నుండి లభిస్తుంది. అతడు తిరుసభలో క్రీస్తు ప్రతినిధి. క్రీస్తు తిరుసభలో అతని ద్వారా బోధిస్తాడు. ఆజ్ఞాపిస్తాడు. పోపుగారి ప్రధానత్వం ఇప్పుడు మనమంతా విశ్వసింపవలసిన వేదసత్యం.

రెండవ వాటికన్ సభపై మొదటి వాటికన్‌సభ ప్రకటనాన్ని దృఢపరచింది. దానికి కొన్ని వివరణలు మాత్రం చేర్చింది. లేకపోతే పైప్రకటనం వలన పోపుగారు నిరంకుశాధికారి, అహంకారి అనే అపార్థాలు స్ఫురిస్తాయి. ఆ వివరణలు ఇవి 1. పోపుగారి అధికారం పెత్తనం చలాయించడానికిగాక సేవలు చేయడానికి ఉద్దేశింపబడింది. అతడు దేవుని దాసులకు దాసుడు. 2. తిరుసభ అంటే విశ్వతిరుసభ మాత్రమేకాక స్థానిక తిరుసభలు కూడ. ఈ స్థానిక తిరుసభల్లో కృషిచేసేదీ అధికారం నెరపేదీ పోపుగారుకాదు, బిషప్పులు. 3. పోపుగారు తిరుసభకు శిరస్సు కాదు. అతడు తిరుసభకంతటికీ ప్రధానాధికారి. శిరస్సు మాత్రం క్రీస్తే. 4. బిషప్పుల అధికారం పోపుగారినుండి రాదు. వారి అభిషేకం నుండే వస్తుంది. 5. పోపుగారూ బిషప్పుల బృందమూ కలసి తిరుసభను పరిపాలిస్తారు.

రెండవ వాటికన్‌సభ ముగిసాకగూడ వేదశాస్త్రులు పోపుగారి ప్రధానత్వాన్ని గూర్చి చర్చను కొనసాగిస్తూనే వున్నారు. ఎందుకంటె, క్రైస్తవ సమైక్యతకు ఈ ప్రధానత్వం పెద్ద ఆటంకం. ప్రొటస్టెంటు సమాజాలు తిరుసభ అంతటిమీద పోపుగారికి సంపూర్ణాధికారం వుందని అంగీకరించవు. పోపుగారి పదవి తిరుసభకు ఐక్యతను చేకూర్చడానికి ఉద్దేశింపబడింది. కాని ఈ పదవే తిరుసభ అనైక్యతకు ప్రధాన కారణం కావడం విడ్డూరం.

తిరుసభకు ఓ ప్రధానాధికారివుండడం బైబులు బోధలకు విరుద్ధంకాదు. ప్రధానాధికారి లేకపోతే ఏ సమాజమూ నిలువదు. తిరుసభకూడ నిలువదు. నాల్గవ శతాబ్దంలోనే జెరోముగారు చెప్పినట్లు, తిరుసభలో ఒకే ప్రధానాధికారీ అతనిద్వారా ఐక్యతవుండకపోతే ఎందరు గురువులున్నారో అన్ని క్రైస్తవ శాఖలు బయలుదేరుతాయి. కనుక ఓ ప్రధానాధికారి ఉండాలనే భావాన్ని చాల క్రైస్తవ సంస్థలు అంగీకరిస్తాయి.

కాని ఆ యధికారి అధికారం ఏ పద్ధతిలో వుండాలనేదే సమస్య. క్యాతలిక్ తిరుసభ ఈ యధికారం సేవకొరకే గాని పెత్తనం చేయడం కొరకు కాదని చెప్తుంది. పోపుగారి అధికారం ప్రేమతో గూడిన సేవ, అతడు దేవుని దాసులకు దాసుడు అని చెప్తుంది. కాని చారిత్రంగాజూస్తే శతాబ్దాల పొడుగునా పోపుగార్లు బిషప్పులు మొదలైన

అధికార్లందరూ ఈ పద్ధతిలో పోలేదు. తిరుసభలో విపరీతమైన లోకాడంబరత్వం కన్పిస్తుంది. తిరుసభ అధికారుల్లో పదవీ వ్యామోహం, సంపదలపట్ల ప్రీతి, ఆడంబర ప్రియత్వం, అధికార గర్వం, లౌకిక విలువలపట్ల మోజు మొదలైన దుర్గుణాలు కొట్టవచ్చినట్లుగా కన్పిస్తాయి. చాలమంది ఈ సత్యాన్ని అంగీకరిస్తారు. ఈ పద్ధతి తిరుసభకు ఎంతమాత్రం తగదు.

క్రైస్తవ శాఖలన్నీ ఐక్యంగావాలంటే పోపుగారి ప్రధానత్వం వుండవచ్చు. కాని ఆ ప్రధానత్వం నిజంగా సేవారూపంలో కన్పించాలి. అధికార రూపంలో చూపట్టకూడదు. క్రీస్తు మార్గాన్ని అనుసరించి నిజమైన సేవకుడుగా మెలిగే పోపుగారినీ పీఠాధిపతులనూ లోకం అంగీకరిస్తుంది.

## 3. క్రైస్తవ సమైక్యత

రెండవ వాటికన్ సభకు పూర్వం నుండే క్యాతలిక్ తిరుసభ సమైక్యత కొరకు కృషిచేస్తూంది. ఐతే ఈ సభ ఈ కార్యాన్ని మరింత విస్తృతం చేసింది. లూతరెన్సు, అంగ్లికన్సు, ఆర్తోడోక్స్ క్రిష్టియన్సు మొదలైన క్రైస్తవ సమాజాలన్నీ సమైక్యత కోరుతున్నాయి. ఎంతో కృషికూడ చేస్తున్నాయి. కొన్ని అంశాల్లో క్యాతలిక్ సమాజానికి ఈ యితర సమాజాలకి ఏకాభిప్రాయం కుదిరింది. కొన్ని ముఖ్యాంశాల్లో ఇంకా కుదరలేదు. మొత్తంమీద ఆత్మశక్తివల్ల క్రైస్తవ శాఖలన్నీ పూర్తిగా కాకపోయినా చాలవరకు కలసిపోయే సూచనలు కన్పిస్తున్నాయి. దీనికి ఇంకా కొంతకాలంపట్టవచ్చు. కాని ఈ సమైక్యత మాత్రం చాలవరకు సిద్ధించి తీరుతుంది. క్యాతలిక్ తిరుసభ మాత్రం పైన మనం పేర్కొన్న సేవామార్గంలో పోవాలి. చీలిపోయిన క్రైస్తవ శాఖలన్నిటినీ ఆకర్షించేది ప్రత్యేకంగా ఈ సేవాగుణమే.

## ప్రార్థనా భావాలు

1. తిరుసభలోని విశ్వాసులు ఈలోకంలో యాత్రికుల్లా జీవించాలి. ఈ భూమిమీద మనకు స్థిరమైన పట్టణం ఏమీలేదు. మన మందరమూ రాబోయే మోక్షపట్టణం కోసం ఎదురుచూడాలి - హెబ్రే 13,14. దయొగ్నీటస్ లేఖ చెప్పినట్లుగా, క్రైస్తవులు ఈ లోకంలో జీవిస్తున్నా ఇది తమలోకం కాదో అన్నట్లుగా జీవించాలి. ఈ లోకంలో జీవిస్తున్నా వారు పరలోక పౌరులుగా వుండాలి. వారికి తాము వసించే ప్రతిదేశం కూడ ప్రవాసదేశం కావాలి.

2. అర్ల్ పట్టణపు సిసేరియస్ అనే వేదశాస్త్రి తిరుసభ ఇహపరాలు రెండింటిలోను వసిస్తుందని చెప్తూ ఈలా వ్రాసాడు. "మనకు ఇహం పరం అనే రెండు పట్టణాలున్నాయి. మంచి క్రైస్తవుడు ఈలోక పట్టణంలో యాత్ర చేస్తున్నా పరలోక పట్టణానికి చెందినవాడుగా వుండాలి. ఈ భూలోక పట్టణం శ్రమలతోను వేదనతోను కూడింది. పరలోక పట్టణం విశ్రాంతితోను ఆనందంతోను కూడింది. ఇక్కడి పట్టణంలో పాపకార్యాలు చేసేవాళ్లు అక్కడి పట్టణాన్ని చేరలేరు. ఈ లోకాన్ని ప్రేమించేవాళ్లు ఆ లోకాన్ని పొందలేరు. ఎవరూ మోసపోవద్దు. క్రైస్తవులకు నిజమైన పట్టణం అక్కడనేగాని యిక్కడలేదు. ఇక్కడ ఆనందాన్ని అనుభవింప గోరేవాడికి అది పరలోకంలో లభింపదు. మన సొంత దేశం, మన యెరూషలేం, పరలోకంలో వుంది. అక్కడ సన్మనస్కులు మనకు సహవాసులు. పితరులు ప్రవక్తలు ప్రేషితులు వేదసాక్షులు మనకు తల్లిదండ్రులు. మనం ఈ లోకంలో వసిస్తున్నపుడే ఆ లోకం కొరకు తపించిపోవాలి. మనకంటె ముందుగా పితరులు ప్రవక్తలు ప్రేషితులు వేదసాక్షులు కన్యలు స్తుతీయులు ఇక్కడినుండి అక్కడికి తరలివెళ్ళారు. వాళ్ళు అక్కడినుండి ఆశతో ప్రేమతో మనకొరకు ఎదురుచూస్తుంటారు. ఆ భక్తులు తమ ప్రార్థనలతోను కోరికలతోను నిరంతరం మనలను ఆ లోకంవైపు ఆకర్షిస్తూంటారు. ఈ లోకాన్నీ పిశాచాన్నీ జయించి మనంకూడ వాళ్ళు వసించే దివ్యలోకాన్ని చేరుకోవాలి."

# 12. పొరపడని వరం

ఆయా విషయాలను గూర్చి మాట్లాడేపుడూ, వ్రాసేపుడూ మనం అజ్ఞానంవల్ల ఎన్నో పొరపాట్లు చేస్తాం. కాని వేదసత్యాలను గూర్చి ప్రకటనం చేసేపుడు పోపుగారు ఈలా పొరపాటు చేయరు. ఆయన తిరుసభకు వెల్లడిచేసే వేదసత్యాల్లో తప్పులు వుండవు. ఆత్మే పొరపాట్లనుండి పోపుగారిని కాపాడుతుంది. కనుక వేద విషయాలను వెల్లడిచేసేపుడు పోపుగారికి పొరపడని వరం వుంటుందని నమ్ముతున్నాం.

క్రీస్తు దైవరాజ్యాన్ని బోధించమని తిరుసభను ఆజ్ఞాపించాడు. అలా బోధించేపుడు ఏ పొరపాటూ చేయకుండా వేదసత్యాలను నిర్దుష్టంగా వెల్లడిచేసే వరాన్నిగూడ అతడు తిరుసభకిచ్చాడు. ఆత్మ ద్వారా ఈ వరం దానికి లభిస్తుంది. కనుక విశ్వతిరుసభకు పొరపాటు చేయని వరం మొదటినుండి వుంది. పోపుగారి వరం ఈ విశ్వ తిరుసభ వరాల్లో ఓ భాగమే కాని ఇతరం కాదు. ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం.

## 1. బైబులు బోధలు

దేవుడు సంపూర్ణ సత్యం. మనం అతన్ని నమ్మవచ్చు - 1యోహా 5,20. అతని కుమారుడైన క్రీస్తు కూడ సత్యమే - యోహా 14,6. సత్యమూర్తియైన దేవుడు సత్యస్వరూపుడైన తనకుమారుని ద్వారా తిరుసభకు పొరపాటు చేయని వరం దయచేసాడు. కనుక ఈ వరాన్ని మనం నమ్మవచ్చు.

క్రీస్తు ఓవైపు తిరుసభను దైవరాజ్యాన్ని బోధించమని ఆజ్ఞాపించాడు. మీరు వెళ్ళి సకలజాతులకు బోధించండి అని చెప్పాడు - మత్త 28,19-20. కనుక వేదసత్యాలను బోధించడం తిరుసభ బాధ్యత. మరోవైపు అతడు తిరుసభమీదికి ఆత్మను పంపుతానని వాగ్దానం చేసాడు. ఆయాత్ముడు స్వయంగా సత్యస్వరూపుడు. శిష్యులను సర్వసత్యంలోనికి నడిపించేవాడు - యోహా 16,13. ఈయాత్మశక్తి ద్వారా శిష్యులు సత్యంలో నిలుస్తారు. అనగా అన్ని పొరపాట్లనుండీ దోషాలనుండీ ఆత్మ తిరుసభను కాపాడుతుంది. ఈ వరం తిరుసభ ప్రధానాధికారియైన పోపుగారికికూడ లభిస్తుంది.

ప్రభువు పేత్రుతో నీవు పడిపోయి మళ్లా లేచాక నీ సోదరులను బలపరుస్తావు అని చెప్పాడు - లూకా 22,32. కనుక పేత్రు విశ్వాస సత్యాల్లో కూడ తిరుసభను బలపరుస్తాడు. పేత్రుకున్న ఈ వరం అతని అనుయాయులైన పోపుగారికి కూడ లభిస్తుంది.

పౌలుకూడ తిరుసభ సత్యానికి నిలయమని చెప్పాడు - 1తిమో 3,15. కనుక తిరుసభకాని దాని నాయకుడైన పోపుగారు కాని వేదసత్యాల్లో పొరపాట్లు చేయరు.

## 2. పొరపాటు చేయని వరం ఎవరికుంటుంది?

పొరపాటు చేయని వరం మొదట పవిత్రాత్మకే వుంటుంది. ఆయాత్మ సత్యస్వరూపి - 14,17. ఈ యాత్మనుండి ఈ వరం తిరుసభకూ దాని అధికారులకూ లభిస్తుంది. క్రీస్తు తిరుసభకు ఆత్మసహాయాన్ని అనుగ్రహించాడు కదా!

ఆత్మసాన్నిధ్యం కలది కనుక తిరుసభ పొరపాటు చేయదు. ఈ తిరుసభ దేవుని నుండి వేదసత్యాలు వింటుంది. ఆ సత్యాలనే నరులకు బోధిస్తుంది. అలా బోధించేపుడు తప్పులు లేకుండా బోధించే శక్తిని ప్రభువే దానికి దయచేసాడు. తిరుసభ అధికారులైన పోపుగారు బిషప్పులు విశ్వాసులు అందరికి కలసి, అనగా తిరుసభ మొత్తానికి కలసి పొరపాటు పడని వరం వుంటుంది. తిరుసభ సభ్యులంతా కలసి క్రీస్తుదేహం, పవిత్రప్రజ, యాజక రూపమైన రాజ్యం - 1పేత్రు 2,9. ఈ ప్రజలందరిని పవిత్రాత్మ అభిషేకిస్తుంది. ఈ యభిషేకం వాళ్ల వేదవాక్యాన్ని విని అర్థంజేసికొని విశ్వసించడానికే - 1యోహా

2,20-27. కనుక తిరుసభ సభ్యులంతా కలసి విశ్వాసరంగంలో పొరపాటు పడ్డం అసంభవం. ఆ బృందంలో విశ్వాస దీపం ఎప్పుడూ వెలుగుతూనే వుంటుంది.

తిరుసభ సభ్యులంతా కలసి ఓ వేద సత్యాన్ని అంగీకరించినపుడు ఏనాడూ పొరపాటు చేయని దేవుని వరంలోనే వాళ్లు పాలుపొందుతారు. ఆత్మకూడ సత్యాన్ని చేపట్టడంలో వాళ్ళకు సహాయం చేస్తుంది.

ఇక, పోపుగారితో కూడిన బిషప్పుల బృందం తిరుసభకు ప్రధానాధికారి. తిరుసభలో అధికార పూర్వకంగా బోధించేది ఈ బృందమే. కనుక పై పొరపాటు చేయని వరం ప్రధానంగా ఈ బృందానికి లభిస్తుంది. ఈ బృందం శిరస్సు లేక నాయకుడు పోపుగారు. కనుక ఈ వరం ప్రధానంగా ఆయనకు లభిస్తుంది.

తిరుసభలోని అధికార బృందం రెండు విధాలుగా బోధించవచ్చు. 1. బిషప్పులంతా పోపుగారితో కలసి (ఒకచోట చేరికాని, చేరకుండా గాని) వేద సత్యాలను బోధించవచ్చు. ఈ బోధ పొరపడని తిరుసభ వరం క్రిందికి వస్తుంది. విశ్వాసులందరూ దీన్ని మనఃపూర్వకంగా అంగీకరించాలి. 2. పోపుగారు విశ్వాసులందరికీ కాపరిగాను బోధకుడుగాను సంపూర్ణాధికారంతో బోధించినపుడు ఆ బోధ కూడ పొరపాటు పడని తిరుసభ వరం క్రిందకే వస్తుంది. కనుక దీన్నికూడ విశ్వాసులు మనఃపూర్వకంగా అంగీకరించాలి.

దేవుడే తిరుసభ రక్షణానికి కొన్ని వేదసత్యాలను తెలియజేసాడు. బైబులు ద్వారాను పారంపర్య బోధద్వారాను ఈ వేదసత్యాలు మనకు తెలుస్తున్నాయి. మనం త్రాగేనీళ్లు విషపూరితం కాకూడదు. అలాగే తిరుసభ విశ్వసించే వేదసత్యాలు కూడ విషపూరితం కాకూడదు. వాటిని విషపూరితం కాకుండా వుంచేవాడు, అనగా వాటిని పొరపాట్ల నుండి కాపాడేవాడు దేవుడే. ఈవిధంగా పొరపాటు చేయని వరంద్వారా దేవుడు తిరుసభ సత్యాలను పదిలపరుస్తుంటాడు.

మొదటి వాటికన్ మహాసభ పోపుగారు వేదసత్యాలను బోధించేపుడు పొరపడరని అధికార పూర్వకంగా ప్రకటించింది. ఈ యంశాన్ని మనమందరమూ విశ్వసించాలి. ఆ ప్రకటనం సంగ్రహంగా యిది.

1. పోపుగారు క్రైస్తవులందరికీ కాపరిగాను బోధకుడుగాను వ్యవహరిస్తూ సంపూర్ణాధికారంతో తిరుసభకంతటికీ విశ్వాసాంశాలను గాని నైతికాంశాలను గాని బోధించినపుడు అవి పొరపడని వరం క్రిందికి వస్తాయి. 2. ఆ వేదసత్యాలు ఇక మార్పు లేనేవిగా వుంటాయి. 3. పూర్వం పేత్రుకి పొరపాటు చేయని వరాన్నిచ్చిన క్రీస్తే పోపుగారికికూడ ఈ వరాన్నిస్తాడు. ఈ వరాన్ని క్రీస్తు తిరుసభ అంతటికీ ఇచ్చాడు.

కనుక తిరుసభ విశ్వాస నైతికాంశాలను అధికారపూర్వకంగా ప్రకటించవచ్చు. 4. ఈ ప్రకటనలు విశ్వాసులు అంగీకరించినందువల్ల కాక, పోపుగారు ప్రకటించినందువల్లనే, వాటంతట అవే, మార్పులేనివిగా వుంటాయి.

పై వేద వాక్యాలకు కొంచెం వివరణం అవసరం. 1. పోపుగారు సంపూర్ణాధికారంతో ప్రకటించిన అంశాలు మాత్రమే పొరపాటు పడని వరం క్రిందికి వస్తాయి. ఏవిబడితే అవికావు. విశ్వాస నైతికాంశాలను గూర్చి మాత్రమే పోపుగారు అధికారపూర్వకంగా బోధిస్తారు. ఈ యంశాలకు ఆధారం బైబులూ పారంపర్య బోధా రెండూను. ఆయన లౌకికాంశాలను బోధించడు. పోపుగారి బోధ తిరుసభ ప్రధానాధికారి బోధ. తిరుసభకు నడిపించేది ఆత్మ. కనుక పోపుగారి బోధలు ఆత్మ బోధలు. అందుచే వాటిల్లో తప్పులుండవు. 2. ఆ వేదసత్యాలను ఇక ఎవరూ మార్చడానికి వీల్లేదు. అనగా భావికాలంలో మరో పోపుగారు ఆ సత్యాలను మళ్లా వేరే మాటలతో చెప్పవచ్చు. వివరించి చెప్పవచ్చు. కాని ఆ సత్యాలనే మార్చివేయడానికి వీల్లేదు. వాటిని నిరాకరించడానికి వీల్లేదు. 3. పొరపాటు చేయని వరాన్ని క్రీస్తు మొదట పేత్రుకిచ్చాడు. ఇప్పుడు అతని అనుయాయియైన పోపుగారికి ఇచ్చాడు. పోపుగారు తన సొంత తెలివితేటలతో ఈ వేదసత్యాలను ప్రకటించడంలేదు. 4. పోపుగారి ప్రకటనలను అంగీకరించడమనేది విశ్వాసుల మంచితనం మీదకాని వారి సహకారం మీదగాని ఆధారపడదు. పోపుగారి అధికారాన్ని బట్టే, అవి ఆత్మ తెలియజేసే సత్యాలు కాబట్టే, వాటిని మనం అంగీకరించాలి.

ఓ ఉదాహరణం చూద్దాం. దేవమాత దేహాత్మలతో మోక్షానికి కొనిపోబడింది అని పన్నెండవ భక్తినాథ పోపుగారు సంపూర్ణాధికారంతో తిరుసభ అంతటికీ 1950లో ప్రకటనం చేసారు. ఇప్పుడు దీన్ని మనమందరమూ పొరపాటులేని వేదసత్యంగా విశ్వసిస్తున్నాం. ఆగస్టు 15న దేవమాత మోక్షారోపణ ఉత్సవాన్ని జరుపుకొంటున్నాం. ఈలాంటి విశ్వాస ప్రకటనలు చేసేపుడు పోపుగారు ఎంతో జాగ్రత్త వహిస్తారు. బైబులునీ పారంపర్య బోధనీ పరిశీలిస్తారు. ప్రాచీన వేదశాస్త్రుల బోధలను తిలకిస్తారు. తోడి బిషప్పులను సంప్రతిస్తారు. ప్రస్తుత వేదశాస్త్రులను సలహా అడుగుతారు. శతాబ్దాల పొడుగునా వస్తున్న విశ్వాసుల నమ్మకాన్ని పరిశీలిస్తారు. ఇతర క్రైస్తవ సమాజాల అభిప్రాయాలను వింటారు. ఆత్మ ప్రబోధాన్ని ఆలిస్తారు. ఇన్ని విధాలుగా జాగ్రత్త వహించిన పిమ్మటగాని పోపుగారు ఏదైనా వేదసత్యాన్ని గూర్చి ప్రకటనం జేయరు. అంతేగాని ఆయన ఈ విషయాన్ని గూర్చి తన కిష్టమొచ్చినట్లుగా మాట్లాడరు.

## 3. పొరపాటు చేయని వరం ఏయే అంశాలకు వర్తిస్తుంది?

పోపుగారి వరం లౌకికాంశాలకు వర్తించదు. వాటిని గూర్చి ఆయన అధికారపూర్వకంగా ప్రకటనలు చేయదు. పొరపడనివరం విశ్వాసరంగానికీ నైతికరంగానికీ మాత్రమే వర్తిస్తుంది. మనకు దేవునితో సంబంధం కలిగించే ప్రధాన రంగాలు ఇవే. నేరుగా మన రక్షణకు సంబంధించినవి కనుక పోపుగారు ఈ యంశాలను గూర్చి మాత్రమే మాట్లాడతారు.

ఈ యంశాలు మామూలుగా బైబుల్లోను పారంపర్య బోధలోను తగులుతాయి. కనుక పోపుగారు బైబులు పారంపర్య బోధలను గూర్చి, వాటితో సంబంధమున్న ఇతరాంశాలనుగూర్చి మాత్రమే అధికారపూర్వకంగా ప్రకటనలు చేస్తారు. వీటిని మనం మనఃపూర్వకంగా అంగీకరించాలి.

పోపుగారు విశ్వాస నైతికాంశాలను గూర్చి అధికారపూర్వకంగా ప్రకటనలు చేసినపుడు బిషప్పుల బృందానికి శిరస్సుగానే మాటలాడతారు. ఈ బిషప్పుల బృందం తిరుసభ కంతటికీ ప్రాతినిధ్యం వహిస్తుంది. కనుక ఆయన తిరుసభ తరపుననే తిరుసభకు బోధచేస్తారు. ఒకవైపు ఆయ క్రీస్తుకి ప్రతినిధి. క్రీస్తు ప్రతినిధిగా ఆయన క్రీస్తు సమాజానికి బోధ చేస్తారు. మరోవైపున ఆయన తిరుసభకు ప్రతనిధి. తిరుసభ ప్రతినిధిగా ఆయన తిరుసభ విశ్వాసాన్నే ప్రకటిస్తారు. పోపుగారి బోధవేదసత్యం మాత్రమేకాదు. విశ్వాసప్రకటనం గూడ.

ఒకమారు పోపుగారు ప్రకటనం చేసిన వేదసత్యం ఇక యేనాటికీ మారదు. అనగా ఆ యంశంలోని సత్యం శాశ్వతంగా నిలుస్తుంది. కాని భావితరాలవాళ్ళు ఆ వేదసత్యాన్ని భిన్నపదాలతో భిన్నరీతుల్లో ప్రకటించవచ్చు. మొదటిసారి చెప్పిన దానికంటె ఇంకా స్పష్టంగా చెప్పవచ్చు. ఆయా కాలాల అవసరాలను బట్టి ఈ మార్పు అవసరమౌతుంది. కనుక వేదసత్యం మారదు. ఆ సత్యాన్ని చెప్పే తీరు మారవచ్చు.

## 4. సమైక్యతరీత్యా సమస్యలు

సమైక్యరీత్యా చూస్తే ప్రొటస్టెంటు క్రైస్తవులు పోపుగారికి పొరపడని వరంవుందని అంగీకరింపరు. ఈ వరంద్వారా పోపుగారికి బైబులును మించిన అధికారం లభిస్తుందని వాళ్ళకు భయం. లూతరు భావాల ప్రకారం, పోపుగారు ఎక్యుమెనికల్ సభులు కూడ పొరపాట్లు చేయవచ్చు. కాని ప్రొటస్టెంట్లు తిరుసభకు మాత్రం ఈ వరం వుందని నమ్ముతారు.

ఐనా పోపుగారికి పవిత్రగ్రంథానికిమించిన అధికారం ఏమీలేదు. ఆయన అధికారపూర్వకంగా ప్రకటనం చేసేది బైబులు సేవకొరకే, బైబులుబోధలు స్పష్టంగాను నిర్దుష్టంగా ప్రలజకు తెలియజేయడం కొరకే. కనుక పోపుగారి బోధలను మనం సేవగా గ్రహించాలేకాని అధికార శాసనాలుగా అర్థం చేసికోగూడదు.

కొన్ని మతాల్లో ఏమి నమ్మాలో ఏమి నమ్మకూడదో కూడ ఎవరికీ స్పష్టంగా తెలియదు. కనుక ఏక మతానికి చెందినవాళ్ళే నమ్మకాల విషయంలో ఒకరితో ఒకరు పోట్లాడుకొంటారు. కాని క్యాతలిక్ మతంలో ఈ చిక్కు లేదు. మనం విశ్వసించవలసిన విషయాలను పోపుగారు, క్యాతలిక బోధన సంఘంవారు స్పష్టంగా బోధిస్తారు. దీనివలన మనకు అపార్థాలూ సందేహాలూ తొలగిపోతాయి. కనుక విశ్వాసులు ఈ బోధను ఓ సేవగా భావించాలి.

ఈ యధ్యాయాంతంలో ఈ చిన్న విషయాన్ని గూడ గ్రహించాలి. పోపుగారు ఎప్పుడూ అధికార పూర్వకంగానే బోధించరు. అనధికారంగా గూడ బోధిస్తారు. అసలు ఈలాంటి బోధలే ఎక్కువ. ఈ బోధలను గూడ మనం వినయ విధేయతలతో స్వీకరించాలి. పోపుగారు తిరుసభ బోధన సంఘంలో ప్రధానుడు. ఆయన బిషప్పులూ కలసి ఈ బోధన సంఘమౌతుంది. ఈ సంఘాధిపతిగానే పోపుగారు మనకు బోధిస్తారు. క్రైస్తవులకు విశ్వాస సత్యాలను బోధించే అధికారం ప్రధానంగా పోపుగారికే వుంది. ఆయన బోధల్లో ఎప్పుడూ పవిత్రాత్మ సాన్నిధ్యం వుంటుంది. ఆత్మ ప్రధానంగా ఆయన ద్వారా క్రైస్తవులతో మాట్లాడుతుంది. కనుక పోపుగారి బోధలను ఏమంచి క్రైస్తవుడూ పెడచెవినిబెట్టడు.

మేత్రాసనంలో పోపుగారికి బదులుగా బిషప్పుగారు మనకు బోధచేస్తారు. ఆయన మేత్రాసనంలో ప్రధాన యాజకుడు, క్రీస్తు ప్రతినిధి అని చెప్పాం. కనుక బిషప్పుగారి బోధలను కూడ మనం వినయవిధేయతలతో, విశ్వాసంతో అంగీకరించాలి.

ఓ వేదసత్యాన్ని గూర్చికాని, నైతికాంశాన్ని గూర్చికాని మనకు సందేహం కలిగినప్పుడు, వెంటనే ఆయంశాన్ని గూర్చి మన కిష్టమొచ్చినట్లుగా విమర్శించి ఖండించకూడదు. తెలిసిన వాళ్ళనుండి దాని భావాన్నీ పూర్వాపరాలనూ లోతుపాతులనూ గ్రహించే ప్రయత్నం చేయాలి. అది మన బుద్ధికి మించిన వేదసత్యమైతే వినయంతో దానికి తలవంచాలి. అది మనకు కష్టాన్నో నష్టాన్నో తెచ్చిపెట్టే నైతికాంశమైతే, స్వార్థాన్ని విడనాడి దానికి కట్టుపడివుండాలి. మంచి క్రైస్తవులకు నియమాలు ఇవి.

## ప్రార్థనా భావాలు

1. రెండవ శతాబ్దంలో జీవించిన ఓరిజన్ పండితుడు ఓ వుపమానం చెప్పాడు. మనలోని ఆత్మ కదిలిస్తేనేగాని మన దేహానికి చైతన్యం పుట్టదు. అలాగే క్రీస్తు కదిలిస్తేనేగాని అతని దేహమైన తిరుసభకు చైతన్యం కలగదు. ఆ ప్రభువు తిరుసభలోని నరులందరికీ, ఒక్కొక్కరికిగూడ, చైతన్యం కలిగించేవాడు. కనుక మన శిరస్సయిన క్రీస్తు మనకు ప్రబోధం కలిగించాలని వేడుకొందాం.

2. మరియమాత తిరుసభకు పోలికగా, ఆదర్శంగా వుంటుంది. మరియలాగే తిరుసభకూడ ఈ లోకంలో పవిత్రంగా జీవించాలి. దేవుని చిత్తానికి బద్ధురాలు కావాలి. ఆమెలాగే తిరుసభ కూడ పరలోకంలో మహిమను పొందాలి. తిరుసభను పవిత్రంగా జీవించేలా చేయమని మరియమాతను ప్రార్థిద్దాం.

# ప్రశ్నలు

## అధ్యాయం - 1

1. దైవరాజ్యాన్ని గూర్చిన పూర్వవేద బోధలూ, క్రీస్తు నాటి రాజకీయవాదుల బోధలూ తెలియజేయండి.
2. దైవరాజ్యాన్ని గూర్చిన క్రీస్తు బోధలను వివరించండి.

## అధ్యాయం - 2

1. క్రీస్తు పండ్రెండుమంది శిష్యులను నియమించడంవల్ల కాని లేక పేత్రుకి ఆధిపత్యం దయచేయడంవల్ల కాని అతనికి తిరుసభను స్థాపించాలనే కోరిక వుందని రుజువు చేయండి.
2. దివ్యసత్ప్రసాదాన్ని స్థాపించడంద్వారా క్రీస్తుకి తిరుసభను నెలకొల్పాలనే కోరిక వుందని నిరూపించండి.
3. అపోస్తలుల చర్యలు అనే గ్రంథంనుండి తిరుసభ యేలా పుట్టి పెంపుజెందిందో తెలియజేయండి.

## అధ్యాయం - 3

1. దైవరాజ్యానికీ తిరుసభకీ తేడా యేమిటి?

## అధ్యాయం - 4

1. తిరుసభ ఎల్లరికీ ఎందుకు రక్షణ సాధనమౌతుంది?
2. "తిరుసభకు వెలుపలకూడ రక్షణం వుంటుంది" ఎందుకు? ఏలా? వివరించండి.

## అధ్యాయం - 5

1. తిరుసభ క్రీస్తు ప్రేషిత సేవను ఎందుకు కొనసాగిస్తుంది? ఏలా కొనసాగిస్తూంది?

## అధ్యాయం - 6

1. పూర్వనూత్న వేదాలు పేర్కొనే దైవప్రజల వివరాలను తెలియజేయండి.
2. తిరుసభ క్రీస్తు శరీరం అంటే అర్థం ఏమిటి? ఈ భావం మనకేలా ప్రేరణం పుట్టిస్తుంది?
3. తిరుసభ ఆత్మకు ఏలా ఆలయమౌతుందో వివరించండి.

## అధ్యాయం - 7

1. తిరుసభ ఏకత అంటే యేమిటి?
2. తిరుసభ విశ్వవ్యాప్తత అంటే యేమిటి?
3. తిరుసభ పవిత్రత అంటే యేమిటి?
4. తిరుసభ అపోస్తులుల వారస సమాజం అంటే యేమిటి?

## అధ్యాయం - 8

1. చారిత్రకంగా గృహస్థుల స్థానాన్ని తెలియజేయండి. వారిని గూర్చిన వాటికన్ బోధలను వివరించండి.

## అధ్యాయం - 9

1. "తిరుసభలో అధికారం సేవ కొరకే" - వివరించండి.
2. గురుపదవిలోని మూడు అంతస్తులు క్రమేణ పరిణామం పొందిన తీరును వివరించండి.

## అధ్యాయం - 10

1. పీఠాధిపతులు క్రీస్తు అధికారంలో ఏలా పాలుపొందుతారు? పీఠాధిపతుల బృందం ప్రాముఖ్యాన్ని తెలియజేయండి.

## అధ్యాయం - 11

1. బైబులు బోధలనుండి పోపుగారి ప్రధానత్వాన్ని ఏలా నిరూపిస్తాం?
2. చరిత్ర నుండి ఏలా నిరూపిస్తాం?

## అధ్యాయం - 12

1. బైబులు బోధలనుండి తిరుసభకీ పోపుగారికీ పొరపడని వరం వుందని నిరూపించండి.
2. పోపుగారి పొరపడని వరాన్ని గూర్చిన మొదటి వాటికన్ సభ ప్రకటనను వివరించండి.

# 4. నూత్న తిరుసభ

బైబులు భాష్యం - 150

## విషయ సూచిక



నూత్న తిరుసభ ప్రేషిత తిరుసభగా పుట్టింది. క్రీస్తు శిష్యులతో వుండి వారికి అద్భుతాలు చేసి చూపించాడు. బోధలు చేసాడు. ఉత్థానానంతరం వారికి దర్శన మిచ్చాడు. శిష్యులు అతడు జీవించివున్నాడనీ మృత్యువుని జయించాడనీ విశ్వసించారు. ఉత్థాన క్రీస్తు తానే సువార్తనని శిష్యులకు తెలియజేసాడు. శిష్యులను ఈ సువార్తను లోకం నలుమూలల ప్రకటించమని ఆదేశించాడు. ఆత్మ తమమీదికి దిగివచ్చి తమకు ప్రసాదించిన బలంతో శిష్యులు యేసే రక్షకుడని ఎల్లయెడల బోధించారు. చిన్న బృందమైన శిష్యులు పంపబడ్డ వాళ్ళుగా (ప్రేషితులుగా) నలుమూలలకు వెళ్లారు. పంపబడిన వాళ్ళుగానే వాళ్ళు మొదటి తిరుసభ అయ్యారు. తిరుసభ ప్రధాన లక్షణం ప్రేషితత్వమే (పంపబడ్డం). తిరుసభ పరిపాలనం, కర్మకాండలు, సిద్ధాంతాలు బోధలు అన్నీ కూడ ప్రేషితత్వాన్ని ఆధారం జేసికొనే ఉద్భవించాయి. కాని క్రమేణ ప్రేషితత్వం మరుగుపడిపోయి యితరాంశాలు ప్రాముఖ్యాన్ని పొందాయి. ప్రేషితత్వం తిరుసభ పనుల్లో వొకటి, అంత ముఖ్యమైన పనికాదు అనే భావాలు ప్రచారంలోకి వచ్చాయి. ఇందువల్ల తిరుసభ స్వభావమే మారిపోయింది. విశేషంగా ఇండియా తిరుసభ ఇతర ప్రజలతో సంబంధాలు త్రెంచుకొని తనకు తానుగా వుండిపోయింది.

రెండవ వాటికను సభ నూత్న పెంతెకోస్టు లాంటిది. అది తిరుసభకు తన ప్రేషిత స్వభావాన్ని మళ్ళా జ్ఞప్తికి తెచ్చింది. మూడవ వేయి సంవత్సరాల్లో క్రైస్తవులందరు ప్రేషితులుగా పనిచేయాలని హెచ్చరించింది. వాళ్లు పిండిని పొంగజేసే పులుపిడి ద్రవ్యంలా వుండాలని చెప్పింది. నరులంతా క్రీస్తుచే ప్రభావితులై దైవకుటుంబంగా మారాలని వాకొంది.

ఇటీవలే యేసుక్రీస్తు జూబిలీ ఉత్సవం జరుపుకొని ప్రభువునుండి ప్రేరణ పొందాం. తొలినాటి క్రైస్తవులనులాగే ప్రభువు మనలనుకూడ లోకంలోనికివెళ్లి తన్ను గూర్చి ప్రకటించమని ఆదేశించాడు. ప్రేషితత్వమే నేటి తిరుసభ ప్రధాన లక్షణం అనుకోవాలి.

# 1. వాటికన్ సభ నూత్న తిరుసభను సిద్ధంజేసిన తీరు

ఉత్థాన క్రీస్తు సాన్నిధ్యం తిరుసభలో వుందనీ, ఈ సాన్నిధ్యం వలన తిరుసభ తాను మారి లోకాన్ని గూడ మారుస్తుందనీ 23వ జాన్ పోపుగారు అభిప్రాయపడ్డారు. ప్రపంచంలోని జనమంతా సోదర భావంతో, ప్రేమ భావంతో ఐక్యంగావాలి. ఈ యైక్యతను సాధించడానికి తిరుసభ సహాయపడుతుంది. ఈ శ్రీసభ లోకం బాగోగులను పట్టించుకొనేది. లోకాన్ని దేవుని చెంతకు చేర్చేది. లోకం సుఖదుఃఖాలు క్రైస్తవులవి కూడ. ప్రపంచానికి సంభవించే కష్టసుఖాలు వారికిగూడ సంభవించినట్లే. వాళ్ళు క్రీస్తుతో ఐక్యమై, ఆత్మ దారి జూపుతూండగా, దైవరాజ్యంవైపు పయనిస్తారు. ఇతరులకు కూడ రక్షణ సందేశాన్ని ఎరిగిస్తారు. అందుకే క్రైస్తవులు ఎప్పుడూ ఇతర ప్రజలతో కలియగోరుతారు. ఇతరుల్లో కూడ క్రీస్తుని చూచి వారితో ఐక్యమై, వారిని తండ్రియైన దేవుని రాజ్యంలోనికి చేర్చగోరతారు. ఈ ప్రధాన భావంతో వాటికన్ సభ తిరుసభలో మార్పు తీసికొని వచ్చింది.

తిరుసభ ప్రపంచమంతటాను, ఇండియాలో కూడ రెండవ వేయి క్రీస్తు జయంతి ఉత్సవాన్ని ఘనంగా జరుపుకొంది. ఈ సందర్భంలో క్రైస్తవులంతా గూడ భక్తి శ్రద్ధలతో దేవుని వాక్యం విన్నారు. దివ్యసత్ప్రసాద బలిలో పాల్గొన్నారు. విశ్వాసులు క్రీస్తునుండి ప్రేరణం పొంది, ఆ ప్రభువు పంపగా వెళ్ళి అతని ప్రేమను లోకానికి తెలియజేయడానికి సిద్ధమయ్యారు. సువార్త సందేశంతో, దాని శక్తితో ప్రపంచాన్ని మార్చి వేయడం తిరుసభ పని. ఈలా మార్పు చెందిన ప్రపంచమే దైవరాజ్యం. లోకంలో శ్రీసభ పులిపిడి ద్రవ్యంలాంటిది. పులిపిడి ద్రవ్యం పిండిని పొంగజేస్తుంది. ఆలాగే తిరుసభ సువార్త సందేశంతో ప్రపంచం పొంగి నిర్మలమూ ఉదాత్తమూ అయ్యేలా చేస్తుంది. ఈ సభ

సభ్యులందరూ వ్యక్తిగతంగా ప్రేషితులు కావాలి. అందరూ దేవుని ప్రేమ సందేశాన్ని లోకానికి ఎరిగించాలి.

## 2. మూడవ సహస్రాబ్దంలో శ్రీసభ రూపం

మూడవ వేయి సంవత్సరాలు వచ్చాయి. ఈ కాలంలో తిరుసభలో పెను మార్పులు రావాలి. 1. క్రైస్తవ సమాజం క్రీస్తుపై కేంద్రీకృతం కావాలి. మన ప్రజలు ఏవో విశ్వాస సత్యాలను నమ్మితేనే చాలదు. వారికి క్రీస్తుతో వ్యక్తిగతమైన సంబంధం ఏర్పడాలి. విశేషంగా దివ్యసత్ప్రసాద బలిలో ప్రభువును వ్యక్తిగతంగా అనుభవానికి తెచ్చుకోవాలి. 2. ఈ సమాజం ఆత్మచే నడిపించబడినదై వుండాలి. ఒకరినొకరు ప్రేమించడం, ఉన్నవాళ్లు లేనివాళ్ళతో పంచుకోవడం అనే లక్షణాలు కన్పించాలి. 3. ఈ సమాజం ప్రేషిత సేవకు పంపబడినది కావాలి. ఈ ప్రజలు ఇరుగుపొరుగు వారితో సంబంధం కలిగించుకోవాలి. వారికి క్రీస్తుని తెలియజేయాలి. వారి ధ్యేయం మతమార్పిడి కాదు. లోకంలోని అన్యాయాలనూ అక్రమాలనూ తొలగించడం. 4. క్యాతలిక్ సమాజం ఇతర క్రైస్తవ సమాజాలతో కలసి పనిచేయాలి. జ్ఞానస్నానం ద్వారా పంపబడ్డం అనే లక్షణం ద్వారా క్రైస్తవులందరూ సోదరులే. 5. తిరుసభ ఇతర మతాలనూ వాటిల్లోని విలువలనూ అంగీకరించాలి. పవిత్రాత్మ ఇతర మతస్థుల హృదయాల్లోగూడ ప్రేరణం పుట్టిస్తూనే వుంటుంది. వాళ్ళుకూడ దేవుణ్ణి చేరుకోవాలని కోరుకొంటూనే వుంటారు. 6. తిరుసభ మానవాభ్యుదయం కొరకు కృషిచేసేవాళ్ళందరితోను కలసి పనిచేయాలి. మనలాగే వాళ్ళుకూడ దైవరాజ్యాన్ని స్థాపిస్తున్నారు అనుకోవాలి. ఈ కార్యాలన్నీ సాధించడం సులభం కాదు. ఐనా దైవ బలంతో వాటిని కొంతవరకైనా సాధించవచ్చు.

## 3. తిరుసభ సభ్యులు ఎవరు?

ఇదివరకు మనం జ్ఞానస్నానం పొందినవాళ్ళు మాత్రమే తిరుసభ సభ్యులు అనుకొనే వాళ్ళం. కాని ఇప్పుడు భావాలు మారాయి. దైవ రాజ్యాన్ని స్థాపించడం తిరుసభ బాధ్యత. ప్రేషిత సేవద్వారా ఈ కార్యాన్ని సాధిస్తాం. కాని ఎవరి పద్ధతిలో వాళ్ళు ఈ సేవచేసి దైవ సామ్రాజ్యాన్ని నెలకొల్పుతారు. అందుచే మనకు తెలియకపోయినా చాల వర్గాల ప్రజలు తిరుసభకు చెందివుంటారు.

1. జ్ఞానస్నానం పొందినవాళ్ళు తిరుసభ సభ్యులు. వీళ్ళు క్రీస్తు మరణోత్థానాలను విశ్వసిస్తారు. ప్రత్యక్షంగా తిరుసభ సభ్యులూ దైవరాజ్య సభ్యులూ ఔతారు. వీళ్ళు క్రీస్తుకి అంకితమైన వాళ్ళు. సువిశేష విలువలను స్వయంగా జీవించి ఇతరులకు కూడ బోధిస్తారు.

2. ఇంకో వర్గంవారికి జ్ఞానస్నానం పొందాలనే కోరిక వుంటుంది కాని సాంఘిక, సాంస్కృతిక కారణాలవల్ల పొందలేరు. వీరికి క్రీస్తుపట్ల విశ్వాసం వుంటుంది. సంస్కారాలు మాత్రం లేవు. వీళ్ళు క్రీస్తుకి సాక్షులుగా వుంటారు. లోకానికి సువిశేష విలువలను తెలియజేసి దైవరాజ్యాన్ని నిర్మిస్తారు. ఈ ప్రజలుకూడ తిరుసభ సభ్యులే.

3. కొందరు వాళ్ల ప్రత్యేక మతంలోనే వుంటారు. కాని క్రీస్తునీ సువిశేష విలువలనూ అంగీకరిస్తారు. వాటిని తమ సొంత మత విలువలతో జోడిస్తారు. క్రీస్తుపట్ల భక్తిప్రపత్తులు చూపుతారు. సువిశేష విలువలను పాటిస్తూ దైవరాజ్యాన్ని స్థాపిస్తారు. ఈలాంటివాళ్ళుకూడ తిరుసభ సభ్యులే.

4. ఇంకా కొందరు ఏ మతానికి చెందివుండరు. కాని క్రీస్తునీ సువిశేష విలువలనూ అంగీకరిస్తారు. కొంతమంది సంఘసేవకులు ఈలాంటివాళ్ళు. వీళ్ళ దృష్టిలో క్రీస్తు సమాజంలోని అన్యాయాలనూ అవినీతిని తొలగించేవాడు. వీళ్ళు తిరుసభకు చెందివుండాలనుకోరు. దైవరాజ్య స్థాపనకు మాత్రం కృషి చేస్తారు. తమ జీవితంలో సువిశేష విలువలను పాటిస్తారు. దైవరాజ్యాన్ని నెలకొల్పేవాళ్ళు కనుక వీళ్ళుకూడ తిరుసభ సభ్యులే.

ఈ దృష్టితో చూస్తే తిరుసభ చాల విస్తృతమైంది. దైవరాజ్యం కొరకు కృషి చేసేవాళ్ళంతా తిరుసభ సభ్యులే. ఈ ప్రజలంతా క్రైస్తవారాధనలో పాల్గొనక పోవచ్చు. కాని కొన్ని పర్యాయాలు వీళ్ళ ఆరాధనాపద్ధతి వీళ్ళకుంటుంది. కాని తిరుసభ సభ్యులందరికీ క్రీస్తు అనే వ్యక్తిపట్ల నమ్మకం వుంటుంది. కేవలం సువిశేష విలువలను అంగీకరిస్తేనే చాలదు. వాటికి కారకుడైన క్రీస్తుని అంగీకరించాలి. అతన్నిబట్టి సువిశేష విలువలకు విలువ వచ్చింది. ప్రధానమైన తంత్రి సువిశేషం అతడే.

భారతదేశ పౌరులు ఎక్కువగా క్రైస్తవులుకారు. అట్లని మనం వేదబోధ మానుకోగూడదు. మన సువిశేష బోధ భిన్న వర్గాలమీద భిన్న ప్రభావం చూపుతుంది. ఎవరికి ఇష్టమైనంతవరకు వాళ్ళు సువిశేష విలువలను స్వీకరిస్తారు. ఈ విలువలను ఏపాటిగా స్వీకరించినా వారి హృదయంలో క్రీస్తు సాన్నిధ్యం కొంతవరకు నెలకొంటుంది. వాళ్ళు తిరుసభకు చెందకపోయినా దైవరాజ్యానికి చెందుతారు. కనుక మన తరపున మనం వేదబోధ చేయవలసిందే. వినేవాళ్ళు వింటారు. విననివాళ్ళు వినరు.

# 4. మౌలిక సంఘాలు

ఇటీవల తిరుసభలో మౌలిక సంఘాలు అనే నూత్న సమాజాలు వెలిసాయి. ఇవి తిరుసభను పరిపుష్టం చేయడానికి బాగా వుపయోగపడతాయి. అపోస్తలుల చర్యల

ప్రకారం తొలినాటి యెరూషలేము సమాజం ఏకహృదయం కలిగివుండేది. ఆ సమాజంలో పేద ధనిక తారతమ్యాలు వుండేవికావు. ఉన్నవాళ్ళు, తమ సొత్తుని లేనివాళ్ళతో, పంచుకొనేవాళ్ళు-2, 45. ఈ లక్షణాలు మౌలిక సంఘాల్లో కనిపించాలి. వీళ్ళు, క్రీస్తుని బాగా అనుభవానికి తెచ్చుకొని మొదట విచారణలోని క్రైస్తవులకు ప్రేరణం పుట్టించాలి. క్రైస్తవ సమాజం వట్టి సంస్థగాదు భక్తబృందం అనేలాగ వారిలో మార్పుతీసుకురావాలి. క్రైస్తవులందరూ సువిశేష విలువల ప్రకారం జీవించేలా చేయాలి. వారిలో క్రీస్తుపట్ల విశ్వాసం పెంచాలి. అటుపిమ్మట వీళ్ళు తమ చుట్లుపట్ల వున్న క్రైస్తవేతరులతో కృషి చేయాలి. వారిలో దైవరాజ్య విలువలు ఇంతకుముందే నెలకొని వుంటాయి. ఇప్పుడు ఆ విలువలను ఇంకా పెంచి దైవరాజ్యాన్ని సుస్థిరం చేయాలి. సువిశేష విలువలను ప్రచారం చేయాలి. నరులంతా శాంతి సంతోషాలతో జీవించడానికి దోహదం చేయాలి. క్రీస్తు కోరిన దైవరాజ్యం ఇదే. మౌలిక సంఘసభ్యులు ప్రధానంగా క్రీస్తుకి సాక్ష్యం పలికేవాళ్ళు. కాని అన్యులతో కలిగే సంబంధవల్ల మన క్రైస్తవుల భక్తి విశ్వాసాలు సన్నగిల్లిపోకూడదు. విశేషంగా దివ్యసత్ప్రసాద బలిపట్ల, క్రీస్తుపట్ల మన విశ్వాసం తగ్గిపోకూడదు. అన్యులకు మనం తెలియజేసేది ప్రధానంగా క్రీస్తుని. ఆ క్రీస్తుపట్ల విశ్వాసం లోపిస్తే అతన్ని ఇతరులకు ఏలా బోధిస్తాం?

# 5. నూత్న తిరుసభకు నూత్న పరిచర్యలు

నూత్న తిరుసభ ప్రధానంగా ప్రేషిత సేవకు అంకితం కావాలి. దానికి జరిగే పరిచర్యల్లోకూడ మార్పు రావాలి.

## 1. వాక్యబోధ ముఖ్యాంశం కావాలి

1. వాక్యబోధవల్లనే తిరుసభ పుడుతుంది. కనుక దానిలో వాక్యబోధ ముఖ్యం కావాలి. మన గురువులు వాక్య బోధను ముమ్మరం చేయాలి. ప్రతి దైవకార్యంలోను వాక్యబోధ తప్పక జరగాలి.

2. దైవార్చన కార్యాలన్నీ దైవరాజ్యాన్ని సూచించేవిగా వుండాలి. క్రీస్తు మరణోత్థానాలతో దైవరాజ్యం ఏర్పడింది. ఈ రాజ్యం రాజకీయ ప్రాబల్యం వలనకాక క్రీస్తు ప్రేమవలనా ఆత్మార్పణం వలనా ఏర్పడింది. దైవార్చనలో, విశేషంగా పూజలో, విశ్వాసులు ఈ దైవరాజ్యంలో భాగస్థులౌతారు. మనం ఏదో అప్పు తీర్చుకోవడానికికాక, దైవరాజ్యాన్ని స్థాపించడానికి పూజలో పాల్గొనాలి.

3. మన కర్మకాండ నరులమధ్య సఖ్యసంబంధాలు పెంచాలి. పూర్వవేదంలోని బలులు ప్రజలకు దేవునితో సఖ్యతను పెంచాయి. అలాగే మన నూత్నవేద బలులు మనకు

క్రీస్తుతో సఖ్యతను పెంచాలి. ఈ సఖ్యత ద్వారానే క్రైస్తవుల్లో పరస్పర సఖ్యత కూడ పెరగాలి. క్రీస్తు శరీరాన్ని భుజించే మనం ఒక్క రొట్టెగా, ఒక్క సమాజంగా ఐక్యం గావాలి - 1కొ 10,17. తోడి నరులతో ఐక్యం గాకుండా దేవునితో ఐక్యంగాలేం. తుదితీర్పు సామెత బోధించేది యిదే. కాని మనలో ఐక్యతను చెరచేది కులవ్యవస్థ. మన సమాజంలో కులం తెచ్చిపెట్టే అనర్థాలు అన్నీ యిన్నీ కావు. మన గురువులూ మఠకన్యలే కులం పేరు మీదిగా ముఠాలవుతున్నారు. ఇక సామాన్యజనం కుల ప్రాబల్యంవలన ముఠాలు కట్టకుండా వుంటారా?

ఈ కుల విభజనను మనం పూర్తిగా వ్యతిరేకించాలి.

4. మనకు పరిపాలనా వ్యవస్థ వుంది. కాని మన బిషప్పులూ గురువులూ క్రైస్తవ సమాజాన్ని, లౌకిక సమాజాన్నిలాగ పరిపాలించకూడదు. క్రైస్తవ సమాజాలను పోషించి పెంచడం మన పాలకుల ధ్యేయం కావాలి. ప్రేమతో క్రైస్తవ సమాజాలను పరిపాలించడం వలన మన ప్రజల్లో, సఖ్యసంబధాలు పెరుగుతాయి. మన అధికారానికి ఆధారం పవిత్రాత్మ. ఈయాత్మ తిరుసభకే ఆత్మ. క్రైస్తవ అధికారులు ఆత్మశక్తితో బాగా తిరుసభను పరిపాలిస్తే మన ప్రజల్లో ప్రేమశక్తీ, పరస్పర సంబంధాలు పెరుగుతాయి. మన అధికారులు తమ పరిపాలనం ద్వారా తిరుసభను సజీవం, ఉత్సాహపూరితం చేయాలి దాన్ని ఓ మహాభవనాన్ని లాగ నిర్మించాలి.

5. మన ఆధ్యాత్మిక జీవితం పరివర్తనంతో కూడింది కావాలి. పవిత్రాత్మ ద్వారా జీవించేదే ఆధ్యాత్మిక జీవితం. కాని మనలోని స్వార్థం ఈ యాత్మకు అడ్డుదగులుతుంది. స్వార్థం వల్లనే మనం నానా పాపకార్యాలు చేస్తాం. పశ్చాత్తాపం ద్వారా ఈ స్వార్థాన్ని అణచుకొంటాం. పరివర్తనంలేని పుణ్యకార్యాలు మనలను గర్విష్ఠులను చేస్తాయి. కనుక వినయం, పరివర్తనం మనకు ఎల్లప్పుడు అవసరమే, ఎప్పటికప్పుడు పరివర్తనం చెందే వాడు ఇతరులపట్ల ప్రేమతో జీవిస్తాడు. క్రైస్తవ సమాజాన్ని పెంపులోకి తెస్తాడు.

## 2. వేదబోధక తిరుసభ

వాక్యాన్ని స్వీకరించిన క్రైస్తవ సమాజం వాక్యాన్ని బోధించాలి. ఒకసారి వాక్యాన్ని అనుభవానికి తెచ్చుకొన్న విశ్వాసి వాక్యాన్ని ప్రకటించకుండా వుండలేడు. క్రీస్తుకి సాక్షి కాకుండా వుండలేడు. క్రైస్తవ సమాజం ఎప్పుడు కూడ వేదబోధ చేసే సమాజం. వేదబోధ దాని ప్రధానమైన పని.

1. నూత్నవేదం పేర్కొనే క్రైస్తవ సమాజం ఎప్పుడూ వేదబోధ చేస్తుంటుంది - అచ 8,4. కాని నేడు క్రైస్తవ సమాజానికి చెంది వుండడమంటే ఓ సాంఘిక సంక్షేమ

సంస్థకు చెంది వుండడమైంది. ఆర్థిక లాభాలు పొందడమైంది. ఈ దృక్పథం మారాలి. ప్రతి విచారణ ప్రతి క్రైస్తవ సమాజం మేము వేదబోధకు పంపబడిన వాళ్ళం అనుకోవాలి. అవి లోకంలో పులిపిడి ద్రవ్యంగా తయారు కావాలి.

2. లోకంలో బోలెడంత దుష్టత్వముంది. క్రీస్తునీ సువిశేష విలువలనూ స్వీకరించిన క్రైస్తవులు ఈ విలువలను ప్రచారంచేసి ఆ దుష్టత్వాన్ని ప్రతిఘటించాలి. క్రైస్తవ సమాజమంతా క్రీస్తుకి సాక్ష్యంగా వుండి లోకంలోని పాపపు వ్యవస్థను నిర్మూలించాలి. గురువులూ ఉపదేశులూ మొదలైనవాళ్ళు మాత్రమేకాక విచారణలోని సంఘాలన్నీకూడ ఏదో రూపంలో సువిశేషబోధ చేసేవిగా వుండాలి.

## 3. ఆత్మ ప్రేరిత తిరుసభ

రెండవ వాటికన్ సభ తర్వాత పవిత్రాత్మ ఉద్యమం తిరుసభలో బాగా ప్రచారంలోకి వచ్చింది. ఇది దైవకటాక్షం అనాలి. ఈ వుద్యమం ద్వారా పవిత్రాత్మ తిరుసభను నడిపిస్తుంది. క్రీస్తు రక్షణాన్ని లోకానికంతటికీ అందీయడం ఆత్మ పని. కనుక క్రీస్తు రక్షణం అందరికీ లభించేలా చూడ్డం ఈ వుద్యమంలో పనిజేసేవాళ్ళ బాధ్యత.

1. జ్ఞానస్నానం, భద్రమైన అభ్యంగనం పొందినవాళ్ళందరికీ ఆత్మ తన వరాలను దయ చేస్తుంది. వీటి ద్వారా మనం దైవరాజ్యాన్ని వ్యాప్తిచేస్తాం. కనుక ఒక్కొక్కరూ ఆత్మ తమకిచ్చిన వరాలను గుర్తించి వేదబోధకు ఉపక్రమించాలి. విశేషంగా గృహస్థుల వరాలకు విలువ నీయాలి. వీళ్ళు కూడ దైవరాజ్యాన్ని వృద్ధి చేస్తారు. దేవుని పిలుపు కూడ ఒక వరం. పెద్దలు ఈ వరాన్ని గుర్తుపట్టాలి.

2. ఈ వరాల ద్వారా తిరుసభ తన ప్రేషిత సేవను కొనసాగించుకొని పోతుంది. కనుక ఈ వరాలను ఓ క్రమ పద్ధతిలో సంఘటితం చేయాలి. ఇక్కడ రెండంశాలు ముఖ్యం. మొదటిది విచారణలోని వివిధ సేవా సమాజాలను క్రమబద్ధం చేయాలి. ఈ సమాజాల సభ్యులు ఆయా రంగాల్లో జరిగే దుష్టకార్యాలను ప్రతిఘటింపగలిగి వుండాలి. ప్రజలచే సత్కార్యాలు చేయించగలిగి వుండాలి. అవసరమైతే తగిన వరాలుగల వ్యక్తులతో నూత్న సేవా సమాజాలను స్థాపించాలి. వీళ్ళు నూతన సేవలు ప్రారంభిస్తారు. రెండవది, మఠ సమాజాలు. ఇవి ఆత్మ తిరుసభకిచ్చే వరాలు. తిరుసభ ప్రేషిత సేవకు ఉపయోగపడి తేనే నూత్న మఠసభల పుట్టుకను అంగీకరించాలి. ప్రజల ఆధ్యాత్మిక అవసరాలను గుర్తించిన పిదపనే నూత్న మఠసభలను స్థాపించాలి. మఠసభలు ఒక దానితో ఒకటి పోటీకి దిగకూడదు. సభ్యులు అధికంగా గల మఠసభలు నూత్న కార్యాలను చేపట్టడానికి వెనుకాడకూడదు.

3. క్రైస్తవులు క్రైస్తవేతరుల్లో కూడ ఆత్మ పనిచేస్తుంటుందని గ్రహించాలి. ఆత్మ వరాలను క్రైస్తవులు మాత్రమే గుత్తకు తీసుకోలేదు. అన్యమతాలనూ ఆ మతాల్లోని వక్తులనూ కూడ ఆత్ముడు తన పనికి వినియోగించుకొంటూంటాడు. వాళ్ళు కూడ దేవుని రక్షణాన్ని ప్రజలకు అందిస్తుంటారు. ప్రజల శ్రేయస్సు కొరకు పనిజేసేవాళ్ళ హృదయాల్లో, లోకకళ్యాణంకొరకు ప్రాణాలర్పించేవాళ్ళ మనస్సుల్లో ఆత్ముడు తప్పక వుంటాడు. మనం ఈలాంటి వాళ్ళను గుర్తుపట్టి వాళ్ళతో కలసి పనిచేయడానికి పూనుకోవాలి. మంచి అంతా మనమే చేయనక్కరలేదు.

4. మన జీవితానికీ పనికీ గూడ దైవానుభూతి ముఖ్యం. కాని నేటి క్రైస్తవుల్లో ఈ దివ్యానుభూతి చాల తక్కువగా కన్పిస్తుంది. ఈ యనుభూతి లోపించినపుడు మనం ధనం, స్నేహితులు, బంధువులు, పలుకుబడి మొదలైన వాటిపై ఆధారపడతాం. కాని వీటితో దైవరాజ్యాన్ని స్థాపించలేం. ఆత్మ వీటి ద్వారా పని చేయదు. భారత దేశ క్రైస్తవులు ఆత్మనూ ఆ యాత్మ బోధించే క్రీస్తునీ గాఢంగా అనుభవానికి తెచ్చుకోవాలి. అప్పుడుగాని మనం సువిశేష సేవలో ఎదురయ్యే ఆటంకాలను ఎదుర్కొనలేం. దైవానుభూతి మనం ప్రప్రథమంగా సాధించవలసిన కార్యం.

## 4. ప్రపంచంతో కలసిపోయే తిరుసభ

క్రీస్తులాగే తిరుసభకూడ ఈ లోకంతో కలసిపోవాలి. క్రీస్తు సిలువమీద చేతులు చాచి ప్రపంచాన్నంతటినీ ఆలింగనం చేసికొన్నాడు. దాన్ని తండ్రికి అర్పించాడు. శ్రీసభకూడ ఈలాగే చేయాలి.

1. క్రీస్తు తన పరిచర్య ప్రారంభించక ముందు యోహాను నుండి జ్ఞానస్నానం పొందాడు. ఈ క్రియద్వారా అతడు పాపపు లోకానికి చెందినవాడయ్యాడు. మన పాపాలలో పాలు పంచుకొన్నాడు - 2 కొరి 5,21. దీని ద్వారా అతడు లోకం పాపాలను పరిహరించే గొర్రెపిల్ల కాగలిగాడు - యోహా 1,29. క్రీస్తు సాన్నిధ్యం కలిగిన తిరుసభకూడ ఈలాగే చేయాలి. అనగా అది లోకంలోని నరులందరితోను సఖ్యసంబంధాలు పెంచుకోవాలి. లోకంలోని నరుల సమస్యలు దాని సమస్యలు కావాలి. అది తన లాభాన్ని తాను చూచుకోకూడదు. ప్రపంచ ప్రజల లాభాన్ని లెక్కలోకి తీసికోవాలి. తండ్రి లోకాన్ని ఎంతో ప్రేమించి దాని రక్షణం కొరకు తనకు ప్రీతిపాత్రుడైన ఏకైక కుమారుణ్ణి సిలువ మరణానికి అప్పగించాడు- యోహా 3, 16. లోకం ఒకవైపు పాపంతో నిండి వుంటుంది. ఈ లోకానికి మనం దూరంగా వుండాలి. కాని క్రీస్తు రక్షణం కూడ ఈ లోకంమీద సోకుతూంటుంది. ఈ లోకానికి మనం దగ్గర కావాలి. అందుకే భక్తులంతా లోకంతో కలిసి పోయారు. లోకోద్ధరణకు కృషి చేసారు.

2. తిరుసభ లోకంలో పులిపిడి ద్రవ్యంగా వుండాలి./ క్రీస్తే ఈ వుపమానాన్ని చెప్పాడు - మత్త 13, 33. పులిపిడి ద్రవ్యం చిన్నదే. కాని అది పిండి అంతా పొంగేలా చేస్తుంది. లోపలినుండి దాన్ని నెమ్మదిగా మార్చివేసి అది రొట్టెగా మారడానికి సిద్ధమయ్యేలా చేస్తుంది. తిరుసభ ఏదో రహస్య సమాజంలాగ ఈ పని చేయదు. ప్రేమతో, తనకున్నది ఇతరులతో పంచుకోవడం ద్వారా, ఈ కార్యాన్ని సాధిస్తుంది. ఆత్మే తిరుసభ ద్వారా లోకంలో ఈ మార్పు తెస్తుంది. తిరుసభకు ఏనాడు సంఖ్యాబలం వుండదు. అది చాల చిన్నది. లోకం పెద్దది. భారత దేశంలో క్రైస్తవ సమాజం ఎప్పుడూ చిన్నదిగానే వుంటుంది. కాని ఈ చిన్న సమాజమే ఈ పెద్ద దేశాన్ని ప్రభావితం చేస్తుంది. ఈ కార్యం ఆత్మద్వారా జరుగుతుంది. కనుక క్రైస్తవ సంఘం ఎప్పుడూ లోకం వైపు దృష్టిత్రిప్పి వుంచాలి. ఎప్పుడూ లోకంతో కలసి పనిజేస్తుండాలి.

-3. తిరుసభ లోకంతో సంప్రతింపులు జరపాలి. లోకంలో ఇన్ని మతాలు, భావాలు, దృక్పథాలు వున్నాయి. మన భారతదేశంలోనే ఎన్ని మతాలు లేవు? కాని వీటన్నిటిలోను కొన్ని ఐక్యతా భావాలు వుంటాయి. వీటిని ఆధారంగా జేసికొని తిరుసభ అన్యమతాలతో సంప్రదింపులు, సంభాషణలు జరపాలి. మొదట మతాల్లోని ఏ భావాలు నరులందరూ ఐక్యం గావడానికి దోహదం చేస్తాయో వాటిని గ్రహించాలి. మతాల్లో మనుష్యులను విభజించే భావాలుకూడ వుంటాయి. వాటి విషయం తర్వాత పరిశీలించవచ్చు. మన సంప్రదింపుల ద్వారా ఇతర మతాల్లో ఏలాంటి మార్పు వస్తుందో మనకు తెలియదు. మన తరపున మనం నరులను ఐక్యంజేసి వారిలో సఖ్యసంబంధాలు పెంపొందించాలి. ఇదే దైవరాజ్యం. సంప్రదింపులూ సంభాషణలూ పలు వర్గాల ప్రజలతో జరపాలి. ఇతర క్రైస్తవ సంఘాలతో, అన్యమతాలతోగూడ సంభాషణలు జరపాలి. ఇవి విశ్వాస పరిధిలో, భావాల పరిధిలో, జీవిత పరిధిలో, క్రియల పరిధిలో నానా రూపాల్లో వుంటాయి. పవిత్రాత్మ ప్రేరణంవల్ల నరుల హృదయాలు క్రమేణ మారతాయి.

4. తిరుసభ పేదలను ఆదుకోవాలి. నరుని స్వార్థం, పాపం లోకాన్ని నాశం చేస్తాయి. ధనవంతులు బలవంతులు బడుగు వర్గాల వారిని అణగద్రొక్కారు. కొద్దిమంది సుఖాలకు నోచుకుంటే అధిక సంఖ్యాకులు కష్టాలపాలయ్యారు. క్రీస్తు ఈ లోకంలోకి వచ్చినపుడు తాను పేదల కొరకు వచ్చానని చెప్పుకొన్నాడు. పీడితులకు విమోచనాన్నీ హితవత్సరాన్నీ తీసుకొని రావడానికి వచ్చానని పల్కాడు - లూకా 4,18-19. క్రీస్తులాగే తిరుసభకూడ పేదలకు సహాయం చేయాలి. మనం ప్రతి విచారణలోను పేదరికాన్ని పరపీడనాన్ని గుర్తించాలి. ప్రజల పేదరికాన్ని తొలగించడానికి విశ్వప్రయత్నాలు చేయాలి.

ఇక్కడ వీళ్ళు క్రైస్తవులు, వీళ్ళు అన్యులు అనే భేదభావం వుండకూడదు. దారిద్ర్యం అందరినీ బాధిస్తుంది. కనుక నరులందరినీ ఆదుకోవడం మన ధర్మం.

తిరుసభలో మార్పు రావాలి. ఈ మార్పు అన్నివర్గాల ప్రజల్లోను కన్పించాలి. మన పీఠాధిపతులూ, గురువులూ మఠసభల సభ్యులు మారాలి. గృహస్థులు మారాలి. మన విచారణల్లో, విద్యా సంస్థల్లో, ఆస్పత్రుల్లో సాంఘిక సేవాసంస్థల్లో పెద్దమార్పు రావాలి. మన జీవితంలో ఆలోచనల్లో క్రియల్లో మార్పు రావాలి. దేవుని ఆత్మ ప్రాతపద్ధతులను తొలగించి కాలానుగుణమైన క్రొత్త పద్ధతులను తీసికొని **వస్తుంది. ఈ** క్రొత్తను మనం అంగీకరించాలి.

మన దినచర్య ఎలా వుండాలి? అందరూ రోజూ కాసేపు వేదవాక్యాన్ని చదువుకొని ప్రార్థనం చేసికోవాలి. వాక్యం మనకు దైవచిత్తాన్నీ దేవుని కోర్కెలనూ **తెలియజేస్తుంది**. మన జీవితాన్ని దేవుని చిత్తానికి అనుగుణంగా మార్చుకోవాలి. ప్రార్థనంవల్ల దైవరాజ్యాన్ని పొందుతాం. మనలోని స్వార్థాన్ని అణచుకొని దేవునికి ప్రీతి కలిగించే పనులు చేయడానికి పూనుకొంటాం.

పశ్చాత్తాపం, పరివర్తనం మనకు ఎప్పుడు అవసరమే. మనం దేవునివైపు పయనించాలి. కాని లోకవస్తువుల వైపు వెళ్తాంటాం. పరివర్తనం ద్వారా మన గమ్యాన్ని మార్చుకొని దేవుని చెంతకు చేరతాం. మన పొరపాట్లను చక్కదిద్దుకొని సత్యమార్గంలో నడుస్తాం.

ఉత్తములైనవారికి ఆత్మపరిశీలనం కూడా వుండాలి. హృదయానికున్న కపటం మరి దేనికీలేదు. అది మంచిని చేసే నెపంతో చెడ్డను చేస్తుంది. కనుక మన పనులు నిజంగా దేవునికి ప్రీతి కలిగిస్తున్నాయా, తోడివారికి మేలు చేస్తున్నాయా అని పరిశీలించి చూచుకోవాలి. ఈ యాత్మ పరిశీలనతో ఎప్పటికప్పుడు మనలను మనం సంస్కరించు కోవాలి.

భారతదేశ తిరుసభ "నా చిన్ని బొజ్జకు శ్రీరామరక్ష" అన్నట్లుగా ప్రవర్తించగూడదు. మైనారిటీ వర్గానిమైన మనం ఎప్పుడూ మన హక్కులను మనం కాపాడుకొనే ప్రయత్నంలోనే వుండకూడదు. మన చుట్టూ వున్న అన్య మతస్థులనుగూడ పట్టించుకొంటూండాలి. చాల పర్యాయాలు అల్ప సంఖ్యాకులమైన మనకున్న సదుపాయాలు అధిక సంఖ్యాకులైన అన్యమతాలవారికి లేవు. విద్యావైద్య సాంఘిక సంక్షేమ రంగాల్లో మనకే ఎక్కువ సౌకర్యాలు వున్నాయి. ఈ దేశంలో మనకంటె నిరుపేదలూ నికృష్ట దశలో వున్నవాళ్ళు చాలమంది వున్నారు. వీరికి సహాయం చేయడం మన బాధ్యత.

# 6. తిరుసభలో నూత్న దృక్పథాలు

తొలి రోజుల్లోని తిరుసభ ఒక పద్ధతిలో వుండేది. కాలక్రమేణ దానిలో చాల మార్పులు వచ్చాయి. చారిత్రక, సాంఘిక కారణాలు ఈ మార్పులకు కారణం. కాని ఈ మార్పుల్లో కొన్ని తిరుసభను అపమార్గం పట్టించాయి. అది లోకానికి నిజంగా ఉపయోగపడాలంటే ఈ యనిష్ట ధోరణులను సవరించుకొని ఆదిమ క్రైస్తవ సమాజం పద్ధతికి రావాలి.

1. ఆదిమ తిరుసభ సువిశేష బోధకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చింది. అది ఆనాటి ప్రజలకు క్రీస్తు బోధలనూ మార్గాన్నీ వివరించింది. చాలమంది క్రీస్తు వలన ఆకర్షితులై అతన్ని అనుసరించారు. కాని మధ్యయుగాల్లో క్రైస్తవ మతాన్ని వ్యాప్తి చేయడము ముఖ్యాంశమైంది. క్రైస్తవుల సంఖ్యలు పెరిగాయి. కాని భక్తివిశ్వాసాలు లేనివాళ్ళు కూడ స్వార్థప్రయోజనాల కొరకు క్రైస్తవ మతంలో చేరారు. మంది యెక్కువయితే మజ్జిగ పల్చనయింది. రెండవ వాటికన్ సమావేశం క్రీస్తుని బోధించడం తిరుసభ ప్రధాన పూచీ అని నొక్కి చెప్పింది. నేడు మనం శుద్ధమైన క్రైస్తవులంగా జీవించి క్రీస్తుని ప్రకటించాలి. మతవ్యాప్తి మన ప్రధానాశయం కాదు.

2. తొలినాటి క్రైస్తవులు పరస్పర సంబంధంగల భక్తసమాజంగా జీవించారు. ఆ సమాజంలో సోదరప్రేమ బలంగా వుండేది. ఆ ప్రేమకు ముగ్ధులై ఆనాడు చాలమంది ఆ సమాజంలో చేరారు. కాలక్రమేణ తిరుసభ తానొక ప్రేమ సమాజాన్నన్న సంగతిని మరచిపోయి ఓ సంస్థగా మారిపోయింది. సోదరప్రేమకు బదులుగా వ్యక్తిగతమైన ప్రాతినిధ్యం ముఖ్యమనుకొన్నారు. వాటికన్ సమావేశం మళ్ళీ ఈ సోదర ప్రేమను పునరుద్ధరింప గోరింది. ఇప్పుడు తిరుసభ లోకమంతటితోను సఖ్యసంబంధాలు పెంచుకోవాలి. అందరిపట్ల ప్రేమతో మెలగాలి.

3. తొలినాటి క్రైస్తవులు క్రీస్తుని గాఢంగా అనుభవానికి తెచ్చుకొన్నవాళ్ళు. ఆ యనుభూతినే వాళ్ళు ఆనాటి ప్రజలకు కూడ అందించారు. కనుకనే యోహాను "మేము కన్నులారచూచి, చెవులారవిని, చేతులార తాకిన జీవవాక్కును మీకు తెలియజేస్తున్నాం" అన్నాడు 1యో 1,1. మధ్యయుగాల్లో ఈ దైవానుభూతి నశించింది. తిరుసభ కొన్ని మతసత్యాలను ప్రోగుజేసికొంది. వాటిని జ్ఞానోపదేశ గ్రంథాలుగా, దైవశాస్త్ర సంగ్రహాలుగా తయారుచేసి ప్రజలకు బోధించసాగింది. వాటికన్ సమావేశం, క్రైస్తవులు క్రీస్తుని గూర్చిన తమ వ్యక్తిగత అనుభవాన్ని లోకానికి తెలియజేయాలని సూచించింది. కనుక నేడు మనం

ప్రజలకు తెలియచేయవలసింది పుస్తకాల్లోని మత సిద్ధాంతాలనుగాదు, మన దైవానుభూతుల్ని. ప్రభువుపట్ల వ్యక్తిగతమైనభక్తి లేనివాళ్ళు అతన్ని ఎలా బోధించ గలుగుతారు?

4. తొలిరోజుల్లో తిరుసభ స్థానిక తిరుసభ. ఎక్కడి క్రైస్తవులు అక్కడే ప్రోగయ్యేవాళ్ళు. ఒకరినొకరు పరామర్శించేవాళ్ళు, అంగీకరించేవాళ్ళు. ఎక్కడి సమస్యలు అక్కడే చర్చించుకొనేవాళ్ళు. పరిష్కరించుకోగలిగిన వాటిని పరిష్కరించుకొనేవాళ్ళు. ఆరోజుల్లో అన్నీ స్థానిక తిరుసభలు. కాని మధ్యయుగాల్లో క్రైస్తవ సమాజం ఏక తిరుసభ, విశ్వశ్రీసభ అయింది. కేంద్రం నుండి నియమాలు జారీచేయడం మొదలుపెట్టారు. అధికారాలు, పరిపాలనలు, నియమావళి పెచ్చు పెరిగాయి. ఫలితంగా స్థానిక తిరుసభలు చచ్చిపోయాయి. ఆత్మ దయచేసే వ్యక్తిగత వరాలు అడుగంటాయి. వాటికన్ సమావేశం మళ్ళా స్థానిక తిరుసభలను ఉద్ధరించింది. స్థానిక క్రైస్తవులు ప్రత్యేక సమాజాలుగా ఏర్పడి వాళ్ళ స్థితిగతులను పరిశీలించి చూచుకోవాలని చెప్పింది. ఇప్పుడు ఏ మేత్రాసనానికి ఆ మేత్రాసనం, ఏ విచారణకు ఆ విచారణ తమ ప్రత్యేకతను నిలబెట్టుకోవాలి.

5. ఆదిమ క్రైస్తవులు నేరుగా క్రీస్తుని ప్రకటించారు. ప్రజలు క్రీస్తుని విశ్వసించి అతని అనుచరులయ్యారు. ఈ యనుచర బృందమే దైవరాజ్యం. మధ్యయుగాల్లో క్రీస్తునిగాక క్రైస్తవమత సత్యాలను బోధించారు. ప్రజలు తిరుసభలో చేరడమే ముఖ్యమన్నారు. విశ్వాసముంటేచాలు మోక్షానికి వెళ్తామన్నారు. క్రైస్తవులు లోకానికి దూరమయ్యారు. వాటికన్‌సభ మళ్ళా దైవరాజ్య స్థాపనం ముఖ్యమని చెప్పింది. లోకంలోని ప్రజల కష్టసుఖాలు, ఆశా నిరాశలు తిరుసభ తనసొంతం చేసికోవాలని చెప్పింది. కనుక ఇప్పుడు ప్రపంచంలోని ప్రజల బాగోగులను పట్టించుకోవడం మన ముఖ్యధర్మం కావాలి.

6. ఆదిమ క్రైస్తవుల్లో ఒకరెక్కువ మరొకరు తక్కువ అనే భావంలేదు. విశ్వాసులంతా సరిసమానం అనుకొన్నారు. కాని మధ్యయుగాల్లో, యాజకవర్గం ప్రాబల్యం పెరిగింది. బిషప్పులు గురువులు, మఠసభల సభ్యులు ఎక్కువ, గృహస్థులు తక్కువ అనే భావం ప్రచారంలోకి వచ్చింది. యాజకులు వరప్రసాదాలు అందిస్తే గృహస్థులు స్వీకరిస్తారు. వాళ్ళు నాయకులు, సామాన్య ప్రజలు నడిపింపబడేవాళ్ళు. వీళ్ళుచేసే పనేమీలేదు. జడపదార్థాల్లాగ ఊరకుంటారు అనుకొన్నారు. కాని వాటికన్ సభ ఈ భావాన్ని పూర్తిగా మార్చివేసింది. తిరుసభ సభ్యులంతా ఏకసమాజం. వారివిలువ సరిసమానం. వారుచేసే పనుల్లో మాత్రం తేడావుంటుంది అని చెప్పింది. గృహస్థులకు ఆదిమ సమాజంలోవున్న ఘనతను పునరుద్ధరించింది. నేడు తిరుసభ సభ్యులంతా కలసి కృషి చేయాలి.

7. తొలినాటి తిరుసభలో అందరు క్రీస్తుని ప్రకటించారు. లోకం క్రీస్తు విలువలను గ్రహించేలా చేసారు. కాని మధ్యయుగాల్లో సువిశేషబోధ గురువులపని అనుకొన్నారు. గృహస్థులు పూర్తిగా లౌకిక విషయాల్లో పడిపోయారు. వాటికన్ సభ సువిశేషబోధ అందరిపని అని, ఎవరి పద్ధతిలో వాళ్ళు క్రీస్తుని ప్రనకటించాలనీ చెప్పింది. ఇంకా ఇండియాలాంటి మిషనరీ దేశాల్లో ప్రజలు తీసుకోవడమే ముఖ్యమనీ, ఈయడం తమ పూచీకాదనీ భావిస్తున్నారు. వీళ్ళు మేము తిరుసభ నీడలో వుంటాం. అది పెద్ద సాంఘిక సంక్షేమసంస్థ. మేము దాని సాయంతో వృద్ధిలోకి వస్తాం. దానికి మాత్రం సాయం చేయం అనుకొంటారు. తీసుకోవడమేగాని, ఈయడం మాపనికాదు అన్నట్లుగా ఆలోచిస్తుంటారు. కాని ఇవి తప్పుడు భావాలు. తిరుసభ మనకు ఈయగలిగినప్పుడు తీసుకోవచ్చు. దాని సాయంతో వృద్ధిలోకి రావచ్చు. కాని మనతరపున మనంకూడ తిరుసభకు ఈయాలి. మన సేవలు దానికి అవసరం. గురువులతోకూడ గృహస్థులు కూడ వాక్యసేవకు పూనుకోవాలి. తిరుసభ చేయూతతో పైకి వచ్చినవాళ్ళంతా తమకంటె క్రింది దశలో వున్నవాళ్ళకు సహాయం చేయాలి. క్రీస్తు ప్రేమకూ కరుణకూ సాక్ష్యంగా వుండాలి.

ఈ మూడవ వేయి సంవత్సరాల కాలంలో పవిత్రాత్మ తిరుసభను ఆధునిక ప్రపంచంలోకి పంపుతూంది. పోయిన రెండువేల యేండ్లల్లో తిరుసభ సాధించిన విజయాలూ పుణ్యకార్యాలూ చాలావున్నాయి. కాని మనం ఇంకా ముందుకుపోయి ఇంకా పవిత్రకార్యాలూ ఎన్నో సాధించాలి. మనకు రెండువేల సంవత్సరాల అనుభవముంది. పూర్వులు చూపిన బాటలున్నాయి. వాటిల్లో నడపవచ్చు. కాని మనం ఇప్పుడు క్రొత్తదారులు కూడ త్రొక్కాలి. ఆత్మశక్తితో, ఉత్సాహంతో లోకానికి సేవలు చేయాలి. ఇది తండ్రి ప్రేమించిన లోకం. క్రీస్తు ప్రవేశించిన లోకం. మన చేయూతను కోరే లోకం. ఆత్మ సహాయంతో, ప్రేరణతో మనం ఆధునిక ప్రపంచానికి చేయవలసిన సేవలు చాలా వున్నాయి. మన తరపున మనం ఈ పరిచర్యలను అందించడానికి సిద్ధంగా వుండాలి.

# 5. బైబులు దృష్టాంతాలు

## మనవిమాట

"బైబులు దృష్టాంతాలు" అనే యీ గ్రంథాన్ని ఇంతకు ముందే బైబులు భాష్యం 24,25 సంచికల్లో ప్రచురించాం. ఆ రెండు సంచికలనూ కలిపి యిక్కడ ఏకగ్రంథంగా అందించాం. దీనిలోని తొలి 16 అధ్యాయాలు ఆయావ్యక్తులు చేసిన దుష్కార్యాలను పేర్కొంటాయి. 17-30 అధ్యాయాలు ఆయావ్యక్తులు చేసిన సత్కార్యాలను పేర్కొంటాయి.

మన ప్రజల్లో చాలమంది ఆవిద్యావంతులూ పిల్లలూను. ఈ వర్గం ప్రజలకు బైబులు సత్యాలను బోధించడం కొంచెం కష్టమే. కాని బైబులు కథలను చెప్తే వీళ్ళు సులభంగానే అర్థంచేసికొంటారు. ఈ లాంటి సందర్భంలో ఈ దృష్టాంతాలు ఉపయోగపడతాయి.

ఇంకా, జ్ఞానోపదేశకులూ ఉపాధ్యాయులూ బోధకులూ మొదలైన వాళ్ళు ఈ దృష్టాంతాలను రకరకాల ఉపన్యాసాలకూ ధ్యానాలకూ వినియోగించుకోవచ్చు. దృష్టాంతం కథలాంటిది. దీనిలో ముఖ్యాంశం ఉపమానం. ఈ వుపమానం శ్రోతమనస్సుని ఆకట్టుకొని చెప్పే విషయాన్ని అతడు శ్రద్ధగా వినేలా చేస్తుంది. ఈ వుదాహరణలను వాడుకొనే బోధకులు వాటికి సంబంధించిన భాగాలను ముందుగనే బైబులు నుండి జాగ్రత్తగా చదువుకొని వుండాలి. ప్రతి ఉదాహరణకీ రిఫరెన్సు ఇచ్చాం.

బైబులు దృష్టాంతాలన్నీ ఎత్తి చూపించడం అలవిగాని పని. ఇక్కడ ముఖ్యమైన వాటిని కొన్నిటిని పేర్కొన్నాం. వాటిని నమూనాగా పెట్టుకొని ఎవరికి కావలసిన ఉదాహరణలను వాళ్లు బైబులునుండి ఇంకా అధికంగా సేకరించుకోవచ్చు. అది వ్యక్తిగతమైన కృషి. ఇది ఆరవ ముద్రణం.

## విషయసూచిక

# 1. అసూయ

నరులు సులభంగా అసూయకు గురౌతూంటారు. అల్పబుద్ధులు ఇతరుల వృద్ధినిచూచి ఓర్చుకోలేక కీడు తలపెడుతుంటారు. బైబులు అసూయపరుల ఉదంతాలను చాల పేర్కొంటుంది.

1. కయీను హేబెలు అన్నదమ్ములు. కయీను పొలములో పండిన పంటను దేవునికి కానుకగా సమర్పించాడు. హేబెలు గొర్రెపిల్లలను కానుక పెట్టారు. ప్రభువు కయీను కపటబుద్ధినిచూచి అతని కానుకను నిరాకరించాడు. హేబెలు సరళబుద్ధికి మెచ్చుకొని అతని కానుకను అంగీకరించాడు. ఇకనేమి, కయీనుకు హేబెలు మీద కన్నుకుట్టింది. అతడు తమ్ముణ్ణి పొలానికి తీసికొనివెళ్ళి చంపివేసాడు - ఆది 4:3-8.

2. యాకోబుకు లెయా, రాహేలు అని యిద్దరు భార్యలు. వాళ్ళిద్దరూ అక్కాచెల్లెళ్లు. లెయా కురూపి, రాహేలు సొగసుకత్తె. కాని దేవుని దయవలన పెద్దభార్యయైన లెయాకు బీరపూవుల్లాంటి పిల్లలు పుట్టారు. చిన్నభార్య రాహేలు మాత్రం గొడ్రాలుగా వుండిపోయింది. ఆమె లెయా సంతానవతి కావడంజూచి కండ్లల్లో నిప్పులు పోసికుంది. నాకు గూడ పిల్లలను పుట్టిస్తావా లేక నన్ను చావమంటావా అని భర్తమీద విరుచుకపడింది. నీకు బిడ్డలనీయడానికి నేనేమి దేవుణ్ణాయేమిటి అని యాకోబు తప్పుకొన్నాడు. తరువాత దేవుడు రాహేలు మొర ఆలకించి ఆమెకు యోసేపు, బెన్యామీను అనే బిడ్డలను ప్రసాదించాడు - ఆది 30: 1-2.

3. యాకోబుకు పంద్రెండుమంది కుమారులు. కాని అతనికి ఇతర కుమారుల మీదకంటె యోసేపుమీద ఎక్కువ ప్రేమ. ఆ కుమారునికి ఓ పొడుగుచేతుల నిలువుటంగీని కుట్టించాడు. అది చూచేటప్పటికి యేసేపు సోదరులకు కడుపు మండింది. వాళ్ళు అతనితో మాటలాడ్డం మానేసారు. తరువాత సోదరులు యోసేపుని అడవిలోని ఓ గోతిలో పడద్రోసారు. మళ్ళా అతన్ని ఆ గోతిలోనుండి పైకిలాగి యిష్మాయేలు వర్తకులకు అమ్మివేసారు. వాళ్ళు యోసేపును ఐగుప్తునకు తీసికొని వెళ్ళారు - ఆది 37: 3-4; 19-28.

4. ప్రభువు మోషేను యిస్రాయేలు ప్రజలకు నాయకుణ్ణి చేసాడు. అతడు ప్రజను ఐగుప్తునుండి నడిపించుకొని పోతున్నాడు. మోషే అన్న అక్క అయిన అహరోను మిర్యాములకు అతని పెద్దరికం నచ్చలేదు. వాళ్ళు చుప్పనాతితనంతో మోషే ఒక్కడే నాయకుడా? అతడొక్కడే ప్రవక్తా? మేము మాత్రంకామా? అని గొణిగారు. దానికి ప్రభువు మిర్యామును కుష్ఠరోగంతో పీడించాడు. తర్వాత మోషే ప్రార్థన చేయగా మిర్యాముకు కుష్ఠ నయిమయింది - సంఖ్యా 12:1-15.

5. ప్రభువు సౌలును మొదటిరాజుగా నియమించాడు. కాని అతడు మాట విననందున దేవుడు అతన్ని త్రోసివేసి దావీదును రెండవరాజుగా నియమించాడు. దావీదు సౌలు కొలువులో పనిచేస్తున్నాడు. ఓమారు సౌలు దావీదూ ఫిలిస్తీయులమీదికి యుద్ధానికి వెళ్ళి వాళ్ళను చితకగొట్టి తిరిగివస్తున్నారు. త్రోవలో ఓ వూరిలో కొందరు స్త్రీలు నాట్యం జేస్తూవచ్చి సౌలు దావీదులకు స్వాగతం చెప్పారు. వాళ్ల సౌలు వేయిమంది ఫిలిస్తీయులను చంపాడు. కాని దావీదు పదివేల మందిని చంపాడు అని పాటపాడారు. ఆ పాట సౌలుకు నచ్చలేదు. యిస్రాయేలు స్త్రీలు తనకంటే దావీదుదే పై చేయి అని పొగడారుకదా అని సౌలు అసూయపడ్డాడు. అప్పటినుండి అతనికి దావీదును అణగద్రొక్కాలనే కోరిక పుట్టింది. ఇంకో మారు దావీదు తనముందట సితారా వాయిస్తుండగా సౌలుకు అతన్ని బల్లెంతో గోడకు గ్రుచ్చాలనిపించింది. దావీదుమీద బల్లెం విసిరాడు. బల్లెంపోయి గోడకు గ్రుచ్చుకొంది. దావీదు మాత్రం నేర్పుతో ప్రక్కకు తప్పుకొని పారిపోయాడు.
-1 సమూ 18:6-11; 19: 8-10.

6. క్రీస్తు బోధలకూ అద్భుతాలకూ ప్రజలు విస్తుపోయారు. యూదనాయకులను వదలివేసి క్రీస్తును అనుసరించారు. దీన్నిచూడగా యూదుల ప్రధానాచార్యులకు మత్సరం పుట్టింది. వాళ్ల అసూయ క్రీస్తుని పిలాతుని కప్పగించేదాకా పోయింది - మార్కు 15: 10; మత్త 27:18.

7. 1) అసూయ అనేది ఎముకల్లో పుట్టే కుళ్లు - సామె 14:30
2) అసూయవలన సకలవిధాలయిన దుష్టగుణాలు పుట్టుకవస్తాయి - యాకో 3:16
3) నరుడు మొదట అమరుడుగానే సృజింపబడ్డాడు. కాని పిశాచం అసూయవలన అతనికి శోధనమూ మరణమూ సంభవించాయి - సొలోమోను జ్ఞాన 2: 23-24.
4) పిశాచం రెచ్చగొట్టగా యూదనాయకులు క్రీస్తు వధకు పూనుకొన్నారు. ఆదిలో నరహంతకుడై ఆదామునకు చావుతెచ్చిపెట్టిన పిశాచమే క్రీస్తు మరణానికి గూడ కారణమైంది. - యోహా 8:44.

## 2. వంచన

నరులు ఒకరి నొకరు వంచిస్తూంటారు. ఒకరి నొకరు మోసగించి లాభం పొందాలని చూస్తుంటారు. బైబులు ఈ లాంటి మోసాలను కొన్నింటిని వర్ణిస్తుంది.

1. పిశాచం తొలి నరదంపతులనుజూచి అసూయపడింది. తాను పోగొట్టుకొనిన భాగ్యం నరులకు అబ్బడంజూచి సహించలేకపోయింది. అది "మీరు ఏచెట్టుపండూ తినగూడదట నిజమేనా?" అని ఏవనడిగింది. ఏవ "తోటనడుమనున్న చెట్టుపండు మాత్రం తినకూడదు. అది తింటే మేము చనిపోతాం" అంది. పిశాచం " ఆ చెట్టుపండుతింటే మీరు దేవుడంతటివాళ్లై పోతారు. పాపం ఈ రహస్యం మీకు తెలీదు" అని ఏవను ఉబ్బించింది. ఆదామేవలు పిశాచంమాటవిని పండుతిని భ్రష్టులైపోయారు. ఈవిధంగా దయ్యం ఆదిదంపతులను వంచించింది - ఆది 3:1-6.

2. యూదుల తండ్రులు తాము చనిపోకముందు పెద్ద కొడుకును దీవించేవాళ్ళు. ఆ దీవెన ఫలించేది. ఈసాకు చనిపోకముందు తన పెద్దకొడుకయిన ఏసావును దీవించాలనుకొన్నాడు. ఏసావును అడవికిపోయి వేటమాంసం తెచ్చి తనకు వండిపెట్టమన్నాడు. కాని అతడు తిరిగిరాకముందే యాకోబు మాంసం వండుకొనివచ్చి యేసావువలె నటించి తండ్రి దీవెన పొందాడు. ఏసావు వేటనుండి తిరిగివచ్చి సంగతి తెలిసికొని యెంతో విలపించాడు. "నాన్నా! నాకు కూడ ఈయడానికి నీవద్ద మరో దీవెన లేదా?" అని దీనంగా అడిగాడు. కాని లాభం లేకపోయింది. తండ్రిదీవెన ఫలించేది ఒక్కసారి మాత్రమే. ఈ విధంగా యాకోబు ఏసావును వంచించాడు- ఆది 27, 18-27.

3. యాకోబు తన అన్నయైన ఏసావునుండి పారిపోయి మేనమామయైన లాబానునింట ఆశ్రయంపొందాడు. ఈలాబానునకు లెయా రాహేలు అని ఇద్దరుకుమార్తెలు ఉండేవాళ్ళు. యాకోబు రాహేలును పెండ్లియాడగోరి మేనమామకు ఏడేండ్లు జీతం చేసాడు. గడువుకాస్త ముగిసాక లాబాను మేనల్లునకు రాహేలు నిస్తున్నట్లే నటించి లెయానిచ్చి పెండ్లిచేసాడు. రాత్రి ఆ యువతిని కూడిన పిదపగాని యాకోబునకు ఆమె లెయాయని తెలియలేదు. అతడు అదేమనగా లాబాను పెద్ద పిల్లకు పెండ్లికాకముందు చిన్నపిల్లకు పెండ్లిచేయడం మా దేశాచారంకాదు అన్నాడు. తరువాత లాబాను రాహేలునుగూడ యాకోబునకిచ్చి పెండ్లిచేసాడు. కాని అతడు రాహేలుకోసం ఇంకో యేడేండ్లు మేనమామకు జీతం చేయవలసివచ్చింది. ఇవి పెండ్లి సందర్భాలలో జరిగే వంచనలు - ఆది 29, 16-28.

4. యోసేపనిన అతని సోదరులకు గిట్టేదికాదు. వాళ్ళు అతన్ని ఐగుప్తువెళ్ళే వర్తకులకు అమ్మివేసారు. కాని తండ్రికి ఏమి చెప్పాలి? ఆ సోదరులు ఓ పన్నాగం పన్నారు. ఓ మేకపిల్ల నెత్తుటిలో యోసేపు అంగీనిముంచి దాన్ని తండ్రి వద్దకు పంపించారు. అడవిలో ఆ నెత్తురుగుడ్డ తమ కంటపడిందని చెప్పించారు. యాకోబు ఏ మాయదారి మృగమో యోసేపును మ్రింగివేసిందని తలంచి చాల బాధపడ్డాడు. కొడుకు మీద ఆశవదలుకొన్నాడు - ఆది 37, 31-32.

5. యోసేపును ఐగుప్తులో పోతీఫరు అనే సైన్యాధిపతికి అమ్మివేసారు. యోసేపు అతని యింట్లో మన్ననపొందాడు. యజమానుని భార్య యోసేపు చక్కదనంజూచి అతని మీద కన్ను వేసింది. అతన్ని తనతో శయనింపమని నిర్బంధం చేసింది. యోసేపు ఆ పాడుపనికి సమ్మతింపక పై బట్టను ఆమె చేతుల్లోనే వదలివేసి పారిపోయాడు. ఆమె మత్సరబుద్ధితో ఆ బట్టనే ఆనవాలుగా చూపి యోసేపు తన్ను నిర్బంధించాడని భర్తకు ఫిర్యాదు చేసింది. దానితో యోసేపును చెరలో త్రోయించారు - ఆది 39, 7-20.

6. సంసోను ఫిలిస్తీయుల యువతియైన డెలీలాను పెండ్లిచేసికొన్నాడు. కాని సంసోనుకు ఫిలిస్తీయులకు మధ్య పచ్చి గడ్డివేస్తే భగ్గునమండేది. వాళ్లు ఆమెకు లంచమిచ్చి అతనికి బలం ఎక్కడుంటుందో తెలిసికొమ్మన్నారు. డెలీలా ఆ వీరుణ్ణి మభ్యపెట్టింది. అతనిబలం తలవెంద్రుకల్లో వుంటుందని తెలిసికొంది. అతడు తలజుట్టు కత్తిరించేవాడు కాదు. ఆమె సంసోనును నిద్రపుచ్చి అతని తలవెంద్రుకలను గొరిగించింది. అంతట ఫిలిస్తీయులువచ్చి సంసోనుని బంధించి అతని కండ్లు తీయించారు. అతన్ని బానిసను చేసి వెట్టిచాకిరి చేయించుకొన్నారు - న్యాయా 16: 16-22.

7. దావీదు పొరుగింటి ఆడగూతురు బత్షెబాను చూచి మోహించాడు. ఆమె ఊరియా అనే సైనికుని భార్య. ఈ ఊరియాని ఏలాగైనా వదలించుకోవాలని దావీదు తలంపు. అపుడు దావీదు సైన్యాధిపతియైన యోవాబు శత్రువులతో యుద్ధం నడుపుతున్నాడు. రాజు అతని కొక జాబువ్రాసి "పోరు జరిగేప్పుడు ఊరియాను మొదటివరుసలో నిలబెట్టి మీరంతా కాస్త వెనుకకు తగ్గండి" అని ఆజ్ఞపంపాడు. సైన్యాధిపతి ఆలాగే చేయగా ఊరియా యుద్ధంలో హతుడయ్యాడు. దావీదు కుట్రనెగ్గింది. అతడు బత్షెబాను భార్యగా స్వీకరించాడు. ఇదంతా తెలిసికొని నాతానుప్రవక్త దావీదును నిశితంగా మందలించాడు. అతడు పశ్చాత్తాపపడ్డాడు - 2 సమూ 11, 14-17.

8. పరిసయులు యూదుల్లో ఓ వర్గంవాళ్ళు. వాళ్ళకు క్రీస్తు అంటే గిట్టదు. వాళ్ళు ఏలాగైనా అతన్ని వంచించాలన్న బుద్ధితో " కైసరు చక్రవర్తికి పన్నుచెల్లించడం న్యాయామాకాదా?" అని ప్రశ్నించారు. చెల్లించమంటే యూదులకు కోపం. పద్దంటే రోమను ప్రభుత్వానికి కోపం. కనుక వాళ్ళు క్రీస్తు ఏలా జవాబు చెప్పినా అతన్ని ఇరకాటాన పెట్టవచ్చు గదా అనుకొన్నారు. కాని క్రీస్తుమాత్రం వాళ్ళ కపటబుద్ధిని గ్రహించి చక్రవర్తికి చెల్లించేవి చక్రవర్తికీ దేవునికీ చెల్లించేవి దేవునికి చెల్లించండనిచెప్పి వాళ్ళ నోళ్ళు మూయించాడు - మార్కు 12, 13-17.

9. పిలాతుకు క్రీస్తు ఏనేరమూ చేయలేదని బాగా తెలుసు. ఐనా అతడు ప్రజలకు భయపడ్డాడు. ద్రోహియైన బరబాను విడుదలచేయించి నిర్దోషియైన క్రీస్తుకు మరణశిక్ష విధించాడు - లూకా 23, 22-25.

10. యూదా క్రీస్తుని పట్టియీయడానికై యూదనాయకులను గెత్సెమని తోపునకు తీసికొనివచ్చాడు. తానెవరిని ముద్దు పెట్టుకొంటే అతన్ని పట్టుకొమ్మని శత్రువులకు ముందుగనే ఆనవాలిచ్చాడు. బయటికిమాత్రం గురుభక్తి కలవాళ్లాగా నటిస్తూ గురువా నమస్కారమని క్రీస్తును ముద్దుపెట్టు కొన్నాడు. క్రీస్తు అతన్నేమీ నిందించలేదు. ఆ యానవాలు ప్రకారం శత్రువులు క్రీస్తును బంధించి తీసికొనిపోయారు - మత్త 26: 49-49.

11. పసిబిడ్డలను చంపించిన మొదటి హెరోదు మనుమడు మూడవ హెరోదు. ఇతడు యాకోబును చంపించాడు. పేత్రుని చెరలో వేయించాడు. తనవిజయాలను తలంచుకొని పొంగిపోతూ ఓమారు బంటులతో కొలువుతీర్చాడు. తనగొప్పతనాన్ని ప్రకటించుకొంటూ వాళ్ళముందు ఓ ఉపన్యాసమిచ్చాడు. కొలువుకాళ్ళు అతని మెప్పుపొందడంకోసం " నీవు నరమాత్రుడివికావు. ఓ దేవుడిలా మాట్లాడావు సుమా!" అని పొగడారు. ఆ పొగడ్తలకు హెరోదు బలూనులాగ ఉబ్బిపోయాడు. అతడు తన్నుతాను దేవుణ్ణిగా భావించుకొన్నందులకై ఓ దేవదూత అక్కడికక్కణ్ణే అతన్ని ఘోరంగా శిక్షించాడు. దానితో హెరోదు రోగపీడితుడై పురుగులుపడి చచ్చాడు - అచ 12, 21-23.

# 3. వ్యభిచారం

స్త్రీ పురుషులు జంతుదృష్టితో ఒకరినొకరు కామిస్తూంటారు. ఏవేవో మాయోపాయాలుపన్ని ఒకరి దేహాన్నొకరు అనుభవింప జూస్తూంటారు. బైబులు ఈలాంటి దుష్టచేష్టలను కొన్నింటిని ఉదాహరిస్తుంది.

1. యోసేపు ఐగుప్తున పోతీఫరు అనే సైన్యాధిపతి ఇంటిలో వుండేవాడు. అతని భార్యకు యోసేపుపై కోరిక పుట్టింది. అతన్ని పాపకార్యానికి పురికొల్పింది. యోసేపు "అమ్మా! యజమానుడు ఈ యింటికంతటికీ నన్ను అధిపతిని జేసాడు. నీవు యజమానుని భార్యవు కనుక నిన్ను మాత్రం నా కప్పగింపలేదు. నేను స్వామి ద్రోహం చేయను. దేవుడు చూస్తూండగా ఇంతటి చెడ్డపనికి ఒడిగట్టను" అని ఆమెను మందలించాడు. ఆమె చెంతకు పోవడంగూడ మానివేసాడు. అయినా యజమానునిభార్య అతన్ని నిర్బంధంచేసింది. ఆ నిర్బంధానికి గూడ లొంగకపోగా ఆమె అతని మీద నేరం మోపింది. అతన్ని చెరలో త్రోయించింది - ఆది 39, 7-10.

2. యూదులు బాబిలోను ప్రవాసంలో వున్నపుడు ఇద్దరు వృద్ధులను న్యాయాధిపతులనుగా నియమించారు. వీళ్ళిద్దరూ సూసన్న అనే ఉత్తమ కుటుంబినిని కామించి ఆమెను చెరచాలనుకొన్నారు. ఓమారు వాళ్ళిద్దరూ ఆమె తోటలో దాగుకొని

కూర్చున్నారు. సూసన్న స్నానం చేయడానికి తోటకు రాగా ఆమెను పాపంచేయమని బలాత్కరించారు. కాని ఆ గృహిణి "ఈలాంటి పాడుపనికి పూనుకొని దేవునియెదుట పాపం కట్టుకోవడంకంటె మీరుపెట్టే శిక్ష ననుభవించడమే మేలు" అంది. వాళ్ళ కోరికను నిరాకరించింది. వాళ్ళిద్దరూ సూసన్న మరెవరితోనో వ్యభిచారం చేసిందని సభ యెదుట ఆమెమీద కూటసాక్ష్యంచెప్పి ఆమెనుచంపించబోయారు. అపుడు దానియేలు ఆ వృద్ధుల కూటసాక్ష్యాన్ని బట్టబయలు చేసాడు. చివరకు వాళ్ళు తలపెట్టిన మరణశిక్ష వాళ్ళమీదికే వచ్చింది - దాని 13, 19-23.

3. దావీదు ఓదినం సాయంకాలం తన మేడమీద పచార్లు చేస్తూ ప్రక్కయింట్లో స్నానమాడుతూన్న ఓ అందగత్తెను చూచాడు. ఆమె పేరు బత్షెబా. ఆమెను చూడగానే దావీదుకు మతిపోయింది. రాజు ఆమెను తన యింటికి రప్పించుకొని తనభార్యను చేసుకొన్నాడు. ఆమె భర్తయైన ఊరియాను మోసంతో యుద్ధంలో చంపించాడు. తర్వాత ఈ పాపానికి నాతాను ప్రవక్త దావీదును కఠినంగా మందలించాడు - 2సమూ 11, 2-5.

4. దావీదునకు ఒక భార్యవలన కలిగిన బిడ్డలు అబ్షాలోమనే కుమారుడు, తామారనేకొమార్తె. మరియొక భార్యవలన కలిగినవాడు అమ్మోననే కుమారుడు. ఈయమ్మోనుకు తామారుపై వలపు పుట్టింది. అతడు వ్యాధిగా వున్నట్లు నటించగా దావీదు అతనిని చూడ్డానికి వచ్చాడు. అమ్మోను రాజును తామారును పంపి తనకు భోజనం సిద్ధంచేయించవలసిందిగా కోరాడు. రాజు ఆనతిపై తామారు అన్నకు భోజనం సిద్ధంచేసి ఇంటిలోనికి తీసికొనివెళ్ళి వడ్డింపబోయింది. అప్పుడు అమ్మోను మారుచెల్లిని బలాత్కరంచేసి ఆమెను చెరిచాడు. అటుపిమ్మట అతనికి తామారుపై కొండంతద్వేషం పుట్టుకవచ్చింది. ఆమెను ఇంటిలోనుండి బయటికి గెంటివేసాడు. తరువాత అబ్షాలోము ఈ యమ్మోనును విందుకు ఆహ్వానించి అక్కడ అతన్ని కపటంతో చంపించివేసాడు - 2సమూ 13, 10-14.

5. పసిబిడ్డలను చంపించిన మొదటి హెరోదు కుమారుడు రెండవ హెరోదు. ఇతడు తన అన్నయైన ఫిలిప్పు భార్య హెరోదియాను ఉంచుకొన్నాడు. స్నాపక యోహాను హెరోదును నిశితంగా మందలించి ఆమెను పంపివేయమన్నాడు. హెరోదియా మత్సరంతో యోహానును చెరలో వేయించింది. ఓ దినం హెరోదియా కూతురు సభలో నాట్యంచేసి అతన్ని మెప్పించింది. అతడు ఒళ్ళు తెలియక ఆ బాలిక ఏమడిగినా యిస్తానని బాసచేసాడు. హెరోదియా యోహాను శిరస్సు అడగమని కూతురికి నూరిపోసింది. కూతురు చేతుల్లో నుండి యోహాను తల అందుకొన్నంకగాని హెరోదియాకు సంతృప్తి కలుగలేదు - మత్త 14, 3-5.

6. వ్యభిచారంలో పట్టుపడిన స్త్రీలను రాళ్ళు రువ్వి చంపమన్నాడు మోషే. ఓ దినం యూదులు అలాంటి స్త్రీ నొకతెను క్రీస్తు ఎదుటికి తీసికొనివచ్చి ఈమెకు ఏమి శిక్ష విధించాలో నీవే చెప్పమని అడిగారు. ప్రభువు మీలో పాపం చేయనివాడెవడైనా వుంటే ఆమె మీద మొదటిరాయి విసరవచ్చు అన్నాడు. ఆ మాటకు సిగ్గుపడి వాళ్ళంతా ఆమెను వదలిపెట్టి వెళ్ళిపోయారు. ప్రభువు ఆమెతో "వాళ్ళు నిన్ను శిక్షింపలేదు. నేను కూడ నీకు శిక్ష విధింపను. ఇక వెళ్ళి పాపం చేయకుండ బ్రతుకు" అన్నాడు - యోహా 8, 10-11.

7. శారీరక వ్యభిచారంతోపాటు మానసిక వ్యభిచారమనేది కూడ వుంది. పరస్త్రీని మోహదృష్టితో చూస్తే ఆమెతో మానసికంగా పాపం చేసినట్లే - మత్త 5,28.

8. పౌలు కొరింతీయులకు వ్రాస్తూ మనదేహం పరిశుద్ధాత్మకు ఆలయమై యుంటుందని పేర్కొన్నాడు. జ్ఞానస్నానం పొందినపుడు పరిశుద్ధాత్మ మన దేహంలో ఓ దేవాలయంలో లాగ నెలకొంటుంది. ఈలాంటి పవిత్ర దేహాన్ని వ్యభిచారం ద్వారా అమంగళపరచకూడదు - 1కొరి 6,19.

# 4. హత్య

నరులు కోపతాపాలకూ అసూయకూ గురై తోడి జనులను హత్యచేస్తూంటారు. ప్రాణాన్ని ఇచ్చే అధికారంగాని తీసికొనే అధికారంగాని మనకులేదు. భగవంతు డొక్కడే దానికి కర్త. అందుచేత హత్య చాల ఘోరమైంది.

1. కయీను తమ్ముడైన హేబెలుమీద గ్రుడ్లెర్రజేసాడు. హేబెలును పొలానికి తీసుకవెళ్ళి మీదికిదూకి అతన్ని చంపివేసాడు. మా అన్నయ్య నన్ను అన్యాయంగా చంపివేసాడు అని హేబెలు నెత్తురు దేవునికి మొరపెట్టుకొంది. దేవుడు కయీనుని దేశదిమ్మరివి కమ్మని శపించాడు. ఆ శాపానికి కయీను భయపడిపోయి "జనులు నన్ను రాళ్ళు విసిరి చంపరా" అని దీనంగా మనవిజేసికొన్నాడు. దేవుడు కయీనుమీద జాలిబూని అతని నొసటిమీద ఓ భయంకరమైన గుర్తుపెట్టాడు. ఆ గుర్తుచూచి జనం భయపడిపోయి అతని యెదుటికి రాకుండాపారిపోయేవాళ్లు. అలా కయీను బ్రతికిపోయాడు - ఆది 4, 8,16.

2. సౌలుకు తన కొలువుకాడైన దావీదు అంటే కన్ను కుట్టింది. ఓమారు దావీదు సౌలుముందర సితార వాయిస్తున్నాడు. దావీదును ఉన్నవాణ్ణి ఉన్నట్లు గోడకు గ్రుచ్చాలి అనుకొని సౌలు అతనిమీదికి ఈటె విసరాడు. కాని దావీదు నేర్పుతో ఆ వేటు తప్పించుకొన్నాడు. ఈటె మాత్రంపోయి గోడలో దిగబడింది. దావీదేమో సౌలు కొలువునుండి పారిపోయాడు - 1సమూ 19, 8-10.

3. దావీదు కుమారుడగు అమ్మోను తనకు మారుచెల్లెలు అబ్షాలోముకు సొంత చెల్లెలు ఐన తామారును చెరిచాడు. రెండేండ్లు గడిచిన తర్వాత అబ్షాలోము కపటబుద్ధితో అమ్మోనును విందునకు ఆహ్వానించాడు. అచట అమ్మోను తిని త్రాగిమైమరచి యుండగా అబ్షాలోము బంటులు అతని మీదపడి చిత్రవధ చేసారు - 2 సమూ 13, 28-29.

4. దావీదు తన సైనికుడైన ఊరియా యనువాని భార్య బత్షెబాను పొందగోరాడు. ఊరియాను ఏవిధంగానైనా మట్టుపెట్టాలనుకొన్నాడు. అప్పుడు అతని సైన్యాధిపతియైన యోవాబు రాబా పట్టణాన్ని ముట్టడిస్తున్నాడు. రాజు సైన్యాధిపతికి జాబు పంపాడు. ఆ కమ్మలో "పోరు ముమ్మరంగా జరిగే తావులో ఊరియాను ముందటి వరుసలో నిలబెట్టండి. మీరంతా కాస్త ప్రక్కకు తప్పుకోండి. అతడే దెబ్బలు తిని చస్తాడు" అని వ్రాసాడు. యోవాబు రాజు చెప్పినట్లేచేసి ఊరియాను చంపించాడు. ఈ విధంగా తడిగుడ్డతో గొంతుకోసాడు - 2సమూ 11, 14-17.

5. ఓ మారు క్రీస్తు తన సొంత గ్రామమైన నజరేతు వెళ్ళాడు. అక్కడి ప్రార్థనామందిరంలో బోధిస్తూ ఏ "ప్రవక్తను గూడ సొంతజనం అంగీకరించరు" అని వాక్రుచ్చాడు. ఆ నగరవాసులు క్రీస్తుమీద మండిపడ్డారు. వాళ్ళ గ్రామం ఓ కొండ మీద కట్టబడి వుంది. వాళ్లు క్రీస్తుని క్రిందికి పడద్రోయాలనుకొని కొండ అంచునకు తీసికొని పోయారు. కాని ప్రభువు వాళ్ళ మధ్యలోనుండి దాటి వెళ్ళిపోయాడు - లూకా 4, 28-30.

6. యూదులు క్రీస్తుని చంపాలని నిశ్చయించుకొన్నారు. కాని నరులను చంపే అధికారం చట్టరీత్యావాళ్ళకులేదు. కనుక వాళ్ళు క్రీస్తుకి మరణదండన విధించమని రోమను అధికారియైన పిలాతును ఒత్తిడి చేసారు. అతని ఉత్తరువుతో ప్రభుని సిలువ మీద కొట్టి చంపారు - యోహా 19, 15-16.

7. జ్ఞానులు క్రీస్తు శిశువును ఆరాధించడానికి పయనమై వస్తూ దారిలో హేరోదును దర్శించారు. అతడు ఈ క్రీస్తు పాపడు యూదులకు రాజౌతాడని విని తన రాజ్యానికి ఎక్కడ ముప్పు వస్తుందోనని తల్లడిల్లి పోయాడు. హేరోదుకు ఆ శిశువును ఏలాగైనా చంపించాలన్న బుద్ధి పుట్టింది. అతడు జ్ఞానులతో "మీరువెళ్ళి శిశువును ఆరాధించండి. మళ్లా తిరిగివచ్చి అతని ఉదంతం నాకు తెలియజేయండి" అని చెప్పాడు. కాని జ్ఞానులు మళ్లా కంటబడక పోవడంవల్ల హేరోదుకు విపరీతమైన కోపం వచ్చింది. అతడు క్రీస్తు శిశువు ప్రాయం రెండేళ్ళలోపులో వుంటుందని అంచనా వేసాడు. కనుక బేత్లెహేము ప్రాంతంలో రెండేండ్లలోపులో వున్న మగబిడ్డల నందరినీ దారుణంగా చంపించాడు. ఆ ఘోర హత్యలో క్రీస్తుశిశువుకూడ నాశమై పోయి వుండాలనుకొని సంబ్రాలుపడ్డాడు - మత్త 2,16.

8. క్రీస్తు ఉత్థానం అనంతరం యెరూషలేములో క్రైస్తవ సమాజం బలపడింది. ఆ సమాజానికి ఏడ్గురు పరిచారకులుండేవాళ్లు. వాళ్ళల్లో స్తెపనుకూడ ఒకడు. ఇతడు పూర్వవేదంవలన ఇక ఫలితం లేదని బోధించాడు. మోషేధర్మశాస్త్రమూ యెరూషలేము దేవాలయమూ ఇక మనల రక్షించలేవనీ, మనలను రక్షించేది ఉత్థాన క్రీస్తు ఒక్కడేనని వాదించాడు. యూద నాయకులు ఆ బోధను సహించలేకపోయారు. యూదమతానికి తలవంపులు కలిగాయనుకొన్నారు. వాళ్ళు కోపంతో స్తెఫనుని ఊరిబయటికికి లాగుకోని వెళ్ళి రాళ్ళతోకొట్టి చంపారు. స్తెఫను ఉత్థాన క్రీస్తుని దర్శించి ప్రాణాలు విడిచాడు. అతనిచావు తలపెట్టిన వాళ్ళలో సౌలు కూడ ఒకడు - అచ 7, 54-60.

9. సౌలు దమస్కు పట్టణంలోని క్రైస్తవులను హింసించడానికి వెళ్తూండగా దారిలో క్రీస్తు ప్రత్యక్షమై అతని మనసు మార్చాడు. అప్పటినుండి సౌలు క్రీస్తే మెస్సియా అని దమస్కు పట్టణంలో ఆవేశంతో ఉపన్యసించడం మొదలెట్టాడు. ఆ పట్టణంలోని యూదులు, అతన్ని చంపాలని కుట్రలు పన్నారు. ఆ సంగతి గుర్తించి సౌలు మిత్రులు అతన్ని ఓ గంపలో కూర్చుండ బెట్టి రాత్రివేళ పట్టణపు గోడమీదిగా వెలుపలికి దింపారు. ఆ రీతిగా సౌలు శత్రువులనుండి తప్పించుకొన్నాడు - అచ 9, 23-25.

# 5. లంచాలు

నరులు లోభంవలన లంచానికి లొంగిపోతారు. డబ్బు తీసికొని కానిపనులు చేస్తారు. డబ్బుకు అమ్ముడుపోయేవాళ్ళు వట్టి నీచులు.

1. సమూవేలు ప్రవక్త మొదటి న్యాయాధిపతి. అతడు చక్కగా తీర్పులుతీర్చి ప్రజలకు న్యాయం జరిగించాడు. సమూవేలు తరువాత అతని కుమారులు న్యాయాధిపతులయ్యారు. కాని వాళ్ళకు తండ్రి గుణాలు అబ్బలేదు. వాళ్ళు కాసులకు దాసులై లంచాలు తీసికొని న్యాయం చెరిచారు-1 సమూ 8, 3-5.

2. ఆహాసు యిస్రాయేలు నేలిన దుష్టరాజుల్లో ఒకడు. ఇతనికాలాన అస్సిరియను రాజగు టిగ్లాత్పిలేసరు పాలస్తీనా మీదికి దండెత్తి వచ్చాడు. ఆహాసు దేవాలయంసొమ్ము అపహరించి ఈ రాజుకు లంచం పెట్టాడు. కాని టిగ్లాత్పిలేసరు ఆ లంచం పుచ్చుకొని గూడ ఆహాసును శిక్షించి వెళ్లాడు- 2 దిన 28, 20-21.

3. ఫిలిస్తీయుల ఆడపడుచు డెలేలాను సంసోను పెండ్లి చేసికొన్నాడు. కాని వాళ్ళకు సంసోనంటే గిట్టదు. కనుక ఫిలిస్తీయదొరలు డెలీలాకు లంచంపెట్టారు. వారిలో ఒక్కొక్కడు ఆమెకు పదకొండువందల వెండి నాణాలు చెల్లించాడు. దేలీలా సంసోను బలం అతని తలవెంట్రుకల్లో ఉంటుందని తెలిసికొని ఫిలిస్తీయ సర్దారులకు ఎరిగించింది.

ఆ రహస్యాన్ని తెలియజేసిన సంసోను తన చావు తానే తెచ్చి పెట్టుకొన్నట్లయింది - న్యాయా 16, 5.

4. గురుద్రోహియైన యూదా ప్రధానాచార్యుల దగ్గర ముప్పై వెండినాణాలు లంచం తీసికొని క్రీస్తును వాళ్ళకు పట్టీయడానికి ఒప్పుకొన్నాడు - మత్త 26, 14-15.

5. ప్రధాన యాజకులు సైనికులను క్రీస్తుసమాధికి కాపుంచారు. ఈ సైనికులు క్రీస్తు ఉత్థానం కావడంచూచి భయపడిపోయి ప్రధాన యాజకులకు తెలియజేసారు. వాళ్ళు తమలో తాము కూడబలుకుకొని సైనికులకు లంచాలిచ్చి "మీరు మేము నిద్రబోతూండగా క్రీస్తు శిష్యులు వచ్చి అతని శవాన్నెత్తుకొని పోయారని పుకార్లుపుట్టించండి. మేము రోమను అధిపతులవలన మీకేలాంటి బాధా కలుగకుండా చూస్తాం" అని చెప్పారు. సైనికులు ఆ డబ్బులు తీసికొని యాజకులు చెప్పినట్లే పుకార్లు పుట్టించారు. కాని సత్యంమాత్రం యూదప్రజలకు తెలిసిపోయింది - మత్త 28, 12-15.

6. యూదుల నాయకులు పౌలును బంధించి కైసరయలోని ఫీలిక్సు అనే అధిపతివద్దకు తీసుకొని వచ్చారు. ఫీలిక్సు పౌలు సమాధానం విన్నాడు. పౌలు లంచం పెడితే అతన్ని విడిపించాలని ఫీలిక్సు ఉద్దేశం. కాని రెండేడ్లుగడిచినా పౌలు లంచమీయలేదు, ఫీలిక్సు అతన్ని విడిపించనూలేదు. తర్వాత ఫీలిక్సు మారిపోయి మరో అధికారి వచ్చాడు. పౌలుమాత్రం చెరలోనే వుండిపోయాడు - అకా 24, 26-27.

## 6. ధనమూ - ధనవాంఛా

నరులు ఆశతో డబ్బు కూడబెట్టగోరుతూంటారు. చివరికి దానికి దాసులైపోతూంటారు. కొందరు సొంత ప్రాణానికంటే దేవునికంటే గూడ అధికంగా డబ్బును గౌరవిస్తారు. అది చివరికి నరుల ప్రాణాలనే తీస్తుంది.

1. యోసేపు సోదరుల అతన్ని చంపివేయాలనుకొని ఓ గోతిలో పడద్రోసారు. మళ్ళా అతన్ని చంపివేయడమెందుకులెమ్మని పైకిలాగి యిరవై వెండినాణాలకు యిష్మాయేలీయులకు అమ్మివేసారు. ఈ విధంగా వాళ్ళు తమ్ముని కంటె డబ్బుకే ఎక్కువ విలువ నిచ్చారు ఆది - 37, 26-28.

2. యాకోబు తన మేనమామయైన లాబాను ఇంటిలో జీతానికున్నాడు. ఈ లాబాను వట్టి మోసగాడు. యాకోబుకు తక్కువజీతమిచ్చి ఎక్కువపని రాబట్టుకోవాలి అనుకొనేవాడు. అతడు యాకోబు జీతం మాటిమాటికి మారుస్తుండేవాడు. అలా పదిసార్లు మార్చాడు - ఆది 31, 7.

3. ఓ మారు సొలోమోను ప్రభువును ఆరాధించడానికి గిబ్యోను పుణ్యక్షేత్రానికి వెళ్లాడు. ఆ రాత్రి ప్రభువు అతనికి కలలో కన్పించి ఏమివరం కావాలో కోరుకొమ్మన్నాడు. సొలోమోను స్వార్థానికేమీ కోరుకొలేదు. ప్రజలను న్యాయబుద్ధితో పరిపాలించడానికి వివేకంమాత్రం ప్రసాదించమని అడిగాడు. ఈ కోరిక ప్రభువుకి చాల నచ్చింది. దేవుడతనితో నీవు దీర్ఘాయువుగాని సిరిసంపదలుగాని శత్రువినాశంగాని కోరుకోక ప్రజలకు మేలుచేయడానికై వివేకాన్ని కోరుకొన్నావు. ఈ వరాన్ని ఇస్తున్నాను. పైపెచ్చు నీ వడగకపోయినా దీర్ఘాయువూ సిరిసంపదలుకూడ ఇస్తున్నాను అన్నాడు. స్వార్థంలేని నరునికి లభించే బహుమతి అది -1రాజు 3, 11-14.

4. యూదా ప్రభుని ముప్పై వెండినాణాలకు అమ్మాడు కదా! తరువాత అతనికి పశ్చాత్తాపం పుట్టింది. అతడు మళ్లా ప్రధానయాజకుల వద్దకు వెళ్ళి మీ సొమ్ము మీరు తీసికొని క్రీస్తుని విడిపించండి అని అడిగాడు. వాళ్ళు ఆ సంగతి మా కేమీపట్టదు అన్నారు. యూదా కోపంతో ఆ వెండినాణాలను అక్కడే దేవాలయంలోనే విసరికొట్టాడు. నిరుత్సాహంతో వెళ్ళిపోయి వురివేసికొని చచ్చాడు. ధనలోభంవల్ల యూదాకు ప్రాణనష్టం కలిగింది - మత్త 27, 3-5.

5. ఓ మారు ఓ ధనిక యువకుడు క్రీస్తువద్దకువచ్చి నేనూ నిన్ను వెంబడిస్తానన్నాడు. క్రీస్తు మొదట నీ యాస్తిపాస్తులను అమ్మి పేదలకిచ్చి అటుపిమ్మటవచ్చి నా శిష్యుడవు కమ్మని చెప్పాడు. అతడు చాల ధనవంతుడు. ఒకవైపు తన సిరిసంపదలను వదలుకోలేకా, మరోవైపు క్రీస్తుశిష్యుడు కాలేకా ఆ యువకుడు విచారంతో వెళ్ళిపోయాడు. ఓకోమారు మన డబ్బే మనలను భగవంతునినుండి వైదొలగిస్తుంది - మార్కు 10, 21-22.

6. ఓ యజమానుడు దేశాంతరంవెళ్తూ తన సేవకుల్లో ఒకనికి ఐదుసంచులూ, ఇంకో అతనికి రెండుసంచులూ, మరొకనికి ఒకసంచీ ధనమిచ్చి పోయాడు. అతడు మళ్లాతిరిగి వచ్చి సేవకులను లెక్క అడిగాడు. ఐదుసంచులు తీసుకొన్నవాడు ఇంకో ఐదుసంచులూ, రెండుసంచులు తీసుకొన్నవాడు ఇంకో రెండు సంచులూ కూడబెట్టి వుంచారు. కాని ఒక సంచిధనం తీసికొన్నవాడు మాత్రం ఏమి వృద్ధిచేయకుండ మెదలకుండా వుండిపోయాడు. యజమానుడు వాడిమీద మండిపడ్డాడు. వాని సొమ్ముకూడ తీసికొని మొదటివాని కిచ్చివేసాడు. కనుక భగవంతుడు మనకిచ్చిన శక్తిసామర్థ్యాలను వృద్ధిచేసికోవాలి - మత్త 25, 14, 30.

7. ఒక ధనవంతునికి పుష్కలంగా పంటలు పండాయి. అతడు తన కొట్లు పడగొట్టించి ఇంకా పెద్దకొట్లు కట్టించి ధాన్యం నిల్వజేయిస్తాననుకొన్నాడు. నేను చాల

అదృష్టవంతుణ్ణి. నాకు చాల యేండ్లవరకు సరిపోయేంతగా సంపదలు అబ్బాయి. కనుక సుఖంగా తిని త్రాగి ఆనందిస్తూంటాను - అనుకొన్నాడు. కాని దేవుడు మాత్రం ఓరి మూర్ఖుడా! ఈ రాత్రే నీవు చనిపోవాలి. ఇక నీవు కూడబెట్టినసొత్తు ఎవరిపాలౌతుందో గదా! అన్నాడు. సిరిసంపదలు శాశ్వతంగావు. నరుడు కేవలం వాటినే నమ్ముకోగూడదు - లూకా 12, 16-20.

8. 1) ప్రభూ! నాకు పేదరికమూవద్దు, సిరిసంపదలూ వద్దు. నాకు కావలసినంత కూడుమాత్రం ఇస్తూండు. నాకు సిరిసంపదలు అబ్బాయో, నిన్ను ధిక్కరించి దేవుడెవరు అనే కాడికి వస్తానేమో! మరి పేదవాణ్ణయిపోయానో, పరుల సొమ్ము దొంగిలించి నీకు అపకీర్తి తెస్తానేమో! సామెత - 30, 8-9.

2) ఈ లోకంలో సంపదలు చేకూర్చుకొంటే వాటిని చిమ్మటలూ త్రుప్పు తినివేస్తాయి. దొంగలు అపహరిస్తారుగూడ. కాని పరలోకంలో ధనం కూడబెట్టుకుంటే అది అక్షయంగా వుండిపోతుంది. మన సంపదలెక్కడుంటాయో మన హృదయంగూడ అక్కడే వుండిపోతుంది - మత్త 6, 19-21

3) విత్తువాని విత్తనాలు కొన్ని ముండ్లపొదల్లో పడ్డాయి. ఆ విత్తనాలు మొలవగానే ముండ్లపొదలు వాటిని అణచివేసాయి. ఇక్కడ ముండ్ల మొక్కలంటే యేమిటి? కొందరు క్రీస్తుని గూర్చిన బోధలను ఆలిస్తారు. మంచి జీవితం జీవించాలని కోరుకొంటారుగూడ. కాని లౌకిక చింతలూ ధనాశా, వ్యామోహాలూ ఆ మంచి కోరికలను కాస్త అణచివేస్తాయి. కనుక వాళ్ళు తాముకోరుకున్న దివ్యజీవితంగాక ప్రాపంచిక జీవితమే జీవిస్తారు - మార్కు 4, 18-19.

4) మన పాపవిమోచనానికై ఒడ్డిన మూల్యం వెండి బంగారాలుకాదు, అమూల్యమైన క్రీస్తురక్తం -1 పేత్రు 1,18

5) సకల అనర్థాలకు మూలం ధనాపేక్ష - 1 తిమో 6,10

6) మంచి దుస్తులు ధరించివచ్చిన ధనికుని ఆప్యాయంగా ఆదరించి, చింపిరి గుడ్డలు తొడుగుకొని వచ్చిన పేదవాణ్ణి అనాదరం చేయడం ధర్మమా? - యాకో 2, 2-4

7) పొలంలో పని చేయించుకొన్నవాళ్ళకు కూలి నిరాకరించగూడదు. ఆ పంటకూలీల యేడ్పు దేవుని చెవుల్లో పడుతుంది - యాకో 5, 4.

# 7. దురాశ

ఒకోమారు నరులు దురాశకు లొంగిపోతూంటారు. లోతైన నీళ్ళలోబడి మునిగిపోయినట్లు పేరాసకు చిక్కి నాశమైపోతూంటారు.

1. యోషువా హాయిపట్టణాన్ని ముట్టడించి పోరు సాగిస్తున్నాడు. అందలి వస్తువులనన్నీటినీ శాపంపాలుచేసి కాల్చివేయమని యావే ఆజ్ఞ యిచ్చాడు. కాని యోషువా సైనికుల్లో ఒకడైన ఆకానుమాత్రం హాయిలో దొరికిన దోపిడి సొమ్మును - పట్టుబట్టలనూ నాణాలనూ - దాచుకొన్నాడు. అతడు యావే ఆజ్ఞ మీరినందున యోషువాకు యుద్ధంలో అపజయం కలిగింది. యోషువా విచారణ జరిపి చూడగా ఆకానునేరం బయటపడింది. అంతట ఆకానునీ అతని కుటుంబాన్నీ రాళ్ళతో కొట్టి చంపారు - యోషువా 7.

2. యెలీషా ప్రవక్తగానున్న రోజుల్లో సిరియా సైన్యాధిపతియైన నామాను కుష్ఠరోగియై చికిత్సకొరకు వచ్చాడు. ప్రవక్త అతన్ని ఏడుసార్లు యోర్దానునదిలో స్నానం చేయమన్నాడు. ఆలా చేయగా నామానుకు కుష్ఠపోయింది. అతడు యెలీషాకు కానుక లర్పింపబోయాడూని, ప్రవక్త అవేమీ స్వీకరించకుండానే నామానును పంపివేసాడు. కాని యెలీషా శిష్యుడైన గేహాసీ దురాశతో నామానువెంట బోయాడు. మా గురువుగారు కానుకలు అడుగుతున్నారని బొంకి ఆతనివద్ద నుండి వెండి నాణాలూ పట్టుబట్టలూ ఇప్పించుకొని వచ్చాడు. గేహాసీ యెలీషాకు పరిచర్య చేయడానికి రాగానే ప్రవక్త అతనిమీద మండిపడి "నాయాత్మ నీతోకూడ వచ్చి నీవు చేసిన పాడుపని చూచింది. నీవు ఈలాంటి అకార్యానికి పాల్పడ్డావు గనుక నామానును వదలిపోయిన కుష్ఠ నిన్ను పట్టి పీడిస్తుంది" అన్నాడు. వెంటనే గేహాసీకి కుష్ఠసోకగా అతని వొళ్ళు మంచులాగ తెల్లబడిపోయింది -- 2 రాజు 5, 20-27.

3. సౌలు అమాలెకీయుల మీదికి యుద్ధానికి పోయాడు. ప్రభువు అమాలెకీయులను శాపంపాలుచేసి సర్వనాశంచేయమని చెప్పాడు. కాని సౌలు అమాలెకీయుల రాజైన అగాగును చంపకుండ వదలివేసాడు. పైగా అతడు అమాలెకీయుల గొడ్లలో పోతరించిన యెడ్లను దూడలను గొర్రెలను చంపలేదు. శ్రేష్ఠమైన జంతువులన్నిటిని తాను మిగుల్చుకొని క్షుద్రజంతువులను మాత్రం శాపంపాలుచేసి వధించాడు. అంతట ప్రభువు పంపగా సమూవేలు ప్రవక్త వచ్చి సౌలును చెడబడ తిట్టాడు. నీవు యావేమాట త్రోసివేసావు. గనుక యావే నీ రాచరికం త్రోసివేసాడు అని చెప్పాడు. దానితో సౌలు రాజదవి కోల్పోయాడు -1 సమూ 15, 9.

4. అహాబు దుష్టరాజు. అతని మేడ ప్రక్కనే నాబోతు అనే పేదవాని పొలముండేది. ఆ రాజుకు ఆ పొలంమీద ఆశ పుట్టింది. అతడు నేను కూరగాయలు పండించుకోవా

ఆ పొలం నా కమ్మమని కోరాడు. నాబోతు అది పిత్రార్జితం, నేనా పొలాన్ని అమ్మనని మొండిపట్టు పట్టాడు. అంతట అహాబు ప్రోద్బలంపై ఇద్దరు దుర్మార్గులు నాబోతు మీద నేరం తెచ్చారు. అతడు దేవుణ్ణీ రాజునీ దూషిస్తున్నాడని కూటసాక్ష్యం పలికారు. అహాబు నాబోతును రాళ్ళతో కొట్టి చంపించి అతని పొలాన్ని స్వాధీనం చేసికొన్నాడు. అప్పుడు యేలీయా ప్రవక్త అహాబును కఠినంగా శపించాడు. నాబోతు పొలంలోనే నీ నెత్తురు కుక్కలు నాకుతాయిపో అన్నాడు. ప్రవక్త అన్నంతపనీ జరిగింది-1 రాజు 21, 1-16.

5. యూదాలో దయ్యం ప్రవేశించింది. అతడు ఆసబోతుతనంతో గురువుని ముప్పది వెండికాసులకు అమ్ముకొన్నాడు- లూకా 22, 3-6.

6. యెరూషలేములోని తొలినాటి క్రైస్తవులు ఉమ్మడి జీవితం జీవిస్తూండేవాళ్ళు. ఈ సమాజానికి పేత్రు పెద్ద. అననీయ సఫీరా అనే భార్యాభర్తలు వాళ్ళంతట వాళ్ళేవచ్చి ఈ సమాజంలో చేరారు. కాని వాళ్ళు పొలం అమ్ముకోగా వచ్చిన డబ్బులో కొంతసొమ్ము మిగుల్చుకొని మిగతాసొమ్ము మాత్రమే పేత్రుకు ముట్టజెప్పారు. పేత్రు అననీయాను పిల్చి నీకు వచ్చిన డబ్బు ఇంతేనా అని అడుగగా, అతడు ఇంతేనని బొంకాడు. వెంటనే అతడు ప్రాణాలు విడిచి నేలమీద పడ్డాడు. అతని శవాన్ని పాతిపెట్టారు. కొంత సేపయ్యాక సఫీరా భర్త చనిపోయాడన్న సంగతి తెలియక ఎక్కడికోవెళ్ళి తిరిగివచ్చింది. పేత్రు సఫీరా డబ్బువిషయమై ప్రశ్నించగా ఆమెకూడ బొంకింది. సఫీరాకూడ ప్రాణాలు విడిచి నేలమీద పడగా ఆమెనుగూడ పాతిపెట్టారు - అచ 5, 1-11.

7. పౌలు ఎఫెసు పట్టణంలో బోధిస్తూ విగ్రహారాధనను ఖండించాడు. ఆ పట్టణంలో దెమిత్రి అనే కమసాలివాడు ఆర్తెమి దేవతకు వెండిగుళ్ళను చేయించి అమ్మేవాడు. ఈ గుళ్ళవలన అతనికి అతని పనివాళ్ళకీ మంచి ఆదాయం వస్తూండేది. కాని పౌలు బోధలవల్ల చాలమంది ఈ గుళ్ళను కొనడం మానేసారు. దెమిత్రి వ్యాపారం పడిపోయింది. కనుక అతడు తన పనివాళ్ళనందరినీ ప్రోగుజేసికొనివచ్చి పౌలుమీద గలాటా లేవదీసాడు. ఎఫెసీయులు పౌలును చంపేకాడికి వచ్చారు. కాని అక్కడి పురపాలక ఉద్యోగులు దొమ్మీదారులను అణచివేసి పౌలు ప్రాణాలను కాపాడారు - అచ 19, 23-41

## 8. పదవీ వ్యామోహం

నరులకు పట్టే ఓ దుర్బుద్ధి పదవీకాంక్ష. పేరు ప్రతిష్ఠల కాసపడి జనులు అందనిపండ్లకు ఆర్రులు చాచుతారు. చివరకు ఎంతపైకి లేవాలనుకొన్నారో అంతక్రిందికి పడిపోతారు.

1. పిశాచం ఏవను మభ్యపెట్టి తినగూడని చెట్టుపండు తినమని దుర్బోధచేసింది. ఆలాతింటే మీరూ మంచిచెడ్డలు తెలిసికొని దేవుళ్ళా ఐపోతారు అంది. ఏవకు ఆ పండ్లమీద

ఆశపుట్టింది. అవి కంటికింపుగా వున్నాయి. నోటికి రుచిగాకూడ వుండవచ్చు. తామూ ఆ పండ్లుతిని మంచిచెడ్డలు తెలిసికొని దేవుళ్లైపోతే ఎంతబాగుంటుంది అనుకొంది. దేవుళ్లు కావాలన్న కోర్కెతోనే ఆదామేవలు తినరానిపండ్లు తిన్నారు - ఆది 3, 5-6

2. కోరా మరియు అతని యనుచరులూ మోషే అహరోనుల్లాగ యాజకులు కావాలనుకొన్నారు. కనుక వాళ్లు మోషే అహరోనులమీద తిరగబడ్డారు. ఇంకా దాతాను అబీరాము అనేవాళ్లు మోషే అహరోనుల్లాగ ప్రజానాయకులు కావాలనుకొన్నారు. కనుక వాళ్లుగూడ ఆ యన్నదమ్ములమీద తిరగబడ్డారు. అపుడు మోషే దేవుని ప్రార్థింపగా నేల నోరువిప్పి తిరుగుబాటుదారులందరిని మ్రింగివేసింది - సంఖ్యా 16, 31-32.

3. అబ్షాలోమునకు తండ్రి దావీదునకు బదులుగా తాను రాజుకావాలన్న బుద్ధిపుట్టింది. అతడు రథాలూ గుర్రాలూ చేకూర్చుకొని వైభవంగా తిరగడం మొదలెట్టాడు. ఏభైమంది బంటులు ముందునడచి అతనికి బరాబరులు చేస్తూండేవాళ్లు. అతడు నగర ద్వారంవద్ద నిలుచుండి వస్తూపోతూండే వాళ్ళను ఆప్యాయంగా పలుకరించి వాళ్ళ మన్ననలను సంపాదించాడు. తరువాత అబ్షాలోము దావీదును తరిమేపి తాను రాజయ్యాడు. కాని దావీదు అనుచరులు అతన్ని యుద్ధంలో ఓడించి చంపివేసారు - 2సమూ 15, 1-6.

4. యూదులు బాబిలోను ప్రవాసంలో వుండగా వాళ్ళ ఆడపడచు ఎస్తేరు ఆ దేశపు రాజును పెండ్లి చేసికొని రాణి ఐంది. ఆ దేశపు రాజుకు మంత్రి హామాను. యూదులనాయకుడు మొర్దెకయి. ఇతడు ఎస్తేరురాణికి బంధువు. హామానుకు మొర్దెకయి పొలకువ గిట్టదు. ఓమారు హామాను రాజు కొలువునకు వస్తూండగా మొర్దెకయి రాజభవన ద్వారం వద్ద కూర్చుని వున్నాడు. కాని అతడు పైకిలేచి నమస్కారంగూడ చేయలేదు. కనుక హామాను మొర్దెకయిని హతమార్చాలనుకొన్నాడు. అతడు భార్యతో మిత్రులతో సంప్రతించి మొర్దెకయిని ఉరితీయించడానికికై ఏబదిమూరలు ఎత్తుగల ఉరికంబాన్ని సిద్ధం చేయించాడు. కాని చివరకు హామానునే ఆ కంబంమీద వురితీసారు - ఎస్తేరు 5, 12-14.

5. జబదెయి కుమారులు యాకోబు యోహానులు. వీరి తల్లి క్రీస్తుకు బంధువురాలు. ఒకతడవ ఆమె కుమారులను వెంటబెట్టుకొని క్రీస్తువద్దకువచ్చి నా కుమారులిద్దరూ నీ రాజ్యంలో కుడియెడమల కూర్చుండేలా చేయమంది. అనగా వాళ్ళిద్దరికి అందరికంటె పై యుద్యోగాలు లభించాలని ఆమె కోరిక. క్రీస్తు వాళ్ళను జూచి మీరు నా బాధల్లో పాల్గొనగలరా అని అడిగాడు. వాళ్ళు ఏమి తెలియక పాల్గొంటామని తలలూపారు. క్రీస్తు వాళ్ళ అజ్ఞానాన్ని క్షమించి "నా రాజ్యంలో కుడియెడమలందు కూర్చుండే అధికారం నా తండ్రి అనుగ్రహించిన వాళ్ళకేగాని లభించదు" అని చెప్పాడు. తరువాత మిగిలిన పదిమంది శిష్యులూ ఈ సంగతంతా విని యాకోబు యోహానులను చీవాట్లు పెట్టారు - మత్త 20, 20-24.

6. ఓ తడవ శిష్యులు కపెర్నహూము అనే వూరికి వెళ్తున్నారు. వాళ్ళు త్రోవలో నేను గొప్పంటే నేను గొప్పని తమలోతాము వాదోపవాదాలు చేసికొన్నారు. ఆ వూరు చేరినంక క్రీస్తు వాళ్ళనుజూచి మీలో మీకు వివాదమెందుకు పుట్టిందని ప్రశ్నించాడు. వాళ్ళు నిజం బయటపడిందని తెలిసికొని సిగ్గుతో తలలు వంచుకొన్నారు - మార్కు 9, 33-35.

7. శిష్యులు క్రీస్తురాజ్యమొకటుందనీ, అక్కడ తమకు గొప్ప పదవులు లభిస్తాయనీ అపోహపడేవాళ్లు. కనుక వాళ్లు క్రీస్తుదగ్గరకివచ్చి పరలోకరాజ్యంలో ఎవడు గొప్పవాడౌతాడో చెప్పమని అడిగారు. ప్రభువు శిష్యులు పదవీవ్యామోహం గుర్తించి వాళ్ళకు ఓ చిన్నబిడ్డను చూపించాడు. ఈ చిన్న బిడ్డలా తన్నుతాను తగ్గించుకొనేవాడే పరలోకరాజ్యంలో గొప్పవాడౌతాడని బోధించాడు. దేవుని యెదుట రాణించేది మన పెద్దరికం కాదు, అణుకువ - మత్త 18, 1-5.

8. ఒకమారు పేతురు యోహాను సమరయ పట్టణానికి వచ్చారు. అంతకుమందే ఫిలిప్పు అక్కడ సువార్త ప్రకటిస్తున్నాడు. పేతురు యోహాను అక్కడి జనులమీద చేతులు చాచగా వాళ్లు పరిశుద్ధాత్మను పొందారు. ఆ పట్టణంలో మంత్ర విద్యలో మెప్పువడసిన సిమోననే అతడు ఉన్నాడు. అతడు పేతురు, యోహాను, ఫిలిప్పు శిష్యులకు పరిశుద్ధాత్మను ఈయడం చూచాడు. తానూ ఆ యాత్మను సంపాదిస్తే ఇతరులకు డబ్బుకు అమ్ముకోవచ్చుగదా అనుకొన్నాడు. కనుక అతడు అపోస్తలుల మందు కొంతడబ్బు పెట్టి నాకుకూడ ఈ యాత్మను సంపాదించే శక్తినీయండని కోరాడు. అప్పుడు పేత్రు నీవు డబ్బుపెట్టి దేవుని వరాన్ని కొనగలవా అని అతన్ని చీవాట్లుపెట్టి పంపాడు - అచ 8, 17-24.

# 9. కోపం

మనం సులభంగా కోపానికి వశులమైపోతాం. కోపం వచ్చినవుడు మంచిచెడ్డలుకూడ మరచిపోయి చేయరాని పనులు చేస్తాం. తర్వాత తెలివివస్తుంది. కాని చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొంటే యేమిలాభం?

1. దేవుడు తమ్ముని కానుకను అంగీకరించి తన కానుకను నిరాకరింపగా కయీనుకు విపరీతమైన కోపం వచ్చింది. అతడు హేబెలును పొలానికి తీసికొనివెళ్ళి అక్కడ అతన్ని చంపివేసాడు - ఆది 4, 3-8.

2. యాకోబు యేసావునకు రావలసిన తండ్రి దీవెన మోసముతో తాను కొట్టేసాడు. కనుక ఏసావు యాకోబుమీద పగబట్టాడు. తండ్రి యీసాకు మృతినిగూర్చి

శోకదినాలు గడచిన పిమ్మట యాకోబు తిత్తి తీయాలనుకొన్నాడు. కాని జిత్తులమారియైన యాకోబు ఈ సంగతి పసిగట్టి ముందుగనే మేనమామ లాబాను నొద్దకు పారిపోయాడు - ఆది 27, 41.

3. నీనివే యూదులుగాని అన్యజాతివాళ్ళు వసించే పట్టణం. ఆ పట్టణ పౌరులు దుర్మార్గులైపోయారు. ఐనా ప్రభువువాళ్లు నాశమైపోవాలని గాదు, పశ్చాత్తాపపడి మనసుమార్చుకోవాలని కోరుకొన్నాడు. కనుక యోనా అనే ప్రవక్తను పిలిచి నీవు వెళ్ళి నీనివేపట్టణవాసులకు బోధించు వాళ్ళకు పశ్చాత్తాపం కలుగుతుంది అన్నాడు. కాని అన్యజాతిజనులు ఆలా పశ్చాత్తాపపడి బ్రతికిపోవడం యోనా కిష్టంలేదు. అతడు దేవునిమీద కోపపడ్డాడు. నీనివే పట్టణానికి వెళ్ళడానికి మారుగా ఓడనెక్కి మరో దిశనున్న తర్సీసు పట్టణానికి వెళ్తూన్నాడు. కాని దారిలో ఓడ సరంగులు యోనాను సముద్రంలో పడద్రోసారు. ఓ పెద్దచేప అతన్ని మ్రింగి ఒడ్డున వెళ్ళగ్రక్కింది. ప్రభువు మళ్ళా యోనాను నీనివే పట్టణానికి వెళ్ళమన్నాడు. ఈమారు అతడు వెళ్ళాడు - యోనా 1-2.

4. యోనా ప్రవక్త మీరు పరివర్తనం చెందండని బోధించగానే నీనివే పట్టణ పౌరులు పశ్చాత్తాపపడ్డారు. దేవుడు వాళ్ళను నాశం చేయకుండ క్షమించి వదలివేసాడు. ఈలా అన్యాజాతివాళ్ళను క్షమించి వదలివేసినందులకై యోనా మళ్లా దేవునిమీద అలిగాడు. అతడు నీనివే పట్టణానికి వెలుపల ఓ పందిరి వేసికొని దానిక్రింద కూర్చున్నాడు. ఒకవేళ పట్టణం నాశమై పోతుందేమోనని అటువైపు పారజూస్తూన్నాడు. ఇంతలో ఒక తీగ ఆ పందిరిమీదికి ఎగబ్రాకి యోనాకు నీడ నిచ్చింది. ఆ తీగను చూచి అతడు చాల సంతోషించాడు. కాని మరునాడు దేవుడు ఆ తీగ యెండిపోయేలా చేసాడు. నీడ లేకపోయేప్పటికల్లా యోనా యెండదెబ్బ తగిలి సొమ్మసిల్లి పడిపోయాడు. ఆ తీగ యెండిపోయినందుకు ఎంతో చింతించాడు. అప్పుడు ప్రభువు యోనాకు గుణపాఠం నేర్పాడు. "నీవు ఒక్కతీగ చచ్చినందుకే ఇంతగా దుఃఖిస్తున్నావే! మరి నీనివే పట్టణంలో ఇందరు జనులూ ఇన్నిగొడ్లూ నాశమైపోతే నాకు బాధ కలగదా?" అన్నాడు. దేవుడు అందరిపట్ల దయ జూపేవాడని యోనా అప్పుడు గ్రహించాడు - యోనా 4.

5. నామాను సిరియాదేశపు సైన్యాధిపతి. అతడు కుష్ఠరోగియై చికిత్సకోసం యిస్రాయేలు దేశంలో వున్న యెలీషా ప్రవక్తవద్దకు వచ్చాడు. నామాను, యెలీషా తన లావుజూచి ఎదురువచ్చి తనను కలిసికొంటాడనుకొన్నాడు. కుష్ఠతో నిండిన తన దేహంమీద చేయిచాచి వ్యాధి నయంచేస్తాడనుకొన్నాడు. కాని యెలీషా తన మొగమైనా చూపించకుండానే అతన్ని యోర్దాను నదికివెళ్ళి ఏడుసార్లు స్నానం చేయమని కబురు పంపాడు. నామాను ఉగ్రుడైపోయాడు. ఈలాంటి నదులు మా దేశంలో చాలావున్నాయి.

నేను అక్కడికెళ్ళి స్నానం చేసికొంటానులే అని తిరిగి వెళ్ళిపోవడానికి సంసిద్ధుడయ్యాడు. కాని సేవకులు అతన్ని సముదాయించి యోర్దాను నదికి తీసికొని వెళ్ళారు. ఆ నదిలో మునగగానే అతనికి కుష్ఠ పోయింది. నామాను తన తప్పును గ్రహించి యెలీషాకు కానుకలు అర్పించబోయాడుగాని ప్రవక్త అవేమీ స్వీకరించలేదు - 2 రాజు 5, 9-14.

6. హేరోదు జ్ఞానులతో "మీరువెళ్ళి యూదులకు రాజుగా బుట్టిన క్రీస్తుశిశువును ఆరాధించండి. మళ్ళా తిరిగి వచ్చి నాకు ఆ బిడ్డ వర్తమానము తెలియజేసారంటే నేను గూడ వెళ్ళి అతన్ని ఆరాధించి వస్తాను" అన్నాడు. కాని వాళ్ళవర్తమానం విని శిశువును చంపివేయాలనే హేరోదు కోరిక. అయినా జ్ఞానులు తిరిగి అతని వద్దకు రానేలేదు. హేరోదుకు శివమెత్తింది. అతడు బేత్లెహేముకు చుట్టుపట్ల ఉన్న మగబిడ్డలందరునీ చంపించాడు. క్రీస్తు శిశువుగూడ వాళ్ళలో నాశమై ఉండాలి అనుకొని సంతృప్తి చెందాడు - మత్త 2, 1-8.

7. క్రీస్తు అద్భుతాలు చేస్తుండగా యూదనాయకులకు కన్ను కుట్టింది. ప్రభువు విశ్రాంతి దినాన అద్భుతాలు చేయకూడదని వాళ్ళు కట్టడచేసారు. కాని ప్రభువు విశ్రాంతి దినాన గూడ ఓ అవిటిచేతివాని చేయి నయంచేసాడు. ఆ యద్భుత క్రియనుచూచి యూదనాయకులు పండ్లు పటపట కొరికారు. వెఱ్ఱికోపంతో క్రీస్తుని ఏమిచేయాలా అని కుట్రలు పన్నడం ప్రారంభించారు - లూకా 6, 6-10.

8. 1) త్వరగా కోపపడేవాడు తొందరపడిపోతాడు. కాని వివేకవంతుడు ఓర్పుతో మెలుగుతాడు - సామె 14,17.

2) వీరునికంటె శాంతచిత్తుడు మేలు
నగరాన్ని జయించినవానికంటె
తన్నుతాను జయించుకొన్నవాడు అధికుడు - సామె 16,32.

# 10. అశ్రద్ధ

జీవితంలో ఒకోమారు సోమరితనానికి గురౌతాం. చేయవలసిన పని సరిగా చేయం. మన బాధ్యతలను మనం తృప్తికరంగా నిర్వహించం. ఈలాంటి అశ్రద్ధవలన ప్రభుశిక్షకు గురౌతాం.

1. యోసేపుతోపాటు ఫరోరాజు పానీయవాహకుడూ వంటవాడూ కూడ చెరలో ఉన్నారు. వాళ్ళిద్దరికీ రెండు కలలొచ్చాయి. పానీయవాహకునికి తాను మూడు ద్రాక్షపండ్ల గుత్తులు చిదిమి రసంతీసి చక్రవర్తికి అందించినట్లుగా కల వచ్చింది. యోసేపు అతనితో "ప్రభువు మూడురోజుల్లో నిన్ను చెరనుండి విడిపించి మళ్ళా నీ పదవిలో నిన్ను నిల్పుతాడు.

నీవు బయటపడినప్పుడు నన్ను గుర్తుపెట్టుకో" అని చెప్పాడు. వంటవాడికి తన తలమీద ఉన్న మూడు గంపల్లోని పిండివంటలు పక్షులు తినిపోతున్నట్లుగా కలవచ్చింది. యోసేపు అతనితో "మూడు రోజుల్లో ఫరోరాజు నిన్ను ఉరితీయిస్తాడని ఈ కలభావం" అని చెప్పాడు. అతడు చెప్పినట్లే ప్రభువు పానీయవాహకుని వెలుపలకి తీయించి వంటవాణ్ణి ఉరిదీయించాడు. కాని పానీయవాహకుడు యోసేపువలన మేలు పొందినా చెరనుండి బయటికి రాగానే అతన్ని పూర్తిగా మరచిపోయాడు - ఆది 40.

2. న్యాయనిర్ణయాన్ని గూర్చి క్రీస్తు చెప్పిన సామెత ఒకటుంది. తోడి జనాన్ని ఆదరిస్తే దేవుణ్ణే ఆదరించినట్లు. తోడి జనాన్ని చిన్నచూపు జూస్తే దేవుణ్ణే చిన్నచూపు జూచినట్లు. కొందరు తోడి జనానికి అన్నంబెట్టక, దాహమీయక బట్టలీయక, ఉపచారంచేయక ఆ శ్రద్ధచేసారు. ప్రభువు తన విషయంలోనే ఈలాంటి అశ్రద్ధ చూపినట్లుగా భావంచి, వాళ్ళకు నిత్య శిక్ష విధించాడు - మత్త 15, 45.

3. ఓ బాటసారి యెరూషలేమునుండి యెరికోకు వెళ్తూన్నాడు. దారిలో దొంగలు అతన్ని దోచుకొని గాయపరచి త్రోవ ప్రక్కన పడవేసిపోయారు. ఓ యాజకుడూ లేవీయుడూ ఆ త్రోవవెంట వస్తూ గాయపడివున్న బాటసారిని చూచారు. చూచికూడ ఏమీ పట్టించుకోకుండ ప్రక్కకు తొలగి వెళ్ళి పోయారు - లూకా 10, 30-32.

4. క్రీస్తుని అనుసరింపగోరినవాళ్ళల్లో ఓ అతనికి చంచలబుద్ధి పుట్టింది. అతడు నేను వెళ్ళి మానాన్న చనిపోయిందాకా వుండి అతన్ని పాతిపెట్టి మళ్ళా వస్తానన్నాడు. కాని ప్రభువు అతనితో "చనిపోయిన వాళ్ళసంగతి చనిపోయినవాళ్ళు చూచుకొంటారు. నీవువచ్చి నన్ను వెంబడించు" అన్నాడు మత్త 8,22.

5. ఓ యజమానుడు ముగ్గురు సేవకులకు డబ్బు ఇచ్చి దేశాంతరం పోయాడు. అతడు తిరిగి వచ్చేప్పటికల్లా తొలియిద్దరు సేవకులూ తాము తీసికొన్న డబ్బు వృద్ధి చేసారు. కాని మూడవ సేవకుడు తాను పుచ్చుకొన్న డబ్బు వృద్ధిచేయలేదు. యజమానుడు అతని అజాగ్రత్తకు మండిపడి నీవు పనికిమాలిన చెడ్డదాసుడవని చీవాట్లు పెట్టాడు. అతనికిచ్చిన డబ్బు కాస్త తీసికొన్నాడు - మత్త 25, 25-26.

6. ఒకరాజు తన కుమారుని పెండ్లి విందునకు అతిథులను ఆహ్వానించాడు. వాళ్ళల్లో ఒక్కడుమాత్రం విందు దుస్తులు తొడుగుకోకుండానేవచ్చి విందారగిస్తున్నాడు. రాజు అతిథులను చూడవచ్చి అతన్ని గుర్తుపట్టి కోపంతో బయటి గెంటించాడు. కనుక మన మెప్పుడూ ప్రభురాజ్యానికి సంసిద్ధులమై యుండాలి - మత్త 22, 11-13.

7. ఓ పెండ్లిలో పదిమంది కన్నెలు పెండ్లికుమారునికి స్వాగతమీయడానికై వేచివున్నారు. వాళ్లల్లో ఐదుగురు తెలివైనవాళ్ళు ఐదుగురు తెలివిలేనివాళ్ళు. తెలివైన

కన్నెలు తమ దివ్వెలకు నూనె సిద్ధంచేసికొన్నారు. తెలివిలేని కన్నెలకు నూనెలేదు. పెండ్లికుమారుడు ఆలస్యం చేసినందున వాళ్ళంతా కొంచెంసేపు నిద్రపోయారు. అర్ధరాత్రికి పెండ్లికుమారుడు రాగా, ఆ కన్నెలందరూ లేచారు. అప్పుడు తెలివైనవాళ్ళు నూనెపోసి దివ్వెలు వెలిగించుకొని అతనికి స్వాగతమిచ్చారు. వాళ్ళు అతనితోపాటు పెండ్లివిందు జరిగే శాలలోనికి వెళ్ళారు. తెలివిలేని కన్నెలు ఆ యపరాత్రిలో నూనెకోసమని అంగడికి పరుగెత్తారు. కాని వాళ్ళు తిరిగి వచ్చేటప్పటికల్లా పెండ్లివిందు జరిగేశాలను మూసివేయనే మూసివేసారు. - మత్త 25, 1-13.

8. ఓ అతని రాతిపునాదిమీద ఇల్లు కట్టాడు. వాన కురిసింది. వరదలు వచ్చాయి. వరదలు ఆ యింటిచుట్టూ పారినా దాని పునాది కదలలేదు. మరో అతను ఇసుకపునాది మీదనే యిల్లు కట్టాడు. వాన కురిసింది వరదలు వచ్చాయి. వరదలు ఆ యింటిచుట్టూ పారగా దాని పునాది కాస్త కొట్టుకొని పోయింది. క్రీస్తు బోధలు ఆలించి ఆ బోధల ప్రకారం జీవించేవాడు తొలివానిలాంటివాడు. కాని క్రీస్తు బోధలు ఆలించి వాటి ప్రకారం జీవించనివాడు రెండవవాని లాంటివాడు- మత్త 7, 24-27.

9. నీకు వెంటనే యిచ్చే శక్తివుంటే యిచ్చేయి. మళ్లా రేపురా, అప్పుడిస్తానులే అనవద్దు - సామె 3, 28.

# 11. పగ

అల్పమానవులు ద్వేషానికి లొంగిపోతూంటారు. పగ వలన తోడి నరులకు కీడు చేయబోతారు. కాని దీనివలన మన అల్పత్వమే బయటపడుతుంది.

1. పూర్వ ఉదాహరణల్లో కయీను హెబెలుమీదా, యోసేపు సోదరులు యోసేపుమీదా, ఏసావు యాకోబుమీదా, అబ్షాలోము ఆమ్మోనుమీదా, సౌలు దావీదుమీదా, హామాను మొర్దెకయిమీదా, హెరోదియా స్నాపక యోహాను మీదా పగబూనారని చెప్పాం.

షిమీ దావీదుమీద పగబూనాడు. దావీదు అబ్షాలోమునకు వెరచి పారిపోతుండగా ఇతడు మార్గంలో దావీదును కలిసికొని అతన్ని శపించాడు. అతనిమీద దుమ్మెత్తిపోసాడు రాళ్ళు రువ్వాడు. ఐనా దావీదు సహించి ఊరుకొన్నాడు. తరువాత దావీదు చనిపోతూ తన కుమారుడు సొలోమోనును ఇతనిమీద పగతీర్చుకొమ్మని చెప్పాడు - 2సమూ 16, 5-10.

2. ఫిలిస్టీయులు సంసోనును బంధించి అతని కండ్లు తీయించారు. అతన్ని నానాహింసలూ పెట్టారు. ఓమారు తమ దేవుడైన దాగోను దేవాలయంలో ఉత్సవం చేసికొంటూ సంసోనును రప్పించి అతన్ని ఎగతాళి చేసారు. ఆ యవమానాన్ని భరించలేక సంసోను దేవాలయాన్ని మోస్తున్న రెండు స్తంభాలనూ రెండుచేతులతో బలంగా నెట్టాడు.

డాగోను దేవాలయం కూలిపడి ఫిలిస్టీయులంతా చచ్చారు. వాళ్ళతోపాటు సంసోనుకూడ చనిపోయాడు. ఆ విధంగా అతడు బ్రతికివున్నప్పటి కంటె చనిపోయినపుడే ఎక్కువమంది ఫిలిస్టీయులను చంపి వాళ్ళమీద పగతీర్చుకొన్నాడు - న్యాయాధి 16,28-30.

3. క్రీస్తు బోధలూ అద్భుతాలూ చూడగా యూదనాయకులకు కన్ను కుట్టింది. వాళ్ళు అతన్ని ద్వేషించారు. ఏలాగైనా అతన్ని చంపించాలని కుట్రలు పన్నారు - యోహా 15, 22-25.

4. 1) మీ పొరుగువాళ్ళను ప్రేమించి మీ శత్రువులను ద్వేషించమని పూర్వవేదం బోధిస్తుంది. కాని నేను చెప్పడమేమిటంటే, మీ శత్రువులనుగూడ ప్రేమించండి. అప్పుడు మీరు పరలోకంలోని తండ్రికి కుమారులౌతారు - మత్త 5, 43.

2) ఎవడైన ఓ వైపున నేను దేవుణ్ణి ప్రేమిస్తున్నానని చెప్పుకొంటూ మరోవైపున తోడినరుణ్ణి ద్వేషిస్తూన్నట్లయితే వాడు అబద్ధాలకోరు ఔతాడు. కంటికి కనుపించే తోడినరుణ్ణి ప్రేమించలేనివాడు కంటికి కనుపించని దేవుణ్ణి ఏలా ప్రేమిస్తాడు? - 1 యోహా 4,20.

3) నేను వెలుగులో ఉన్నానని చెప్పుకొంటూ తోడి నరులను ద్వేషించేవాడు ఇంకా చీకటిలోనే ఉన్నాడని చెప్పాలి - 1 యోహా 2,9.

# 12. అవిధేయత

పొగరువల్ల పెద్దలమాట జవదాటుతూంటాం. ఆలాగే దేవునిపట్లగూడ అవిధేయత చూపుతూంటాం. ఈ యవిధేయతకు దేవుడు నరుణ్ణి శిక్షిస్తూంటాడు.

1. ప్రభువు తోటనడుమనున్న చెట్టుపండు తాకవద్దని ఆది దంపతులకు ఖండితంగా ఆజ్ఞ యిచ్చాడు. ఆలా తాకితే వాళ్ళకు చావు మూడుతుందనికూడ చెప్పాడు. అయినా వాళ్లు పిశాచంమాట నమ్మి ప్రభువు ఆజ్ఞమీరారు, చావు తెచ్చిపెట్టుకొన్నారు - ఆది 3, 2-3.

2. అబీహు నాదాబు అహరోను కుమారులు. వీళ్ళు ప్రభువు ఆజ్ఞాపింపకున్నా ధూపకలశాలు తీసికొని యావే యెదుట సాంబ్రాణిపొగ వేసారు. ప్రభువు వాళ్ళను నిప్పు మంటలతో కాల్చివేసాడు - లేవీ 10, 1-2.

3. ప్రభువు తన్ను దప్ప అన్యదైవతాలను ఆరాధించగూడదని యిస్రాయేలు ప్రజకు ఆజ్ఞయిచ్చాడు. వాళ్ళు చుట్టుపట్లవున్న కనానీయులు ఎద్దును ఆరాధించడం చూచారు. మనమూ ఆ యెద్దును ఆరాధిస్తే ఎంతో బాగుంటుందని ఉవ్విళ్ళూరిపోయారు.

ఓమారు మోషే సీనాయి కొండ మీదికిపోయి నలువది నాళ్ళదాకా అక్కడే వుండిపోయాడు. అతడు కొంచెం ఆలస్యం చేసిందే తడవుగా, యిస్రాయేలీయులు అహరోను నాయకత్వం క్రింద బంగారు కోడెదూడను చేసికొని దాన్ని ఆరాధించడం మొదలెట్టారు - నిర్గ 32, 7-8.

4. బిలాము ప్రభువు వద్దన్నా వినక యిస్రాయేలు శత్రువూ మోవాబు రాజూ ఐన బాలాకును దీవించడానికి గాడిద నెక్కి పయనం కట్టాడు. యిస్రాయేలును శపించడానికే బాలాకు బిలామును పిలిపించాడు. త్రోవలో ప్రభువుదూత బిలాము గాడిదకు అడ్డుపడి దాన్ని ఆపాడు. బిలాము మూడుసార్లు గాడిదను చావమోదాడు. అప్పుడు గాడిద దైవశక్తితో మాటలాడింది. తన్ను కొట్టవద్దని మొరపెట్టుకుంది. దేవదూతగూడ బిలాముకు ప్రత్యక్షమై అవిధేయతకుగాను అతన్ని మందలించాడు. - సంఖ్యా 22, 31-35.

5. మోషే అహరోనులు ఫరోవద్దకువచ్చి యిస్రాయేలు ప్రజను ఐగుప్తునుండి పంపవలసిందిగా యావే ఆజ్ఞాపిస్తున్నాడని చెప్పారు. ఫరో అహంభావంతో "ఎవడా యావే? అతడు చెప్పిన మాటలు విని నేనెందుకు యిస్రాయేలీయులను పంపాలి?" అన్నాడు. ప్రభువు ఫరోను సర్వనాశంచేసి తన ప్రజను ఐగుప్తునుండి తోడ్కొని పోయాడు - నిర్గ5,2.

6. యిస్రాయేలు ప్రజలను శత్రువులు బాధింపగా వాళ్లు ప్రభువుకి మొరపెట్టేవాళ్లు. ప్రభువు వాళ్ళమీద కరుణబూని ఓ న్యాయాధిపతిని నియమించేవాడు. ఈ న్యాయాధిపతి శత్రువుల నుండి యిస్రాయేలును రక్షించేవాడు. కాని అతడు చనిపోగానే వాళ్ళు మూర్ఖులై అన్యదైవతాలను ఆరాధించేవాళ్ళు. అపుడు ప్రభువు వాళ్ళను శిక్షించడానికై శత్రువుల పాలుచేసేవాడు. వాళ్ళు శత్రువుల బాధ భరించలేక మళ్లా ప్రభువుకు మొరపెట్టుకొనేవాళ్ళు. నరుల బలహీనత ఈలా వుంటుంది - న్యాయాధి 2, 18-19.

7. సౌలు గిల్గాలువద్ద సమూవేలు కొరకు వేచివున్నాడు. సమూవేలు ప్రవక్త నేను వారందినాల్లో వస్తాను. నేను వచ్చిందాకా బలి సమర్పించవద్దన్నాడు. కాని ప్రవక్త తాను పెట్టిన గడువులో రాలేదు. శత్రువులైన ఫిలిస్టీయులువచ్చి మీద పడేలాగూ వున్నారు. సౌలు ఆతురత పట్టలేక తానే బలి సమర్పించాడు. ఆ బలి ముగియడంతోనే సమూవేలు వచ్చి మాట మీరినందుకు సౌలును మందలించాడు. నీవు దేవుని ఆజ్ఞ మీరావు గనుక దేవుడు నిన్ను రాచరికంనుండి త్రోసివేసాడని చెప్పాడు - 1సమూ 13, 13-14.

8. అహాబు సిరియారాజైన బెన్హదదును జయించాడు. ప్రభువు ఈ బెన్హదదును శాపంపాలుచేసి సంహరించమని చెప్పాడు. కాని బెన్హదదు కపటంతో అహాబును శరణువేడగానే అహాబు గుండె కరిగి అతన్ని ప్రాణాలతో వదలివేసాడు. అపుడు ప్రభువు అహాబునొద్దకు ఓ ప్రవక్తను పంపి బెన్హదదు ప్రాణాలకు మారుగా నీ ప్రాణాలు పోతాయని చెప్పించాడు 1 రాజు 20, 42-43.

9. సోలోమోను రాజు మహాజ్ఞాని. కాని అతడు స్త్రీలోలుడై పోయాడు. అతడు చాలామంది అన్యజాతి స్త్రీలను పెండ్లియాడాడు. వాళ్ళంతా అతని హృదయాన్ని అన్యదేవతలవైపు త్రిప్పివేసారు. ఈ విధంగా అతడు అన్యజాతి స్త్రీలను వివాహ మాడకూడదన్న యావే యాజ్ఞ మీరి కడకు ఆ ప్రభుని ఆరాధించడం కూడ మానుకొన్నాడు- 1 రాజు 11, 2-3.

10. కోడి తన పిల్లలను రెక్కలకిందికి చేర్చుకొని కాపాడుతుంది. అలాగే క్రీస్తుకూడ యెరూషలేము పౌరులను కాపాడేవాడే కాని వాళ్ళు అతనిమాట వినలేదు - మత్త 23, 37-38.

# 13. గొణగుడు

మనం సహనం కోల్పోయి పై యధికారులమీద తప్పుమోపుతాం. వాళ్ళమీద గొణగుతాం. ఈ గొణగుడు మన అసమ్మతిని తెలియజేస్తుంది. కనుక అది భగవంతునికి ప్రియపడదు. అతడు ఓకోమారు మన అవిధేయతను శిక్షిస్తుంటాడు గూడ.

1. యావే పంపించిన అరిష్టాలకు భయపడి ఫరో యిస్రాయేలును పంపివేసాడు. కాని వాళ్లు రెల్లుసముద్రం వద్దకు పోగానే అతడు మనసుమార్చుకొని మళ్ళా వాళ్ళను పట్టుకొని రావాలని సైన్యంతో వచ్చాడు. సైన్యాన్ని చూచి యిస్రాయేలు ప్రజలు భయపడిపోయారు. మోషేమీద గొణిగారు. ఐగుప్తుదేశంలో పూడ్చి పెట్టడానికి తావుదొరక్క మమ్ము ఇక్కడికి తీసికొని వచ్చావా అని అతన్ని నిందించారు. తరువాత ప్రభువు యిస్రాయేలును సముద్రం దాటించాడు. ఫరోచక్రవర్తినీ అతని సైన్యాన్నీ సముద్రంలో ముంచివేసాడు - నిర్గ 14, 12.

2. యిస్రాయేలు ప్రజలు మోషేతో యెడారిలో ప్రయాణం చేస్తూ మెరిబా అనే తావుకి వచ్చారు. అక్కడ వాళ్ళకు త్రాగడానికి నీళ్ళు దొరకలేదు. వాళ్ళు వెంటనే మోషేమీద తిరగబడ్డారు. ఐగుప్తులో వుండగా కడుపునిండా అన్నం దొరికింది. ఇక్కడ కూడూ నీళ్ళు కూడ కరువయ్యాయి అని గొణగారు. ప్రభువు ఆజ్ఞపై మోషే బెత్తంతో కొండబండను చరవగా నీటిపాయ పుట్టింది. జనం ఆ నీళ్ళు త్రాగి సంతృప్తి చెందారు - సంఖ్యా 20, 5-6.

3. యిస్రాయేలీయులు ఎడారిలో హోరు కొండ ప్రక్కగా నడుస్తున్నారు. వాళ్ళు మార్గాయాసంవల్ల సొమ్మసిల్లిపోయి మోషేమీద గొణగడం ప్రారంభించారు. "ఈ యెడారిలో లభించే చవీసారమూ లేని అన్నం యెవరికి కావాలి? అసలు నీవు ఐగుప్తునుండి మమ్మెందుకు తీసికొని వచ్చావు?" అని దబాయించారు. వాళ్ళకు బుద్ధి చెప్పడానికై ప్రభువు నిప్పుపాములను పుట్టించాడు. అవి కరవగా చాలమంది చనిపోయారు. అపుడు ప్రజలు

బుద్ధితెచ్చుకొని మోషేకు మనవిచేసారు. అతడు ఇత్తడి పామును చేయించి గడెమీద వ్రేలాడ దీయించాడు. దానివైపు చూచినవాళ్ళంతా విషం విరిగి బ్రతికిపోయారు - సంఖ్యా 21, 5-9.

4. మళ్ళా యిస్రాయేలీయులు ప్రయాణం చేస్తూ మారా అనే తావుకి వచ్చారు. అక్కడి నీళ్ళు కటిక ఉప్పులు. ఆ నీళ్ళు త్రాగలేక జనం మోషేమీద తిరగబడ్డారు. వెంటనే గొణగుడు ప్రారంభించారు. అపుడు మోషే ప్రభువు ఆనతిపై ఒక చెట్టు కొయ్యను ఆ నీళ్ళలో పడవేయగా అవి తియ్యని నీళ్ళయ్యాయి - నిర్గ 15, 25.

5. కోరా, దాతాను, అబీరాము మోషేమీద తిరుగబడ్డారు. దాని ఫలితంగా నేల నోరువిప్పి వాళ్ళను మ్రింగివేసింది. అదిచూచి యిస్రాయేలు సమాజం మోషేమీద గొణగారు. నీవు ప్రభు ప్రజను చంపివేసావుగదా అని దూషించారు. అపుడు ప్రభువు ప్రత్యక్షమై ఆ ప్రజలను నాశంచేయబోయాడు. కాని మోషే ప్రభుని వేడుకొని ఆయుపద్రవాన్ని వారించాడు - సంఖ్యా 16, 41.

6. యెరూషలేములో తొలినాటి యూదక్రైస్తవులు ఉమ్మడి జీవితం జీవిస్తున్నారు. వాళ్ళలో పాలస్తీనా యూదులు కొందరు. అన్యదేశాల నుండి వచ్చిన యూదులు కొందరు. అన్నాలు వడ్డించేకాడ అన్యదేశాల నుండి వచ్చిన యూదుల విధవలకు అన్నం అట్టే సరిపోలేదు. కనుక వాళ్ళు వెంటనే పేత్రుమీద గొణగడం ప్రారంభించారు. ఆ గొడవ విని పేత్రు అన్నపానీయాలను పరామర్శించడానికై ఏడ్గురు పరిచారకులను నియమించాడు - అచ 6, 1-6.

# 14. తగాదాలు

కొందరు ఆట ఆడినంత సులభంగా తగాదా ఆడుతూంటారు. కాని ఇది మూర్ఖుల లక్షణం. బుద్ధిమంతుడైనవాడు తొందరపడి తగాదాకు దిగడు. దిగినా మళ్ళా సర్దుకొని పోతూంటాడు.

1. అబ్రాహాముభార్య సార గొడ్రాలుగావుంది. ఆమె ఆనాటి ఓ ఆచారం ప్రకారం, తన దాసీ ఐగప్తు బానిసా ఐన హాగారును అబ్రాహామునకు భార్యగానిచ్చి ఆమెకు కలిగిన సంతానాన్ని తన సంతానం చేసికోవాలనుకొంది. కాని హాగారు అబ్రాహామువలన గర్భవతియైన నాటినుండి కన్నూ మిన్నూ గానక యజమానురాలైన సారాను చిన్నచూపు చూడ్డం మొదలెట్టింది. సారా ఇది సహింపక అబ్రాహాముకు ఫిర్యాదు చేసింది. ఆ బానిసతొత్తును నేలబెట్టి కాలరాచింది. అది యజమానురాలు పెట్టేబాధలు పడలేక యిల్లువిడిచి పారిపోయింది - ఆది 16, 1-6.

2. అబ్రాహాము తమ్ముని కొడుకయిన లోతుకూడ అతని వెంట వచ్చాడు. వాళ్ళిద్దరూ కనానుమండలంలో మూడు పూవులూ ఆరు కాయలుగా వర్ధిల్లారు. ఇద్దరికీ గొర్రెల మందలూ గొడ్లమందలూ కావలసినన్ని వున్నాయి. క్రమేణ అబ్రాహాము జీతగాళ్ళకూ లోతు జీతగాళ్ళకూ తగాదాలు వచ్చాయి. అది చూచి అబ్రాహాము లోతుతో "మనం ఆయినవాళ్ళం. మనలో మనకు ఈలాంటి జగడాలా? ఇక మనం వేరుపడ్డం మంచిది. మనముందు కావలసినంత దేశముంది. నీవు ఎడమవైపుకుబోతే నేను కుడివైపుకు వెళ్తాను. లేదా నీవు కుడివైపు జరిగితే నేనే ఎడమవైపుకు జరుగుతాను" అన్నాడు. అపుడు లోతు తూర్పువైపునకు జరిగాడు. కనుక అబ్రాహాము పడమటి వైపునకు వెళ్ళిపోయాడు. ఆవిధంగా వాళ్ళ తగాదా సమసిపోయింది - ఆది 13, 9-11.

3. మోషే యితియోపియను వధువును పెండ్లిచేసికొన్నాడు. మోషే సోదరియైనమిర్యాముకూ ఈమెకూ పడలేదు. కనుక మిర్యాము అన్నయైన అహరోనునిగూడ చేరదీసికొని మోషేమీద కలహానికి దిగింది - సంఖ్యా 12, 1-2.

4. పౌలు బర్నబా స్నేహితులు. వాళ్ళిద్దరూ రెండవ ప్రేషిత ప్రయాణానికి బయలుదేరారు. బర్నబా తన బంధువూ సువిశేషకారుడూ ఐన మార్కునుగూడ వెంటబెట్టుకుని వెళ్దామన్నాడు. కాని దానికి పౌలు సమ్మతించలేదు. ఈ మార్కు మొదటి ప్రేషిత ప్రయాణంలో పౌలుతో పయనమై పోయాడు. కాని పంఫీలియా అనే పట్టణం వరకూ వెళ్ళి అమ్మమీద దిగులు పుట్టగా అక్కడినుండి వెనక్కు వచ్చేసాడు. అలా చేయడం పౌలుకు నచ్చలేదు. కనుక అతడు మళ్ళా రెండవ ప్రేషిత ప్రయాణంలో మార్కును తీసికొని వెళ్ళడానికి అంగీకరించలేదు. ఈ విషయమై పౌలు బర్నబాలు గట్టిగా వాదించుకొని ఒకరి నుండి ఒకరు విడిపోయారు. తర్వాత పౌలు మార్కును క్షమించాడు - అచ 15, 36-40.

5. పౌలు క్రీస్తుతో మోషే ధర్మశాస్త్రం అంతరించిందని ఇపుడు మనలను రక్షించేది ఉత్థాన క్రీస్తేగాని ధర్మశాస్త్రం కాదని బోధించాడు. తొలినాటి యూదక్రైస్తవ సమాజానికి ఈవాదం నచ్చలేదు. వాళ్ళనాయకుడు యాకోబు. ఇతడు క్రీస్తు బంధువు. యూదసమాజంలో పలుకబడి కలవాడు. యెరూషలేములోని యూద క్రైస్తవులంతా ఇతన్ని సమర్థించారు. కాని అంతియోకయలోని గ్రీకు క్రైస్తవులంతా పౌలును సమర్థించారు. పేత్రు లోలోపల పౌలు వాదాన్ని నమ్మినా బయటికి మాత్రం యాకోబుతో చేరిపోతూండేవాడు. అతడు గ్రీకు క్రైస్తవులతో కలియడానికి జంకుతుండేవాడు. ఓమారు పేత్రు అంతియోకయకు రాగా పౌలు అతన్ని ఎదిరించి మాట్లాడాడు. నీనమ్మిక యేమిటో చెప్పమని నిలదీసి అడిగాడు. తర్వాత ఈతగాదా లన్నీ యెరూషలేము సమాజంలో పరిష్కారమయ్యాయి. అక్కడ పౌలు వాదమే నెగ్గింది - గల 2, 11-14

6. కొరింతులో పౌలే క్రైస్తవసమాజాన్ని స్థాపించాడు. కాని కొరింతు క్రైస్తవుల్లో చీలికలేర్పడ్డాయి. మనలను రక్షించేది మోషే ధర్మశాస్త్రమేనని వాదించే యూదులు కొందరు కొరింతుకువచ్చి పౌలుమీద లేనిపోని అభాండాలు మోపారు. ఆ రోజుల్లో అపొల్లో అనే ఉపన్యాసకుడుగూడ తన బోధలతో ప్రజలను ఉర్రూతలూగించేవాడు. ఈలాంటి పరిస్థితుల్లో కొరింతు క్రైస్తవులు కొందరు మేము అపొల్లో పక్షమన్నారు. కొందరు పేత్రు పక్షమన్నారు. కొందరు పౌలుపక్షమన్నారు. ఇంకా కొందరు క్రీస్తు పక్షమన్నారు. ఈగందరగోళమంతా చూచి పౌలు చాల బాధపడ్డారు. ఒక్క క్రీస్తు ఇన్ని ముక్కలుగా విభజింపబడ్డాడా అని దుఃఖించాడు - 1కొరి 1, 11-13.

7. తొలినాటి క్రైస్తవులంతా యూదులే. వీళ్ళు యెరూషలేములో ఉమ్మడి జీవితం జీవిస్తూండేవాళ్లు. వీళ్ళల్లో మళ్ళా పాలస్తీనా యూదులనీ, అన్యదేశాల యూదులనీ రెండు తెగలుండేవి. ఈ రెండుతెగలకు పడేదికాదు. అన్యదేశయూదుల తెగవాళ్ళు పాలస్తీనా యూదుల తెగమీద ఫిర్యాదు చేసారు. మా విధవలకు అన్న పానీయాలు సరిగా అందడంలేదు. అంతా మీరే అనుభవిస్తున్నారు అని నేరంతెచ్చారు. పేత్రు సమాజపు భోజన సదుపాయాలు చూడ్డానికి ఏడ్గురు పరిచారకులను నియమించాడు. అపోస్తలులు మాత్రం ప్రార్థనలోను వాక్యబోధలోను కాలం గడిపారు - అకా 6, 1-6.

8. 1) మూర్ఖులు కయ్యానికి కాలు దువ్వుతూంటారు. కాని తగాదాలు మానుకొనేవాళ్ళు ఘనులు - సామె 20, 3.
   2) గయ్యాళిగంపతో ఇంట్లో కాపురముండే దానికంటె ఒంటరిగా యింటిమీద ఓమూల పడివుండడం మేలు - సామె 21, 9.

# 15. గర్వం

తొలిపాపంవలన భ్రష్టులమైపోయిన మనకందరికీ గర్వం సులభంగా పుట్టుకవస్తుంది. కాని దేవునికి గర్వమంటే యెంతో రోత. అది పిశాచగుణం.

1. ఫరోరాజు కఠినహృదయుడై యిస్రాయేలీయులను బాధిస్తున్నాడు. ప్రభువు పంపగావచ్చి మోషే యిస్రాయేలును పంపివేయవలసిందిగా యావే ఆజ్ఞాపిస్తున్నాడని చెప్పాడు. ఆ మాటలకు ఫరో మండిపడి "ఎవడా యావే? అతని మాటలు విని నేనెందుకు ఈ బానిసలను వదలుకోవాలి?" అన్నాడు. ప్రభువు ఎన్నిసార్లు చెప్పినా ఎన్ని అద్భుత క్రియలు చేసినా ఫరో గుండె రాయి జేసికొన్నాడేగాని ప్రజలను పోనీలేదు. కనుక ప్రభువు ఫరోకు తగినశాస్తి చేసాడు. అతన్నీ అతని రథాలనూ నడిసముద్రంలో ముంచివేసాడు.

2. హిజ్కియా గొప్పరాజు. అతడు ఒకమారు జబ్బుపడి వుండగా బాబిలోనురాజు సానుభూతి తెల్పుతూ తన దూతల నంపాడు. ఆ దూతలనుజూచి హిజ్కియా ఉబ్బిపోయి

తన సిరిసంపదలనూ కోశాగారాన్ని వాళ్ళకు చూపించాడు. ప్రభువు అతని మీద కోపించి ప్రవక్తను బంపి బాబిలోను ప్రజలువచ్చి నీవు చూపించిన ఈ సొమ్మంతా అపహరించుకొని పోతారు అని చెప్పించాడు - 2 రాజు 20, 12 - 17.

3. యూదులు బాబిలోను ప్రవాసంలో వున్నపుడు మొర్దేకయి వాళ్ళ నాయకుడు. హామాను రాజు కొలువుకాడు. ఓమారు హామాను కొలువుకు వస్తుండగా మొర్దేకయి రాజమందిరంముందు కూర్చుండియుండి పైకిలేవనూలేదు, అతనికి నమస్కారం చేయనూలేదు. హామాను మహా గర్విష్ఠి. అతడు మొర్దేకయిని ఉరిదీయించడానికై ఏబదిమూరల ఉరికంబం తయారుచేయించాడు. కాని ప్రభువు మొర్దేకయిని కాపాడ్డం వల్ల చివరకు హామానే ఆ వురికంబంమీద వ్రేలాడవలసి వచ్చింది - ఎస్తే 3,5.

4. ఉజ్జీయా తెలివైన రాజు. ఈ రాజు కొన్ని మారణ యంత్రాలను కనిపెట్టగా ప్రజలు ఇతన్ని పొగడారు. దానితో పొంగిపోయి అతడు దేవాలయంలో సాంబ్రాణిపొగ వేయబోయాడు. కాని ఎనభై మంది యాజకులు అడ్డువచ్చి ఇది యాజకులు చేయవలసిన పనిగాని రాజు చేయవలసిన కార్యం గాదని అతన్ని వారించారు. ఐనా ఉజ్జీయా వారిమాట విన్పించుకోకుండా అధికార గర్వంతో సాంబ్రాణిపొగ వేయడానికి పీఠందగ్గరికి వచ్చాడు. వెంటనే అతని నొసటిమీద కుష్ఠ పుట్టుక వచ్చింది. యాజకులు అతన్ని దేవాలయం నుండి బయటికి గెంటివేసారు. ఆ మీదట ఉజ్జీయా ఆమరణాంతం ఒంటరిగా వసించవలసివచ్చింది - 2 దినవృ 26, 16-21.

5. యాకోబుని చంపించి పేత్రుని చెరలో వేయించిన మూడవ హెరోదు ఓమారు కొలువుదీర్చి ఉపన్యాసమిచ్చాడు. అతని బంటులంతా నీవు ఓ దేవుడిలా మాట్లాడావని పొగడారు. హెరోదు అ పొగడ్తకు ఉబ్బిపోయి తాను నిజంగా దేవుణ్ణేనని భావించాడు. వెంటనే ఒక దేవదూత ఆ రాజును ఘోరంగా శిక్షింపగా అతడు పురుగులుపడి చచ్చాడు - అచ 12 -22-23.

6. ఓ పరిసయుడూ సుంకరీ ప్రార్థనచేయడానికి దేవాలయానికి వెళ్ళారు. సుంకరి "ప్రభో? నేను పాపిని నన్ను క్షమించు" అని ప్రార్థించాడు. కాని పరిసయుడు ప్రభో! నేను ఈ సుంకరిలాంటి వాణ్ణికాదు. నీతిమంతుణ్ణి. నీకు తెలియందేముంది?" అని ప్రార్థించాడు. దేవుడు ఆ సుంకరి మనవిని ఆలించి పరిసయుని మనవిని త్రోసిపుచ్చాడు - లూకా 18, 10-14.

7. 1) ప్రభువు ఏవగించుకొనేవి ఏడున్నాయి. అవి అహంకారమూ, అబద్ధాలాడ్డమూ, హత్యచేయడమూ, కీడెంచడమూ, చెడుపనికి పూనుకోవడమూ, కూటసాక్ష్యమూ, తగాదాలు పెట్టడమూను - సామె 6, 16-19.

2) వినాశానికి ముందుగా అహంకారమూ, పతనానికి ముందుగా ఆహంభావమూ పుట్టుకవస్తాయి - సామె 16, 18.

# 16. శోధనలు

నరులందరికీ శోధనలు వస్తూంటాయి. కాని శోధనలతో పాటు దేవుడు వాటిని జయించే శక్తినిగూడ ప్రసాదిస్తూంటాడు. కొందరు ఈ శక్తిని వాడుకొని శోధనలను జయిస్తూంటారు. ఆలా చేయనివాళ్లు వాటికి లొంగిపోతూంటారు.

1. పిశాచం ఆదామేవలను శోధించింది. వాళ్ళు ఆ శోధనలకు లొంగిపోయారు. బత్షెబా సౌందర్యం దావీదు శోధనకు కారణమైంది. అతడు లొంగిపోయాడు. సూసన్న సౌందర్యం ఇద్దరు వృద్ధులకు శోధనకారణమైంది. వాళ్ళూ లొంగిపోయారు. పోతీఫరుభార్య యోసేపును శోధించింది. కాని అతడు లొంగిపోలేదు. ఈ యంశాలన్నీ పూర్వమే చూచాం.

అహాబు దుష్టరాజు. అతని భార్య యెసబెలు పరమ దుర్మార్గురాలు. ఆమె ప్రబోధానికి లొంగిపోవడంవల్ల అహాబు చేయని దుష్కార్యమంటూ లేదు. భార్య అతనికి శోధన కారణమైంది - 1 రాజు 21, 25-26.

2. ఓదినం దేవుడు పిశాచంతో "నా భక్తుడు యోబుని చూచావా? అతడు చాల చిత్తశుద్ధికలవాడు" అన్నాడు. కాని దయ్యం యోబుకు కష్టాలువస్తే అతడు నిన్ను దూషించి తీరుతాడు అని దేవునిముందు సవాలు చేసింది. దేవుడు దయ్యంతో "యోబుని నీ యిష్టంవచ్చినట్లు శోధించుకో. అతని ప్రాణాలుమాత్రం తీయకు" అన్నాడు. కనుక పిశాచం యోబుని పరీక్షించడం మొదలెట్టింది. అతనికి మహా వ్యాధులు కలిగించింది. ఆస్తి నష్టం కలిగించింది. ఐనా యోబు "దేవుడు సిరిసంపదలిచ్చి నపుడు హాయిగా అనుభవించాను. ఇపుడు అతడు వాటిని తీసికొని వెళ్లాడు. కనుక ఆ ప్రభుని భూషిస్తానుగాని దూషించను" అన్నాడు. ఈ రీతిగా యోబు పిశాచ శోధనలను ఎదిరించి నిల్చాడు - యోబు 2, 2-6.

3. ప్రభువు అబ్రాహాముని పరీక్షించడానికై అతని కుమారుణ్ణి బలి ఈయమని అడిగాడు. ఆ ముసలి ప్రాయంలో ఈసాకుని కోల్పోతే అబ్రాహాముకి మరోకొడుకు పుట్టడు. ఐనా అతడు దేవుణ్ణి నమ్మి తన కుమారుణ్ణి బలి ఈయడానికి సంసిద్ధుడయ్యాడు. దేవుడు ఏదోవిధంగా తన కుమారుణ్ణి బ్రతికించక పోతాడా అని అతని నమ్మకం. అతడు నమ్మినట్లే ప్రభువు ఓ పొట్టేలును బలిగా స్వీకరించి ఈసాకును వదిలివేసాడు - ఆది 22.

4. పిశాచం క్రీస్తుని తండ్రి చిత్తాన్ని మీరమని యెడారిలో ముమ్మారు శోధించింది. ఐనా అతడు పిశాచం శోధనకు లొంగలేదు. అతడు ఏవిధంగానైన సిలువ మరణాన్ని నిరాకరించేలా చేయాలని పిశాచం కోరిక. కాని దయ్యం ప్రభుని ఇక మీదట నేరుగా శోధింపక పేత్రుద్వారా శోధింపబూనుకొంది. ఈ పేత్రు పిశాచ ప్రేరితుడై "ప్రభూ! ఈ

సిలువమరణం నీకు వద్దనేవద్దు" అన్నాడు. ప్రభువు పేత్రుని పిశాచం పురి కొల్పిందని గుర్తించి "సైతానూ! నా వద్దనుండి తొలగిపో!" అని గద్దించాడు - మత్త 16, 21-23.

5. దయ్యం పేత్రుద్వారా క్రీస్తుని శోధించాలనుకొంది గాని ఆ ప్రయత్నంలో నెగ్గలేదు. ఇక యూదాద్వారా క్రీస్తుని కూల ద్రోయాననుకొంది. కనుక యూదాను శోధించడం మొదలెట్టింది. క్రీస్తుని శత్రువుల కైవసం చేయమని యూదా హృదయంలో దురాలోచన పుట్టించింది - యోహా 13,2. ఈ యూదా కడపటి భోజన సమయంలో ప్రభువు ఆశీర్వదించి యిచ్చిన రొట్టెముక్కను పుచ్చుకోగానే దయ్యం అతనిలో ప్రవేశించింది. దానితో అతడు క్రీస్తును పట్టీయడానికి వెళ్ళిపోయాడు - యోహా 13, 26-30.

6. అననీయ సఫీరా అనే భార్యాభర్తలు యెరూషలేములోని ఉమ్మడి సమాజంలో చేరాలనుకొన్నారు. కనుక వాళ్ళు సొంత ఆస్తిని అమ్ముకొంటూండగా పిశాచం వాళ్ళను ప్రేరేపించి, ఆ వచ్చిన డబ్బులో కొంత పైకం మిగుల్చుకొనేలా చేసింది. పిశాచ ప్రేరితులై వాళ్లు పేత్రు ఎదుట బొంకి ప్రాణహాని తెచ్చుకొన్నారు - అచ 5, 3.

7. క్రైస్తవులను హింసిస్తున్న సౌలు క్రీస్తు శిష్యుడూ ప్రేషితుడూ అయ్యాడు. ప్రభువు అతనికి చాలసార్లు దర్శనమిచ్చాడుగూడ. ఈ దర్శనాలవల్ల ఒకవేళ పౌలుకి తలతిరుగుతుందేమోనని ప్రభువు అతనికి సైతాను శోధనలు కూడ పంపాడు. పిశాచం పౌలుని కాలిలోని ముల్లులాగ బాధించడం మొదలెట్టింది. దానితో పౌలు తన బలహీనతను అర్థంచేసికొని వినయంతో దేవుని సహాయం అడుగుకొన్నాడు - 2 కొరి 12,7-10.

8. 1) మీరు శోధనల్లో చిక్కుకోకుండా వుండేందుకై ముందుగానే ప్రార్థన చేయండి - లూకా 22, 40.

2) పిశాచం మొదటినుండి నరహంతకుడే. అబద్ధాలాడ్డం వానికి స్వభావసిద్ధం. వాడు అసత్యానికి తండ్రిలాంటివాడు - యోహా 8, 44.

3) దేవుడెప్పుడూ మన శక్తికి మించి శోధించడు. శోధనలు వచ్చినపుడు వాటిని భరించే శక్తి నిచ్చి వాటినుండి బయటపడేలా చేస్తాడు - 1కొరి 10,13.

# 17. భగవంతుని తోడ్పాటు

నరుడు అల్పుడు. ఐనా భగవంతుడు ఉద్దేశపూర్వకంగా అతన్ని ఆదుకొంటూంటాడు. భగవంతుని ఆదరణను పొందిన వాళ్ళు నీరుపోసిన చెట్టులా పెరిగి వృద్ధిలోకి వస్తారు. దేవుడు మేలుచేయగోరినవాణ్ణి ఎవరూ చెరుపలేరు.

1. అన్నలు యోసేపును బానిసగా అమ్మివేసారు. ఐగుప్తుదేశంలో ఫరోరాజు సైనికోద్యోగియైన పోతీఫరు అతన్ని కొన్నాడు. ఆ సైనికోద్యోగి యింటిలో యోసేపు మన్ననపొందాడు. కాని అతని భార్య మూలకంగా చెరలో త్రోయబడ్డాడు. ఐనా యోసేపుకు ప్రభువు తోడ్పడ్డాడు. చెరసాల అధికారికి అతనిమీద దయపుట్టింది. యోసేపు దైవశక్తివలన తనతోపాటు చెరలోవున్న వంటలవాని కలకూ పానీయవాహకుని కలకూ వివరణం చెప్పాడు. అది తెలిసికొని ఫరోచక్రవర్తికూడ అతనితో తన కలలకు అర్థం చెప్పించుకొన్నాడు. ఫరో యోసేపును మెచ్చుకొని అతన్ని ఐగుప్తు దేశాని కంతటికీ సర్వాధికారినిగా నియమించాడు. ఈ విధంగా ఒక హీబ్రూ బానిస గండాలన్నీ తప్పించుకొని ఐగుప్తుకు ప్రధానమంత్రి కాగలిగాడంటే అది భగవంతుని తోడ్పాటువలననే గదా! – ఆది 39, 2.

2. యోసేపు ఐగుప్తున మంత్రిగా వుండగా ప్రపంచమంతటా దారుణమైన కరువు వచ్చింది. అతని సోదరులు కనాను మండలంలో మలమల మాడి చస్తున్నారు. కాని యోసేపు బుద్ధికుశలతతో ఐగుప్తున ముందుగానే ధాన్యం సేకరించి వుంచాడు. యోసేపు సోదరులు ధాన్యం కొనితెచ్చుకోవడానికి ఐగుప్తుకు రెండుసార్లు వెళ్ళారు. రెండవసారి వాళ్ళు యోసేపు తమ్ము శిక్షిస్తాడేమోనని భయపడిపోయారు. ఐనా యోసేపు వారిని క్షమించాడు. సోదరుల ప్రాణాలను కాపాడ్డానికి దేవుడే తన్ను ముందుగా ఐగుప్తుకు చేర్చాడని చెప్పాడు. సోదరులు తనకు కీడు తలపెట్టి తన్ను బానిసనుగా అమ్మివేసినా, దేవుడు ఆ కీడును మేలుగా మార్చాడని పలికాడు. భగవంతుని తోడ్పాటు లేందే యోసేపు అంత వృద్ధిలోకి వచ్చేవాడా? అతని సోదరులు ఆ కరువు తప్పించుకొని బ్రతికేవాళ్లా?– ఆది 45, 7–8; 50, 20.

3. ఏలీయా ప్రవక్తగానున్న కాలంలో ఆహబురాజు పరిపాలిస్తూండేవాడు. అతని భార్య యెసబెలురాణి పరమ దుర్మార్గురాలు. ఆమె యావే ప్రభువును నిరాకరించి దేశమంతటా బాలు దేవత ఆరాధనను ప్రోత్సహించింది. ఏలీయా యావేభక్తుడు కావడంవల్ల ఆ దుష్టరాణికి భయపడి పారిపోయి కేరీతు లోయలో దాగుకొన్నాడు. దేవుని ఆజ్ఞపై కాకులు రేపుమాపు అతనికి ఆహారం కొనివస్తూండేవి. అతడు ఆ యాహారం భుజించి ఆ లోయలోని నీటిపాయలో నీళ్లుత్రాగి ప్రాణాలు నిలుపుకొన్నాడు – 1 రాజు 17, 2–6.

4. ఆకాశంలోని పక్షులు విత్తనాలు చల్లి పంటపండించవు. పైరుకోసి నూర్పుళ్లుచేసి ధాన్యం గిడ్డంగుల్లో నిల్వజేయవు. ఐయినా పరలోకంలోని తండ్రి వాటిని పోషిస్తూంటాడు. మరి అతడు పక్షులకంటె శ్రేష్ఠుడైన నరుణ్ణి పోషింపకుండా వుంటాడా? ఇంకా, పొలంలో యెదిగే పూల మొక్కలు కష్టపడవు. నూలు వడికి వస్త్రాలు నేసికొనవు. అయినా భగవంతుడు వాటిని పూలు అనే వస్త్రాలతో అలంకరిస్తాడు. వాటి పూబట్టలు సొలోమోను మహారాజు తాల్చిన వస్త్రాలకంటె యింకా అందంగా వుంటాయి. ఈ పూలమొక్కలకంటె శ్రేష్ఠులైన నరులను భగవంతుడు పోషింపడా? తప్పక పోషిస్తాడు.

కనుక నరుడు కూడూగుడ్డా యిల్లూవాకిలికై తాపత్రయపడకూడదు. ఆ భగవంతుణ్ణి నమ్ముకొని జీవిస్తూండాలి - మత్త 6, 25-30.

5. పిచ్చుక అల్పప్రాణి. ఒక అణాబెడితే రెండు పిచ్చుకలు వస్తాయి. అలాంటి క్షుద్రప్రాణియైన పిచ్చుకను గూడా భగవంతుడు పోషిస్తూంటాడు. అతని యనుజ్ఞలేందే అది చావదు. ఇక, ఆ పిచ్చుకకంటె యెన్నోరెట్లు అధికుడైన నరుణ్ణి దేవుడు చేయి విడుస్తాడా? విడువడు. భగవంతుడు నరుని తల వెంట్రుకలు గూడ లెక్కబెట్టుకొని వుంచుకొంటాడు. అతని అనుమతి లేందే మన వెంట్రుకగూడ రాలదు. భగవంతుని ప్రాణి పోషణాచాతుర్యం అలా వుంటుంది - మత్త 10, 29-30.

6. ఓ బాటసారి యెరూషలేమునుండి యెరికోకు దిగివస్తూ త్రోవలో దొంగలచేతజిక్కి గాయపడ్డాడు. ఓ యాజకుడూ లేవీయుడూ ఆ త్రోవవెంట వచ్చిగూడ అతన్ని పట్టించుకోకుండా వెళ్ళిపోయారు. తరువాత ఓ సమరయుడు ఆ దారివెంటవచ్చి గాయపడివున్న తెరువరిని జూచి జాలి పడ్డాడు. అతని గాయాలకు కట్టుగట్టి అతన్ని ఓ సత్రానికి తీసికొని వచ్చాడు. ఈ మంచి సమరయుడు ఎవరోగాదు క్రీస్తే. మనుష్యజాతి పాపంవలన గాయపడివుండగా ప్రభువు వచ్చి సిలువ మరణంద్వారా మనకు పాపపరిహారం జేసాడు. మన గాయాలను మాన్పి మనకు ప్రాణం పోసాడు. ప్రభువుతోడ్పాటు అలాంటిది - లూకా 10, 33-34.

7. 1) ప్రభువే నాకు కాపరి. నాకిక యే కొదవాలేదు - కీర్త 23, 1.

2) అతడు ఓ కాపరిలా తన మందను మేపుతాడు
తన చేతులతో గొర్రెలను మందగూరుస్తాడు
గొర్రెపిల్లలను తన రొమ్ముమీద మోసికొని పోతాడు - యెష 40, -11.

3) యిస్రాయేలు ప్రజకు కావలిగాసే ప్రభువు
కునికిపాట్లు పడనూపడడు, నిద్ర పోనూపోడు కీర్త 121, 4.

4) గరుడపక్షి తన గూటిమీదికి లేచి పిల్లలకు ఎగరడం
నేర్పినట్లుగానే ప్రభువు యిస్రాయేలును పైకెత్తి
తన రెక్కలమీద నిలుపుకొంటాడు - ద్వితీ 32, 11.

5) ప్రభువు తన రెక్కలమాటున నిన్ను దాచివుంచుతాడు
అతని రెక్కలమరుగున నీవు సురక్షితంగా
వుండిపోతావు కీర్త 91,4.

6) ప్రభువు నాకు దీపం వెలిగిస్తాడు
నా త్రోవలోని చీకటిని తొలగిస్తాడు - కీర్త 18, 28.

7) నిన్ను అంటుకొనినవాడు నా కనుపాపను
అంటుకొన్నట్లే - జెకరయా 2,8.

8) అతడు నిన్ను గూర్చి జాగ్రత్తపడతాడు- 1 పేత్రు 1,7.

# 18. శీలవ్యత్యాసం

నరులు ఒకేపని చేస్తున్నపుడుగూడ వాళ్ళవాళ్ళ శీలాన్నిబట్టి భిన్నభిన్నంగా ప్రవర్తిస్తూంటారు. కొందరు స్వార్థబుద్ధితో ఆత్మలాభం వెదకుతూంటారు. ఈలాంటి వాళ్ళను భగవంతుడు ఆదరించడు. కొందరు నిస్వార్థబుద్ధితో ప్రవర్తిస్తారు. భగవంతుణ్ణి పొందాలని కోరుకొంటారు. ఈలాంటి వాళ్ళను ప్రభువు కరుణిస్తాడు. దైనందిన జీవితంలో ఒకే కార్యరంగంలో పనిజేసే నరులు ప్రదర్శించే శీలవ్యత్యాసం గమనించదగ్గది.

1. కయీనూ హేబెలూ అన్నదమ్ములు. ఇద్దరూ దేవునికి కానుకలు సమర్పించారు. ఐనా ప్రభువు కయీను కానుకను నిరాకరించి హేబెలు కానుకను చేకొన్నాడు. ఎందుకు? కయీనుది వక్రబుద్ధి హేబెలుది సరళబుద్ధి. ఋజువర్తనులు కాని వాళ్ళు ప్రభువుకి ప్రియపడలేరు - ఆది 4, 3-4.

2. ప్రభువు సౌలుని త్రోసివేసి దావీదుని రాజుగా ఎన్నుకొన్నాడు. సమూవేలు ప్రవక్త బేత్లెహేము వెళ్ళి యూషాయి కుమారుడు దావీదును రాజుగా అభిషేకించాలి. యూషాయికి యెనమండుగురు కొడుకులు. వీరిలో దావీదెవరో ప్రవక్తకు తెలియదు. యూషాయి తన పెద్ద కుమారుడు ఎలియాబును సమూవేలు చెంతకు గొనివచ్చాడు. ప్రవక్త యెలియాబు ఎత్తూ రూపము చూచి మెచ్చుకొని అతన్ని అభిషేకింప బోయాడు. కాని ప్రభువు "నేనితన్ని నిరాకరించాను. నరులు వెలుపలి రూపానికి భ్రమసిపోతారు. కాని నేను లోపలి హృదయాన్ని పరిశీలిస్తాను" అన్నాడు. ఈ రీతిగా యూషాయి తన కుమారుల్లో తొలి యేడ్గురునీ సమూవేలు వద్దకు తీసికొని రావడమూ, దేవుడు వాళ్ళను నిరాకరించడమూ జరిగింది. అప్పుడు అతని కడగొట్టుకొడుకు దావీదు ఎక్కడో పొలంలో గొర్రెలుకాచుకొంటున్నాడు. ప్రవక్త ఆజ్ఞపై యూషాయి అతన్ని పిలిపించాడు. దావీదురాగానే ప్రభువు ప్రవక్తతో "నేను ఎన్నుకొన్నవాడితడే. ఇతన్ని అభిషేకించు" అని చెప్పాడు. వెంటనే సమూవేలు అతనికి అభిషేకం చేసాడు. ఈ రీతిగా ప్రభువు ఏడ్గురు అన్నలను కాదని ఎన్మిదవవాడైన దావీదునే ఎన్నుకొన్నాడు. ఎందుకు? ప్రభువుకి అతని హృదయం నచ్చింది - 1 సమూ 16, 6-13.

3. గొల్యాతు మహావీరుడు. యుద్ధంలో కాకలుతీరిన జోదు. దావీదు పసివాడు. గొర్రెలు కాచుకొని బ్రతికేవాడు. వాళ్ళిద్దరికీ పోరుజరిగింది. సామాన్య పరిస్థితుల్లో గొల్యాతు దావీదుని పురుగును నలిపివేసినట్లుగా నలిపివేయవలసింది. కాని దావీదు ఒడిసెల రాతితో గొల్యాతు నొసటిని పగుల గొట్టాడు. అతడు మొదలు నరికిన చెట్టులాగ గభీలున నేలమీద కూలాడు. దావీదు గొల్యాతు కత్తితోనే అతని మెడ తెగనరికాడు. గొల్యాతు కత్తిడాలు

మొదలైన ఆయుధాలతో యుద్ధానికిరాగా దావీదు దేవుడైన యావేపేరిట వచ్చాడు. ఇక్కడ దైవబలమూ మనుష్యబలమూ ఒకదానితో వొకటి పోరాడాయి. చివరికి దైవబలమే నెగ్గింది. జీవితంలో దైవబలంమీదనే ఆధారపడేవాళ్లు కొందరూ, కేవలం మనుష్య బలంమీదనే ఆధారపడేవాళ్లు కొందరూ - 1 సమూ 17, 45-51.

4. యెషయా యిర్మీయా యిద్దరూ మహా ప్రవక్తలే. ప్రభువు ఇద్దరినీ బాల్యప్రాయంలోనే ప్రవచనం చెప్పడానికి పిల్చాడు. యెషయా ధైర్యవంతుడు, యిర్మీయా పిరికివాడు. దేవుని పిలుపు విన్పింపగానే యెషయా "ప్రభో! నేను సిద్ధంగానే ఉన్నాను. నన్ను పంపు" అన్నాడు. కాని యిర్మీయా "ప్రభో! నేను బాలుణ్ణి. నాకు మాటలాడ్డం చేతకాదు. ఇంకెవరినైనా పంపుకో" అన్నాడు. యెషయాకు ముందుకుపోయే గుణముంది. యిర్మీయాకు జంకే గుణముంది. కాని ప్రభువు ఈ ప్రవక్త లిద్దరికీ తన శక్తిని ప్రసాదించి యిద్దరినీ తన పనికి నియోగించుకొన్నాడు - యెష 6, 8 ; యిర్మీయా 1,6.

5, ఓ సేవకుడు తన యజమానునికి లక్షల వరహాలు అప్పుపడ్డాడు. అయినా యజమానుడు జాలిపడి అతని యప్పును క్షమించాడు. ఈ సేవకునికి యింకో సేవకుడు కొన్ని రూకలు అప్పుపడ్డాడు. అయినా ఆ సేవకుడు అప్పుపడిన తన దాసుణ్ణి క్షమింపక వాని గొంతు పట్టుకొన్నాడు. అప్పు తీర్చిందాక యిక్కడే ఉండమని అతన్ని చెరలో త్రోయించాడు. అదిచూచి యజమానుడు మొదటి సేవకుణ్ణి కఠినంగా శిక్షించాడు. "నీచుడా! నేను నీ యప్పు మన్నించినట్లే నీవూ నీ తోడిదాసుని యప్పు మన్నించవద్దా?" అని గద్దించాడు. మనం భగవంతునినుండి క్షమాపణం పొందాలి అంటే మన తోడిజనాన్ని క్షమించడం నేర్చుకోవాలి. కొంత మందిలో క్షమించే గుణముంటుంది, కొంత మందిలో ఉండదు - మత్త 18, 32-33.

6. పదిమంది కన్నెలు దివ్వెలు తీసికొని రాత్రిలో పెండ్లికుమారునికొరకు వేచివున్నారు. వాళ్లల్లో ఐదుగురు తెలివైనవాళ్ళు. వాళ్ళ దగ్గర నూనెవుంది. పెండ్లి కుమారుడు రాగానే వాళ్ళు తమ దివ్వెలు వెలిగించుకొని అతనితోపాటు వివాహ శాలలోనికి వెళ్లారు. మిగిలిన అయిదుగురు తెలివి తక్కువవాళ్లు. వాళ్లవద్ద నూనె లేదు. అపరాత్రిలో పెండ్లికుమారుడు రాగానే ఆ కన్నెలు చమురుకోసం అంగడికి వెళ్లారు. కాని వాళ్లు తిరిగి రాకముందే వివాహశాలను మూసివేసారు. ప్రభువు ఎప్పుడు విజయం చేస్తాడో మనకు తెలీదు. అతడు వచ్చినప్పుడు సిద్ధంగా ఉన్నవాళ్ళు అతని వెంట పరలోకానికి వెళ్తారు. కాని అలా సిద్ధంగా ఉండేవాళ్ళు కొందరు, ఉండనివాళ్ళు కొందరు. - మత్త 25, 1-13.

7. పేత్రూ యూదా యిద్దరూ ఘోరపాపంచేసారు. పేత్రు ప్రభువుని ఎరగనని ముమ్మారు బొంకాడు. అయినా అతడు ఆశాభావంతో పశ్చాత్తాపపడ్డాడు. తన పాపానికి

సంతాపపడి యేడ్చాడు. యూదా గురుద్రోహంచేసి క్రీస్తుని ముప్పది వెండి కాసులకు అమ్ముకొన్నాడు. కాని అతడు తన పాపాన్ని తలంచుకొని నిరుత్సాహపడ్డాడు. ఇక తన పాపానికి పరిహారంలేదని నిరాశచెంది ఉరివేసికొని చచ్చాడు. నరుడు ఎంతటి పాపం చేసినా భగవంతుడు క్షమిస్తాడు. కనుక అతడు నమ్మికతో పశ్చాత్తాప పడాలిగాని నిరుత్సాహపడగూడదు - లూకా 22, 62; మత్త 27,5.

8. ప్రభువు ఇద్దరు యజమానులను సేవించవద్దన్నాడు. ఈ ఇద్దరు యజమానులు దేవుడూ ధనమూను - మత్త 6,24. పేత్రు దేవుణ్ణి మాత్రమే సేవించినవాడు. కనుకనే యేసు మీరు గూడ నన్ను విడిచి వెళ్ళిపోతారా అని అడగ్గానే అతడు "ప్రభో! మేమెక్కడికి వెళ్తాం? నిత్యజీవమిచ్చే మాటలు నీ నుండి వెలువడుతూన్నాయి" అన్నాడు. కాని యూదా ధనాన్ని సేవించినవాడు. క్రీస్తూ అతని శిష్యులూ తమతో కొంతడబ్బు ఉంచుకొంటూండే వాళ్లు. ఆ డబ్బులసంచి యూదా దగ్గిర ఉండేది. అతడు తనకు అవసరమైనపుడెల్లా ఆ సంచి నుండి డబ్బు కొట్టేస్తూండేవాడు. ఈ దురభ్యాసంతోనే చివరికి గురువును కూడ అమ్మేసుకొన్నాడు - యోహాను 6,68; 12,6.

9. పదిమంది కుష్ఠరోగులు తమ వ్యాధిని తొలగించమని ప్రభుని వేడుకొన్నాడు. అతడు మీ కుష్ఠ పోతుంది. మీరు వెళ్ళి దేవాలయంలో యాజకునికి చూపెట్టుకొండని చెప్పాడు. త్రోవలో వాళ్లందరికి కుష్ఠ నయమయింది. కాని వాళ్లల్లో ఒక్కడు మాత్రం తిరిగివచ్చి ప్రభువుకి కృతజ్ఞత తెలుపుకొన్నాడు. అతన్నిచూచి ప్రభువు తతిమ్మా తొమ్మిది మంది యేరి అని అడిగాడు. తొమ్మిది మంది కృతఘ్నులూ, ఒక్కడు కృతజ్ఞతాపరుడూను - లూకా 17,17.

10. ఓ తెరువరి యెరూషలేమునుండి యెరికో వెళ్తూ దొంగలకు జిక్కి గాయపడి త్రోవప్రక్కన పడిఉన్నాడు. ఓ యాజకుడూ లేవీయుడు ఆ త్రోవవెంట బోతూ అతన్ని పట్టించుకోకుండానే వెళ్లిపోయారు. తరువాత ఓ సమరయుడు ఆ దారి వెంట వచ్చి అతన్ని పరామర్శించాడు. ఇద్దరు అక్కరలో ఉన్నవారిని ఆదుకోకపోగా, ఒక్కడు ఆదుకొన్నాడు - లూకా 10, 30-34.

11. ఓ పరిసయుడూ సుంకరీ ప్రార్థన చేసికోవడానికి దేవాలయానికి వెళ్ళారు. పరిసయుడు గర్వాత్ముడు. అతడు "ప్రభూ! నేను పుణ్యాత్ముణ్ణి. ఈ సుంకరిలాగా పాపాత్ముణ్ణి కాదు, నీకు తెలియందేముంది?" అని ప్రార్థించాడు. కాని సుంకరి వినయవంతుడు. అతడు "ప్రభో నేను పాపిని. నన్ను కరుణించు" అని ప్రార్థించాడు. భగవంతుడు పరిసయుని త్రోసిపుచ్చి సుంకరి ప్రార్థన ఆలించాడు. జీవితంలో కొందరు గర్వాత్ములూ కొందరు వినయవంతులూను. ప్రభువు మాత్రం గర్విష్ఠులను అణగద్రొక్కి వినయాత్ములను ఆదుకొంటాడు - లూకా 18, 10-14.

12. ఓ యజమానుడు దేశాంతరమెళ్తూ తన సేవకులను ముగ్గురిని పిలిచి వాళ్లకు ధన మప్పగించాడు. ఒకనికి అయిదు సంచులూ, మరొకనికి రెండు సంచులూ, ఇంకొకనికి ఒక సంచీ యిచ్చి వెళ్ళాడు. యజమానుడు తిరిగి వచ్చేప్పటికల్లా అయిదు సంచులు తీసికొన్నవాడు ఇంకా అయిదు సంచులూ, రెండు సంచులు తీసికొన్నవాడు ఇంకా రెండు సంచులూ డబ్బు సంపాదించి ఉంచారు. కాని ఒకసంచి డబ్బు తీసికొన్నవాడు మాత్రం వొట్టినే ఉండిపోయాడు. ప్రభువు అతన్ని కోపగించుకొన్నాడు. అతని డబ్బుకూడ తీసికొని మొదటివాని కిచ్చేసాడు. కొందరు భగవంతుడు తమకిచ్చిన శక్తిసామర్థ్యాలను వృద్ధిచేసి కొంటారు. కొందరు అలా వృద్ధిచేసికోరు - మత్త 25, 24-30.

13. ప్రభువు చాలామంది శిష్యులను పిల్చాడు. సుంకపు మెట్టులో పన్నులు వసూలు చేస్తున్న మత్తయిని పిల్చాడు. అతడు తాను లెక్కబెట్టుకొనే డబ్బుగూడ వదలిపెట్టి వెంటనే క్రీస్తుని అనుసరించాడు. అలాగే ప్రభువు ధనిక యువకుణ్ణి గూడ పిల్చాడు. కాని అతడు చాల ఆస్తిపాస్తులు కలవాడు. తన సిరిసంపదలను వదలుకోవడానికి అతనికి మనసురాలేదు. అందుచేత ఆ యువకుడు ప్రభుని అనుసరించలేక బాధపడుతూ వెళ్ళిపోయాడు. భగవంతుని పిలుపునీ ప్రబోధాన్నీ ఆలించేవాళ్ళు కొందరు, పెడచెవిని బెట్టేవాళ్ళు కొందరు - మత్త 9, 9 ; లూకా 18, 23.

# 19. అంతరాత్మ

నరుల్లో అంతరాత్మ అంటూ ఉంది. ఇది భగవంతుడు హృదయాల్లో నిల్పిన ఓ దీపంలాంటిది. ఈ యంతరాత్మ పాడుపనులు చేస్తుంటే హెచ్చరిస్తుంది. మంచిపనులు చేస్తుంటే మెచ్చుకొంటుంది. నరుడు మనస్సాక్షి ప్రబోధం వింటే దేవుని ప్రబోధం విన్నట్లే.

1. యోసేపు సోదరులు ధాన్యం కొనితెచ్చుకోవడానికి ఐగుప్తునకు వెళ్లారు. అక్కడ యోసేఫే పెత్తనదారుడు. అతడు అన్నలను గుర్తుపట్టాడు గాని వాళ్లు అతన్ని గుర్తుపట్టలేదు. యోసేపు అన్నల చిత్తశుద్ధిని పరీక్షించడానికి గూఢచారులన్న నేరంతో వాళ్ళను చెరలో వేయించాడు. అప్పుడా సోదరులు "ఆనాడు మనం తమ్మునికి కీడు తలపెట్టాం. వాడు ఎంత బతిమాలినా మనం వాడిగోడు విన్పించుకోలేదు. వాడి ఉసురుకొట్టి యిప్పుడు ఈ కడగండ్ల పాలయ్యాం" అని అనుకొన్నారు. సోదరునికి చేసిన అపరాధానికిగాను వాళ్ల అంతరాత్మ వాళ్ళను నిందించింది... ఆది 42, 21.

2. ఓ మారు క్రీస్తు దేవాలయంలో బోధిస్తున్నాడు. అప్పుడు యూదులు వ్యభిచారంలో పట్టుపడిన ఓ స్త్రీని అతని వద్దకు తీసికొని వచ్చారు. మోషే ఆజ్ఞాపించినట్లుగా ఆమెను రాళ్ళతో కొట్టి చంపవచ్చా అని అడిగారు. అందుకు ప్రభువు "మీలో పాపంలేనివాడు

ఎవడైనా ఉంటే అతడు ఆమెమీద మొదటిరాయి వేయవచ్చు" అన్నాడు. వాళ్లంతా సిగ్గుపడిపోయి ఆమెను వదలివేసి ఒకరి తరువాత వొకరు మెల్లగా జారుకొన్నారు. మీరూ ఈమెలాగే పాపాత్ములై యుండగా ఈమెను దండించే అధికారం మీకెక్కడి నుండి వచ్చిందని వాళ్ల అంతరాత్మే వాళ్లను ప్రబోధించింది - యోహా 8, 7-11.

3. ప్రధమాచార్యులు క్రీస్తుకు మరణశిక్ష విధించమని పిలాతుని ఒత్తిడిచేసారు. అతడు వెనుదీసాడు. వాళ్ళు క్రీస్తుని చంపించకపోతే నీవు సీజరు చక్రవర్తికి స్నేహితుడివి కాలేవు. మేము నీమీద ఫిర్యాదుచేస్తాం" అని బెదిరించారు. పిలాతు దడిసాడు. అయినా యేసు యే నేరమూ చేయలేదని అతనికి బాగా తెలుసు - యోహా 16,6. ఈలా తెలిసికూడ అతడు యూదులకు జంకి నిర్దోషియైన క్రీస్తుకి మరణశిక్ష విధించాడు. పిలాతు అంతరాత్మ ప్రబోధాన్ని అణచుకొని ఈలాంటి పాడుపనికి తలపడ్డాడు. - యోహా 19,16.

4. 1) నేను దేవుని యెదుటా మానవుల యెదుటా గూడ నిర్మలమైన అంతరాత్మను కలిగి యుండడానికై శక్తివంచన లేకుండా పనిచేస్తున్నాను - అచ 24,16

2) నిర్మలమైన వాళ్లకి అన్నీ నిర్మలంగానే ఉంటాయి.
మలిన మనస్కులకు అన్నీ మలినంగానే వుంటాయి. - తీతు 1, 15

# 20. సలహా

నరుడు నరునికి సలహా యిస్తుంటాడు. ఈ సలహామంచిదైనా కావచ్చు చెడ్డదైనా కావచ్చు. మంచి సలహా విన్నవాళ్ళు బాగుపడతారు. చెడ్డ సలహా విన్నవాళ్ళు నాశమైపోతారు. క్రైస్తవభక్తుడు తాను యితరులకు ఏలాంటి సలహా యిస్తుంటాడో, ఇతరులనుండి తాను ఏలాంటి సలహా పొందుతుంటాడో జాగ్రత్తగా ఆలోచించిచూచుకోవాలి.

1. యూదులు బాబిలోను ప్రవాసంలో వుండగా వాళ్ల ఆడపడుచు ఎస్తేరు ఆ దేశపు రాజును పెండ్లి చేసికొని రాణి అయింది. ఆ దేశపు రాజునకు సలహాదారుడయిన హామాను యూదులకు ప్రబల శత్రువు. ఎస్తేరునకు బంధువయిన మొర్దేకయి యూదులకు నాయకుడు. హామాను మొర్దేకయిని ఈసడించుకొన్నాడు. అతన్నేవిధంగా హతమార్చాలో చెప్పమని మిత్రులను సలహా అడిగాడు. అతని మిత్రలూ భార్యా ఏబది మూరల యెత్తుగల ఉరికంబాన్ని తయారు చేయించవలసిందనీ, దానిమీద మొర్దేకయిని ఉరితీయమని రాజుని మనవి చేయవలసిందనీ సలహా యిచ్చారు. వారు చెప్పిన దుష్టాలోచన ప్రకారమే హామాను ఉరికంబం సిద్ధం చేయించాడు. కాని దేవుడు యూదులకోపు తీసికొన్నందున చివరకు హామానునే ఆ కంబంమీద ఉరితీసారు. - ఎస్తే 5,14.

2. దావీదు కుమారుడు అబ్బాలోము దౌర్జన్యంతో తండ్రిరాజ్యం ఆక్రమించు కొన్నాడు. దావీదుఅతనికి భయపడి పారిపోయి ఓ యెడారిలో తల దాచుకున్నాడు. తండ్రిని ఏవిధంగా పట్టుకోవాలా అని అబ్బాలోము మంత్రులను ఆలోచన అడిగాడు. అహిటోఫెలు అనే సలహాదారుడు తాను ఆ రాత్రే సైన్యంతోపోయి దావీదును పట్టుకొని వస్తానన్నాడు. హుషయి అనే సలహాదారుడు అబ్బాలోమే సైన్యంతోపోయి దావీదుని పట్టుకొంటే బాగుంటుందని సూచించాడు. రాజు హుషయి సలహాను పాటించాడు. అహిటోఫెలు ఆలోచనను అనాదరం చేసినందుకు అతనికి మొగం కొట్టినట్లయింది. ఆ చిన్నతనాన్ని భరించలేక అహిటోఫెలు స్వీయగ్రామానికెళ్ళి అక్కడ ఉరివేసుకొని చచ్చాడు. -2 సమూ 17, 23.

3. సిరియా దేశపు సైన్యాధిపతియైన నామాను కుష్ఠరోగియై చికిత్సకోసం యిస్రాయేలు ప్రవక్త యెలీషా వద్దకు వచ్చాడు. ఎలీషా అతనికి మొగమైనా చూపించకుండానే యోర్దాను నదికివెళ్ళి స్నానం చేయవలసిందని సేవకునిచేత కబురు పెట్టించాడు. నామాను మండిపడ్డాడు. స్నానం చేసికోవాడానికి మా దేశంలో నదుల్లేక మీ దేశానికి వచ్చాననుకొన్నారా అంటూ సిరియాకు వెడలిపోవడానికి సంసిద్ధుడయ్యాడు. కాని అతని సేవకుడు "అయ్యా! ప్రవక్తయేదైన పెద్దపనిచెప్తే నీవు తప్పకుండ చేసేవాడివేకదా? నదిలో స్నానం చేయమని ఈపాటి చిన్న పనిచెప్తే చులకన చేయడం దేనికి? ప్రవక్తమాట పాటించడం మేలు" అని హితోపదేశం చేసాడు. నామాను ఆ వుపదేశం విని నదిలో స్నానం చేసి కుష్ఠనుండి విముక్తుడయ్యాడు. - 2 రాజు 5, 13.

4. దేవుడు తన సేవకుడైన యోబు మహా భక్తుడని మెచ్చుకొన్నాడు. కాని పిశాచం అతని భక్తిని నమ్మలేదు. దేవుని అనుమతిపై యోబుని శోధించి పరీక్షింప గోరింది. యోబుకి నానా కష్టాలు కలిగించింది. అతని ఆస్తంతా నాశమైపోయింది. అతని దేహమంతా మహా వ్రణంకాగా, చీమూ నెత్తురూ కారుతున్నాయి. బంధువులంతా యోబుని ఈసడించుకున్నారు. అతడు ఒంటరిగా బూడిదమీద కూర్చున్నాడు. యోబు మిత్రులుగూడ అతడు దుర్మార్గుడై యుండాలి లేకపోతే అలాంటి కష్టాలు వస్తాయా అని శంకించారు. అలాంటి పరిస్థితుల్లో యోబు భార్య దేవుణ్ణి దూషించమని పెనిమిటికి సలహా యిచ్చింది. అయినా యోబు మహాభక్తుడు. ఆతడు "మూర్ఖురాలా! మనం దేవుడిచ్చే మేళ్లు అనుభవించినట్లే అతడిచ్చే కీడులూ అనుభవించాలి" అని జవాబిచ్చాడు - యోబు 2, 9-10.

5. యూదుల నాయకులు ప్రభుని సంహరించడానికై కుట్రలు పన్నుతూన్నారు. వాళ్ళంతా ప్రధానయాజకుడైన కైఫా యింటిలో సమావేశమై మంత్రాంగం నడిపారు.

ఒకరి సలహా వొకరు విన్నారు. చివరకు మాయోపాయంతో యేసుని బంధించి చంపివేయాలని నిశ్చయించుకొన్నారు. - మత్త 26, 3-4.

6. పరిశుద్ధాత్మ దిగివచ్చాక శిష్యులు యేసే మెస్సియాయని యెరూషలేములో బోధిస్తున్నారు. అతని పేరుమీదిగా అద్భుతాలు చేస్తున్నారు. యూదుల ప్రధాన యాజకుడు వాళ్ళని దడిపించాడు. చెరలో వేయించాడు. యేసు పేరుమీదిగా బోధించవద్దన్నాడు. అయినా శిష్యులు మానలేదు. యూదుల నాయకులు అపోస్తలులను బంధించి వాళ్ల మహాసభ యెదుటికి కొనివచ్చారు. ఆ సభలోని సభ్యులు అపోస్తలులను చంపివేయాలని సలహా యిచ్చారు. అప్పుడు గమలియేలు అనే వృద్ధుడులేచి "వీళ్ల ఉద్యమం మానవ ప్రయత్నమైతే దానంతట అదే అణగిపోతుంది. దైవ ప్రయత్నమైతే మీరు దాన్ని అణచివేయలేరు. పైగా మీరు దేవునితోనే పోట్లాడినట్లౌతుంది. కనుక యిప్పుడు వీళ్లను ఏమి చేయకుండా వదలివేయండి" అని ఆ సభలోని సభ్యులకు ఆలోచన చెప్పాడు. మహాసభ సభ్యులు అతని సలహాను పాటించి అపోస్తలులను వదలివేసారు. - అచ 5, 38,39.

7. సలహా లేకపోతే ప్రజ నాశమైపోతుంది.
చాలమంది సలహాదారులుంటే భద్రత కలుగుతుంది. - సామె 11,14.

# 21. కృతజ్ఞత

మనం తోడినరులకు ఏదైనా ఉపకారం చేసినపుడు వాళ్లు మనకు కృతజ్ఞులై వుండాలని అనుకొంటాం. భగవంతుడు గూడ నరుడు తనకు కృతజ్ఞుడై ఉండాలనే కోరుకొంటాడు. కృతజ్ఞతాపరుల చరిత్రలు వింటానికి చాల రమ్యంగా ఉంటాయి.

1. సౌలు కుమారుడైన యోనాతానూ దావీదూ మిత్రులు. సౌలుకు దావీదుమీద అసూయ పుట్టగా అతన్ని చంపివేయాలని తలపోస్తున్నాడు. యోనాతాను ఆ సంగతి దావీదుకు తెలియజేసి అతన్ని భద్రంగావుండమని హెచ్చరించాడు. పైగా అతడు దావీదు నమ్మదగిన బంటుగాని ద్రోహిగాడు అని తండ్రికి నచ్చజెప్పాడు. సౌలు ఆ మాటలకు సంతృప్తి చెంది దావీదును మళ్ళా కొలువులో చేర్చుకొన్నాడు. ఈ యుపకారానికి దావీదు యోనాతానుకు కృతజ్ఞతలు తెలిపాడు -1 సమూ 19, 1-7.

2. యోసేపుతోపాటు ఫరోరాజు వంటలవాడూ పానీయ వాహకుడూ కూడ చెరలో వున్నారు. వాళ్ళిద్దరికీ కలలు వచ్చాయి. పానీయవాహకుడు బ్రతికి బయటపడతాడనీ వంటలవానికి మరణశిక్ష ప్రాప్తిస్తుందనీ యోసేపు కలలకు వివరం చెప్పాడు. అతడు చెప్పినట్లే జరిగింది. కాని పానీయవాహకుడు చెరనుండి బయట బడినంక యింకా చెరలోనే

వుండిపోయిన యోసేపుని పూర్తిగా మరచిపోయాడు. కొంతకాలమయ్యాక ఫరో రాజుకుగూడ కలలు వచ్చాయి. కాని యెవరు ఆ కలల భావాన్ని వివరించి చెప్పలేక పోయారు. అప్పుడు పానీయవాహకునికి యోసేపు గుర్తుకి వచ్చాడు. తనకు మేలు చేసిన యోసేపును మరచి పోయినందున అతడు పశ్చాత్తాపపడ్డాడు. వెంటనే ఫరో దగ్గరికి వెళ్ళి చెరలోనున్న హీబ్రూ పడుచువాడు ఓ మారు తన కలకు అర్థం చెప్పాడనీ, ఫరో కలలకుగూడ వివరం చెప్పగలడని విన్నవించాడు. అతని కృతజ్ఞత పండిందో అన్నట్లు ఫరోరాజు యోసేపుని చెరనుండి విడిపించాడు- ఆది 4, 8-13.

3. సౌలు కుమారుడైన యోనాతాను దావీదునకు ఇష్టుడు. సౌలు యోనాతాను గిల్బోవా యుద్ధంలో మరణించారు. సౌలుకు మారుగా దావీదు రాజయ్యాడు. యోనా తానునకు మెపిబోసెతు అనే కొడుకుండేవాడు. అతడు అవిటికాలివాడు. దావీదు తన్నెక్కడ చంపివేస్తాడో అని మెపిబోసెతు భయపడుతున్నాడు. కాని దావీదు అతన్ని తన సమక్షానికి పిలిపించి అభయమిచ్చాడు. "నీ తండ్రి యోనాతానును స్మరించుకొని నేను నీకు దయజూపుతాను. నీ వికమీదట రోజు నా సరసన కూర్చుండి భోజనం చేయవచ్చు" అని చెప్పాడు. ఆ మాటలకు మెపిబోసెతు విస్తుపోయాడు. "ప్రభూ! ఈ దాసునిమీద ఎంత ఆదరం జూపించావు!నేనెంత నా బ్రతుకెంత? ఓ చచ్చిన కుక్కలాంటి వాణ్ణిగదా!" అని తన కృతజ్ఞత తెలుపుకొన్నాడు. - 2 సమూ 9,6-8.

4. ప్రభువు మగ్దలీన మరియనుండి ఏడు దయ్యాలను వెళ్లగొట్టాడు. మరియ కృతజ్ఞతాభావంతో ప్రభువు శిష్యురాలైంది. ఆమె పుణ్యస్త్రీలతోజేరి క్రీస్తువెంట వెళ్తూండేది. అతని అవసరాలను తీరుస్తుండేది - లూకా 8,8.

5. ఓ మారు యేసు పదిమంది కుష్ఠరోగులకు వ్యాధి నయం జేసాడు. కాని వాళ్ళల్లో ఒక్కడు మాత్రం తిరిగివచ్చి ప్రభువుకి కృతజ్ఞత తెలుపుకొన్నాడు. అప్పుడు ప్రభువు "పదిమందికీ కుష్ఠ నయమైందికదా, మిగిలిన తొమ్మిది మంది యేరీ?" అని అడిగాడు. నరులు స్వార్థపరులు. వాళ్లల్లో కృతజ్ఞతాభావం అరుదుగాగాని కన్పించదు - లూకా 17,17.

## 22. భక్తుల హృదయం

పసిబిడ్డ తల్లి కంటిపెట్టుకొని ఉన్నట్లుగానే భక్తుడు భగవంతునికి అంటిపెట్టుకొని ఉంటాడు. అతని హృదయం భగవంతునిమీద లగ్నమౌతుంది. ఆ ప్రభుని తలంచుకొని ద్రవించి పోతుంది. భగవంతుడు అతన్ని కరుణతో జూస్తాడు. దీవిస్తాడు. దానితో భక్తునికి జన్మ తరిస్తుంది.

1. అబ్రాహాము తొంబై తొమ్మిది యేండ్లవాడై యుండగా భగవంతుడు ప్రత్యక్షమై "నీవు నా సన్నిధిలో నడుస్తూ ఉత్తముడిగా మెలగాలి" అని చెప్పాడు. అబ్రాహాము చిత్తశుద్ధిగల భక్తుడు. అతడు భగవంతుని సన్నిధిలో నడిచాడు. చివరకు ప్రభువు అబ్రాహామునిపరీక్షించడానికై అతని కుమారుణ్ణి బలియీయమని అడిగాడు. అబ్రాహాముకి ఏకైక కుమారుడు ఈసాకు. ఆ ముసలి ప్రాయంలో అతన్ని కోల్పోతే మరో కొడుకు పుడతాడనే నమ్మకంగూడ లేదు. అయినా అబ్రాహాము వెనుకాడలేదు. ప్రభువు ఏదో విధంగా ఈసాకుని మళ్ళా బ్రతికిస్తాడనే నమ్మకంతో అబ్రాహాము అతన్ని బలియీయడానికి సంసిద్ధుడయ్యాడు. ప్రభువు "నీ ఏకైక కుమారుణ్ణి నాకు సమర్పించడానికి వెనుకాడలేదు కనుగ నీవు దైవభీతిగలవాడవని రుజువయింది" అని అతని విశ్వాసాన్ని మెచ్చుకొన్నాడు. - ఆది 17, 1; 22, 10-12.

2. మోషేగూడ మహాభక్తుడు. అతడు ప్రభువుతో ఓ స్నేహితుల్లాగే ముఖాముఖి మాటలాడేవాడు. యావే తన భక్తులతో కలలద్వారా దర్శనాలద్వారా పరోక్షంగా మాటలాడేవాడు. కాని మోషేతో మాత్రం నేరుగా మాటలాడేవాడు - నిర్గ 33,11. మోషే పది ఆజ్ఞలు తీసికొని కొండదిగి వచ్చేప్పటికల్లా యిస్రాయేలు ప్రజలు విశ్వాసఘాతుకులై ఎద్దును ఆరాధించుకొంటున్నారు. ప్రభువు వాళ్లని వేరంట నాశం జేస్తాన్నాడు. ఆ తలబిరుసుజాతికి మారుగా మోషే సంతానం నుండి యింకో క్రొత్త జాతిని పుట్టిస్తానన్నాడు. అప్పుడు మోషే జాతిపితగావచ్చు. అయినా ఆ భక్తునికి అలాంటి బిరుదాలేమీ అక్కరలేదు. అతడు ఆ ప్రజల తరపున దేవుణ్ణి మనవిచేసాడు. ప్రభువు వాళ్లను క్షమించడానికిష్టపడకపోయినట్లయితే జీవగ్రంథంనుండి తన పేరు తొలగించమని మనవి చేసాడు. అతని చిత్తశుద్ధిని మెచ్చుకొని ప్రభువు యిస్రాయేలీయులను క్షమించి వదలివేసాడు. - నిర్గ 32. 10; 32, 32.

3. అన్నా పెనిన్నా సవతులు. ఎల్కానా భార్యలు. పెనిన్నాకు సంతానం కలిగిందిగాని అన్నా గొడ్రాలుగా ఉండిపోయింది. అందువలన సవతి ఆమెను ఎగతాళిజేసి యేడిపించేది. అన్నా షిలో నగరంలోవున్న ప్రభుమందిరానికి యాత్ర వెళ్ళి దేవునిముందు తన గోడు విన్పించుకొంది. "సైన్యములకు అధిపతివైన ప్రభూ! నాకొక మగబిడ్డను ప్రసాదించావంటే వాణ్ణి నీకే సమర్పించుకొంటాను" అని ప్రార్థించింది. ఆ భక్తురాలి మనవి నాలించి ప్రభువు ఆమెకు ఓ మగకందును ప్రసాదించాడు. ఆతడే సమూవేలు ప్రవక్త. -1 సమూ 1,11.

4. యిస్రాయేలీయుల అడపడుచు నవోమి మోవాబు దేశంలో వసిస్తూండేది. ఆమెకు ఓర్ఫ, రూతు అని ఇద్దరు కోడళ్ళు. వాళ్ళిద్దరూ మోవాబుదేశ స్త్రీలు. నవోమి తన

కొడుకులిద్దరు చనిపోగా సొంత దేశానికి తిరిగిరావాలనుకొంది. కనుక కోడండ్లను పుట్టింండ్లకు వెళ్ళిపొమ్మని చెప్పింది. పెద్దకోడలు ఓర్పా కన్నవారింటికి వెళ్లిపోయింది. కాని చిన్నకోడలైన రూతు మాత్రం "నేనుగూడ నీ వెంటనే వస్తాను. నీ బంధువులే నాకు బంధువు లౌతారు. నీ దేవుడే నాకు దేవుడౌతాడు. నీవు చనిపోయేకాడనే నేనూ చనిపోతాను. మరణం వరకూ మన మిద్దరం విడిపోగూడదు" అంది. నవోమి కోడలిబుద్ధికి మెచ్చుకొని ఆమెనుగూడ వెంటబెట్టుకొని యిస్రాయేలు దేశానికి వచ్చింది. పూర్వం యూదస్త్రీలు సంతానం కలుగకముందే భర్త చనిపోయినట్లయితే ఆ భర్తకు దగ్గరి చుట్టమైన పురుషుని గూడి సంతానం పొందేవాళ్లు. ఆ యాచారాన్నే దేవరన్యాయం అనేవాళ్లు. ఆ యాచారం ప్రకారమే రూతు నవోమికి దగ్గరి బంధువయిన బోవసువలన బిడ్డనుగని తన జీవితం ధన్యం చేసికొంది - రూతు 1, 16-17.

5. హిజ్కియారాజు యావే భక్తుడు. అతడు ప్రభువు మీదనే మనసు నిల్పి ప్రభువు ఆజ్ఞలను తూచా తప్పకుండా పాటించేవాడు. ప్రభువు హిజ్కియాకు తోడ్పడినందున అతడు ఎక్కడికి వెళ్ళినా ఏమిచేసినా విజయం లభిస్తూండేది. ఈలా ఉండగా అస్సిరియా రాజైన సన్హెరీబు యూదామీది కెత్తివచ్చాడు. హిజ్కియాను భయపెడుతూ కమ్మ(వ్రాసి పంపాడు. "ఓయి హిజ్కియా! నన్నెదిరించిన రాజులందరూ మంటగలిసిపోయారు. ఆ రాజులు కొలిచే దేవతలు వాళ్లను నా దాడినుండి కాపాడలేకపోయారు. నీకూ అదేగతి పడుతుంది. కాని నీవు నా శరణుజొచ్చావో, బ్రతికిపోతావు" అని కబురు పంపించాడు హిజ్కియా ఆ జాబును తీసికొనివెళ్లి ప్రభువు దేవాలయంలో పీఠంమీద విప్పిపెట్టాడు. కొయ్యబొమ్మలనూ రాతి బొమ్మలనూ కొలుచుకొనే రాజులను సన్హెరీబు జయిస్తే జయించవచ్చు గాక, యావేను కొలిచే రాజును మాత్రం ఆతడు జయించకుండా ఉండేలా చేయమని ప్రార్థించాడు. యావే ఆ భక్తుని ప్రార్థన ఆలించాడు. ఆ రాత్రి ప్రభువుదూత వెళ్లి సన్హెరీబు సైన్యంలో కొందరిని చంపివేయగా అతడు భయపడి వెనుదిరిగి పారిపోయాడు - 2 రాజు 19, 14-19.

6. ఇత్తాయి దావీదు అంగరక్షకులకు నాయకుడు. అతడు యూదుడుకాడు, అన్యజాతివాడు. దావీదు కొలువులో చేరి అతనికి ఊడిగం చేస్తున్నాడు. ఓ మారు దావీదు అబ్షాలోమునకు వెరచి యెరూషలేమునుండి పారిపోతున్నాడు. అపుడు యిత్తాయిగూడ దావీదువెంట ప్రవాసానికి బయలుదేరాడు. దావీదు అతన్ని తనవెంట రావద్దని వారించాడు. తన మీద యిక ఆశవదలుకొమ్మనీ, అబ్షాలోము కొలువులోచేరి అతనికి ఊడిగంచేయమనీ సలహా యిచ్చాడు. కాని స్వామిభక్తిగల యిత్తాయి "యావేతోడు. చావుగానీ బ్రతుకుగానీ రాజెక్కడ ఉంటాడో ఈ దాసుడు గూడ అక్కడే ఉంటాడు" అని పలికి తానూ దావీదువెంట వెళ్లిపోయాడు - 2 సమూ 15, 20-21.

7. ఓమారు ప్రభువు దేవాలయంలో బోధిస్తుండగా భక్తులువచ్చి కానుకల పెట్టెలో డబ్బు వేస్తున్నారు. ధనవంతులు మస్తుగా డబ్బు పడవేస్తున్నారు. అప్పుడు ఓ పేద విధవ గూడ వచ్చి రెండు పైసలు మాత్రం కానుక వేసింది. అది చూచి ప్రభువు శిష్యులతో "అందరికంటె ఈ పేదరాలు ఎక్కువదానం చేసింది. వాళ్లంతా సమృద్ధిగా ఉండి దానం చేసారు. కాని ఈమె లేమిలో ఉండిగూడ దానంచేసింది. తన జీవనాన్నే త్యాగంచేసి కొంది" అన్నాడు. భగవంతునికి మన వస్తువులతో పనిలేదు. అతనికి కావలసింది మన హృదయం. ఆ హృదయాన్ని భగవంతునికి సమర్పించుకొన్నవాడే భక్తుడు - మార్కు 12, 41-43.

8. లాజరు చనిపోయి మళ్ళా బ్రతికినాక ప్రభువు ఓ మారు బెతానియా గ్రామానికి వచ్చాడు. అతడు లాజరుతో విందారగిస్తుండగా మరియ పరిమళద్రవ్యం తీసికొనివచ్చి యేసు పాదాలపై కుమ్మరించింది. పరమ భక్తి భావంతో ఆ పవిత్ర పాదాలను తన తలవెండ్రుకలతో తుడిచింది. ఈ భక్తిక్రియ ద్వారా ఆమె యేసు భూస్థాపనాన్ని సూచించింది. - యోహా 12, 1-3.

9. ఇంకొక మారుగూడ ప్రభువు లాజరు ఇంటికి వచ్చాడు. మార్తతొందరపాటుతో భోజనం తయారు చేస్తుంది. కాని మరియమాత్రం ప్రభువుపాదాల చెంతనే గూర్చుండి నిమ్మళంగా అతని బోధ ఆలిస్తూంది. మార్త చిరాకుతో క్రీస్తు దగ్గరికివచ్చి "ఈ పనంతా నేనే చేసికోవాలి. చెల్లెలినిగూడ వచ్చి కాస్త సహాయం చేయమని చెప్పండి" అంది. కాని ప్రభువు "మార్తా! నీవు ఏమేమో పనులు పెట్టుకొని సతమతమౌతూన్నావు. ఆతుర పడుతూన్నావు. కాని అవసరమైంది ఒక్కటే. భగవంతుని మీద హృదయం నిల్పుకోవడం. మరియ పరలోకంలోని దేవుని మీద మనసునిల్పి నా బోధలు ఆలిస్తూంది. ఆమెను కాదనడందేనికి?" అన్నాడు. అలా ఆ భక్తురాలు మరియ ప్రభువు మన్నలను అందుకొంది - లూకా 10, 32-42.

10. పౌలు పగటిపూట క్రీస్తునిగూర్చి బోధించేవాడు. రాత్రుల్లో డేరాబట్టలు కుట్టుకొని పొట్టకూడు సంపాదించుకొనేవాడు. అతడు ఎవరి డబ్బులమీద ఆధారపడలేదు. కాయకష్టంచేసి బ్రతికాడు. ఆకుల అనే యూద కుటింబీకుడూ అతని భార్య ప్రిస్క పౌలుని పరామర్శించేవాళ్లు. అతడు కొంతకాలం ఆ దంపతుల యింటనే తలదాచుకొన్నాడు. ఆనాటి క్రైస్తవులుగూడ ఈ పుణ్యదంపతుల యింట సమావేశమై ప్రార్థనలు జరుపుకొనేవాళ్ళు. ఈ దంపతులు పౌలుకోసం ప్రాణాలు బలి యీయడానికిగూడ వెనుకాడలేదు. పౌలు ఈ భార్యాభర్తల భక్తి భావాన్ని వేనోళ్ళ కొనియాడాడు - రోమా 16, 3-5.

11. మరియా యోసేపులు క్రీస్తు శిశువుని యెరూషలేము దేవాలయంలో కానుక పెట్టడానికి కొనిపోయారు. ఆ రోజుల్లో అన్న అనే ప్రవక్త్రి దేవాలయానికివచ్చి ప్రభువుని

పూజించుకొంటూండేది. ఆమె యేండ్లుగడచిన వృద్ధురాలు, విధవ. ఉపవాసాలతో ప్రార్థనలు చేసికొంటూ దేవాలయాన్ని విడిచిపోయేదికాదు. ఆమె క్రీస్తు బిడ్డనుజూచి సంతోషంతో దేవునికి ధన్యవాదాలు అర్పించింది. అక్కడి భక్తులకు ఆ శిశువుని చూపించి యెరూషలేముకు రక్షణం కొనివచ్చేది యీ బిడ్డడేనని చెప్పింది. అలా ప్రభుదర్శనంవల్ల ఆ భక్తురాలి హృదయం ద్రవించిపోయింది - లూకా 2, 36-38.

12. స్నాపక యోహాను తల్లిదండ్రులు ఎలిసబేతు జకరియాలు. వీళ్లు వృద్ధులు, భక్తులు. ప్రభువు మోషే ద్వారా యిచ్చిన ధర్మశాస్త్రాన్ని పాటిస్తూ నీతిమంతులుగా జీవిస్తుండేవాళ్లు - లూకా 1, 5-7.

13. కన్యమరియ మహా భక్తురాలు. ఆమె దేవదూత శుభవార్త ద్వారా దేవుని చిత్తాన్ని తెలిసికోగానే "ఇదిగో ప్రభువు దాసురాలిని. ఆయన చిత్తప్రకారమే జరగాలి" అంది. దేవుడు తన్ను కరుణించిన విధానాన్ని తలంచుకొని భక్తిపారవశ్యంతో "నేను పూర్ణహృదయంతో ప్రభుని స్తుతిస్తున్నాను. రక్షకుడైన దేవుణ్ణి తలంచుకొని నిండుమనస్సుతో ఆనందిస్తున్నాను" అని యెలిగెత్తిపాడింది. ప్రభువు ఆమె వినయాన్నీ భక్తిభావాన్నీ మెచ్చుకొన్నాడు. ఆమెకు తన రక్షణాన్ని ప్రసాదించాడు. కనుకనే సకల తరాలవాళ్లూ ఆమెను ధన్యురాలు అని కొనియాడుతున్నారు - లూకా 1, 46-48.

# 23. క్షమాగుణం

తోడి జనాన్ని క్షమించాలి అంటే పాపపు మానవులమైన మనకెంతో కష్టంగా వుంటుంది. కనుక భగవంతుడు మనలను క్షమించి మనంకూడ ఇతరులను క్షమించాలని నేర్పాడు. తోడి జనాన్ని క్షమించినవాడు నరుళ్లాకాదు దేవుళ్లా ప్రవర్తిస్తాడు. అపరాధులను క్షమించడమనేది నూత్నవేదం బోధించే గొప్ప సత్యాల్లో ఒకటి.

1. సోదరులు యోసేపుని బానిసగా అమ్మివేసారు గదా! అతడు ఐగుప్తులో ప్రధానాధికారి అయ్యాడు. కరువురాగా సోదరులు రెండుసారులు ధాన్యంకోసం యోసేపు వద్దకు వెళ్లారు. రెండవసారి యోసేపు నేనే మీ తమ్ముణ్ణని సోదరులకు తెలియజేసికొన్నాడు. ఆ యన్నలు యోసేపుని బానిసగా అమ్మివేసినందుకు అతడు తమమీద పగతీర్చుకుంటాడేమోనని భయపడిపోయారు. కాని యోసేపువారితో "మీరు అనుమానపడకండి. ఆనాడు మీరు నాకు కీడు తలపెట్టారు. కాని ఈనాడు దేవుడు ఆ కీడును మేలుగా మార్చాడు. నేను మీకంటె ముందుగా వచ్చి యిక్కడ ఉండబట్టే నేడు మీరు బ్రతకగలిగారు. నేను మిమ్మూ మీ పిల్లలనూ ఆదరిస్తాను. మీ యపరాధాన్ని పూర్తిగా క్షమిస్తాను" అని చెప్పాడు - ఆది 50, 18-21.

2. యాకోబు మోసంతో యేసావు జ్యేష్ఠభాగం కొట్టేసి మేనమామ దగ్గరికి పారిపోయాడు గదా! అతడు తన భార్యా బిడ్డలతో తిరిగిరాగా యేసావు తమ్మునికి ఎదురువోయాడు. అన్న యెదురు వస్తున్నాడని విని యాకోబు హడలిపోయాడు. యేసావు దగ్గరికివచ్చి ఏడుసారులు నేలమీదికి వంగి దండం పెట్టాడు. యేసావు తమ్ముణ్ణి క్షమించాడు. అతన్ని కౌగిలించుకొని ముద్దాడాడు. అతని భార్యాపిల్లలను ఆదరంతోజూచాడు. - ఆది 33, 1-4.

3. ఓ సేవకుడు తన యజమానునికి పెద్దమొత్తం బాకీ పడ్డాడు. అయినా యజమానుడు దయతలచి అతన్ని మన్నించాడు. ఆ సేవకునికి మరొకడు చిన్న మొత్తం బాకీ పడివున్నాడు. అయినా అతడు తన తోడిదాసుణ్ణి మన్నించకుండా నా డబ్బు చెల్లిస్తావా లేక జైలుకి వెళ్తావా అని కుత్తిక పట్టుకొన్నాడు. యజమానునికి ఈ సంగతి తెలిసింది. అతడు తొలిసేవకుణ్ణి పిలపించి "దుర్మార్గుడా! నేను నిన్ను క్షమించినట్లే నీవూ తోడిదాసుణ్ణి క్షమించవద్దా?" అని మండిపడ్డాడు. అతన్ని కఠినంగా శిక్షించాడు గూడ- మత్త 18, 33.

4. సీమోను అనే పరిసయుని ఇంటిలో క్రీస్తు విందారగిస్తూండగా ఓ పాపాత్మురాలు వచ్చి అతని పాదాలను కన్నీటితో తడిపి తలవెంట్రుకలతో తుడిచింది. ఆ పాదాలను భక్తిభావంతో ముద్దిడుకొని వాటికి పరిమళ ద్రవ్యం పూసింది. ఇదంతా గమనిస్తున్న సీమోను "ఈమె పాపాత్మురాలుకదా! ఈలాంటి అయోగ్యురాలు తన్ను తాకుతుంటే క్రీస్తు చూస్తూ ఊరుకుంటాడేమిటి?" అనుకొన్నాడు. అతని తలపులెరిగి ప్రభువు " ఈమె అధికంగా ప్రేమించింది కనుక ఈమె చాల పాపాలు చేసినా అవన్నీ క్షమించబడ్డాయి" అన్నాడు. ఆమె గాఢమైన భక్తిభావం కలది కనుకనే తన పాపాలన్నిటికి క్షమాపణం పొందింది - లూకా 7, 47.

5. క్రీస్తు సిలువమీద వ్రేలాడుతూ తన్ను హింసించి చంపే శత్రువులకోసం ప్రార్థించాడు. "తండ్రీ వీళ్లేమిచేస్తున్నారో వీళ్లకే తెలియదు. వీళ్లను క్షమించు" అని మనవి చేసాడు. ...లూకా 23, 34.

6. స్తెఫను ఏడ్గురు పరిచారకుల్లో ఒకడు. అతడు మోషే ధర్మశాస్త్రమూ పూర్వవేద దేవాలయమూ ఇక మనలను రక్షింప లేవు, మనలను కాపాడేది ఉత్థానక్రీస్తేనని బోధించాడు. ఈ బోధ యూదుల యాజకులకు గిట్టలేదు. వాళ్ళు అతన్ని బలవంతంగా లాగుకొనివెళ్ళి యెరూషలేము పట్టణం వెలుపల రాళ్ళు రువ్వి చంపారు. అలా చనిపోతూగూడ స్తెఫను శత్రువులను దూషించలేదు. వాళ్లను క్షమించి వాళ్లకోసం ప్రార్థించాడు. "ప్రభో! ఈ పాపాన్ని వీళ్లమీద మోపవద్దు" అని దేవుణ్ణి మనవిచేసాడు. ఈ విధంగా అతడు క్రీస్తుచూపిన మార్గంలోనే పయనించాడు - అచ 7, 59.

7. మనం ప్రార్థనం చేసేపుడు తోడివాళ్ళమీద ఏమైనా మనస్పర్థ వున్నట్లయితే వాళ్లను క్షమించాలి. మనం తోడి జనులను క్షమించకపోతే దేవుడు మనలను క్షమించడు. - మార్కు 11, 25.

# 24. ప్రభుదీవెన

భక్తుడు భగవంతుని అనుగ్రహానికి నోచుకొంటాడు. ప్రభువు అతన్ని దీవిస్తాడు. దానితో అతడు మూడు పూవులూ ఆరు కాయలుగా పెంపుజెందుతాడు. ఇక నరులు కలిగించే ఆటంకాలేమి అతనికి అడ్డురావు. దైవబలం కలవాళ్ళు పక్షిరాజులాగ పై కెగిరి పోతూంటారు.

1. అబ్రాహాము మహాభక్తుడు. ప్రభువుని నమ్మి సొంత దేశమైన కాల్దియాను వదలివచ్చినవాడు. కనుక ప్రభువు అతన్ని దీవించాడు. అతని సంతానం ఇసుకరేణువుల్లాగ, ఆకాశంలోని చుక్కల్లాగ లెక్కల కందనిరీతిగా విస్తరిల్లుతుందని చెప్పాడు. అతనిపేరు అబ్రామునుండి అబ్రాహామునకు మార్చాడు. అబ్రాహాము అంటే అనేక జాతులవాళ్లకు తండ్రి అని అర్థం. అనగా అబ్రాహాము సంతానం తామరతంపరగా వృద్ధి జెందుతుందని భావం. ప్రభువు ఆ భక్తుని కిచ్చిన దీవెన అలాంటిది. - ఆది 17, 5-6.

2. అబ్రాహాము కుమారుడు ఈసాకుగూడ ప్రభుభక్తుడు. కనుక దేవుడు ఈసాకుని దీవింపగా, అతడు వెదవెట్టిందే తడవుగా నూరంతల పంట చేతికివచ్చింది. అతని గొర్రెలమందలు గొడ్లమందలు వృద్ధిలోకి వచ్చాయి. అతని బానిసలు ఆ మందలన్నిటినీ కాస్తూవచ్చారు. ఈసాకు రోజు రోజుకి అభివృద్ధిచెంది మహా సంపన్నుడయ్యాడు. అతని వృద్ధిని చూడగా చుట్టుపట్లవున్న ఫిలిస్టీయులకు పండ్లు పులిసాయి. - ఆది 26, 12-14.

3. యోసేపును చాలమంది అణగద్రొక్కాలని చూచారు. కనానులో అతని అన్నలే అతన్ని పైకిరానీయలేదు. ఐగుప్తులో పోతీఫరు భార్య అతన్ని నాశం జేయజూచింది. అయినా దేవుడు ఆ భక్తునికి తోడుగా వున్నాడు. అతన్ని దీవించాడు. కావుననే యోసేపు శుక్లపక్షంనాటి చంద్రబింబంలాగ వర్ధిల్లుతూ వచ్చాడు. దేవుడు మేలు చేయగోరినవాడికి ఎవడు చెరుపుచేయగలడు? - ఆది 39,2.

4. యూదులకు మందసం పరమ పవిత్రమైంది. దానిలో ప్రభువు మోషేకిచ్చిన పదియాజ్ఞల పలకలుండేవి. దానిమీద ప్రభుసాన్నిధ్యముండేది. దావీదు ఈమందసాన్ని మూడు నెలలపాటు గిత్తీయుడైన ఓబెదెదోము యింటిలో ఉంచాడు. మందసము కారణంగా ప్రభువు ఓబెదెదోమును చల్లనిచూపు చూచాడు - 2 సమూ 6,12.

5. సౌలు దుష్టుడైపోగా యావే దావీదు నెన్నుకొన్నాడు. ప్రభువు సౌలును విడనాడి దావీదుకు తోడ్పడ్డం మొదలెట్టాడు. దానితో సౌలు ముసలిచెట్టులాగ క్షయించి పోయాడు. దావీదు లేతమొక్కలాగ ఏపుగా ఎదిగిపోయాడు. యావే తోడ్పాటువలన దావీదు పట్టిందల్లా బంగారమైంది. అతడు ఎక్కడికెళ్ళినా విజయమే సిద్ధించింది -1 సమూ 18, 12-16.

6. మోషే తరువాత యోషువా యిస్రాయేలు ప్రజలకు నాయకుడయ్యాడు. కాని ప్రజలను ఏలా నడిపించుకొని పోవాలో అతనికి తెలిసిందిగాదు. అప్పుడు ప్రభువు యోషువాతో "నీవు నా యాజ్ఞల ప్రకారం జీవించినట్లయితే నేను నీకు తోడ్పడతాను. నీవు చేసే పనులన్నిటిలోను నీకు తోడైయుంటాను" అని అభయమిచ్చాడు. యావే చెప్పినట్లు యోషువా తరువాత ప్రభుదీవెన పొందాడు - యోషు 1, 8-9.

7. పిశాచం యోబుని నానా కష్టాలపాలు చేసింది. అతని సిరిసంపదలనూ బంధువులనూ ఆరోగ్యాన్నీ మనశ్శాంతినీ గూడ అపహరించింది. అయినా యోబు ప్రభు భక్తిపరాయణుడై ధైర్యంతో నిలిచాడు. ఇక పరీక్ష అయిపోయింది. ప్రభువు యోబుకి సాక్షాత్కారమై అతన్ని దీవించాడు. యోబు మళ్ళా సిరిసంపదలతో అలరాలాడు. అతనికి సంతానం కలిగింది. - యోబు 42, 12.

8. ఓమారు కొందరు తల్లులు చిన్నబిడ్డలను క్రీస్తు వద్దకు తీసికొనివచ్చి వాళ్ళను దీవించమని కోరారు. ప్రభువు పరలోక రాజ్యం ఈలాంటివాళ్లదే అంటూ ఆ బిడ్డలమీద చేతులుచాచి వాళ్లను దీవించాడు. - మత్త 19,15.

9. ప్రభువు మోక్షారోహణమయ్యే గడియ వచ్చింది. అతడు శిష్యులతో బెతానియావరకు వెడలిపోయి అక్కడ చేతులెత్తివారిని ఆశీర్వదించాడు. అలా ఆశీర్వదిస్తూ అతడు పరలోకాని కెక్కిపోయాడు. శిష్యులు ఆయనకు మ్రొక్కి ఆనందంతో యెరూషలేముకు తిరిగి వచ్చారు. - లూకా 24, 50.

10. 1) నీ లోగిట నీ భార్య పండ్లుపండిన
ద్రాక్షతీగలా ఉంటుంది
నీ బిడ్డలు ఓలివు మొక్కల్లా ఎదుగుతారు
ప్రభువుపట్ల భయభక్తులతో మెలిగేవాళ్ళకు
ఈలాంటి దీవెనలు లభిస్తాయి - కీర్త 128, 3-4.

2) నేను చీకటిలోయగుండా పయనించినా
ఏ యపాయానికీ జంకను
నీవు నాకు తోడై యుంటావు
నీ చేతికర్రా, నీ కోలా
నన్ను కాపాడుతూంటాయి - కీర్త 23, 4.

3) నేను విత్తనం నాటాను. మొక్కమొలిచింది. అపొల్లొ వచ్చి మొక్కకు నీళ్ళు పోసాడు. కాని ఆ మొక్క పెరిగేలా చేసేదేమో దేవుడే - 1 కొరి 3,6.

# 25. దంపతులు

దంపతులకు ఒకరిపట్ల ఒకరికి ప్రేమా గౌరవమూ ఆదరమూ ఉండాలి. ఈ గుణాలు లేందే యిద్దరు వ్యక్తులు జీవిత కాలమంతా కలిసిమెలిసి వుండలేరు. కుటుంబ జీవితంతో సతమతమయ్యే ఆలుమగలు బైబులు దంపతులు ప్రదర్శించే ఆదర్శాలను జాగ్రత్తగా గమనించాలి.

1. దేవుడు మొదట ఆదాముని సృజించాడు. అతడు ఒంటరిగా ఉండిపోయాడు. ప్రభువు ఆదామునకు తోడుగా ఉండడానికి ఓ స్త్రీని చేద్దామనుకొన్నాడు. ఆదాముని నిద్రబుచ్చి అతని ప్రక్కటెముక నుండి స్త్రీని తయారుచేసాడు. ఆ స్త్రీని ఆదామునకు చూపించాడు. ఆదాము ఏవనుచూచి ఈమె నా యెముకల్లో యెముక, నా దేహంలో దేహం అనుకొన్నాడు. అనగా ఆమె తనకు దగ్గరిచుట్టమూ ఆప్తురాలూ అని భావం - ఆది 2, 23-24.

2. యాకోబు తన అన్నయయిన ఏసావునుండి పారిపోయి మేనమామ లాబానునింట తలదాచుకున్నాడు. అతనికి లాబాను కొమార్తె రాహేలుపై మనసుపోయింది. ఆమెను పెండ్లి యాడ్డంకోసం మేనమామకు ఏడేండ్లు జీతంచేసాడు. రాహేలు మీదగల వలపుచే ఏడేండ్లుగూడ ఏడు గడియల్లాగ సాగిపోయాయి. ఇంత అయినా లాబాను యాకోబున కిచ్చింది రాహేలు అక్క లెయానుగాని రాహేలునుగాదు. అతడు రాహేలు కోసం ఇంకో ఏడేండ్లు జీతంచేయడానికి ఒప్పుకొన్నాడు. యాకోబుకు రాహేలు మీద ఉన్న ప్రేమ అంత గాఢమైంది - ఆది 29, 20.

3. ఎల్కానాకు అన్నా పెనిన్నా అని ఇద్దరు భార్యలు. పెనిన్నాకు ఇద్దరు బిడ్డలు కలిగారుగాని అన్నా గొడ్రాలుగా ఉండిపోయింది. ఈ యలుసు చూచుకొని పెనిన్నా అన్నాను ఎగతాళిచేసి యేడ్పిస్తూండేది. ఆ రోజుల్లో ప్రభువు గుడారం షిలోలో ఉండేది. ఎల్కానా అతని యిద్దరు భార్యలూ షిలోలో ఉన్న ప్రభువుని సేవించుకోవడానికై యాత్ర వెళ్ళారు. బిడ్డలు కలగలేదన్న విచారంతో అక్కడ అన్నా పెద్దగా దుఃఖించింది. అన్నం తినడంగూడ మానివేసింది. ఎల్కానా ఆమెనోదార్చాడు. "అన్నా! ఈ ఏడ్పు ఈ దిగులు దేనికి? నేను నీకు పదిమంది కుమారుల పెట్టుకాదా? నీకు నా ప్రేమ చాలదా?" అని ఆమెను బుజ్జగించాడు. తరువాత ప్రభువు దయవలన ఆ దంపతులకు సమూవేలు అనే కుమారుడు కలిగాడు - సమూ 1, 6-8.

4. ఈసాకు రిబ్కాను వివాహమాడాడు. ఆమెను నిండు హృదయంతో ప్రేమించాడు. కాలు క్రిందపెట్టనీకుండ చూచుకొన్నాడు. అప్పటికి ఈసాకు తల్లి సారా చనిపోయింది. కాని అతడు రిబ్కావల్ల తల్లిలేని కొరతదీరి ఊరడిల్లాడు - ఆది 24, 67.

5. యూదితు యిస్రాయేలీయుల ఆడపడుచు, విధవ. చాల ప్రజ్ఞావంతురాలు. ఆమె యెరూషలేముమీదికి దండెత్తి వచ్చిన హోలోఫెర్నెసు అనే శత్రుసైన్యాధిపతి శిరస్సు తెగనరుకుకొనివచ్చి పట్టణాన్ని కాపాడింది. యూదితు సౌందర్యాన్ని సాహసాన్నిజూచి చాలమంది ఆమెను పెండ్లియాడాలని ఉవ్విళ్లూరారు. కాని ఆ ధీరురాలు గతించిన తనభర్త మనాష్షేను స్మరించుకొంటూ రెండవ పెండ్లిమానివేసింది. వైధవ్యంతోనే స్వీయగ్రామమైన బెతూలియాలో రోజులు వెళ్లబుచ్చింది. భర్తపట్ల ఆమె చూపిన గాఢానురాగం అలాంటిది - యూదితు 16, 22.

6. సౌలు తన కొమార్తె మీకాలును దావీదుకిచ్చి పెండ్లిచేసాడు. ఓ రాత్రిదావీదు మీకాలు యింటిలో ఉండగా సౌలు అతన్ని చంపివేయాలనుకొన్నాడు. ఆ రాత్రి ఆమె యింటికి కాపుంచాడు. ఉదయాన్నే దావీదును చంపించాలని అతని పన్నాగం. కాని మీకాలు నేర్పుతో ఆరాత్రేదావీదుని కిటికీగుండా వెలుపలికి దింపింది. అతడు సౌలుకు దొరకకుండా పారిపోయాడు 1 సమూ 19, 11-12.

7. దావీదు ప్రవాసంలోవుండగా కర్మెలు కొండపై నాబాలు అనే సంపన్నుడయిన కాపరి ఉండేవాడు. దావీదు తిరిపెంకోసం తన అనుచరులను అతని వద్దకు పంపాడు. కాని నాబాలు వట్టి మూర్ఖుడు. అతడు దావీదు జనాన్ని అవమానపరచి వెనుకకు పంపాడు. కనుక దావీదు అతని యనుచరులూ నాబాలుని మట్టుపెట్టడానికి పయనమై వస్తున్నారు. కాని నాబాలు భార్య అబిగాయిలు చాల తెలివితేటలుకలది. ఆమె యీ సంగతంతా తెలిసికొని గబగబ కానుకలు సిద్ధం చేసికొనివచ్చి త్రోవలో దావీదును కలసి కొంది. మూర్ఖుడైన తన పెనిమిటిని మన్నించమని వేడుకొంది. ఆమె ముఖంజూచి దావీదు నాబాలును క్షమించి వదలివేసాడు. ఆ రీతిగా ఆమె ఆనాడు పెనిమిటి ప్రాణాలు కాపాడింది. తరువాత నాబాలు చనిపోగా దావీదు ఆమెను పెండ్లియాడాడు - 1 సమూ 25, 32-35.

8. స్నాపక యోహాను తల్లిదండ్రులు ఎలిసబేత్తు జకర్యాలు. ఎలిసబేత్తు గొడ్రాలుగా వుంది. అయినా ఆ భార్యాభర్తలు నిర్మల జీవితం జీవిస్తూండేవాళ్లు. దేవుని ఆజ్ఞలు పాటిస్తూండేవాళ్లు. వృద్ధులైన ఆ పుణ్యదంపతులకు తర్వాత యోహాను పుట్టాడు 1, 5-7.

# 26. పశ్చాత్తాపము

నరులు బలహీనతలవల్ల పాపంచేస్తూంటారు. కాని భగవంతుడు పాపాన్ని అసహ్యించుకొన్నంతగా మరిదేన్నీ అసహ్యించుకోడు. అతడు మహా పవిత్రుడైన దేవుడు.

ఆ ప్రభువు తన భక్తులకు పశ్చాత్తాపమనే వరాన్ని ప్రసాదిస్తూంటాడు. ఈ వరంతో భక్తులు రోజురోజుకి హృదయశుద్ధిని పొందుతుండాలి.

1. దావీదు ఊరియాభార్య బత్షెబాను ఆశించాడు. ఊరియాను చంపించి ఆమెను తన భార్యను చేసికొన్నాడు. అప్పుడు ప్రభువు పంపగావచ్చి నాతానుప్రవక్త రాజును మందలించడానికై ఓ కథ చెప్పాడు. ఓ వూరిలో ఓ పేదవాడూ ఓ ధనవంతుడూ ఉన్నారు. ధనవంతునికి గొర్రెల మందలు చాలా ఉన్నాయి. పేదవానికి ఒక్క గొర్రెపిల్ల మాత్రమే ఉంది. ఓ దినం ధనవంతుని యింటికి చుట్టంరాగా అతడు తన గొర్రెల నంటుకోకుండా దౌర్జన్యంతో పేదవాని గొర్రెపిల్లను కోయించి బందుగునికి భోజనం తయారు చేయించాడు - అని చెప్పాడు. ఆ మాటలకు దావీదు మండిపడి అలాంటి పాడుపని చేసినవాణ్ణి దండించాలి అన్నాడు. అతడు నాల్గువంతులు నష్టపరిహారం గూడ చెల్లించాలి అన్నాడు. అప్పుడు ప్రవక్త రాజుతో - ఆపాడు పని చేసినవాడవు నీవే. నీకు ఇంతమంది భార్యలుండగా వూరియా భార్యను గూడ అపహరించావు. నీవు చేసిన ఈ చెడుపని ప్రభువుకి నచ్చలేదు - అని అన్నాడు. దావీదు అంతరాత్మ ఆతన్ని మందలించింది. అతడు పశ్చాత్తాపపడి ప్రభువుని మన్నింపు అడుగుకొన్నాడు -2 సమూ 12, 1-13.

2. స్నాపక యోహాను క్రీస్తుకు ముందుగా వచ్చాడు. క్రీస్తుకు త్రోవ సిద్ధం చేయడం అతనిపని. అతడు "దైవరాజ్యం సమీపంలో ఉందిగనుక పశ్చాత్తాపపడండి" అని బోధించాడు. ఇక్కడ దైవరాజ్యమంటే క్రీస్తే. యూద ప్రజలు తరతరాలనుండి ఎదురుచూస్తూవచ్చిన మెస్సీయా రానే వచ్చాడు. కనుక ప్రజలు తమ పాపాలకు పశ్చాత్తాపపడి హృదయం మార్చుకొని అతని బోధలు ఆలించాలి అని భావం. తర్వాత క్రీస్తువచ్చాక అతడు కూడ పై యోహాను వాక్యంతోనే తన బోధ ప్రారంభించాడు - మత్త 3, 2;4, 17.

3. ఓ కాపు తనతోటలో అంజూరపు చెట్టును పెంచాడు. కాని మూడేండ్లు గడిచినా దానికి కాపు పట్టలేదు. అతడు దానిపై కోపించి తోటమాలితో ఆ చెట్టును నరికివేయమని చెప్పాడు. కాని తోటమాలి అతనితో ఇంకొక్కయేడు చూద్దాం. దానిచుట్టూ త్రవ్వి యెరువువేద్దాం. అప్పటికీ కాపు దిగకపోతే కొట్టిపారేద్దాం అన్నాడు. ఏమిటి ఈ యుపమాన భావం? సకాలంలో పరివర్తనమనే ఫలితమీయని నరుడే యీ చెట్టు. న్యాయాధిపతియైన దేవుడు పశ్చాత్తాపపడని పాపాత్ముణ్ణిజూచి కోపగించు కొంటాడు - లూకా 13, 6-9.

4. పేత్రు ప్రభువుని ఎరుగనని ముమ్మారు బొంకాడు. అటుతరువాత అతడు మంటదగ్గిర కూర్చుండి చలిగాచుకొంటున్నాడు. అప్పుడు యేసుని బంధించి తీసికొని

వెళ్తున్నారు. ప్రభువు తన్నెరుగనని బొంకి ధీమాగా కూర్చొని ఉన్న పేత్రువైపు అలా తేరిపారజూచాడు. అంతకుముందే ప్రభువు పేత్రుతో "ఈ దినం నీవు నన్నెరుగనని మూడు సార్లు బొంకుతావు" అని చెప్పాడు. పేత్రుకి దిఢీలున ఆ విషయం గుర్తుకి వచ్చింది. ప్రభువు చూపు అతనిలో పశ్చాత్తాపం పుట్టించింది. అతడు గురువుని ఎరుగనని బొంకాను గదా అని వెలుపలకిబోయి విచారంతో వెక్కివెక్కి యేడ్చాడు - లూకా 22, 62.

5. ఓమారు ఓ పరిసయుడూ ఓ సుంకరీ ప్రార్థన జేసికోవడానికి దేవాలయానికి వెళ్ళారు. పరిసయుడు దేవుని ముందు తన్నుతాను పొగిడేసుకొన్నాడు. తాను మంచి వాణ్ణేననుకొని తనలోతాను సంబరాలు పడ్డాడు. కాని సుంకరి చిత్తశుద్ధితో "ప్రభో! నేను పాపిని. నన్ను కరుణించు" అని మనవిచేసాడు. దేవుడు సుంకరి మొర ఆలించాడు, పరిసయుణ్ణి త్రోసిపుచ్చాడు - లూకా 18,13.

6. క్రీస్తుతోపాటు ఇద్దరు దొంగలనుకూడ సిలువమీద కొట్టిచంపారు. వాళ్లల్లో ఒకడు పశ్చాత్తాపపడకుండానే మరణించాడు. పైగా అతడు "నీవే క్రీస్తువైతే మొదట నిన్ను నీవు రక్షించుకో. అటుపిమ్మట మమ్ముగూడ రక్షించు" అని సవాలు చేసాడు. కాని రెండవ దొంగ పశ్చాత్తాపపడ్డాడు. అతడు మొదట తన తోడి దొంగను మందలించాడు. మన పాపాలకు తగిన శిక్ష అనుభవిస్తూగూడ ఈ వెర్రివాగుడేమిటి అని అతని నోరు మూయించాడు. అటుతరువాత ప్రభువుతో "అయ్యా! నీవు తప్పకుండా మోక్షరాజ్యానికి వెళ్తావు. అక్కడికి చేరాక నన్నుకూడ జ్ఞాపకముంచుకో" అని మనవి చేసాడు - లూకా 23, 39-43.

7. దుడుకుచిన్నవాడు తండ్రి ఆస్తిలో తన వాటా తీసికొని దూరదేశాలకు వెళ్ళిపోయాడు. అక్కడ దూబరా ఖర్చులతో సొత్తంతా పాడుచేసికొన్నాడు. ఆ దేశంలో పెద్ద కరువు రాగా తినడానికి తిండిలేక మలమలమాడి చచ్చాడు. అప్పుడు అతనికి బుద్ధివచ్చింది. ఇంటివద్ద తన్ను ప్రేమతో చూచుకొనే నాన్నను వీడి వచ్చినందుకు పశ్చాత్తాపం పుట్టుక వచ్చింది. అతడు "నేను మా నాన్న దగ్గిరికి వెళ్లి మన్నింపు అడుగుకొంటాను. ఇక మీదట నేను నీ కుమారుణ్ణి అన్పించుకోవడానికి తగను. నన్ను నీ సేవకుల్లో ఒకణ్ణిగానైన చేర్చుకో. ఏదో కమికెడు కూడు తిని బ్రతికిపోతాను అని చెప్తాను" అనుకొన్నాడు. పాపమంటే యీ దుడుకు చిన్నవాడిలాగ తండ్రియైన దేవునివద్దనుండి వెళ్ళిపోవడం. సృష్టికర్తను వీడి సృష్టి వస్తువులేమో మనలను సుఖపెడతాయనుకొని వాటి దగ్గరికి వెళ్లిపోవడం. పశ్చాత్తాపమంటే ఆ దుడుకుచిన్నవాడిలాగే మరల తండ్రియైన దేవుని యింటికి తిరిగిరావడం. ఆ తండ్రి యనురాగాన్ని పొందడం - లూకా 15, 17-19.

8. క్రీస్తునాడు పాలస్తీనా దేశం రోమను సామ్రాజ్యం అధీనంలో ఉండేది. యూదులు రోమను ప్రభుత్వానికి కప్పం గట్టేవాళ్లు. స్థానికంగా కొందరు యూదులు పాలస్తీనాలోని ఒక్కో మండలంలోను ఈ కప్పానికి పాటపాడేవాళ్ళు. వాళ్ళు ప్రజలవద్దనుండి పెద్ద మొత్తాలు వసూలుజేసి వానిలో కొంత భాగంమాత్రమే రోమను ప్రభుత్వానికి ముట్టజెప్పేవాళ్ళు. మిగతాడబ్బు వాళ్లు కొట్టేసేవాళ్లు. ఈ కాయిదాదారులకే సుంకరులు అని పేరు. ఈ సుంకరులు చేసే మోసానికి వీళ్ళను "పాపాత్ములు" అని పిలిచేవాళ్లు. యెరికొమండలములోని సుంకరులకు నాయకుడు జక్కయ. ఓమారు ప్రభువు యెరికో పట్టణానికి వచ్చి జక్కయను సందర్శించాడు. దానితో అతనికి పశ్చాత్తాపం కలిగింది. అతడు తాను నోళ్ళుగొట్టి సంపాదించిన సొత్తులో సగం పేదలకు దానం జేసాడు. పైగా ఎవరెవరికి వ్యక్తిగతంగా అన్యాయం చేసాడో వాళ్ళందరికి నాల్గువంతులు నష్టపరిహారంగూడ చెల్లించాడు. ప్రభువు అతని పశ్చాత్తాపానికి మెచ్చుకొని నేడు ఈ యింటికి రక్షణ లభించింది అని పల్కాడు - లూకా 19, 1-10.

9. పౌలు యూదుడుగా ఉన్నప్పుడు క్రైస్తవులను హింసించాడు. దమస్కు త్రోవలో ప్రభువు ప్రత్యక్షం కాగా పౌలు మనసు మార్చుకొని క్రీస్తు శిష్యుడయ్యాడు. అతడు క్రీస్తుకు ఎంతో సేవ చేసాడు. కొరింతులాంటి గ్రీకు పట్టణాల్లో క్రైస్తవ సమాజాలు స్థాపించాడు. తీతు తిమోతీలవంటి శిష్యులను ప్రోగుజేసాడు. మహత్తరమైన భక్తిభావాలతో పదునాల్గు జాబులు వ్రాసాడు. ఇంతసేవ చేసినంక చివరిరోజుల్లో గూడ పౌలు తాను మహా పాపిననుకొని పశ్చాత్తాపపడ్డాడు. "పాపాత్ముల్లో నేను మొదటివాణ్ణి. అయినా నాలాంటి పాపిని మన్నిస్తే ఇక భవిష్యత్తులో రాబోయే పాపాత్ములు నన్నుజూచి ధైర్యం తెచ్చుకొంటారనుకొని వాళ్ళకు ఆదర్శంగా ఉండడం కోసం ప్రభువు నన్ను మన్నించాడు" అని వ్రాసికొన్నాడు. ఈలా పౌలు తానెప్పుడో క్రైస్తవులను హింసించినందుకు జీవితాంతమువరకూ పశ్చాత్తాపపడ్డాడు -1 తిమో 1, 50-16.

10. 1) పాపి మరణించడం వలన నాకు సంతోషం కలుగదు.
అతడు మనసు మార్చుకొని బ్రతకడంవలన నాకు
సంతోషం కలుగుతుంది - యెహె 23,11.

2) దేవా! నాలో నిర్మల హృదయాన్ని సృజించు
క్రొత్త అంతఃకరణాన్ని నాలో నెలకొల్పు
నీ సన్నిధినుండి నన్ను గెంటివేయకు
నీ పరిశుద్ధాత్మను నా యొద్దనుండి తీసివేయకు - కీర్త 51, 10-11.

# 27. దయ

భగవంతునిలో కన్పించే ఓ కల్యాణగుణం, దయ. ఆ భగవంతుణ్ణి చూచి నరుడుకూడ దయతో ప్రవర్తించడం నేర్చుకోవాలి. ఇతరులపట్ల ఖచ్చితంగా ప్రవర్తించడమూ, ఇతరులను ప్రశిక్షణలో ఉంచుకోవడమూ సులభం. కాని ఇతరుల యెడల దయతో మెలగడం కష్టం. అయినా దయాగుణం అలవర్చుకొన్నవాడే దొడ్డవాడు.

1. అబ్రాహాము తన కుమారుడు ఈసాకునకు పిల్లను వెదకడానికై సేవకుణ్ణి పంపాడు. అతడు ఒంటెలతో వెళ్ళి ఆరాము అనే గ్రామం చేరుకొని ఆ యూరి దిగుడుబావివద్ద దిగాడు. అప్పుడు అబ్రాహాము తమ్ముని కుమారుడైన బెతువేలుని కుమార్తె రిబ్కా బావికి నీళ్ళకు వచ్చింది. ఆ వచ్చిన వ్యక్తి అబ్రాహాము సేవకుడని ఆమెకు తెలియదు. ఆ బాలిక అతనికి నీళ్లు చేది యిచ్చింది. దయతో అతని ఒంటెలకుగూడ నీళ్లు తెచ్చిపోసింది. తరువాత ఆ యువతిని ఈసాకునకిచ్చి పెండ్లిచేయడం జరిగింది - ఆది 24, 18-19.

2. సౌలు దావీదును చంపాలని చూస్తున్నాడు. అతన్ని పట్టుకోవడానికై ఎంగెడీ ఎడారి అంతా గాలిస్తున్నాడు. ఓమారు సౌలు మలవిసర్జనకై ఆ ఎడారిలోని ఓ కొండ గుహలో ప్రవేశించాడు. అంతకు ముందే దావీదు తన అనుచరులతో ఆ గుహలో దాగివున్నాడు. అలా తలవని తలంపుగా గుహలోనికి వచ్చిన సౌలునుజూచి అతన్ని చంపివేయమని మిత్రులు దావీదుకు సలహా యిచ్చారు. కాని రాజుపై గల గౌరవంచే దావీదు అతన్ని ముట్టుకోలేదు. సౌలు తనకు దొరికిపోయాడు అనడానికి ఆనవాలుగా దావీదు అతని ఉత్తరీయపు చెంగుమాత్రం కత్తిరించుకొన్నాడు. అలా దావీదు తనపట్ల దయజూపి తన బొందిలో ప్రాణాలు నిలిపినందుకు సౌలు చాల ఆశ్చర్యపడ్డాడు. 1 సమూ 24, 11-16.

3. సౌలు కుమారుడైన యోనాతాను దావీదునకు మిత్రుడు. ఈ యోనాతాను కుమారుడు మెఫిబోసెతు. ఇతడు అవిటికాలివాడు. సౌలు కుటుంబమంతా యుద్ధంలో నాశమైపోయాక దావీదు మెఫిబోసెతును పిలిపించి అతని మీద దయజూపాడు. అతన్ని రోజూ తన సరసన కూర్చుండి భోజనం చేయమని చెప్పాడు. అలా రాజాదరణ పొందిన మెఫిబోసెతు "నేను చచ్చిన కుక్కలాంటివాణ్ణి గదా! దావీదు ప్రభువు నాపట్ల యింత కరుణ జూపాలా" అని విస్తుపోయాడు -2 సమూ 9, 7-8.

4. రూతు నవోమికి కోడలు. ఈ నవోమి బోవసు బంధువురాలు. బోవసు ధనవంతుడు. నవోమి పేదరాలు. ఓ దినం రూతు బోవసు పొలంలో పరిగలేరుకోవడానికి పోయింది. బోవసు ఆమెను కరుణతోజూచి పరిగలేరుకో నిచ్చాడు. తన కూలివాళ్లతోగూడ ఆమెను బాధించవద్దని చెప్పాడు. ఆమెకు దాహమైనప్పుడు కూలివాళ్ళు చేదుకొని వచ్చిన

కుండల్లోని నీళ్ళు త్రాగమని చెప్పాడు. అతని కారుణ్యానికి రూతు ఎంతో సంతోషించింది - రూతు, 2, 8-9.

5. పౌలు ఓడపై ప్రయాణం చేస్తుండగా తుఫాను వచ్చి ఆ వోడ మునిగిపోయింది. అతడూ అతని యనుచరులూ ఒడ్డుజేరి మాల్టాదీవి చేరుకొన్నారు. ఆ ద్వీపవాసులు పౌలును ఆదరంతో జూచారు. అప్పుడు చలిగా వున్నందున మంటలువేసి అతన్ని పరామర్శించారు - అచ 28,చ 1-2.

6. ఓ యజమానునికి ఓ సేవకుడు పెద్దమొత్తం బాకీపడి ఉన్నాడు. యజమానుడు అతనిమీద దయతలచి బాకీని మన్నించాడు. ఆ సేవకుని ఇంకో సేవకుడు చిన్న మొత్తం బాకీపడి ఉన్నాడు. అయినా అతడు తనతోడి సేవకుణ్ణి మన్నించలేదు. బాకీ చెల్లించవా అని అతన్ని చెరలో వేయించాడు. ఆ సంగతి తెలిసికొని యజమానుడు మొదటి సేవకుణ్ణి పిలిపించి "ఓయీ! నేను నీయెడల దయచూపినట్లే నీవూ తోడి సేవకునియెడల దయజూపవద్దా?" అని అతన్ని కఠినంగా శిక్షించాడు- మత్త 18, 33.

## 28. పని

మనకు పనిచేయాలంటే యిష్టంగా ఉండదు. పని నుండి తప్పించుకొంటే యెంతోగొప్ప అనుకొంటాం. కాని బైబులు భగవంతుడు స్వయంగా పనిచేసేవాడు. ఆ భగవంతునిలాగే అతని భక్తుడుకూడ పనిచేయాలి. చివరికి మనలను రక్షించేదీ శిక్షించేదీగూడ మనం చేసే పనే.

1. దేవుడు ఆరునాళ్లు పనిచేసి భూమ్యాకాశాలనూ వాటిలో ఉండే సకల ప్రాణులనూ సృజించాడు. ఏడవనాడు పనిచాలించి విశ్రాంతి తీసికొన్నాడు. ఏడవరోజును దీవించి దాన్ని పవిత్ర దినంగా చేసాడు - ఆది 2, 1-3.

2. ఆదాము పాపంచేయకముందుగూడ ఏదెను తోటలో పని చేస్తూండేవాడు - ఆది 2, 15. అయినా ఆ పని అతనికి కష్టమనిపించలేదు. ఇక ఆదాము పాపంచేసాక నొసటి చెమటోడ్చి పొట్టకూడు సంపాదించుకొమ్మని దేవుడతన్ని శపించాడు. ఈ శాప ఫలితంగా ఆదామునకు పనిభారమనిపించింది. నాటినుండి నేటివరకు నరులందరికీ పని అంటే అనిష్టంగానే ఉంటుంది - ఆది 3, 19.

3. చీమలనుచూచి సోమరియైన నరుడు జ్ఞానం తెచ్చుకోవాలి. చీమలకు నాయకుడూ లేడు, తనిఖీదారుడూ లేడు. అయినా అవి సోమరితనంతో కాలం వెళ్లబుచ్చవు. పంటకాలం రాగానే ఆహారం నిల్వజేసికొంటాయి. ఆ యాహారంతో సంవత్సరమంతా హాయిగా బ్రతుకుతాయి. ఈలాగే నరుడుగూడ కృషిచేస్తే ఆ కృషి ఫలితంగా బ్రతికి పోతాడు - సామె 6, 6-8.

4. క్రీస్తు తానుచేసిన పనులన్నీ చక్కగాజేసి ముగించాడు. అతడు ఇతరులకు ఉపకారంజేస్తూ పర్యటనం జేసాడు - అచ 10.38.

5. మనం చేసేపనులు మంచివైయుండాలి. మంచి పనులు ఓ దీపంలా ప్రకాశిస్తాయి. ఆ వెలుగునుజూచి తోడి జనులు పరలోకంలోని దేవుణ్ణి కొనియాడతారు - మత్త 5,16.

6. మనం చేయవలసిన పనంతాచేసి ముగించాక గూడ గొప్పలు చెప్పుకోగూడదు. మేము అది చేసాం యిది చేసాం అని డప్పువాయించుకోగూడదు. మన బాధ్యత ప్రకారం చేయవలసిన పని చేసినపిదపగూడ "మేము అయోగ్యులమైన సేవకులం. మా కర్తవ్యం ప్రకారం చేయవలసినపని చేసాం. మేము అధికంగా చేసిందే ముంది?" అనుకోవాలి - లూకా 17.10.

7. క్రీస్తు తన తండ్రి చిత్తప్రకారం జీవించాడు. తాను చేసిన పనులన్నీ తండ్రి చిత్తాన్ననుసరించే చేసాడు. అతడు "నన్ను పంపిన తండ్రి చిత్తాన్ని నెరవేర్చడమూ ఆయన పనిని పూర్తిచేయడమూ నా యాహారంగా భావిస్తాను" అని యన్నాడు - యోహా 4,24.

8. మంచిచెట్టు మంచిపండ్లనూ, పాడుచెట్టు పాడుపండ్లనూ కాస్తాయి. పండ్లనుబట్టి చెట్టు ఏలాంటిదో తెలిసిపోతుంది. అలాగే మనంచేసే పనులనుబట్టే మనమేలాంటి వాళ్లమో తెలిసిపోతుంది - మత్త 7, 16, 30.

9. పౌలు బ్రతికివుండగా క్రీస్తు మళ్ళా రెండవ మారు విజయంచేసే కాలం ఆసన్నమైంది అనే వదంతి బయలుదేరింది. ఆ వదంతిని ఆసరాగా దీసికొని కొంతమంది పనిపాటలు మానేసి గాలికి తిరగడం మొదలెట్టారు. తెస్సలోనిక పట్టణంలో ఈలాంటి పోస్కోలు రాయుళ్లు కొంతమంది పౌలు కంటబడ్డారు. అతడు వాళ్ళను నిశితంగా మందలించాడు. "పని చేయనివాడు కూడు దినడానికి అర్హుడుకాడు" అని శాసించాడు - 2 తెస్స 3,10.

10. పౌలుకు చివరిరోజులు సమీపించాయి. అతడు తన జీవితాన్నంతటినీ ఓమారు సమీక్షించి చూచుకొన్నాడు. తాను వ్యర్థంగా కాలంగడపలేదనీ ప్రభువుకోసం ఏదో కొంత సాధించాననీ సంతృప్తిచెందాడు. ఇంకా అతడు ఈలా అనుకొన్నాడు - "ఇంతకాలమూ నేను మంచి పోరాటమే పోరాడాను. పందెంలో చక్కగా పరుగెత్తాను. ప్రభువుమీద విశ్వాసం నిలుపుకొన్నాను. ఇప్పుడు నాకు పందెపు బహుమానం లభిస్తుంది. న్యాయాధిపతియైన ప్రభువు నాకు నీతిమంతుల కిరీటాన్ని బహూకరిస్తాడు. ఒక్కనాకేగాదు, ప్రభువు కొరకు పనిచేసి ఆయన దర్శనంకోసం వేచివున్న భక్తులందరికీ ఈలాంటి కిరీటం లభిస్తుంది" -2 తిమో4, 7-8.

# 29. విశ్వాసం

భగవంతుని మీద భక్తి అంటే ఏమిటి? ఆ ప్రభుని నమ్మి ఆతన్ని ఆశ్రయించడం. కనుక నమ్మికలేందే దేవుని మీద భక్తి కుదరదు. ప్రస్తుతం మనం భగవంతుణ్ణి కంటితో చూడలేం. కేవలం విశ్వాసం ద్వారానే అతన్ని అంగీకరించాలి. భగవంతుణ్ణి నమ్మినవాళ్ళకి ఈ జీవితంలోని సుఖదుఃఖాలద్వారా అతడు రోజురోజుకీ అనుభవానికి వస్తూనే ఉంటాడు.

1. అబ్రాహాము కాల్దియాదేశ నివాసి. ప్రభువు అతన్ని "నీ దేశాన్ని నీ చుట్టపక్కాలనూ వదలి నావెంట రమ్మని పిల్చాడు. అబ్రాహాముకి తానెక్కడికి వెళ్ళాలో యేమిచేయాలో ఏమీ తెలియదు. అయినా అతడు ప్రభునినమ్మి అతనివెంట వచ్చేసాడు. ఇది యతని విశ్వాసంలో మొదటి మెట్టు - ఆది 12, 1.

ఈ అబ్రాహాముకి సంతానం కలుగలేదు. అతడూ అతని భార్య సారా వృద్ధులు. అయినా అతడు ప్రభుని నమ్మాడు. ప్రభువు అబ్రాహాముకి సంతానం కలిగిస్తానని చెప్పాడు. పైగా అతని వంశీయులు ఆకాశంలోని చుక్కల్లాగ, సముద్రతీరమందలి యిసుకరేణువుల్లాగ వృద్ధి చెందుతారని మాటయిచ్చాడు. అబ్రాహాము దేవునిమాట నమ్మాడు. ఆ నమ్మికనుబట్టే దేవుడు అతన్ని నీతిమంతునిగా ఎంచాడు. ఇది అతని విశ్వాసంలో రెండవమెట్టు -15, 5-6.

ఆ మీదట ప్రభువు అబ్రాహాముని తన యేకైక కుమారుడైన ఈసాకుని బలియీయమని కోరాడు. ఆ ముసలి ప్రాయంలో ఈసాకు గతిస్తే అతనికి మరో కుమారుడు పుడతాడా? అయినా అతడు దేవుణ్ణినమ్మాడు. తన కుమారుణ్ణి ప్రభువు ఏలాగైనా బ్రతికించకపోతాడా అనుకొన్నాడు. అతడు ఈసాకును బలి యీయడానికి పూనుకొన్నాడు. ప్రభువు మాత్రం ఒక పొట్టేలిని బలిగా స్వీకరించి ఈసాకును వదలివేసాడు. ఇది యతని విశ్వాసంలో మూడవమెట్టు. ఈలా అబ్రాహాము విశ్వాసంతో జీవించిన నీతిమంతుడు - ఆది 22, 11-13.

2. ప్రభువు యిస్రాయేలు ప్రజలకు ఎడారిలో మన్నా కురిపించాడు. అయినా ఆ యాహారం వాళ్ళకు రుచించలేదు. చవీసారమూ లేని ఈ యన్నం ఎవరికి కావాలి అని వాళ్ళు మోషేమీద తిరగబడ్డారు. అప్పుడు ప్రభువు ప్రజలపై కోపించి నిప్పుపాములు పంపాడు. అవి కరవగా వాళ్ళల్లో చాలమంది చచ్చారు. అప్పుడు ప్రజలు మోషేను ప్రార్థింపగా అతడు దేవుని యాజ్ఞపై ఓ యిత్తడిపామును చేయించి దాన్ని ఓ యెత్తయిన గడెమీద వ్రేలాడ దీయించాడు. పాములు కరచిన వాళ్ళంతా నమ్మికతో ఆ యిత్తడి పామువైపు చూడగా విషంవిరిగి బ్రతికిపోయారు. ఒట్టినే యిత్తడిపామువైపు చూడ్డంవల్లకాదు, ఆ పామువైపు చూడమని చెప్పిన దేవుని ఆజ్ఞను నమ్మడంవల్ల వాళ్ళకు చావు తప్పింది - సంఖ్యా 21, 8-9.

3. సిరియాదేశపు సైన్యాధిపతియైన నామాను కుష్ఠ వ్యాధిని నయంజేయించు కోవడానికై యిస్రాయేలు ప్రవక్త ఎలీషా వద్దకు వచ్చాడు. ప్రవక్త అతన్ని యోర్దానునదిలో స్నానం చేయమని చెప్పాడు. కాని నదిలో స్నానంచేస్తే కుష్ఠ పోతుందనే నమ్మకం నామానుకు లేదు. కనుక అతడు తిరిగి సిరియాకు వెళ్ళిపోబోతున్నాడు. కాని నామాను సేవకుడు ప్రవక్తమాట నమ్మాడు. అతడు తన యజమానునికి నచ్చ జెప్పి అతనిచేత ఏటిలో స్నానం చేయించాడు. దానితో నామానుకు కుష్టపోయింది 2-రాజు 5, 13-14.

4. గొల్యాతు మహావీరుడు. దావీదు చిన్నకుర్రవాడు. కాని గొల్యాతు ఆయుధాలను నమ్ముకొన్నాడు. దావీదు యావే ప్రభువుని నమ్ముకొన్నాడు. సామాన్య పరిస్థితుల్లో గొల్యాతులాంటి వీరుడు దావీదును పేలపిండి చేయవలసింది. కాని దైవబలాన్ని నమ్ముకొన్న దావీదు గొల్యాతుని పచ్చడిచేసాడు. చివరికి నవ్విన నాపచేనే పండింది - 1సమూ 17,45.

5. యోబుని పిశాచం నానా శ్రమలతో బాధిస్తూంది. యోబు మిత్రులు అతడు దుర్మార్గుడైయుండాలి అనుకొన్నారు. యోబు భార్య దేవుణ్ణి శపించమని భర్తను రెచ్చగొట్టింది. ఆలాంటి పరిస్థితుల్లోగూడ యోబు దేవునిమీద నమ్మిక కోల్పోలేదు. అతడు "ప్రభువు నన్ను చంపినాసరే నేను అతన్ని నమ్మితీరతాను" అన్నాడు - యోబు 13, 15.

6. యేసు చనిపోయిన లాజరుని బ్రతికించడానికి వచ్చాడు. లాజరుని ఓ కొండగుహలో పాతిపెట్టి రాతితో మూసి ఉంచారు. ప్రభువు ఆ రాతిని తొలగించమన్నాడు. మార్త "ప్రభూ లాజరు చనిపోయి నాల్గురోజులైంది. అతని శరీరం ఇప్పటికల్లా కంపుకొడుతూంటుంది" అంది. ప్రభువు ఆమెతో "మార్తా! నీవు నా పలుకులు విశ్వసించావంటే దేవునిశక్తి ఏలాంటిదో చూస్తావు" అన్నాడు. మార్త క్రీస్తుమాట విశ్వసించింది. అపుడు ప్రభువు లాజరుని వెలుపలికిరమ్మని పిల్వగానే అతడు సజీవుడై సమాధి నుండి వెలుపలికి వచ్చాడు - యోహా 11, 40.

7. ఓమారు ఓ తండ్రి పిశాచం సోకిన కుమారుణ్ణి శిష్యులవద్దకు తీసికొనివచ్చాడు. కాని శిష్యులు అతన్ని స్వస్థపరచలేకపోయారు. తర్వాత తండ్రి ఆ చిన్నవాణ్ణి క్రీస్తువద్దకు తీసికొని రాగా ప్రభువు అతనికి పట్టివున్న దయ్యాన్ని పారద్రోలాడు. అటుపిమ్మట శిష్యులు ఏకాంతంగా క్రీస్తుదగ్గరికివచ్చి ఆ భూతాన్ని మేమెందుకు వెళ్ళ గొట్టలేకపోయామో చెప్పమని అడిగారు. ప్రభువు "మీకు చాలినంత విశ్వాసంలేదు కనుకనే పిశాచం మీ మాట వినలే" దని పల్కాడు - మత్త 18, 19-20.

8. ఓ రాత్రి శిష్యులు గలిలయ సరస్సులో పడవమీద ప్రయాణం చేస్తున్నారు. వేకువజామున ప్రభువుగూడ నీళ్లమీద నడుస్తూ వాళ్ళదగ్గరికి వచ్చాడు. ప్రభువునిజూచి పిశాచ మనుకొని భయపడి వాళ్ళంతా కెవ్వున కేకవేసారు. ప్రభువు తన్నెరుకపరచుకొని వాళ్లకు ధైర్యంచెప్పాడు. అపుడు పేత్రు తనూ నీటిమీద నడచి ప్రభువు దగ్గరికి వెళ్లాలనుకొన్నాడు. అతడు నీటిమీద కొన్ని అడుగులు బాగానేవేసాడు. కాని అంతలోనే అతనికి అనుమానం పుట్టుకవచ్చింది. అతని విశ్వాసం గూడ సన్నగిల్లిపోయింది. వెంటనే అతడు నీటిలో మునిగిపోవడం మొదలెట్టాడు. ప్రభో నన్ను రక్షించు అని అరచాడు. ప్రభువు చేయిచాచి అతన్ని పట్టుకొని "పేత్రూ! నీవు అల్పవిశ్వాసివి. నీవు సందేహించకుండా ఉన్నట్లయితే నా వద్దకు నడిచివచ్చేవాడివే గదా!" అన్నాడు - మత్త 14, 30-31.

9. ఇంకోమారు పేత్రు రాత్రంతా చేపలు పట్టాలని ప్రయత్నం చేసాడుగాని, అతనికి ఓ పక్కెపిల్లగూడ దొరకలేదు. తర్వాత ప్రభువు అతన్ని పిలిచి లోతులోకి వల విసరమన్నాడు. పేత్రు ప్రభువుమాటనమ్మి లోతులోకి వలవిసిరాడు. వెంటనే వల పిగిలిపోయేటంతగా చేపలు పడ్డాయి. అదిచూచి పేత్రు ఆశ్చర్యపోయి "ప్రభో! నేను పాపిని. నన్ను విడిచి వెళ్లిపో" అని అరిచాడు. - లూకా 5, 4-6.

10. ఓ తడవ ఓ తండ్రి మూగదయ్యం పట్టిన కుమారుణ్ణి క్రీస్తువద్దకు తీసికొనివచ్చి నీకు సాధ్యమైతే ఈ దయ్యాన్ని పారద్రోలి నాకు ఉపకారం చేసిపెట్టమని అడిగాడు. క్రీస్తు ఈ పని నాకు సాధ్యమౌతుంది. అనేనమ్మకం నీకువుందా అని ప్రశ్నించాడు. ఆ తండ్రి "ప్రభో! మీకు సాధ్యమౌతుందనే నా నమ్మకం. అయినా నాకేమైనా అపనమ్మకం కలిగినట్లయితే తమరే తోడ్పడాలి" అని వినయంగా అడుగుకొన్నాడు. ప్రభువు ఆ తండ్రి కోరినట్లే అతని కుమారునినుండి దయ్యాన్ని పారద్రోలాడు - మార్కు 9, 22-24.

11. సొలోమోను వైభవంగా జీవించాడు. సుందరమైన వస్త్రాలను ధరించాడు. కాని ప్రభువు పొలంలో ఎదిగే లిల్లీ మొక్కలకుగూడా చక్కనిపూలు తొడుగుతున్నాడు. అవి కష్టపడి పనిచేయవు, నూలు వడకవు. అయినా వాటి పూబట్టలు సొలోమోను తాల్చిన దుస్తులకంటే యింకా అందంగా ఉంటాయి. నేడు పొలంలో ఉండి రేపు పొయ్యిమంటలో కాలిపోయే గడ్డిపోచలనే భగవంతుడు యింత సుందరంగా అలంకరిస్తూంటే, వాటికంటె ఎంతో యోగ్యుడైన నరుణ్ణిగూర్చి అతడు ఆలోచించడా? అలాంటి భగవంతునిమీద మనకు నమ్మకం ఉండవద్దా? - లూకా 12, 27-28.

12. కఫర్నాము పట్టణంలో ఓ రోమను సైన్యాధిపతి ఉండేవాడు. అతనికి యూదులంటే యిష్టం. వాళ్లకు ప్రార్థనా మందిరంగూడ కట్టిపెట్టారు. ఓమారు అతనికి ఇష్టుడైన సేవకునికి జబ్బుచేసింది. ఆ సేవకుని వ్యాధి నయంచేయవలసిందిగా అతడు

ప్రభువుకి కబురు పెట్టాడు. ప్రభువు అతని యింటికి వస్తూండగా సైన్యాధిపతి అతని యొద్దకు దూతలనపంపి "తమరు మా యింటికి రానక్కరలేదు. అందుకు నేను యోగ్యుణ్ణి గూడకాదు. మీరక్కడనే ఉండి ఒక్కమాట సెలవిస్తేచాలు నా దాసుడు బ్రతికిపోతాడు. మీ యధికారవాక్యం ఏలా పనిచేస్తుందో నాకు బాగా తెలుసు" అని చెప్పించాడు. అతని విశ్వాసానికి ప్రభువు ఆశ్చర్యపోయి "నేను యిస్రాయేలీయుల్లోగూడ ఇంతటి విశ్వాసం చూడలేదు" అని అన్నాడు - లూకా 7,9.

13. ఓమారు ప్రభువు యాయీరు అనే అధికారి యింటికి వెళ్తూన్నాడు. జనసమూహం ఆయన్ననుసరించి వెళ్తూంది. అప్పుడు పండ్రెండేండ్ల నుండి రక్తస్రావవ్యాధితో బాధపడుతున్న ఓ దీనురాలు ఆ మహానుభావుని అంగీ ముట్టుకొంటేచాలు నాకు ఆరోగ్యం చేకూరుతుంది అనుకొంది. ఆమె జనసమూహంగుండా చోటుచేసికొనివచ్చి నమ్మికతో ఆయన అంగీ అంచును అంటుకొంది. ప్రభువు ఆమె హృదయాన్నిగుర్తించి "కుమారీ! నీ విశ్వాసమే నీకు ఆరోగ్యం చేకూర్చి పెడుతుందిపో" అన్నాడు. వెంటనే ఆమె వ్యాధి నయమయింది - మత్త 9,20-22.

14. ఉత్థానక్రీస్తు శిష్యులకు కన్పించినపుడు తోమా వాళ్లతోలేడు. తర్వాత శిష్యులు ప్రభువు తమకు కన్పించాడని చెప్పినా తోమా నమ్మలేదు. ఆయన ప్రక్క గాయాలలో వేలుపెట్టి చూస్తేనేగాని నేను నమ్మనుపొండి అన్నాడు. తర్వాత ప్రభువు మళ్ళా శిష్యులకు కన్పించాడు. అప్పుడు తోమాకూడ వున్నాడు. ప్రభువు అతన్ని పిల్చి "ఓయి! నీవు కోరినట్లే నా గాయాల్లో వేళ్లుపెట్టి చూడు. నీవు అవిశ్వాసివిగాక విశ్వాసివిగావుండు. నీ విప్పుడు కండ్లార చూచావుగనుక నన్ను విశ్వసిస్తున్నావు. కాని కంటితో చూడకుండానే నన్ను విశ్వసించేవాళ్లు నీ కంటే ధన్యులు సుమా!" అన్నాడు - యోహా 20, 27-29.

15. నీతిమంతుడు విశ్వాసంతో జీవిస్తాడు - హబకూకు 2-4.

# 30. దైవవాక్కు

ప్రభువువాక్కు ప్రభువులాగే అద్భుతమైన క్రియాశక్తిగలది. అది మన హృదయాలమీద పనిచేసి మనకు చైతన్యం కలిగిస్తుంది. కనుక భక్తుడు బైబులువాక్కుతో పరిచయం కలిగించుకోవాలి. ఆ వాక్కును ధ్యానించుకోవాలి.

## (1) పఠనాభ్యాసం

1. తిమోతి చిన్ననాటినుండే పూర్వవేదగ్రంథాలు చదువుకొనే అలవాటు కలవాడు. అవి అతనికి క్రీస్తు జ్ఞానాన్ని గలిగించాయి. అతడు ఆజ్ఞానంద్వారా విశ్వాసమూ దానిద్వారా రక్షణమూ పొందాడు - 2 తిమో 3, 15.

2. క్రైస్తవుడు క్రీస్తుసందేశంతో నిండుకొని ఉండాలి. కుండ నీటితో నిండివున్నట్లే భక్తుని హృదయం బైబులు సందేశంతో నిండి ఉండాలి. అనగా అతనికి బైబులుతో పరిచయముండాలి - కొలొ 3, 16.

3. ప్రభువు కరువు పంపిస్తాడు. ఆ కరువు కూటికీ నీళ్లకూ గాదు, దైవవాక్యానికి. అనగా ప్రజలు బైబులు వాక్యం తెలిసికోకపోవడం అనే కరువు వస్తుంది. నేటి మన పరిస్థితి అలాగే ఉందిగదా! - ఆమోసు 8, 11.

4. ఎజ్రా ధర్మశాస్త్రగ్రంథాన్ని చదివి విన్నిస్తూండగా యిస్రాయేలు ప్రజలంతా విని భక్తిపారవశ్యంతో కన్నీళ్లు రాల్చారు - నెహెమ్యా, 8, 8-9. అలాగే ధర్మశాస్త్రం చదువుతూండగా విని యోషియారాజు పరితాపంతో బట్టలు చించుకొన్నాడు - 2 రాజు 22,11.

## (2) దైవవాక్కులో వుండే శక్తి

1. వానా మంచూ కురిసి నేలను పదునుజేసి పైరు ఎదిగిస్తాయి. సేద్యగానికి ధాన్యం చేకూర్చి పెడతాయి. అలాగే దైవవాక్కుగూడ మన హృదయమనే పొలాన్ని పదునుజేసి దానిలో మంచికోరికలు మొలకెత్తిస్తుంది. మనం దైవసంకల్పం ప్రకారం జీవించేలా చేస్తుంది. కురిసిన వర్షంలాగే దైవవాక్కు గూడ వ్యర్థంగాబోదు - యెష 55, 10-11.

2. వేటగాడు పక్షులమీదికి విడిచిన దేగలాగే దైవవాక్కుగూడ రౌద్రంగా నరులమీదికి దిగివస్తుంది - యెష 9,8.

3. సమ్మెట గండశిలలను బ్రద్దలు చేసినట్లే ప్రభువు వాక్కు నరుని హృదయాన్ని వ్రయ్యలు చేస్తుంది -యిర్మీ 23, 29.

4. దావాగ్ని అరణ్యాన్ని కాల్చివేస్తుంది. అలాగే దేవునిమాట విననివాళ్లను ఆతని వాక్కు భస్మం చేస్తుంది - యిర్మీ 5, 14.

5. ప్రభువు వాక్కు ఓ దూతలాగ వడివడిగా పరుగెత్తుకొని వచ్చి నరుని చేరుతుంది - కీర్తన 147, 15.

6. ఆ వాక్కు ఓ యుద్ధవీరుళ్లాగ దుముకుతూ వస్తుంది. అది శత్రువుమీదపడి అతన్ని హతమారుస్తుంది - సొలొమోను జ్ఞాన 18, 14-16.

7. ప్రభువు వాక్కు ఓ దీపంలాంటిది
మన త్రోవకు ఓ వెలుగులాంటిది - కీర్త 119, 105.

9. ప్రభు పలుకులు ఎంతో రుచిగా ఉంటాయి
తేనెకంటె తీయగా ఉంటాయి 119, 103.

9. ప్రవక్త యెహెజ్కేలు ప్రభుగ్రంథాన్ని భక్షించగా అది అతని నోటికి తేనెవలె తీయగా వుంది - యెహెజ్కేలు 3,3

10. పాలు శిశువును పోషించినట్లే దైవవాక్కు భక్తులను పోషిస్తుంది - 1 పేత్రు 2,2.

## (3) వాక్యాన్ని వివరించి చెప్తూండగా భక్తితో ఆలించాలి.

1. క్రీస్తు ఉత్థానానంతరం ఇద్దరు శిష్యులు ఎమ్మావుకు వెళ్తూన్నారు. వాళ్లకింకా ప్రభువు ఉత్థానమయ్యాడని తెలీదు. పైగా వాళ్లు క్రీస్తు రోమను ప్రభుత్వంతో యుద్ధంచేసి పాలస్తీనా దేశానికి స్వాతంత్ర్యం సంపాదించి పెట్టకుండానే చనిపోయాడుగదా అని నిరుత్సాహంగా ఉన్నారు. త్రోవలో క్రీస్తు వాళ్లను కలిసికొన్నాడు. అయినా వాళ్ళతన్ని గుర్తుపట్టలేదు. క్రీస్తు రాజకీయాల్లో జోక్యంచేసికోవడానికి రాలేదనీ, అతడు మొదట బాధలననుభవించి అటుపిమ్మట మహిమను పొందుతాడనీ ప్రవక్తలు వచించారని ప్రభువు వాళ్లకు తెలియజెప్పాడు. తరువాత ఎమ్మావు చేరుకొన్నంక క్రీస్తు రొట్టె విరుస్తుండగా శిష్యులతన్ని గుర్తుపట్టారు. దానితో ప్రభువు అదృశ్యుడయ్యాడు. తరువాత ఆ ఇద్దరు శిష్యులూ యెరూషలేముకు తిరిగివస్తూ "ఆయన మార్గంలో మనతో మాట్లాడుతూ లేఖనాలను వివరించి చెప్తూంటే మన హృదయం భక్తిపారవశ్యంతో నిండిపోలేదా?" అనుకొన్నారు. ప్రభువు వాక్యాన్నిగాని ఆ వాక్యాన్ని గూర్చిన బోధనుగాని వింటూన్నపుడు మనకుగూడ ఈలాగే భక్తిపారవశ్యం కలగాలి - లూకా 24, 32.

2. ఓమారు ప్రభువు మరియామార్తల ఇంటికి వచ్చాడు. మార్త ప్రభువుకి భోజనం సిద్ధంజేయడంలో సతమతమౌతుంది. కాని మరియ మాత్రం ప్రభు పాదాల దగ్గిరే కూర్చుండి స్తిమితంగా ఆయన బోధ వింటూంది. మరియనుగూడ వంటపనికి పంపమని మార్త ప్రభుని అడిగింది. అయినా ప్రభువు ఆమెను పంపలేదు. మరియ ఉత్తమమైన కార్యాన్ని ఎన్నుకొందని ఆమెను సమర్థించాడు. ఈ మరియలాగే మనమూ స్తిమితంగా ప్రభు వాక్యాన్ని వినాలి - లూకా 10, 38-42.

3. ఇతియోపీయుడు రథంమీద గూర్చుండి హీబ్రూ బాషలో యెషయా ప్రవచనం చదువుకొంటూన్నాడు. "అతన్ని ఓ గొర్రెపిల్లగా వధ్యస్థానానికి నడిపించుకొని వెళ్లారు. అయినా అతడు పల్లెత్తి మాటాడలేదు" - అనే వాక్యం దగ్గరికి వచ్చేప్పటికల్లా ఇతియోపీయునికి ప్రవక్త యెవరినిగూర్చి - ఈలా చెప్తున్నాడబ్బా అని సందేహం కలిగింది. అప్పుడు ఫిలిప్పు అతన్ని కలిసికొని అదేవాక్యం ఆధారంగా తీసికొని క్రీస్తుని గూర్చి బోధించాడు. అలా పల్లెత్తి మాట్లాడకుండా వధ్యస్థానానికి వెళ్ళిన మహానుభావుడు క్రీస్తేనని

వివరించి చెప్పాడు. యితియోపీయుడు అతని బోధను విశ్వసించి జ్ఞానస్నానం పొందాడు. అతనిలాగే మనమూ దైవవాక్య బోధను నమ్మికతో ఆలించాలి - అచ 8, 26-40.

4. ప్రభో! నీవు నా కండ్లు తెరువు
అప్పుడు నేను నీ ధర్మశాస్త్రం బోధించే
అద్భుత సత్యాలను తెలిసికొంటాను - కీర్త 119,18.

5. ప్రభో! నీ దాసుడు ఆలించడానికి సిద్ధంగానే వున్నాడు. సెలవీయి - 1 సమూ 3, 10.

6. ఇద్దరు ముగ్గురు నా పేరుమీదుగా సమావేశమైన కాడ నేనూ నెలకొని వుంటాను - మత్త 18,20.

## (4) భక్తుడు దైవాక్కును ధ్యానించుకోవాలి

1. ప్రభో ! నేను నీ ఉపదేశాలను
ధ్యానించుకొంటున్నాను - కీర్త 119, 78.
2. నేను పడకమీద పండుకొని
నిన్ను స్మరించుకొంటూంటాను - 63, 6.
3. ప్రభువు కట్టడలను రేయింబవళ్లు మననంజేసికొంటూ
ఆనందించే నరుడు ధన్యుడు
అతడు ఏటియొడ్డున పెరిగే చెట్టులాంటివాడు
అది సకాలంలో పండ్లనిస్తుంది
దాని యాకులు వాడిపోవు
ఆలాగే అతడుకూడ సఫలుడౌతాడు 1, 2-3
4. మరియ ఆ సంగతులన్నీ హృదయంలో పదిలపరచుకొని మననం జేసికొంటూండేది - లూకా 2, 29-2,51.

## (5) భక్తుడు ప్రభువాక్యాన్ని పాటించాలి

1. ఒకడు పొలంలో విత్తనాలు వెదజల్లాడు. కొన్ని విత్తనాలు త్రోవలో పడగా పక్షులు వాటిని ఏరుకొని తినేసాయి. కొన్ని విత్తనాలు రాతినేలపైబడి మొలిచాయి. కాని అవి వేరు పాతుకోలేనందున ఎండవేడి తగిలి మాడిపోయాయి. కొన్ని విత్తనాలు ముండ్లపొదల్లోబడి మొలిచాయిగాని ముండ్లుకాస్త వాటిని అణచివేసాయి. కొన్ని మాత్రమే సారవంతమైన నేలలోపడి ముప్పైయంతలూ అరవైయంతలూ నూరంతలూ ఫలించాయి.

మన హృదయం ఈ చివరన పేర్కొన్న సారవంతమైన నేలలా ఉండాలి. అప్పుడే దైవ వాక్యం మన జీవితలో ఫలితమిచ్చేది - మత్త 12, 4-8.

2. ఓ అతని రాతిపునాదిమీద యిల్లుకట్టాడు. గాలి వీచి వాన కురిసి వరదలు వచ్చాయి. అయినా ఆ యింటి పునాది కదలలేదు. ఇల్లు సురక్షితంగానే ఉండిపోయింది. ప్రభు వాక్కు విని దాన్ని పాటించేవాడు ఈ బుద్ధిమంతుని లాంటివాడు. మరో అతని యిసుక పునాదిమీద ఇల్లు గట్టాడు. గాలివీచి వానకురిసి వరదలు వచ్చాయి. ఆ యింటి పునాదికాస్త కొట్టుకొనిపోగా యిల్లుకూడ కూలిపోయింది. ప్రభువాక్కును విని దాన్ని పాటించనివాడు ఈ మందమతిలాంటివాడు. - మత్త 7, 24-27.

3. ఓ అతని అద్దంలోకి చూచుకొని తన ముఖం అశుభ్రంగా ఉందని తెలుసుకొన్నాడు. వెళ్లి ముఖం కడుగుకొందామని పదడుగులు వేసాడు. కాని అంతలోనే తాను అద్దంలోకి చూచుకొన్న సంగతి ముఖం కడుగుకొందామనుకొన్న సంగతీపూర్తిగా మరచిపోయాడు. ఆ యేబ్రాసి మొగంతో అలాగే తిరుగుతున్నాడు. అదేవిధంగా మనం కూడ ప్రభు గ్రంథమనే అద్దంలోనికి చూచుకొన్నపుడు మన హృదయం ఎంత వికృతంగా ఉందో తెలిసిపోతుంది. ఆ గ్రంథంలోనికి చూచుకొని మన జీవితాన్ని సరిదిద్దుకోవాలి. కనుక కేవలం వాక్యం విని మరచిపోతే లాభంలేదు. దాన్ని ఆచరణలో పెట్టగలిగి ఉండాలి - యాకో 1, 22-25.

4. ప్రభువాక్కుని పాటించేవాళ్లని అతడు తన సొంత తల్లిలాగ, సొంత సోదరుల్లాగ భావిస్తాడు. అనగా వాళ్లు క్రీస్తుకి ఆత్మబంధువులూ ప్రీతిపాత్రులూ ఔతారని భావం - లూకా 8, 19, 21.

## (6) వాక్యపఠనంవలన కలిగే ఫలితాలు

1. నరుడు ఆహారంతో మాత్రమే జీవించదు. ప్రభువు నోటినుండి వెలువడే ప్రతిమాటద్వారాగూడ జీవిస్తాడు - ద్వితీ 8,3. యథార్థంగా భూమిమీద పైరుపంటలు నరులను పోషింపలేవు. ప్రభుని నమ్మిన జనాన్ని పోషించేది అతని నోటిమాటలే - సొలోమోను 16, 26.

2. ప్రభువు నోటినుండి వెలువడేమాటలు నిత్య జీవమిస్తాయి - యోహా 6, 68.

3. ప్రభువు ధర్మగ్రంథాన్ని అనాదరంజేసేవాళ్లు మృత్యువు వాతబడతారు - బరూకు 4,1.

4. ప్రభువు ఆజ్ఞలను పాటించేవాళ్లు అతని దీవెనలు పొందుతారు. పాటించని వాళ్లు శాపానికి గురౌతారు - ద్వితీ 30, 16-18.

5. పరిశుద్ధ గ్రంథం దైవప్రేరణంవల్ల పుట్టింది. అది సత్యాన్ని బోధిస్తుంది. దోషాన్ని ఖండిస్తుంది. తప్పులను సరిదిద్దుతుంది. సత్ప్రవర్తన నేర్పుతుంది. సత్కార్యాలు చేయిస్తుంది -2 తిమో 3, 16-17.

6. పరిశుద్ధ గ్రంథములోని సంగతులన్నీ మనకు ప్రబోధం కలిగించడానికే వ్రాయబడ్డాయి - రోమా 15,4.

7. జ్ఞానస్నానంద్వారాలాగే వాక్కుద్వారా గూడ మనకు క్రొత్తపుట్టువు కలుగుతుంది -1 పేత్రు 1, 23.

8. వాక్కుద్వారా పాపపరిహారం కలిగి హృదయం శుద్ధిచెందుతుంది - యోహా 15, 3. అందుకే కీర్తనకారుడు గూడ "ప్రభో! నీ సమక్షంలో పాపంచేయకుండా ఉండేందుకై నీ వాక్యాన్ని నా హృదయంలో నిల్పుకొన్నాను" అన్నాడు -119, 11.

9. ప్రభువు వాక్కు సజీవమైంది. క్రియాత్మకమైంది. రెండంచుల కత్తికంటె పదునైంది. అంతరంగందాకా కోసుకొని పోతుంది. అది మన హృదయాల్లోని కోర్కెలనూ ఆలోచనలనూ పరిశీలించి చూస్తుంది - హెబ్రే 4,12.

10. నరుడు క్షణమాత్రజీవి. అతడు పొలంలోని గడ్డిలా యెండిపోతాడు. పూవులా వాడిపోతాడు. కాని దేవుని వాక్కు శాశ్వతంగా వుండిపోతుంది - యెష 40, 6-8

## (7) మనకు వాక్యాన్ని బోధించేది పరిశుద్ధాత్మే.

1. పవిత్రాత్మవచ్చాక మీకు సమస్త విషయాలు బోధిస్తుంది. నేను చెప్పిన సంగతులన్ని మీకు తలపునకు తెస్తుంది - యోహా 14, 26. ఆ యాత్మ మిమ్ము సర్వసత్యంలోనికి నడిపిస్తుంది. ఆయన తనంతటతాను ఏమీ బోధించక తాను నావలన వినిన సంగతులనే మీకు బోధిస్తాడు - 16, 13.

2. ప్రవచనం అనేది కేవలం మానవ సంకల్పం వలన పుట్టలేదు. ప్రవక్తలు పవిత్రాత్మచే ప్రేరితులై దేవుని సందేశాన్ని విన్పించారు. ఈనాడు మనం బైబులు అర్థంచేసికొనేలా చేసేది కూడ ఆయాత్మే - 2 పేత్రు 1,21.

3. క్రీస్తు ఆత్మ మీయందు ఉన్నంతకాలమూ మీకు మరో బోధకునితో అవసరంలేదు. ఆయాత్మే మీకు అన్ని విషయాలు బోధిస్తుంది -1 యోహా 2, 27.

4. నీ బిడ్డలందరు ప్రభువువలన ఉపదేశం పొందుతారు. - యెష 54, 31.

# 6. క్రీస్తు వరప్రసాదం

## మనవిమాట

14-15 బైబులు భాష్యం సంచికల్లో వరప్రసాదాన్ని గూర్చి చెప్పాం. ఆ సంచికలనే యిక్కడ కొలది మార్పులతో ఏకగ్రంథంగా ముద్రించాం.

క్రైస్తవ జీవితమంటే విశేషంగా వరప్రసాద జీవితమే. ఈ గ్రంథంలో వరప్రసాదాన్ని గూర్చిన దైవశాస్త్రాంశాలను సులువైన పద్ధతిలో వివరించాం. భక్తులు వరప్రసాదాన్ని గూర్చి క్షుణ్ణంగా తెలిసికొని దేవునిపట్ల భక్తిని పెంపొందించుకోడానికి ఈ పుస్తకం వుపకరిస్తుంది. ఇది రెండవ ముద్రణం.

## పారిభాషిక పదాలు

| | |
|---|---|
| Grace | వరప్రసాదం |
| Habitual grace | శాశ్వత వరప్రసాదం |
| Sanctifying grace | పవిత్రీకరణ వరప్రసాదం |
| Uncreated grace | దైవాతక వరప్రసాదం |
| Indwelling | అంతర్నివాసం |
| Actual grace | సహాయక / తాత్కాలిక వరప్రసాదం |
| Healing grace | చికిత్సాత్మక వరప్రసాదం |
| Elevating grace | ఉద్ధరణ వరప్రసాదం |
| Prevenient grace | ప్రబోధాత్మక వరప్రసాదం |
| External grace | బాహిర వరప్రసాదం |
| Gratia graits data | అన్య ప్రయోజక వరప్రసాదం |
| Gratia gratum faciens | స్వీయ ప్రయోజక వరప్రసాదం |
| Efficient grace | క్రియానిర్వహణ వరప్రసాదం |
| Sufficient grace | క్రియాసమర్థక వరప్రసాదం |
| Theological virtues | దివ్యపుణ్యాలు |
| Moral virtues | నైతిక పుణ్యాలు |
| Natural order | ప్రాకృతిక రంగం |
| Supernatural order | ఆధ్యాత్మిక రంగం |

## విషయసూచిక



# 1. పవిత్రీకరణ వరప్రసాదం

జ్ఞానస్నానంతో వరప్రసాద జీవితం ప్రారంభమౌతుంది. ఇక్కడ వరప్రసాదమంటే యేమిటో, అదెలా వుంటుందో విచారిద్దాం. ప్రస్తుతాధ్యాయంలో ఐదంశాలను విలోకిద్దాం.

## 1. భావవిభాగం

వరప్రసాద భావంలో చాలా విభాగాలున్నాయి. వరప్రసాదాలన్నీ శాశ్వత వరప్రసాదాలూ తాత్కాలిక వరప్రసాదాలూ అని రెండు విధాలుగా వుంటాయి. శాశ్వత వరప్రసాదం ఓమారు మనలో నెలకొన్నంక, చావైన పాపం కట్టుకొనని యంతవరకు మనలో స్థిరగా నిలచివుంటుంది. అందుకే దీనికి శాశ్వత వరప్రసాదం లేక స్థిర వరప్రసాదం అని పేరు. కాని తాత్కాలిక వరప్రసాదం ఈ శాశ్వత వరప్రసాదంలాగ స్థిరంగా నిలువదు. తాత్కాలికంగా మాత్రమే వుండి మనలను ఆయా పుణ్యకార్యాలకు పురికొల్పుతుంది. ఈ తాత్కాలిక వరప్రసాదానికే సహాయక వరప్రసాదమని కూడ పేరు.

ఇక శాశ్వత వరప్రసాదం మరల పవిత్రీకరణ వరప్రసాదం, దైవాత్మక వరప్రసాదం అని రెండు రకాలుగా వుంటుంది. పవిత్రీకరణ వరప్రసాదం క్రొత్త పుట్టువు నిచ్చి మనలను పవిత్ర పరుస్తుంది. మన పాపాలను హరిహరిస్తుంది. దివ్యత్వాన్నిచ్చి మనలను దేవుని బిడ్డలను చేస్తుంది. మనలను మోక్షానికి హక్కుదారులను గావిస్తుంది. దైవాత్మక

వరప్రసాదమంటే ముగ్గురు దైవ వ్యక్తులు మన హృదయంలో నెలకొనడం. దీనికే అంతర్నివాసం అని పేరు. దైవాత్మక వరప్రసాదం ముగ్గురు దైవవ్యక్తుల సాన్నిధ్యమైతే ఆ దైవవ్యక్తు లిచ్చే బహూమానమే పవిత్రీకరణ వరప్రసాదం. ఈ రెండు వరప్రసాదాలూ అవినాభావ సంబంధం కలవి. అనగా ఒకటి ఉన్న చోట రెండవది కూడ ఉండితీరుతుంది. రెండు రకాలుగా వున్న ఈ శాశ్వత వరప్రసాదం, చావైన పాపం కట్టుకొనిన ఆత్మ యందు నిలువదు.

## 2. వరప్రసాదం ఏమి చేస్తుంది?

వరప్రసాదమంటే యేమిటి? అది మనలోని ఓ దివ్య గుణం. ఈ గుణంవలన మనం భగవంతునికి ప్రియపడతాం. ఈ గుణం దేవుడు మనకు ఉచితంగా యిచ్చేవరం. దానికి మనం ఏవిధంగాను అర్హులంకాము.

వరప్రసాదం చేసే పనులు చాలా వున్నాయి. దాని వలన మనకు పాపపరిహారం లభిస్తుంది. మనం నీతిమంతులమై దేవునితో రాజీపడతాం. పాపంతో వున్నపుడు దేవునికి విరోధులమై అతనికి అప్రియం కలిగిస్తాం. వరప్రసాదం వలన పావిత్ర్యాన్ని గూడ పొందుతాం.

వరప్రసాదం ద్వారా దేవునికి దత్తపుత్రుల మౌతాం. అతడు మనకు నిజంగా తండ్రి ఔతాడు. పిత పుత్ర పవిత్రాత్మలనే ముగ్గురు దైవవ్యక్తులు మన హృదయంలో వసించడం మొదలిడతారు. మనకు దివ్యత్వం లభిస్తుంది.

ఈ వరం ద్వారా మనం విశేషంగా క్రీస్తుతో ఐక్యమై అతని దివ్యజీవితం జీవిస్తాం. కొమ్మలు చెట్టుతో లాగ అతనితో ఐక్యమౌతాం. ఆ క్రీస్తుతో ఐక్యమైన తోడిజనంతోగూడ ఐక్యమై ప్రేమజీవితం జీవిస్తాం.

మోక్షం తండ్రి రాజ్యం. ఆ తండ్రికి బిడ్డలమైన మనం వరప్రసాదం ద్వారా మోక్షానికిగూడ వారసుల మౌతాం.

వరప్రసాద ఫలితాలు ఇన్ని వున్నాయి. ఈ విషయాలన్నిటినీ రాబోయే అధ్యాయాల్లో విపులంగా పరిశీలిస్తాం. ప్రస్తుతానికి పవిత్రీకరణ వరప్రసాదాన్ని గూర్చి విచారిద్దాం.

## 3. త్రెంటు మహాసభ బోధలు

ప్రోటస్టెంటు సోదరుల తిరుగుబాటును పురస్కరించుకొని త్రెంటు మహాసభ 16వ శతాబ్దంలో సమావేశమైంది. అందుచేత ఈ సభ ప్రతిపాదించిన సత్యాలన్నీ ప్రత్యక్షంగానైతేనేమి పరోక్షంగా నైతేనేమి ప్రోటస్టెంటుల నూత్న సిద్ధాంతాలను

పురస్కరించుకొని వెలువడినవే. వరప్రసాదాన్ని గూర్చిన ట్రెంటు సభ బోధలను గూడ ఈ దృష్టితోనే పర్యవేక్షించాలి.

పవిత్రీకరణ వరప్రసాదాన్ని గూర్చి ట్రెంటు సభ మూడు ముఖ్య విషయాలను బోధించింది. అవి యివి. 1. నీతిని పొందడమంటే దేవుడు మన పాపాలను యథార్థంగా మన్నించడం. 2. నీతిని పొందడమంటే ఆత్మ క్రొత్తతనాన్ని పొందడం. 3. నీతిని పొందడంలో మన సహకారం కూడ వుంటుంది. ఈ మూడు విషయాలు నీతిని పొందడం అనే సత్యాన్ని వివరించే సందర్భంలో బోధింపబడ్డాయి. నీతిని పొందడమంటే జ్ఞానస్నానంద్వారా పాపాన్ని విడనాడి పవిత్రతను పొందడం. పాపం ద్వారా సిద్ధించే దైవశత్రుత్వాన్నుండి తప్పుకొని పవిత్రీకరణ వరప్రసాదంద్వారా దైవ మిత్రత్వాన్ని పొందడం.

1. లూతరు సిద్ధాంతం ప్రకారం నీతిని పొందినంక గూడ మన పాపాలు యథార్థంగా పరిహారం కావు. మనకు దేవునిమీద ప్రేమా నమ్మికా వున్నట్లయితే ఆ దేవుడు మనలను చల్లని చూపుతో జూస్తాడు. క్రీస్తు సిలువమరణం వలన ఆర్జించిన వరప్రసాదాలతో మన ఆత్మను కప్పి అలంకరిస్తాడు. ఈ యలంకరణం ద్వారా మన ఆత్మం స్వయంగా పాపభూయిష్ఠమైయున్నా దేవుని సముఖంలో మాత్రం ప్రియంగొల్పుతూనే వుంటుంది.

ట్రెంటు సభ ఈ నూత్న వాదాన్ని ఖండించి ఈలా బోధించింది. నీతిని పొందడమంటే దేవుడు మన యాత్మను క్రీస్తు వరప్రసాదాలనే వస్త్రంతో కప్పివేయడం గాదు. యథార్థంగా పాపాలనుండి మన్నింపును పొందడం. ఈ మన్నింపు వలననే మనం నీతిమంతులం కాగల్గుతున్నాం.

నరుడు పుట్టుకతోనే తొలి ఆదాము పాపంతో జన్మిస్తున్నాడు. పుట్టుకతోనే దేవునికి శత్రువూ అప్రియుడూ ఔతున్నాడు. కాని మలి ఆదామునందు జ్ఞాకస్నానం పొంది మలి పుట్టువును పొందుతున్నాడు. దేవునికి దత్తపుత్రుడు ప్రియసుతుడు ఔతూన్నాడు.

2. లూతరు తలంపు ప్రకారం నీతిని పొందడమంటే ఆత్మను క్రీస్తు వరప్రసాదంతో కప్పివేయడం అన్నాం. అంచేత నీతిని పొందినాక గూడ మన ఆత్మయందు వస్తుతః ఏ మార్పూ కలుగదు. నీతిని పొందిన పిదప గూడ ఆత్మపాపం నుండి విముక్తి చెందదు. మనలోని ఆశాపాశాలు కూడ పాపాలే. ఈ యాశాపాశాలు మనం జీవించినంత కాలమూ వుంటాయి కనుక మన యాత్మ కూడ నిత్యం పాపంలోనే జీవిస్తుంటుంది. మరి మనకు రక్షణ లభించేది ఎలాగంటే, మన ఆత్మను వస్త్రంలాగ కప్పివేసిన క్రీస్తు వరప్రసాదంద్వారా. ఈ వరప్రసాదాలను చూచి క్రీస్తుపైగల ఆదరంచే పరలోకపిత మనలను చల్లని చూపున జూస్తాడు. మనలను తనసముఖంలోనికి చేర్చుకొంటాడు.

ట్రెంటుసభ ఈ వాదాన్ని నిరాకరించి ఈలా బోధించింది. నీతిని పొందడమంటే మన పాపాలు యథార్థంగా పరిహరింపబడ్డం. మన ఆత్మలో గూడ క్రొత్తతనం ఏర్పడుతుంది. పవిత్రీకరణ వరప్రసాదం ద్వారా మన ఆత్మ నూత్నత్వాన్ని పొందుతుంది. పాపపరిహారంతో పాటు ఈ పవిత్రీకరణ వరప్రసాదాన్ని గూడ భగవంతుడే మనకు అనుగ్రహిస్తాడు. దానిద్వారా మనం పాపావస్థనుండి పవిత్రావస్థను పొందుతాం. నీతిని పొందడమంటే నీతిమంతుడైన దేవుడు మనలను చల్లని చూపున చూడ్డంగాదు. పాపపరిహారం వలనా పవిత్రీకరణ వరప్రసాదం వలనా మనలను నీతిమంతులను చేయడం. ఆశాపాశాలు పాపం వలన పుడుతున్నాయి, పాపానికి పురికొల్పుతున్నాయి. కాని అవి స్వయంగా పాపాలు కావు. కావున మనం నీతిని పొందినంక గూడ ఆశాపాశాలు అనే పాపాలు ఉంటాయి అనే మాట పొసగదు.

3. లూతరు మతమున నీతిని పొందాలంటే మన తరపున కావలసింది ప్రేమతో గూడిన నమ్మిక మాత్రమే. దాని వలననే భగవంతుడు మనలను రక్షిస్తాడు. దీనికి మినహా మన సహకారం ఎందుకూ పనికిరాదు. జన్మపాపంద్వారా నరుల బుద్ధి చిత్తశక్తులు పూర్తిగా చెడిపోయాయిగనుక మన స్వాతంత్ర్యంగూడ నశించింది. కావున రక్షణకార్యంలో మన తోడ్పాటేమీ లేదు. మనం వరప్రసాదాలను ఆర్జిస్తాం అనడం కల్ల. మనం వరప్రసాదం ఆర్జిస్తే క్రీస్తు వరప్రసాదం వ్యర్థమైపోదా?

ట్రెంటుసభ ఈ వాదాన్ని ఖండించి ఈలా బోధించింది భగవంతునియందు ప్రేమతో గూడిన నమ్మికను ఉంచడం అవసరమేగాని అంతమాత్రంచేతనే నీతిని పొందలేం. తొలిపాపంద్వారా మన బుద్ధి చిత్తశక్తులు గాయపడ్డాయి గాని నశింపలేదు. కావున నరులకు అవసరమైన స్వాతంత్ర్యం వుంది. ఈ స్వాతంత్ర్యం వలన, మనతోడ్పాటులేందే దేవుడు మనలను రక్షింపడు. మనం పుణ్యాన్ని ఆర్జించందే మోక్షంలో అడుగుపెట్టలేం. మనంకూడ పుణ్యాన్ని అర్జిస్తున్నామంటే క్రీస్తు సహాయంతోగాని, క్రీస్తు నిస్సహాయంగాగాదు. మనం ఆర్జించే వరప్రసాదం క్రీస్తు వరప్రసాదంమీద ఆధారపడి వుంటుంది కనుక ఆ ప్రభు వరప్రసాదాన్ని వ్యర్థం చేయదు.

నేడు ప్రోటస్టెంటు శాఖలను క్యాతలికు శాఖ నుండి వేరుపరచే ప్రధానాంశాల్లో ఇవీ కొన్ని గనుక పాఠకులు ఈ విభేదాలను చక్కగా గుర్తించాలి. లూతరు బోధించిన పై మూడు సిద్ధాంతాలను నేటి ప్రోటస్టెంటు శాఖలు సంపూర్ణంగా అంగీకరింపవు. పైగా అసలు లూతరు బోధించిందేమిటి అన్న విషయంలోగూడ ప్రోటస్టెంటు శాఖల్లో భేదాభిప్రాయాలున్నాయి.

## 4. పితృపాదుల ఉపమానాలు

పవిత్రీకరణ వరప్రసాదాన్ని గూర్చి చెప్తూ పితృపాదులు రెండుపమానాలు వాడారు. మొదటిది మైనంమీద వేసిన ముద్ర. రెండవది స్ఫటికం గుండా ప్రసరించే వెలుగు.

1. అలెగ్జాండ్రియ సిరిల్ మన ఆత్మలో పనిచేసే పరిశుద్ధాత్మను వర్ణిస్తూ ఈలా చెప్పాడు : "దేవుని నుండి వెడలివచ్చే దైవవ్యక్తి పరిశుద్ధాత్మ మైనంపై ముద్రలాగ తన రూపాన్ని మన హృదయంమీద ముద్రిస్తుంది. చిత్రకారుడు ఫలకంపై మరియొకరి చిత్రాన్ని గీస్తాడు. కాని ఈ దివ్యవ్యక్తి మాత్రం తన రూపాన్నే మన హృదయాలమీద చిత్రిస్తాడు. ఈ దివ్యరూపం వలన మనం పాపంద్వారా కోల్పోయిన దేవుని పోలికను తిరిగి పొందుతాం."

ఈ సాదృశ్యంలోని భావాలివి : (1) మన హృదయంలో పరిశుద్ధాత్మ వశించడమూ, ఆ యాత్మ యిచ్చే వరప్రసాదమూ మైనంమీద వేసిన ముద్రతో పోల్చబడ్డాయి. మైనపు ముద్ద ముద్రను గైకొని నూత్నరూపం తాలుస్తుంది. అలాగే మనంకూడ వరప్రసాదం ద్వారా క్రొత్తతనం పొందుతాం. మార్పుచెందుతాం. (2) లోహంతో చేయబడిన ముద్ర తన రూపాన్ని మైనంమీద ఒత్తుతుంది. మైనంమీద పడిన ముద్ర ఆ లోహపుముద్ర రూపమే. ఇదేరీతిగా భగవంతుడు కూడా పవిత్రీకరణ వరప్రసాదంద్వారా తన పోలికను మన ఆత్మమీద చిత్రిస్తాడు. ఈ పోలిక వలననే మనం దివ్యత్వం పొందుతున్నాం.

ఇవి పోలికలు. కాని అన్ని వుపమానాల్లోలాగే ఈ యుపమానంలో కూడ కొన్ని లోపాలున్నాయి. మొదటిది ముద్ర మైనం ఉపరిభాగాన్ని మాత్రమే సోకుతుంది. భగవత్కృప ఈలా కాకుండ మన ఆత్మమునంతటినీ సోకి మనకు దైవత్వం ఇస్తుంది. రెండవది, లోహపు ముద్రను తొలగించినంక గూడ మైనంమీద ముద్ర నిలిచే వుంటుంది. కాని ఇదేరీతిగా భగవంతుడు మన ఆత్మపై తన పోలికను కలిగించిన పిదప తాను వైదొలగి పోడు. వడ్రంగి బల్లనుచేసి ముగించాక అతని ఆపేక్ష లేకుండానే బల్ల తనంతట తాను ఉండగలదు. కాని వరప్రసాద విషయం ఈలాగాదు. భగవంతుడు మన హృదయంలో ఉన్నంతసేపే అతని పవిత్రీకరణ వరప్రసాదంకూడ హృదయంలో నిలుస్తుంది. మనం పాపంచేసి అతడు వైదొలగిన క్షణంలోనే పవిత్రీకరణ వరప్రసాదం కూడ అంతరించిపోతుంది. అందుకే భగవంతుని అంతర్నివాసానికీ పవిత్రీకరణ వరప్రసాదానికీ అవినాభావ సంబంధం ఉంటుందని చెప్పాం.

2. పరిశుద్ధాత్మ మనకు దైవత్వాన్ని ఇస్తుందని చెప్తూ బాసిల్ ఈలా వ్రాసాడు. "పరిశుద్ధాత్మ తన్నాహ్వానించే వాళ్ళ హృదయాల్లో స్థిరమూనూ పరిపూర్ణమునైన వరప్రసాదాన్ని చిలకరిస్తుంది. ఆదివ్యాత్మ కృప అనంతమైనా మన పాత్రతను బట్టి ఆ యాత్మ కృపను స్వీకరిస్తుంటాం. ఆ యాత్మ కూడ తన్నాహ్వానించే వాని హృదయంలో, ఆ హృదయ

మాలిన్యం అడ్డుపడనంతవరకూ, వెలిగిపోతూంటుంది. వెలుగు పైబడి నంతనే స్ఫటికం మొదలైన నిర్మల వస్తువులు తాము వెలిగిపోతాయి. నలువైపుల నూత్న తేజం వెదజల్లుతాయి. ఆ రీతిగానే మన యాత్మలు కూడ దేవుని పొంది దేవుని రూపం గైకొంటాయి. దివ్యత్వం పొందుతాయి".

ఈ సాదృశ్యంలోని భావాలివి : (1) పవిత్రీకరణ వరప్రసాదం ఆత్మ ఉపరిభాగంమీద కాదు, ఆత్మయందంతటా ప్రసరిస్తుంది. వెలుగు స్ఫటికాన్నంతటినీ వెలిగించినట్లే వరప్రసాదం ఆత్మనంతటినీ వెలిగిస్తుంది. జ్యోతిర్మయ స్ఫటికం తానూ జ్యోతీ రెండూకూడ. అలాగే వరప్రసాదమయాత్మం తానూ వరప్రసాదమూ రెండూకూడ. వెలుగు స్ఫటికం యొక్క అస్తిత్వాన్ని నాశం చేయని యట్లే వరప్రసాదంకూడ ఆత్మ అస్తిత్వాన్ని నాశం చేయదు. (2) వెలుగు ప్రసరించినంత కాలం మాత్రమే స్ఫటికం ప్రజ్వరిల్లుతుంది. ఆ వెలుగు అంతరించగానే స్ఫటికం బండవారిపోతుంది. అదేరీతిగా మన హృదయంలో దైవసాన్నిధ్యం ఉన్నంతకాలమే వరప్రసాదమూ నిలుస్తుంది. పాపం ద్వారా ఆ దేవుని పోగొట్టుకొనినంతనే ఆ దైవతేజం కూడ చల్లారిపోతుంది.

దివ్యజ్యోతితో వెలిగే ఆత్మం ఆధ్యాత్మిక సత్తు. కావున దానిని ఈ భౌతిక నేత్రాలతో చూడలేం. చూచామో, మరి ఈ యైహిక వస్తువులేవీ మన కంటికి ఇంపుగొల్పవు. పెద్దతెరీస, సియన్నా కత్తరీన మొదలైన పునీతురాళ్ళు కూడ పవిత్రస్థితిలోనున్న ఆత్మకంటె సుందరరూపం మరొకటి లేదని వ్రాసారు. ఉదయం గడ్డిమీద కన్పించే నీటిబొట్లు సూర్యుడు ఉదయించనంతవరకూ ఒట్టినీటిబొట్లే. కాని సూర్యకిరణాలు సోకిన వెంటనే ఆ నీటిబొట్లు సూర్యుణ్ణి ప్రతిబింబించుకొని ముత్యాల్లాగ మెరిసిపోతాయి. మన ఆత్మ కూడ దైవవరప్రసాదాన్ని పొందిన వెంటనే దివ్యరూపంతో, దివ్యతేజంతో మెరసిపోతుంది. ఆ బిందువు తానూ ఓ సూర్యుళ్ళాగ వెలిగినట్లే, మన ఆత్మం కూడ తానూ ఓ దేవుళ్ళాగ మెరసిపోతుంది. ఐనా ఆత్మ దివ్యతేజాన్ని ఆవలితీరాన అడుగుపెట్టిందాకా ఈ భౌతిక చక్షువులతో వీక్షించలేం. ఇంకా తీరము జేరని బాటసారులమైన మనం దివ్యరూపాలను మాసిన అద్దంలోని ప్రతిబింబంలాగ మసకమసకగా మాత్రమే దర్శించగలం - 1 కొరి 13, 12.

## 5. దివ్యగ్రంథ వర్ణనం

త్రెంటుసభ ప్రకారం, నీతిని పొందడమంటే మన పాపాలు యథార్థంగా పరిహారం కావడం. మన ఆత్మ వర ప్రసాదాన్ని పొంది క్రొత్తతనాన్నీ మార్పునీ చేకొనడం. దివ్యగ్రంథాలు కూడ ఈ సత్యాలనే బోధిస్తాయి.

**1. పాపపరిహారం :** మొదటి యోహాను జాబు క్రీస్తు రక్తం మనలను పాపంనుండి శుభ్రంగా కడిగివేస్తుంది అని చెప్తుంది. 1,7. స్నాపక యోహాను క్రీస్తును చూచి "ఇదుగో! లోకం పాపాలను తొలగించడానికై వచ్చిన దేవుని గొర్రెపిల్ల" అంటాడు - యోహా 1,29

క్రీస్తు సిలువమీద మరణించిందీ మళ్లా ఉత్థానమైందీ మన పాపాలను పరిహరించడం కోసమేగదా! కావున నీతిని పొందడం ద్వారా మన పాపాలు యథార్థంగా పరిహారమౌతాయికాని, కప్పివేయబడవు. పూర్వవేదపు యిస్రాయేలు ప్రజలు కూడ దేవుని కృపవల్ల తమ పాపాలు పూర్తిగా మన్నింపబడ్డాయనే నమ్మారు. 51వ కీర్తన "ప్రభూ! కారుణ్యాతిశయంతో నా పాపాలను తుడిచివేయి. నన్ను పూర్తిగా కడిగి శుభ్రాత్మని చేయి. హిస్సోపుతో నా పాపాలను కడిగివేయి. నేను మంచుకంటె తెల్లనయ్యేలా నన్ను కడుగు. నాలో నిర్మల హృదయం నెలకొల్పు అంటుంది. ఈ వాక్యాల భావం ప్రకారం, యావే మన పాపాలను పలకమీది అక్షరాలనులాగ తుడిచివేస్తాడు. శుభ్రమైన నీటిలో మురికి బట్టనులాగ మన మలినాత్మను శుభ్రపరుస్తాడు. కనుక దేవుడు మన ఆత్మను క్రీస్తు వరప్రసాదంతో కప్పివేయుడు. దాని పాపాలను పూర్తిగా క్షమిస్తాడు.

**2. క్రొత్తదనము :** పౌలు ఎఫేసీయుల జాబులో "మీ చిత్తవృత్తి యందు నూత్నత్వం పొందండి. నీతి, భక్తి కలవాళ్లై దేవునికి పోలికగా సృజింపబడిన నవీన స్వభావాన్ని చేకొనండి" అంటాడు - 4,24. ఇలా నూత్నత్వం పొందాలి అని బైబులు చాలా తావుల్లో చెప్తుంది.

## ప్రార్థనా భావాలు

1. జ్ఞానస్నానంద్వారా మనం క్రీస్తుతో ఐక్యమౌతాం. అతనినుండి వరప్రసాదాన్ని స్వీకరిస్తాం. ఈ యంశాన్ని నూత్నవేద రచయితలు మూడుపమానాలలో వివరించారు.

   పౌలు దేహం అవయవాలు అనే వుపమానం వాడాడు - 1కొ 12, 27. జ్ఞానస్నానంద్వారా క్రైస్తవులు క్రీస్తుతో ఐక్యమై అతనితో ఒక్కదేహంగా ఏర్పడతారు. ఈ దేహానికి శిరస్సు క్రీస్తు. అవయవాలు క్రైస్తవులు. అవయవాలు శిరస్సు వలన జీవిస్తాయి. ఆలాగే క్రైస్తవులు క్రీస్తు వలన జీవిస్తారు. శిరస్సులోని జీవం అవయవాల్లోనికి మల్లే క్రీస్తులోని దివ్యజీవం క్రైస్తవుల్లోనికి ప్రసరిస్తుంది. ఈ దివ్య జీవనమే వరప్రసాద జీవితం.

2. యోహాను తీగలు రెమ్మలు అనే వుపమానం వాడాడు. -15, 16. తీగలోని సారం రెమ్మలలోనికి ప్రసరిస్తుంది. ఆ రెమ్మలు ఆకుదొడిగి పూలుపూచి కాయలు కాస్తాయి. తల్లి తీగనుండి వేరుచేస్తే రెమ్మలు వెంటనే వాడిపోతాయి. క్రైస్తవులు కూడ క్రీస్తుతో ఐక్యమై అతని సారంవలన జీవిస్తుంటారు. అతని సారం వలననే సత్ఫలితాన్ని ఇస్తుంటారు. క్రీస్తునుండి వేరైతే నిష్ప్రయోజకులై పోతారు. క్రీస్తునుండి క్రైస్తవులు పొందే సారమే వరప్రసాద జీవితం.

3. పేత్రు వ్రాసిన మొదటి జాబులో దేవాలయ సజీవ శిలలు అనే వుపమానం వాడాడు - 2,3. క్రీస్తు శిల. ఈ శిలను మూలరాయిగా చేసి తండ్రి దివ్యమందిరాన్ని నిర్మిస్తాడు. క్రైస్తవులుకూడ సజీవ శిలల్లాగ ఆ మందిరంలో నిర్మింపబడతారు. అనగా క్రీస్తుతో కూడి మనమంతా ఒక మందిరమౌతాం. ఈ దేవాలయంలో మనం పరలోకపు తండ్రిని ఆరాధిస్తాం. ఇక్కడ వుపమానం యిది. మందిరానికి ఐక్యతా నిలకడా పెంపూ యిచ్చేది మూలరాయి. అలా క్రైస్తవ ప్రజలకు జీవమూ ఐక్యతా ప్రసాదించేది క్రీస్తు.

పై మూడుపమానాలు క్రీస్తుతో మనకుండే సంబంధాన్నీ ఐక్యతనూ సూచిస్తాయి. ఈ యైక్యత జ్ఞానస్నానం నుండి ప్రారంభ మౌతుంది. జ్ఞానస్నానమంటే క్రీస్తు మరణోత్థానాల్లో పాలుపొంది అతని వరప్రసాదాన్ని స్వీకరించడమే.

# 2. నరుడు దివ్యుడు

పూర్వాధ్యాయంలో పవిత్రీకరణ వరప్రసాదాన్ని గూర్చి చెప్పాం. ఈ పవిత్రీకరణ వరప్రసాదం మనలను దివ్యులను చేస్తుంది. ప్రస్తుతాధ్యాయంలో ఈ దివ్యత్వమంటే యేమిటో విచారించి చూద్దాం. ఇక్కడ మూడంశాలు తెలిసికొందాం.

## 1. నరుడు దేవుని ప్రతిబింబం

దివ్యజీవితం జీవించే సామర్థ్యాన్ని ఇచ్చేది మనలోని ఆత్మం. ఈ యాత్మ ద్వారానే నరుడు దేవునిపోలికను పొందుతున్నాడు. ఈ పోలికను ఆదికాండం ఈలా వర్ణిస్తుంది. దేవుడు నరుని సృజించాలి అనుకున్నాడు. సమస్త ప్రాణికోటిపై అతడు అధికారం నెరపాలి అనుకున్నాడు. ఇట్లనుకొని తనకు ప్రతిబింబంగా నరుని సృజించాడు. స్త్రీ పురుషులనుగా ఆ నరుని సృజించాడు-1 26-28. పూర్వ నూత్నవేదాలు చాలా తావుల్లో ఈ విషయాన్ని పేర్కొంటాయి. నరుడు దేవునికి పోలికగా వుంటాడు అనడంలో దివ్యగ్రంథం ఉద్దేశాలు ఇవి 1. నరుడు భగవంతునికి పోలికగా సృజింపబడ్డాడు అంటే అతడు జంతువుల కంటె అధికుడు. ఈ పోలికద్వారా నరుడు భూమ్యాకాశ సముద్రాల్లో సంచరించే ప్రాణులన్నింటి మీద అధికారం నెరవుతూన్నాడు. 2. ఈ పోలిక ద్వారానే అతడు దేవునికి పుత్రుడయ్యాడు. 3. అతని యందు అతనిద్వారా దేవుడు భూమిమీద నెలకొన్నాడు. 4. ఈ పోలికే అతనికి అమృతత్వాన్ని ఇస్తుంది. 5. పాపం వలన నరునిలోని యీ పోలిక మాసిపోతుంది. 6. నరునిలో మళ్ళా యీ పోలికను కలిగించడానికే క్రీస్తు వచ్చాడు. అతడు భగవంతుని ప్రతిబింబం. క్రీస్తు రూపాన్ని ప్రతిబింబించు కోవడమే మన బాధ్యత. 8. జ్ఞానస్నానం మొదలైన సంస్కారాలవల్ల, విశ్వాసంవల్లా నైతిక జీవితంవల్ల నానాటికీ ఈ క్రీస్తు పోలిక మనలో పెరుగుతుంది. పరిశుద్ధాత్మ ఓ చిత్రకారునిలాగ క్రీస్తు రూపాన్ని మన హృదయంమీద చిత్రిస్తుంది.

అగస్టీను, అక్వైనాసు మొదలైన దైవశాస్త్రజ్ఞులు పై బైబులు భావాల మీద ఆలోచన సల్పి ఈక్రింది భావాలను వెల్లడించారు. మనుష్యుల్లో దేవుని పోలికా వుంది, త్రీత్వైక సర్వేశ్వరుని పోలికా వుంది.

దేవుని పోలిక మూడు దశల్లో కన్పిస్తుంది. మొదటి దశ సృష్టికి చెందింది. ప్రతి నరుని ఆత్మలోను సృష్టికర్త రూపం వుంటుంది. దీని వలననే అతడు దేవుని తెలిసికొని ప్రేమింప గల్గుతూన్నాడు. జన్మపాపం ద్వారా ఈ రూపం మాసిపోదు. రెండవదశ ఉద్ధరణకు చెందింది. నరుడు ప్రాకృతిక జీవితం నుండి వరప్రసాద జీవితంలో ప్రవేశించి తన ఆత్మలో దేవుని రూపం కలిగించుకుంటాడు. చావైన పాపం చేసిన వెంటనే ఈ పోలిక నశిస్తుంది. మూడవ దశ మహిమకు చెందింది. మోక్షంలో ప్రభుని ముఖాముఖి దర్శించే పునీతుల్లో అతని దివ్యరూపం వెలుగుతూంటుంది. ఈ మూడవ పోలిక ఎప్పటికీ మాసిపోదు. ఈ మూడవ పోలికవలన మనం కూడ దేవునిలాంటి వాళ్ళమౌతాం. అందుకే యోహాను మొదటి జాబు "దేవుడు ప్రత్యక్షమైనప్పుడు మనంకూడ అతనిలా ఔతాం, ఉన్నవానిని ఉన్నట్లుగా అతని నిజరూపం చూస్తాం" అని చెప్తుంది - 3,2.

నరులయందు త్రీత్వైక సర్వేశ్వరుని పోలిక కూడ వుంది. నరునిలో ఉనికి, చిత్తశక్తి, బుద్ధిశక్తివుంటాయి. ఉనికి వలన జనుడు ఉండగల్గుతున్నాడు. బుద్ధిశక్తిద్వారా ఆలోచింపగల్గుతున్నాడు. చిత్తశక్తిద్వారా ప్రేమింప గల్గుతున్నాడు.

నరుని ఉనికి పితయైన సర్వేశ్వరునికి పోలికగా వుంటుంది. ముగ్గురు దైవవ్యక్తుల్లోను తొలివ్యక్తి పిత. అతడు అన్ని ప్రాణులకు ఉనికి నిచ్చేవాడు. ఐనా అతని కెవ్వరూ ఉనికి నీయరు. మరి తనంతట, తననుండి తాను ఉండేవాడు. కావున మన యునికి అతని యునికికి ఒక మాదిరి ప్రతిబింబం. ఒక మాదిరి పోలిక.

నరునియందలి బుద్ధిశక్తి రెండవ వ్యక్తియైన సుతుడైన సర్వేశ్వరునికి పోలికగా వుంటుంది. రెండవ దైవవ్యక్తి పిత బుద్ధిశక్తినుండి వెలువుడతుంటాడు. కనుకనే అతనికి "వార్త" అని పేరు. అనగా అతడు పిత పలుకూ ఆలోచనమూను. మనలోని ఆలోచనద్వారా ఈ రెండవ దైవవ్యక్తిని పోలివుంటాం.

మనలోని చిత్తశక్తి మూడవ దైవవ్యక్తి యైన పరిశుద్ధాత్మకు పోలికగా వుంటుంది. చిత్తశక్తి ప్రేమకు ఆధారం కదా! పరిశుద్ధాత్మ కూడ పితసుతుల పరస్పర ప్రేమే. కనుక మనలోని ప్రేమద్వారా పరిశుద్ధాత్మకు పోలికగా వుంటాం.

నరులమైన మనకు దివ్యత్వం లభిస్తుంది. కాని ఈ దివ్యత్వాన్ని పొందే అర్హత మనలో వుండాలి. ఈ యర్హతే మనలోని దేవుని పోలిక. ఈ పోలిక వలననే నరులు పశుపక్ష్యాదులకంటె గొప్పవాళ్లై, దేవుని రూపాన్ని పొంది దైవజీవితం జీవింప గల్గుతున్నారు. రెండవ శతాబ్దపు వేదశాస్త్రజ్ఞుడు ఇరెనేయుస్ "నరుడు దేవుని మహిమను విస్తరింప జేస్తున్నాడు" అని వ్రాసాడు.

## 2. గ్రీకు పితృపాదులు

సిరిల్, బాసిల్, గ్రెగొరీ మొదలైన గ్రీకు పితృపాదులు క్రీస్తు ద్వారా మనం దివ్యత్వం పొందుతామని చెప్పారు. వాళ్ళ భావాలను కొన్నిటిని చూద్దాం.

క్రీస్తు జననాన్ని గూర్చి వ్రాస్తూ ఇరెనేయుస్, మనుష్యుడు దైవకుమారుడు కావడం కోసమే రక్షకుడు మనుష్య కుమారుడై జన్మించాడని చెప్పాడు. అతనేష్యస్ కూడ క్రీస్తు నరుడై నరుని దేవుని గావించాడు అని వ్రాసాడు.

అలెగ్జాండ్రియా సిరిల్ క్రీస్తు దేవదూతల కుటుంబంలో జన్మింపక అబ్రాహాము కుటుంబంలో జన్మించి నరుడుగా మెలగనేల అని ప్రశ్నించుకొని ఈలా జవాబు చెప్పాడు. మన బానిసజాతిలో జన్మించడంవల్ల క్రీస్తుకు కలిగిన లాభమేమీలేదు. మరి లాభమంతా బానిసలమైన మనకే. క్రీస్తుద్వారా మనం బానిసానికి తప్పి దైవత్వం పొందుతున్నాం. పేదరికాన్ని జయించి కలిమిని పొందుతున్నాం.

నీస్సా గ్రెగోరీ తలపున, మంచి కాపరియైన క్రీస్తు తప్పిపోయిన గొఱ్ఱెను తన భుజాలమీదికి ఎక్కించుకొని తానూ ఆ గొఱ్ఱె స్వభావం పొందుతాడు. ఇక్కడ కాపరి దేవుణ్ణీ, గొఱ్ఱె మానవ సంతతినీ సూచిస్తుంది. క్రీస్తు గొఱ్ఱె, కాపరి రెండూకూడ. అతడు గొఱ్ఱె దేనికంటే తాను గైకొనిన క్రొత్త స్వభావం వలన. కాపరి ఎందుకంటే తన స్వీయ స్వభావంచేత. ఈ రీతిగా క్రీస్తు మన స్వభావం గైకొనడం చేత మనం క్రీస్తు స్వభావం గైకొంటున్నాం. అనగా భగవంతులమౌతూన్నాం.

నాసియాన్సన్ గ్రెగోరీ తలపున, క్రీస్తు మన రోజువారి పనులను తానూచేసి వాటిద్వారానే మనకు దైవత్వం ఇస్తాడు. మన నిద్రను ఆశీర్వదించడానికే ప్రభువు తాను నిద్రపోయాడు. మన అలసటను పునీతం చేయడానికే ప్రభువు తానూ అలసట చెందాడు. మన కన్నీటిని పవిపత్రం చేయడానికే ప్రభువు తానూ కన్నీరోడ్చాడు.

ఇంకా ఈ గ్రెగోరీ తన్ను గూర్చి తానే మననం చేసుకొని ఈలా అబ్బురపడ్డాడు. నేను అల్పప్రాణిని మహత్తర ప్రాణినికూడ. మృత్యువువాతబడేవాడిని, అమృతత్వాన్ని పొందేవాడినిగూడ. దేహిని, ఆత్మచే అలంకృతుణ్ణికూడ. భౌతిక ప్రపంచవాసిని, దైవపురంలో అడుగుపెట్టే వాణ్ణి కూడ. ఏమి వింత? ఈ భాగ్యమంతా క్రీస్తుద్వారానే. నేను క్రీస్తుతో ఐక్యమై క్రీస్తునందు మరణిస్తాను. క్రీస్తుతో భూస్థాపితుడనై అతనితోనే ఉత్థానమౌతాను. క్రీస్తుతో స్వర్గానికి వారసుడ నౌతాను. క్రీస్తు ద్వారా దైవపుత్రుడనౌతాను. దైవత్వం పొందుతాను.

అతనేష్యస్ తలపున, క్రీస్తు మహిమ మనకూ సంక్రమిస్తుంది. క్రీస్తు మనదేహాన్ని గైకొని మన మానుష సంతతితో నివసించడంచే మనం కూడ దేవుని ఆలయాల మౌతాం. కావున దేవాలయాలమైన మనయందు కూడ ప్రభువు ఆరాధ్యుడు. మనలను చూచిన నరులుకూడ "భగవంతుడు వీళ్ళయందున్నాడు" అని భావిస్తుంటారు - 1 కొరి 14,25.

పై అతనేష్యస్ మనం దైవ పుత్రులమౌతామని కూడ చెప్పాడు. మంటిమీది వాళ్ళని మింటిమీదికి చేర్చడానికే క్రీస్తు మింటి మీదినుండి మంటిమీదికి దిగివచ్చాడు. మానవకుమారులను దైవకుమారులను గావించడం కోసమే దైవకుమారుడు మానవకుమారుడై జన్మించాడు. తాను మనుష్య కుమారుడన్న పేరుతో చలామణి అయ్యాడు. అతని ద్వారా మనం దైవకుమారులమై పరలోకంలోని దేవుణ్ణి "మా తండ్రీ!" అని పిలుస్తున్నాం.

బానిసల ప్రభువు తనకు బానిసయైన ఆదామునకు బానిసయై జన్మించాడు. దానిద్వారా మృత్యుగ్రస్తులైన ఆదాము పుత్రులు అమృతత్వం పొంది దైవ కుమారులయ్యారు. కావుననే "అతడు వారిని దైవపుత్రులను చేసాడు" అని చెప్పబడింది. - యోహా 1,12. అతడు స్వభావసిద్ధంగానే దైవకుమారుడు. మనం అతని వరప్రసాదం ద్వారా దైవ పుత్రులం. ప్రభువు కరుణామయుడు కాబట్టి తాను ఆదాము పుత్రుడై జన్మించి మనలనుకూడ తనయందు భరించుకొన్నాడు. దీని వలన మనం దేవుణ్ణి మనయందు భరించుకో గల్గుతున్నాం.

హిలరీ భావాల ప్రకారం క్రీస్తు మన మానుష స్వభావాన్ని చేకొని మనల నందరినీ తనలోనికి తీసికొన్నాడు. తాను ఓ పట్టణంలా వుంటాడు. క్రీస్తుతో ఐక్యమై ఆ దివ్యపట్టణంలో వసించే దివ్యపౌరులం మనం.

క్రీస్తుద్వారా దైవత్వాన్ని పొందినట్లే పరిశుద్ధాత్మ ద్వారా క్రీస్తుని పొందుతుంటాం. అలెగ్జాండ్రియా సిరిల్‌భావాల ప్రకారం, క్రీస్తు పితకు ప్రతిబింబమైతే పరిశుద్ధాత్మ క్రీస్తుకు ప్రతిబింబం. కావుననే ఈ పావనాత్మ క్రీస్తు రూపురేఖలను మన హృదయాల్లో చిత్రిస్తుంది. ఈలా చిత్రించడం ద్వారానే మనం క్రీస్తు దైవత్వంలో పాలు పొందుతూంటాం.

పితృపాదుల భావాలు ఎంత రమ్యంగా వుంటాయో అంత బహుళంగా వుంటాయికూడ. కాని వాని నన్నిటినీ ఇక్కడ పేర్కొనలేం. వాళ్ళ భావాల సారం యిది: క్రీస్తు స్వభావ సిద్ధంగా దైవకుమారుడు. మనం క్రీస్తు కృపవల్ల దైవ కుమారులం. ఈ దైవత్వంపై మనకు ఏ హక్కూ లేదు. స్వభావసిద్ధంగా మనం దేవుళ్ళం కాదుగదా, పాపపు నరులం కూడ. మన స్వభావం వేరు. దైవస్వభావంవేరు. ఐనా ప్రభువు మనమీద దయబూని తన దైవత్వంలో మనమూ పాలు పొందేలా చేసాడు.

## 3. ఉపనిషద్భావాలు

మనం స్వభావ సిద్ధంగా భగవంతులం కాము, క్రీస్తు వరప్రసాదం వలన దివ్యత్వం పొందుతామని చెప్పాం. కాని హిందూ సోదరులు, జనులు స్వభావ సిద్ధంగానే భగవంతులు అని చెప్తారు. వరప్రసాదంతో అవసరం లేకుండానే, మనమే భగవంతులం, భగవంతుడే మనం అని వాదిస్తారు. ఈ వాదనకే అద్వైతమని పేరు.

మోక్షసాధనకై హిందువులు కర్మ, భక్తి, జ్ఞానం అనే మూడు మార్గాలు సూచిస్తారు. ఈ మూడింటిలో జ్ఞానమార్గం మాత్రమే అద్వైతవాదాన్ని అవలంబిస్తుంది. ఈ యద్వైత వాదం తొలుత ఉపనిషత్తుల్లో ప్రతిపాదించబడింది. ఉపనిషత్తులు వేదాల్లో ఓ భాగం. క్రీస్తు పూర్వం 8-4 శతాబ్దాల్లో రచింపబడ్డాయి. ఈ యుపనిషత్తులు మానవుడుకూడా భగవంతుడే అనే అద్వైత వాదాన్ని మాత్రమేకాక, నరుడు భగవంతుడు వేరు వేరు సత్తులనే ద్వైత భావాన్నీ, ఈ సత్తులన్నీ భగవంతుని గుణాలను కలిగి వుంటాయనే బహ్వీశ్వర భావాన్నీ కూడ బోధిస్తాయి. కనుక ఉపనిషద్వీథుల్లో ఓ పాయ మాత్రమే అద్వైత బోధ. ఇక ఈ యద్వైత సారం యిది : (1) మనం మొదటినుండీ బ్రహ్మలమే. (2) ఐనా మాయ వలన ఈ సత్యాన్ని మరచి ఆ బ్రహ్మ వేరు, మనం వేరు అని భ్రాంతి పడుతూంటాం. (3) జ్ఞానం ద్వారా మనం కూడా బ్రహ్మమేనని తెలిసికొనిన వెంటనే ఆ బ్రహ్మతో ఐక్యమై పోతాం. ఈ మూడంశాలను ఒకింత విపులంగా విచారించి చూద్దాం.

1. ఉపనిషత్తులు భగవంతుని "బ్రహ్మము" అని పిలుస్తాయి. ఈ బ్రహ్మము త్రిమూర్తులలోని "బ్రహ్మ" కాదు. జగదాధారమైన కారణం. బ్రహ్మ పుంలింగం, బ్రహ్మము నపుంసక లింగం. ఈ బ్రహ్మము, మానవుడు, భౌతిక ప్రపంచము - ఈ మూడు మూడు ప్రత్యేక సత్తులు కావనియు ఒకే సత్తనియు ఉపనిషత్తుల సిద్ధాంతం. చాందోగ్యోపనిషత్తు ఈ విశ్వమంతా బ్రహ్మయే అంటుంది. "సర్వంఖలు ఇదంబ్రహ్మ-" 3,14,1. బృహదారణ్య కోపనిషత్తు నేనే బ్రహ్మమునని చెపుతుంది. జీవాత్మను పరమాత్మతో ఏకం చేస్తుంది. "అహం బ్రహ్మ అస్మి" - 1, 4,10.

2. మనమందరమూ స్వయంగా బ్రహ్మమే. ఐనా మాయకు జిక్కి ఈ సత్యాన్ని గ్రహించలేకపోతున్నాం. ఇక్కడ బంగారపు గనివుంది అని తెలియనివాడు ప్రతిరోజు ఆ గనిమీద నడుస్తున్నా అక్కడున్న అమూల్య వస్తువును తెలిసికోలేడు. అలాగే మనమూ ప్రతిదినం బ్రహ్మ జీవితం జీవిస్తున్నా అ బ్రహ్మమును తెలిసికోలేక పోతున్నాం. బ్రహ్మజ్ఞానంద్వారా మాత్రమే నరులు ఈ మాయను దాటగల్గుతున్నారు.

3. బ్రహ్మమును ధ్యానించి బ్రహ్మ స్వభావం తెలిసికోవడంద్వారామనంకూడ బ్రహ్మలమైపోతాం. బ్రహ్మమైపోతామంటే మనమింతకు ముందు కాని నూత్న వ్యక్తిమైపోతామని కాదు. మనం బ్రహ్మమేనని తెలిసికొంటాం. అంతే. ఈ తెలివిడి ద్వారానే బ్రహ్మభావాన్ని పొందుతాం. బ్రహ్మభావం పొందడమంటే ఏదో కావడంగాదు. తెలిసికోవడం మాత్రమే. బృహదారణ్య కోపనిషత్తు నేనే బ్రహ్మను అని తెలిసికొనేవాడు ఈ సర్వమూ ఔతాడు అంటుంది. "ఆహం బ్రహ్మ అస్మీతి స ఇదం సర్వం భవతి" - 1,4,10. ఈరీతిగా బ్రహ్మముతో ఐక్యమైనంక నేను జగత్తు, భగవంతుడు అనే మూడుసత్తులు ఉండవు. ఈ మూడు ఒకే సత్తుగా పరిగణింపబడతాయి.

ఈ యద్వైతవాదం బోధించే దివ్యత్వం మన క్రైస్తవమతం బోధించే దివ్యత్వం కంటె భిన్నమైంది. మన తలపున నరులకు స్వభావ సిద్ధమైన దైవత్వం లేదు. దైవత్వం మనకు వర ప్రసాదం వలన లభిస్తుంది. దైవత్వాన్ని పొందినంకకూడ నరులు దేవునితో కలసిపోరు. మోక్షంలోకూడ నరుడు వేరు, భగవంతుడు వేరు. కాని అద్వైతవాదం ప్రకారం నరులు స్వభావ సిద్ధంగానే భగవంతులు. ఈ భగవత్స్వభావాన్ని వాళ్ళు ఏనాడూ పోగొట్టుకోలేదు. మరచిపోయారు అంతే. ఈ విషయాన్ని జ్ఞాపకం చేసికోగానే నరుడూ భగవంతుడై పోతాడు.

ఈ యద్వైతవాదాన్ని హైందవు లెప్పుడూ సకారణంగా రుజువు చేయరు. ప్రాచీన ఋషుల అనుభవమని మాత్రం చెపుతూంటారు. వ్యక్తిగతానుభవానికి దైవశాస్త్రరీత్యా ఏమి విలువ? మన దివ్యగ్రంథాలూ పారంపర్యబోధా నరుడు భగవంతుడేనని చెప్పవు. సృష్టి ప్రాణియైన నరుడు సృష్టికర్తనుండి దివ్యత్వమనే భిక్షను స్వీకరిస్తాడని మాత్రం చెప్తాయి.

## ప్రార్థనా భావాలు

1. వరప్రసాదం అంటుమామిడి లాంటిది. పుల్లమామిడిపై తీయమామిడిని అంటుకడతాం. దీనివలన తీయమామిడి పుల్లమామిడి సారాన్ని తలలోనికి మార్చుకొని తీయని పండ్లనిస్తుంది. పవిత్రీకరణ వరప్రసాదం మనమీద కట్టుబడిన అంటులాంటిది. మనంతటమనం పుల్లమామిడి లాంటివాళ్ళం. ప్రాకృతిక మానవులం. మన జీవితంకూడ పుల్లనిపండ్లనేగాని తీయనిపండ్ల నీయలేదు. కాని పవిత్రీకరణ వరప్రసాదం ఓ మారు మనమీద అంటుపాతుకొందో, ఇక మన జీవితమూ మన కార్యాలూ దివ్యత్వాన్ని పొందుతాయి. మన తలపుల్లో పలుకుల్లో చేతల్లో దివ్యత్వం గోచరిస్తుంది. కనుకనే పౌలు "నేను జీవిస్తున్నాను. కాదు, నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు" అని చెప్పుకొన్నాడు - గల 2, 20. ఇది చాల లోతైన వాక్యం.

2. వరప్రసాదం ద్వారా ప్రాకృతిక మానవులమైన మనం దివ్యమానవుల మౌతాం. దేవుని బిడ్డల్లా ప్రవర్తిస్తాం. ఓమారు ఫ్రాన్సుదేశపు లూయీరాజు కొమార్తను ఆమె పరిచారిక చిన్న చూపు చూచిందట. రాజకుమారి ఆగ్రహించింది ప్రభువు పుత్రికనైన నన్ను చిన్న చూపు చూస్తావా అని గద్దించింది. కాని ఆ పరిచారిక ఏమీ జంకక పరలోక భూలోకాలకు ప్రభువైన దేవుని పుత్రికను నన్ను ఈ రీతిగా ప్రశ్నిస్తావా అంది. ఔను, మనం వరప్రసాదంద్వారా దేవుని బిడ్డలం, దివ్యజీవితం జీవించేవాళ్ళం. తరచుగా ఈ సత్యాన్ని జ్ఞాపకం చేసికోవడం మంచిది.

# 3. దత్తపుత్రులు

పూర్వాధ్యాయంలో పవిత్రీకరణ వరప్రసాదం మనలను దివ్యులను చేస్తుంది అని చెప్పాం. ఇదే వరప్రసాదం మనలను దేవునికి దత్తపుత్రులను చేస్తుంది. కావున ఈ యధ్యాయంలో దత్తపుత్రులు కావడమంటే యేమిటో చూద్దాం. ఇక్కడ మూడంశాలను పరిశీలిద్దాం.

## 1. దత్త పుత్రులు

ఎఫెసీయుల జాబులో పౌలు, పరలోకపిత లోకారంభం నుండి మనలను క్రీస్తుద్వారా దత్తపుత్రులనుగా ఎన్నుకొన్నాడు అని వ్రాసాదు – 1,5. దత్తపుత్రులంటే యేమిటి? క్రీస్తు ద్వారా ఎన్నుకోవడమంటే యేమిటి?

దత్తపుత్రుని లక్షణాలు రెండు. 1. మన కుటుంబానికి చెందని అన్యవ్యక్తి నొకనిని పుత్రునిగా స్వీకరిస్తాం. 2. కుటుంబపు ఆస్తిపాస్తులపై అతనికి వారసపు హక్కు లభిస్తుంది. ఈ రెండు ఉపకారాలనీ అతనికి హక్కు లేదు. క్రొత్త తల్లిదండ్రుల కారుణ్యం వలన ఈ రెండుపకారాలు అతనికి ఉచితంగా లభిస్తాయి.

దేవునిపట్ల మనకు చనువు వుంటుందని తెలియజేయడానికే పౌలు మనం దత్తపుత్రులమని చెప్పాడు. దత్తపుత్రుడు క్రొత్త తల్లిదండ్రులను తన సొంత తల్లిదండ్రుల్లాగ భావిస్తాడు. వాళ్ల పట్ల చనువుతో మెలుగుతాడు. వాళ్ళూ అతన్ని ప్రేవున బుట్టిన బిడ్డనులాగ వాత్సల్యంతో చూస్తారు. ఈ చనువు ఈ ప్రేమ దేవునికీ, మనకీ వుండే బాంధవ్యానికి ఓ మాదిరి పోలిక.

దత్తపుత్రుడు యథార్థంగా తల్లిదండ్రుల ప్రేవున పుట్టలేదు. అతనికి భౌతిక జీవితాన్ని ఇచ్చింది వాళ్ళుగాదు. అతని పుట్టుక, మనిక ఈ తల్లిదండ్రులమీద అధారపడి వుండవు. కాని భగవంతునిపట్ల మన పుత్రత్వం ఈలాంటిదిగాదు. పరలోక పిత మనలను దత్తపుత్రులనుగా స్వీకరించినపుడే తన పితృత్వాన్ని మనమీద విస్తరింప జేస్తూంటాడు. మనం అతని స్వభావంలో పాలుపొందుతాం. ఏలాగ?

పిత పుత్రుడైన వార్త మన మానుష దేహాన్ని స్వీకరించి క్రీస్తుగా జన్మించాడు. మనం క్రీస్తులోనికి జ్ఞానాస్నానం పొందినపుడు అతనితో ఐక్యమౌతాం. క్రీస్తు స్వీకరించింది ఓ ప్రత్యేక మానుష దేహాన్ని మాత్రమే కాదు. మానుష వ్యక్తులమైన మనలనందరినీకూడ. అతనితోగూడి మన మందరము ఒక్క జ్ఞాన శరీరమౌతాం. అతడు పరలోక పితకు పుత్రుడు. ఈ పుత్రునితో ఐక్యమైన మనమూ ఈ పుత్రుని ద్వారా పరలోకపు తండ్రికి దత్తపుత్రులమౌతాం.

జ్ఞానస్నానంద్వారా క్రీస్తు తన పుత్రత్వంలో మనకూ భాగమిస్తాడు. మనలను తన సోదరులను చేసికొంటాడు. అతడు మనకు పెద్దన్న. మన మందరమూ అతనికి తమ్ముళ్ళమూ చెల్లెళ్ళమూ ఔతాం. అతని ద్వారా మనం అతని తండ్రికి బిడ్డల మౌతాం. క్రీస్తు వరప్రసాదం మనలను భగవంతుని పుత్రులను చేస్తుంది. అందుకే పౌలు పై వాక్యంలో తండ్రి మనలను క్రీస్తుద్వారా దత్తపుత్రులనుగా ఎన్నుకున్నాడు అని వ్రాసాడు.

కాని దివ్యగ్రంథం మనం దత్తపుత్రులమని చెప్పడం దేనికి? క్రీస్తుతోపాటు మనంకూడ పరలోక పితకు సహజపుత్రులం కామా? పితకు సహజ పుత్రుడు క్రీస్తు ఒక్కడే. అందుకే దివ్యగ్రంథం అతన్ని "ఏకైక పుత్రుడు" "తొలిపుత్రుడు" అని పిలుస్తుంది. క్రీస్తు మాత్రమే సహజ పుత్రుడు గావడంచేత ద్వివగ్రంథం మనలను "దత్తపుత్రులు" అని పిలుస్తుంది. ఐనా క్రీస్తులాగే మనంకూడ దేవునికి నిజమైన పుత్రులం. అందుకే యోహాను మొదటిజాబు "మనం దేవుని బిడ్డలమని పిలవబడుతూన్నాం. యథార్థంగా బిడ్డలంకూడ" అంటుంది. 3,1.

## 2. క్రీస్తు – దత్తపుత్రులు

దత్తపుత్రుల్లో మూడు తరగతుల ప్రజలు గోచరిస్తారు. మొదటి తరగతికి ఆధారం సృష్టి. అన్ని మతాలకు చెందిన ప్రజలూ తాము భగవంతుని బిడ్డలమనే చెప్పుకున్నారు. భగవంతుణ్ణి "తండ్రి" అని సంబోధించారు. అతడు సృష్టికర్త. ఈ నరులంతా అతడు సృజించిన ప్రాణులు. అతని నుండి ప్రాణం పొందడంవలన నరులు అతనికి దత్తపుత్రులౌతారు.

రెండవ తరగతికి చెందినవాళ్ళు యూదులు. ఈ తరగతికి ఆధారం ఒడంబడిక. ప్రభువు అబ్రహాముతో ఒడంబడిక చేసికొన్నాడు. ఈ యొడంబడికనే సీనాయివద్ద మోషే సమక్షంలో నూత్నీకరించాడు ప్రభువు. ఈ సీనాయి ఒడంబడిక ద్వారా యిస్రాయేలీయులు యావే ప్రజలయ్యారు. యావే ఆరాధకులయ్యారు. యావేకు పుత్రులయ్యారు. యిస్రాయేలు ప్రజలు వ్యక్తిగతంగాగాదు, సాముదాయికంగా యావేకు పుత్రులు. కావుననే మోషే యావే తరపున ఫరోచక్రవర్తితో మాటలాడుతూ "యిస్రాయేలు నా తొలి పుత్రుడు. అతనిని ఈజిప్టునుండి వెడలిపోనీయి" అంటాడు – నిర్గ 4, 21. ఇక్కడ "తొలిపుత్రుడు" అంటే గారాబు బిడ్డ అని భావం. యిస్రాయేలు ప్రజలంతా యావేకు బిడ్డలాంటివాళ్ళు.

మూడవ తరగతికి చెందినవాళ్ళు క్రైస్తవులు. ఈ తరగతికి ఆధారం జ్ఞానస్నానం. యూదులు సాముదాయికంగా యావే పుత్రులన్నాం. క్రైస్తవులు వ్యక్తిగతంగా గూడా యావే పుత్రులు. జ్ఞానస్నానంద్వారా ఈ పుత్రత్వం మనకు లభిస్తుంది. యోహాను సువార్త "ధర్మశాస్త్రం మోషేద్వారా లభించింది. కాని వరప్రసాదమూ సత్యమూ క్రీస్తు ద్వారా లభించాయి" అని చెప్తుంది. 1,17. మోషే పూర్వవేదపు మధ్యవర్తి. అతడు యావేనుండి

ధర్మశాస్త్రాన్ని గ్రహించి పూర్వవేద ప్రజలకు ఇచ్చాడు. క్రీస్తు నూత్న వేదపు మధ్యవర్తి. ధర్మశాస్త్రానికి మారుగా క్రీస్తు తన కృపనే మనకు అనుగ్రహించాడు. కావుననే "అతని పరిపూర్ణతనుండి మనమంతా కృపకు బదులుగా వేరొక కృపను పొందాము" అని చెప్తుంది యోహాను సువార్త 1, 16. తొలి కృప మోషే ధర్మశాస్త్రం. దానికి బదులుగా మనం పొందిన కృప క్రీస్తు వరప్రసాదం. ఈ కృపకే సత్యం, వరప్రసాదం అనే విశేషణాలు రెండు వాడబడ్డాయి. ఇక్కడ వరప్రసాదమంటే, పరలోకపిత క్రీస్తు ద్వారా మనలను రక్షించడం. సత్యమంటే పరలోకపిత ప్రజలను రక్షిస్తానని తాను పూర్వమే చేసిన ఒడంబడికను క్రీస్తుద్వారా నెరవేర్చుకోవడం.

ఈ క్రీస్తుని అందరూ అంగీకరించరు. అంగీకరించిన వాళ్ళకు మాత్రం క్రీస్తు తన పుత్రత్వంలో పాలిస్తాడు-1,12. ఇక్కడ అంగీకరించడమంటే క్రీస్తుని విశ్వసించి అతని లోనికి జ్ఞానస్నానం పొందడం. అలా చేసినవాళ్ళు క్రీస్తు కృపకూ పుత్రత్వానికీ పాత్రులౌతారు. ఈ పాత్రతవలననే పరలోకపితకు పుత్రుల మౌతున్నాం.

యూదులు యావేను తండ్రి అనికాక యజమానుడు అని పిలిచేవాళ్ళు. ఆ భగవంతునిపట్ల వారికి పెద్ద చనువులేదు. అతడుకూడ నరావతారమెత్తి వాళ్ళ మధ్యలో జీవింపలేదు. యూదులు అతడు మహా పవిత్రమూర్తి అనీ, పాపులమైన మనకూ అతనికీ చాలా అంతరముంటుందనీ చెప్పేవాళ్ళు. అందుకే యావేను కంటితో చూచినవాళ్ళు బ్రతకరని అనుకొనేవాళ్ళు – నిర్గ 33,20. భగవంతునికీ మానవునికీగల ఈ యంతరాన్ని తొలగించడానికే క్రీస్తు వచ్చింది. అతని నరావతారం ద్వారా దేవుడు మన మానవలోకంలో అడుగు పెట్టాడు. మానవులు కూడ దేవుని దగ్గరకు వెళ్ళగలిగారు. అతని ద్వారా పరలోకపిత మనకందరకూ సన్నిహితుడయ్యాడు. కావుననే మనం ప్రతిదినం క్రీస్తు ద్వారా ఆ తండ్రిని "పరలోకంలో వుండే మా తండ్రీ!" అని చనువుతో పిలుస్తూంటాం. యూదులు దేవుణ్ణితండ్రి అని పిలువలేక పోయారు అన్నాం. అతడు యజమానుడు తాము బానిసలు అనుకున్నారు అన్నాం. కాని మనంమాత్రం అతన్ని తండ్రి అని పిలుస్తున్నాం. మనం అతని బిడ్డలమని చెప్పుకొంటూన్నాం. ఎందుకు? యూదులనాడు క్రీస్తులేదు. వాళ్ళు అతనిలోనికి జ్ఞానస్నానం పొందనూ లేదు, అతనితో ఐక్యం కానూలేదు. ఈ భాగ్యాలన్నీ నేడు మనకు లభించాయి.

## 3. పరిశుద్ధాత్మ - దత్తపుత్రులు

క్రీస్తుద్వారా మనం పుత్రులమౌతాం అన్నాం. కాని ఈలా పుత్రులయ్యేలా చేసేది పరిశుద్ధాత్మ. ఈ యాత్మ క్రీస్తు వెళ్ళిపోయాక అతని కార్యాన్ని కొనసాగిస్తుంది.

పౌలు, పరిశుద్ధాత్మ మనలను పుత్రులనుగా చేస్తుందనీ, ఆ యాత్మవలన మనం దేవుని తండ్రి అని పిలువగల్గుతున్నామని చెప్పాడు – రోమా 8,15. అతడే మరో తావులో పిత తన పుత్రుని యాత్మమైన పావనాత్మను మన హృదయాల్లోనికి పంపాడనీ ఆ

యాత్మతోపాటు మనమూ దేవుని తండ్రి అని పిలుస్తామనీ చెప్పాడు - గల 4,6. ఆ యాత్మ మన హృదయంలో ప్రార్థనం చేస్తూంటుంది. క్రీస్తు స్వర్గంలో పిత సమక్షంలో మనకోసం ప్రార్థనం చేస్తుంటాడు - హెబ్రే 7,25. ఆత్మ మాత్రం మన హృదయంలోనే ప్రార్థనం చేస్తూంటుంది- రోమా 8, 27. ఆత్మప్రార్థనం, మనం పితపట్ల బిడ్డల్లాగ ప్రవర్తించాలనే.

ప్రాత యిస్రాయేలు యావే పుత్రులై నందున వాగ్దత్త భూమిని వారసంగా పొందారు. క్రొత్త యిస్రాయేలీయులమైన మనమును దేవుని పుత్రులమైనందున మోక్షాన్ని వారసంగా పొందుతాం. క్రీస్తుతో పాటు మనమూ ఈ మోక్షానికి వారసులమౌతాం. క్రీస్తుతోపాటు పుత్రులమైతే అతనితోపాటు వారసుల మౌతాం-రోమా 8, 17. మనం ఈ లోకంలో వున్నంతకాలం ఈ వారసం పూర్తిగా లభింపదు. మరణానంతరంగాని మోక్షాన్ని పొందలేం. కాని ఈ వారసానికి గురుతుగా తండ్రి తన ఆత్మను మన హృదయాల్లో వుంచాడు. అందుకే ఎఫేసీయుల జాబు "మీరు ఆత్మచేత ముద్రింపబడ్డారు. ఈ యాత్మ మన వారసానికై ఈయబడిన సంచకరువు" అంటుంది - 1,14. సంచకరువు లేక బయానా తరువాత ఈయనున్న మొత్తం రొక్కానికి గురుతు. అదే రీతిగా ఈ యాత్మ కూడ భావిలో మనం పొందునున్న పూర్ణమహిమకు, అనగా మోక్ష భాగ్యానికి గురుతు. జ్ఞానస్నానం నుండి గూడ పావనాత్మ మనలను మోక్షభాగ్యానికి తయారుచేస్తూంటుంది. పుత్రులం గనుక ఆత్మ మనలను ఈ మోక్షవారసానికి సిద్ధం చేస్తుంటుంది.

ఇంతవరకు మనం చూచిన విషయాల సారాంశం ఇది. మానుష కుటుంబంలో దత్తపుత్రులు తండ్రి ఆస్తిమీద హక్కును పొందుతారేగాని ఆ తండ్రి స్వభావంలో పాలు పొందరు. తండ్రి తన బుద్ధి శక్తినిగాని ఆలోచనాశక్తినిగాని దత్తపుత్రునికి ఈయజాలడు. ఆ కుమారుని పుట్టుక గూడ తండ్రినుండి కాదు.

కాని దైవకుటుంబంలో ఈలాకాదు. మనం దేవుని పుత్రుల మవడంద్వారా దేవుని మోక్షానికి హక్కుదారులం కావడం మాత్రమేగాదు, ఆ దేవుని స్వభావంలో కూడ పాలుపొందుతాం. ఆ దేవునినుండి క్రొత్త పుట్టుకను పొంది ఆ దేవునివలె దివ్యజీవితం జీవిస్తాం. అందుకే యోహాను తన తొలిజాబులో "మనం దేవుని బిడ్డలమని పిలవబడ్డం మాత్రమే కాదు యథార్థంగానే దేవుని బిడ్డలం" అన్నాడు - 3,1.

భగవంతుని కృప ద్వారా మనం అతని బిడ్డలమౌతూన్నాం. యోహాను తొలి జాబులో "దేవుని నుండి పుట్టిన వాళ్ళల్లో అతని బీజం వుంటుంది" అన్నాడు - 3, 9. ఈ బీజమే వరప్రసాదం. ఈ వరప్రసాదం ద్వారా దేవునితో ఐక్యమౌతాం. మాతృగర్భంలోని పిండం తల్లి జీవితం జీవించినట్లే మనమూ దేవుని జీవితం జీవిస్తాం. అందుకే పేత్రు రెండవ జాబుకూడ మనం భగవంతుని స్వభావంలో పాలుపొందుతామని చెప్తుంది - 1,4.

క్రీస్తుద్వారా దేవునికి దత్తపుత్రులం గావటానికిగాని మోక్షాన్ని వారసంగా పొందడానికిగాని మనకు ఏ హక్కులేదు. ఏ యోగ్యతాలేదు. దైవస్వభావం వేరు మానుషస్వభావం వేరు. ఆ ప్రభువు నరులు చేరలేని జ్యోతిః ప్రవాహంలో నివసిస్తూంటాడు. దైహిక నేత్రాలేవీ ఆ దివ్యమూర్తిని ఇంతవరకు చూచి యెరుగవు - 1తిమో 6,16. ప్రభువుకూడ "నా ద్వారా తప్ప ఎవ్వడూ పితదగ్గరకు రాలేడు" అని చెప్పాడు - యోహా 14, 6. అనగా మనము దత్తపుత్రులం కావడమనేది కేవలం దేవుని కృప. మనంతట మనం ఎంత ప్రయత్నం చేసినా దేవుని పుత్రులం కాలేం. క్రింది అంతస్తులో ఉన్నవాళ్ళు అటూ యిటూ ఎన్నిసార్లు తిరిగినా పై యంతస్తులోనికి పోలేరు. పై యంతస్తులోకి వెళ్ళాలంటే మెట్లెక్కిపోవాలి. మానవులనుగూడ దైవ పుత్రులనుజేసి పై యంతస్తులోనికి గొనిపోయే మెట్లవరుస క్రీస్తు. క్రీస్తు ద్వారా మనకు లభించే ఈ భాగ్యాన్ని తలంచికొని దేవునికి కృతజ్ఞులమై యుండాలి.

## ప్రార్థనా భావాలు

1. ఐదవ శతాబ్దానికి చెందిన భక్తుడు పెద్ద లియోపాపుగారు ఈలా వ్రాసారు. "క్రైస్తవుడా! నీ ఘనతను నీవు గుర్తించు. దైవస్వభావంలో పాలుపొందిన నీవు మళ్ళా నీ పూర్వపు అధోగతికి దిగజారకు. నీవు ఏ శిరస్సుకి, ఏ దేహానికి అవయవానివో జ్ఞప్తికి దెచ్చుకో. నీవు చీకటి నుండి వైదొలగి దైవరాజ్యపు వెలుగులో ప్రకాశించావని జ్ఞాపకముంచుకో. జ్ఞానస్నానంద్వారా పవిత్రాత్మకు దేవాలయమయ్యావు. పాపకార్యాలద్వారా అంతటి గొప్ప అతిథిని నీ హృదయం నుండి పారదోలకు. పిశాచానికి మరల దాసుడివి కాబోకు. క్రీస్తు తన అమూల్యమైన రక్తంతో నిన్ను విమోచించాడు. అంతదయతో నిన్ను రక్షించిన దేవుడు ఓనాడు నీకు నిష్పాక్షికమైన తీర్పు తీరుస్తాడు సుమా!" ఈ వాక్యాలు పలుసార్లు భక్తి భావంతో మననం చేసికో దగ్గవి.

2. ఓ చిన్నపిల్లవాడు చెట్టుమీది పండు కోసికోబోయాడు. కాని అది వాడి కందలేదు. ఆ బాలుడి తండ్రి వాణ్ణి చేతులతో పైకెత్తి పట్టుకోగా వాడా పండు కోసికొన్నాడు. దేవుడు మనకు దత్తపుత్రత్వాన్ని దయచేయడమంటే, మనలను తన చేతులతో పైకెత్తిపట్టుకోవడం. మనం మోక్షం అనే పండుని అందుకొనేలా చేయడం.

3. "నీ వరప్రసాదం ప్రాణంకంటె మెరుగైంది. కనుక నేను నిన్ను స్తుతిస్తాను" అంటుంది కీర్తన 63,4. అన్నికంటె ముఖ్యమైంది మన ప్రాణం. కాని దేవుని వరప్రసాదం ఈ ప్రాణంకంటెగూడ గొప్పది. అసలు మనకు ప్రాణాన్ని దయచేసేదీ ఆ ప్రాణాన్ని

నిలబెట్టేదీకూడ దేవుని వరప్రసాదమే. హీబ్రూ భాషలో వరప్రసాదానికి "హెన్" అని పేరు. దేవుని అనుగ్రహానికి పాత్రులం కావడమని ఈ మాట కర్థం. ఇంకా ఈ పదానికి దేవుని దయ, ప్రేమ అనికూడ అర్థం చెప్పవచ్చు. అతనికి ప్రీతిపాత్రులమౌతామని భావం. ఈలాంటి వరాన్ని మనకు దయచేసినందుకుగాను మనం ఆ ప్రభువుకి నిరంతరం వందనాలు చెప్పాలి.

# 4. అంతర్నివాసం

నరులకు దేవు డొసగే దానం ప్రాకృతిక జీవం. దీనితోపాటు ఆధ్యాత్మిక జీవంకూడ వుంది. ఇదే దివ్యజీవితం. కాని ఈ దివ్యజీవంలో భగవంతుడు తన దానాలను గాదు, తన్నుతానే మనకు అనుగ్రహించుకొంటాడు. అనగా తాను మన హృదయంలో వసిస్తూంటాడు. ఇదే అంతర్నివాసం. కనుక ఈ యధ్యాయంలో ముగ్గురు దైవవ్యక్తులు మన హృదయంలో ఎలా వసిస్తూంటారో చూద్దాం. ఇక్కడ విశేషంగా నూత్న వేదంనుండి పౌలు యోహాను భావాలను తిలకిద్దాం. అంతర్నివాసాన్నే దైవాత్మక వరప్రసాదమనికూడ పిలుస్తారు.

## 1. క్రీస్తు అంతర్నివాసం

వార్త దేహాన్ని చేకొని మన మధ్యలో వసించింది అంటాడు యోహాను - 1,14. ఈ వార్త కలకాలం నుండి దేవుని యందు దేవునితో వసించే దివ్యవ్యక్తి. ఐనా మన మానుషదేహం చేకొని మనజాతి నరుడై, మన మధ్యలో మరియమాత గర్భం నుండి జన్మించాడు ప్రభువు. జగత్ సృష్టిలో ఇంతకు మించిన గొప్ప వుదంతం లేదు.

ఈ దివ్యవ్యక్తి తన కృపనూ సత్యాన్ని అనుగ్రహించడానికే మన చెంతకు వచ్చాడు 1,16. ఆ ప్రభువు మనలో వసిస్తుంటాడు. కావుననే అతడు నా యాజ్ఞలను పాటించే వాడు నన్ను ప్రేమిస్తాడు. అతన్ని నేనూ నాపితా ప్రేమిస్తాం. నేను అతనికి కానిపించుకుంటాను" అన్నాడు -14,21. ఇక్కడ కాన్పించుకోవడమనగా క్రీస్తు తన్ను ప్రేమించేవారిలో వసించడం. వసించి వారిలో తన ప్రభావాన్ని చూపెట్టడం.

క్రీస్తు మనయందు వసించడం మాత్రమే గాదు, మనమూ ఆ క్రీస్తునందు వసిస్తాం. ఈ యంతర్నివాసం పిత క్రీస్తునందూ క్రీస్తు పితయందూ వసించడంతో పోల్చబడింది - 6,57.

ద్రాక్షలత ఉపమానం మనకు తెలుసు. క్రీస్తు లత, మనం రెమ్మలం. అనగా మనం క్రీస్తున కదుకుకొని క్రీస్తునందు నెలకొని క్రీస్తునందు కొమ్మలు సాగాలి. క్రీస్తు

కూడ మనయందు నెలకొని తనసారమనే వరప్రసాదాన్ని మనలోనికి ప్రవేశపెడతాడు. కనుకనే "నేను మీ యందులాగే మీరు నా యందు నెలకొని వుండండని ఆదేశించాడు ప్రభువు- 15,4. ఈ వాక్యం ప్రత్యక్షంగా నాటి ప్రేషితులకే అన్వయించినా, పరోక్షంగా విశ్వాసులందరికీ అన్వయిస్తుంది.

యోహాను లాగే పౌలు కూడ క్రీస్తు అంతర్నివాసాన్ని చాల తావుల్లో వర్ణించాడు. జ్ఞానస్నానం వలన క్రీస్తు మనమూ ఒక్క జ్ఞానదేహ మౌతాం. ఈ దేహానికి శిరస్సు క్రీస్తు మనం అవయవాలం. అనగా మనం క్రీస్తునందూ, మనయందు క్రీస్తూ వసిస్తుంటాడు- 1కొ 12, 27.

రోమీయులు 6,5 లో పౌలు మనం క్రీస్తు మరణంతో ఐక్యమైతే అతనిని ఉత్థానంతో గూడ ఐక్యమౌతాం అంటాడు. కాని ఇక్కడ "ఐక్యంగావడం" అనే మాటకు పౌలు మూల భాషలో వాడిన శబ్దానికి "పిండం మాతృ గర్భంలోలాగ మనమూ క్రీస్తునందు జీవిస్తుంటాం" అనే భావం స్ఫురిస్తుంది. అనగా పిండం మాతృప్రాణమునందు వలె మనమూ క్రీస్తు ప్రాణంలో పాలుపొందుతూంటాం. క్రీస్తుతో మనం ఇంత సన్నిహితంగా జీవిస్తాం. అందుకే పౌలు "నేను గాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు" అని చెప్పుకున్నాడు - గల 2, 20. ఇది మహావాక్యం.

క్రీస్తుతో మనమూ మనతో ఆ క్రీస్తూ ఐక్యంగావడం ద్వారా ఆ ప్రభు భాగ్యాలు మనకు లభిస్తుంటాయి. మనం అతని బాధలు అనుభవిస్తాం - 2 కొ 1,5. దీని ఫలితంగా అతని ఉత్థానంలో పాలు పొందుతాం - కొలో 3,12. క్రీస్తుతో శాశ్వత రాజ్యపాలనం చేస్తాం - 2 తిమో 2,12. నేడుకూడ క్రీస్తుమనస్సు శక్తి మనయందు పనిచేస్తుంటుంది - 1కొ 2,16. సంగ్రహంగా చెప్పాలంటే ఆధ్యాత్మిక సౌభాగ్యాలన్నీ మనకు క్రీస్తుద్వారా లభిస్తాయి. ఆ క్రీస్తు ద్వారా సర్వసంపూర్ణత్వాన్ని పొందుతూంటాం - ఎఫే 3,19.

## 2. పిత అంతర్నివాసం

పితకూ సుతునికీ ఎడబాటు లేదు. కావున సుతుడు వసించే చోట పితగూడ వసిస్తుంటాడు. అందుకే క్రీస్తు "నన్ను ప్రేమించేవాళ్లు నా యాజ్ఞల ప్రకారం ప్రవర్తిస్తారు. నా పిత వాళ్ళను ప్రేమిస్తాడు. మేమిద్దరమూ వాళ్ల చెంతకువచ్చి వాళ్ళయందు నివాస మేర్పరచుకుంటాం" అన్నాడు - యోహా 14,23. కనుక క్రీస్తులాగే పిత కూడ మనయందు వసిస్తుంటాడు.

పిత మనలను గాఢంగా ప్రేమించి, మన విమోచనకై తన యేకైక కుమారుని పంపాడు. ఈ సుతుడు నరులందరికీ పితతో పునస్సఖ్యాన్ని చేకూర్చాడు. ఇకమీదట నరులందరు దైవ ప్రేమతో, సోదర ప్రేమతో జీవించాలి. సోదర ప్రేమ ద్వారాకూడ పిత మనయందు వసిస్తుంటాడు. మనం ఒకరినొకరం ప్రేమిస్తే పిత మనయందు వసిస్తాడు -1 యోహా 4,12.

క్రీస్తు మనయందు మనం క్రీస్తునందు వసిస్తాం అన్నాం. అలాగే మనం పితయందు, పిత మనయందు వసిస్తాడు. క్రీస్తుని దేవుని కుమారుడని అంగీకరించిన వాళ్ళల్లో దేవుడు వసిస్తాడు. వాళ్ళూ దేవునియందు వసిస్తారు. 1యోహా 4,15. దేవుడు ప్రేమమయుడు. కావున ప్రేమ జీవితం జీవించే వాళ్లల్లో దేవుడూ జీవిస్తాడు. వాళ్ళూ దేవునియందు జీవిస్తారు - 4,16.

క్రీస్తు అంతర్నివాసం ద్వారా అతని భాగ్యాలు మనకు లభిస్తాయి అన్నాం. అలాగే పిత అంతర్నివాసం ద్వారా అతని భాగ్యాలూ పొందుతాం. పితనుండి పొందే భాగ్యాల్లో అతని "ఆకర్షణం" అనే భాగ్యం చాల గొప్పది. పిత మనలను సుతునివైపు ఆకర్షిస్తుంటాడు - యోహా 6,44. ఎందుకు? పిత తాను జీవనమూర్తి. తన జీవాన్నే సుతునకు ప్రసాదిస్తుంటాడు. ఈ సుతుని జీవాన్నే మనమూ పొందాలని పితకోరిక. కనుకనే మనలను తన కుమారుని వైపు ఆకర్షిస్తుంటాడు - 3,16. మనంకూడ ఆ పితతోను, సుతునితోను సహవాసం చేయాలి - 1యోహా 1,4.

## 3. పరిశుద్ధాత్మ అంతర్నివాసం

ఉత్థానం కాకముందే క్రీస్తు ఆత్మను పంపిస్తానని శిష్యులకు హామీ యిచ్చాడు. ఎల్లప్పుడూ వాళ్లవద్ద వుండడానికై మరో ఆదరణకర్తను పంపిస్తానన్నాడు - యోహా 14,16. ఈయాత్మ క్రీస్తుబోధించిన సంగతులన్నిటినీ వాళ్ళకు జ్ఞప్తికి తెస్తుంది - 14,26. యోహాను "క్రీస్తునుండి మనం స్వీకరించిన అభిషేకం మనలో నిల్చివుంటుంది" అంటాడు -1 యోహా 2,27. ఏమిటీ యభిషేకం? జ్ఞానస్నానం ద్వారా మనం పొందిన పరిశుద్ధాత్మే, ఈ యాత్మ క్రీస్తు బోధించిన సత్యాలన్నీ విశ్వాసులకు బోధిస్తుంది. తాను విశ్వాసుల్లో వసిస్తుంది.

పౌలు తన జాబుల్లో "క్రీస్తునందు" "ఆత్మయందు" అనే ప్రయోగాలు రెండూ చాలసార్లు వాడుతుంటాడు. తొలి ప్రయోగానికి మనం క్రీస్తునందు, క్రీస్తు మన యందు వసిస్తుంటామని భావం. రెండవ ప్రయోగానికి మనం ఆత్మయందు, ఆత్మ మన యందూ వసిస్తుంటుందని భావం.

కొరింతు పౌరులకు వ్రాస్తు పౌలు వాళ్ళు దేవాలయం వంటి వాళ్ళనీ ఆత్మ వాళ్ళల్లో వసిస్తుందనీ బోధించాడు- 1కొ 3,16 ఈ వాక్యంలో విశ్వాసులు సాముదాయికంగా పేర్కొనబడ్డారు. అనగా కొరింతులోని క్రైస్తవ సమాజంలో ఆత్మ వసిస్తుంది. ఇదే జాబు 6,19లో వ్యక్తిగతమైన అంతర్నివాసం చెప్పబడింది. పూర్వవేద ప్రభువు "షెకీనా" అనే పేరుతో యూదుల దేవాలయంలో వసించేవాడు. నూత్నవేదంలో విశ్వాసుల హృదయాలే దేవాలయాలు. ఈ దేవాలయాల్లో దేవుని ఆత్మ వసిస్తుంది.

అంతరాత్మలో వసించే యీ దివ్యాత్మ మనకు వరాలనిస్తుంది. దైవప్రేమ, సోదరప్రేమ మన హృదయాల్లో కుమ్మరిస్తుంది. దేవునితో తండ్రితోలాగ సంభాషించి ప్రార్థనం చేయడం నేర్పుతుంది. మన హృదయాలను వెలిగిస్తుంది - హెబ్రే 6,4

క్రీస్తు కృప, తండ్రి ప్రేమ, ఆత్మ సహవాసం కొరింతీయులతో వుండాలని దీవించాడు పౌలు - 2కొ 13,13. దైవవ్యక్తులు ముువ్వురూ విశ్వాసుల హృదయాల్లో వసిస్తూంటారని భావం. మనం పైన పేర్కొన్న అంశాలన్నీ ఈ వాక్యంలో సంగ్రహంగా ఇమిడే వున్నాయి.

## 4. అంతర్నివాస ఫలితాలు

జ్ఞానస్నానం ద్వారా పితకు పుత్రుల మౌతాం. అంతర్నివాసం ద్వారా ఈ పుత్రత్వం బలపడుతుంది. ఆ పరలోకపు తండ్రిలాగే మనమూ నాడునాటికి పరిపూర్ణులంగా మంచివాళ్ళంగా తయారౌతాం - మత్త 5,48. కడన పిత మనలను తన దివ్యరాజ్యంలోనికి చేర్చుకుంటాడు - లూకా 12,32.

జ్ఞానస్నానంద్వారా క్రీస్తుకు తమ్ముళ్ళమూ, చెల్లెళ్ళమూ ఔతామన్నాం. క్రీస్తు అంతర్నివాసం ద్వారా మన యీ సోదరత్వం బలపడుతుంది.

మోషే యిస్రాయేలు ప్రజలకు నాయకుడై వారిని ఐగుప్తునుండి వాగ్దత్తభూమికి నడిపించుకొని వెళ్ళాడు. క్రొత్త యిస్రాయేలీయులమైన మనలను క్రీస్తు నాయకుడు పరలోకంలోని పితసాన్నిధ్యానికి నడిపించుకొని వెళ్తాడు.

ఈ లోకంలో వున్నంతకాలం మనం క్రీస్తుద్వారా పితను ఆరాధిస్తుంటాం. మన ఆరాధనమంతా ప్రధాన యాజకుడైన క్రీస్తుద్వారా పితను కొలవడమే. కట్టకడన క్రీస్తు ఈ క్రైస్తవ సమాజాన్నంతటినీ పిత చేతులలోనికి అప్పగిస్తాడు. అపుడు విశ్వాసులందరు దేవునియందు, దేవుడు విశ్వాసులందు శాశ్వతంగా వసిస్తారు - 1కొరి 15, 27-28.

జ్ఞానస్నానంద్వారా పరిశుద్ధాత్మ మనలను ఆధ్యాత్మిక మానవులను చేస్తుంది. ఆత్మ అంతర్నివాసం ద్వారా ఈ యాధ్యాత్మిక జీవనం బలపడుతుంది. పూర్వవేదపు యూదులు రాతిపలకమీద వ్రాయబడిన పది యాజ్ఞలను పాటించారు. నూత్న వేద ప్రజలమైన మనం ఆత్మ యిచ్చే అంతరంగిక ప్రబోధాలను పాటిస్తాం. ఆధ్యాత్మికమైన దివ్యజీవితం జీవించడానికి వలసిన శక్తినిగూడ ఆత్మ ప్రసాదిస్తుంది. తన వెలుగుతో ఓదార్పుతో సదాలోచనతో మనలను ముందంజ వేయిస్తుంది. మన ఆధ్యాత్మిక జీవితం విశేషంగా పాపనాత్మమీద ఆధారపడి వుంటుంది. దేవుని పుత్రులు ఎప్పుడూ ఆ యాత్మచేత నడిపింపబడుతూంటారు.

1. రెండవ శతాబ్దానికి చెందిన క్రైస్తవ రచయిత యొకడు "దయొగ్నీటస్ లేఖ" అనే పేరుతో ఓ రచనచేసాడు. దానిలో అతడు ఈలా చెప్పాడు " దేహంలో ఆత్మ యేలాగో ఈ లోకంలో క్రైస్తవుడు ఆలాగు. ఆత్మ దేహంలో వసిస్తుంది. కాని దేహానికి చెందిందికాదు. అలాగే క్రైస్తవుడు ఈలోకంలో వసించినా ఈ లోకానికి చెందినవాడు కాదు. అతడు భూలోకంలో వసించినా పరలోక పౌరుడుగా జీవిస్తాడు. ఔను, వరప్రసాదంవల్లనే మనం పరలోక పౌరులంగా జీవింపగల్గుతున్నాం. ఈ భాగ్యానికిగాను మనం ఎంతో సంతోషించాలి.

2. నాల్గవ శతాబ్దానికి చెందిన నీస్సా గ్రెగోరీ భక్తుడు ఈలా చెప్పాడు. "నరుడు బూడిదలాంటివాడు, గడ్డిలాంటివాడు. ఐనా అతడు దేవుడంతటివాడౌతాడు. మృత్యువువాతబడేవాడు అమరుడౌతాడు. క్షణమాత్రుడైనవాడు శాశ్వతుడౌతాడు. నరమాత్రుడైనవాడు దేవుడౌతాడు. దేవుని పుత్రుడై దేవుని ఆస్తికి వారసుడౌతాడు. ఇది వరప్రసాద మహిమ". ఈ వరప్రసాద భాగ్యానికి పాత్రులమైనమనం దాన్ని ఎంతో విలువతో జూడాలి.

3. పదవ శతాబ్దానికి చెందిన ఆన్సెల్మ్ భక్తుడు ఈలా వ్రాసాడు. "ఓ ప్రభూ! నీవు నన్ను నీకు పోలికగా చేసావు. ఎందుకు? నేను నిన్ను జ్ఞాపకముంచుకోడానికి. నిన్ను తెలుసు కోడానికి. నిన్ను ప్రేమించడానికి. ఈ దొడ్డ భాగ్యాలకుగాను నేను నీకు నమస్కారం చెప్తున్నాను". మనలోని దేవునిపోలిక వలన మనం సహజంగానే ఆ ప్రభువుని అభిలషిస్తుంటాం. సృష్టివస్తు వ్యామోహంవల్ల కొంతకాలంపాటు ఆ ప్రభువుని విస్మరించినా మళ్ళా అతన్ని జ్ఞప్తికి తెచ్చుకొంటూంటాం.

# 5. దివ్యవ్యక్తులతో బాంధవ్యాలు

పూర్వాధ్యాయంలో దివ్యవ్యక్తులు ముగ్గురూ మన హృదయంలో వసిస్తుంటారని చెప్పాం. ఈ ముగ్గురు వ్యక్తులతో మనకు మూడు బాంధవ్యాలు ఏర్పడతాయి. వాళ్ళు ముగ్గురూ మూడు ముద్రల్లాంటివాళ్ళు. ఎవరి రూపురేఖలను వాళ్ళే మన హృదయాలపై చిత్రించుకుంటారు. ఈ యధ్యాయంలో నాల్గంశాలు పరిశీలిద్దాం.

## 1. పిత జీవనదాత

క్రీస్తు ద్వారా పిత మనలను తన పుత్రులను చేసికొంటాడని చెప్పాం. పుత్రుడు తండ్రి జీవితంలో పాలుపొందుతాడు. ఆ పుత్రుని ద్వారా మనంకూడ తండ్రి జీవితంలో పాలుపొందుతాం.

దివ్యవ్యక్తులు ముగ్గురిలో ఆంతరంగిక జీవితమూ వుంటుంది. బాహిర జీవితమూ వుంటుంది. ఆంతరంగిక జీవితమంటే దివ్యవ్యక్తులు తమయందు మాత్రమే జీవించడం. బాహిర జీవితమంటే ఆ దివ్యవ్యక్తులకు ప్రపంచ ప్రాణులతో వుండే సంబంధం. పిత సుత పరిశుద్ధాత్మల బాహిర జీవితం వాళ్ల అంతర్జీవితాన్ని అనుసరించి వుంటుంది. వాళ్లల్లో రెండు జీవితాలు లేవు. ఒకే జీవితం. కాని మనం మాత్రం దైవవ్యక్తుల జీవితాన్ని అర్థం చేసికోవాలి అంటే దాన్ని బాహిరం ఆంతరంగికం అనే రెండు దృక్కోణాలనుండి పర్యవేక్షించాలి.

ఆంతరంగికమైన దైవ జీవితంలో వార్త లేక సుతుడు పిత నుండి ఉద్భవిస్తాడు. పిత ఒకే పుట్టువు నిస్తాడు. ఈ యొకే పుట్టువు ఆంతరంగికమైన దైవ జీవితంలో, వార్త. బాహిరమైన దైవజీవితంలో, సృష్టి ప్రాణులు. అనగా మనమూ వార్తా కూడ ఒకే పుట్టువున బుట్టిన కవలలం. ఆ వార్త దేవుని తొలి పుత్రుడైన సుతుడు. మనం మలిపుత్రులమైన ప్రాణులం. ఈ విధంగా అందరి పుట్టువునకు కారకుడుగాన పిత జీవనదాత. కావున పితతో మన బాంధవ్యం ఎలా వుంటుందంటే, అతడు మనకు జీవమిచ్చేవాడు. మనం అతని నుండి యుద్భవించిన బిడ్డలం.

## 2. క్రీస్తు సత్యదాత

క్రీస్తు మనకు దైవసత్యాలు తెలియజేస్తాడు. దైవసత్యాలంటే దేవు డేలాంటివాడు, అతడేలా పని చేస్తాడు మొదలైన అంశాలు.

క్రీస్తు మానుష రూపం గైకొనిన దైవవార్త. దేవుని యాంతరంగిక జీవితంలో ఈ వార్త పిత బుద్ధిశక్తి నుండి జన్మిస్తుంది. వార్త పిత తలపు, ఆలోచన, భావము, ఎరుక, పలుకు. పిత తలపులు భావాలు సుతుని యందు కరుడు గట్టుకుంటాయి. పిత సుతుని పూర్తిగా నెరుగుతాడు. సుతుడును పితను పూర్తిగా నెరుగుతాడు. కావున నరావతార మెత్తిన సుతుడు పితను గూర్చి నరులకు తెలియజేస్తాడు. కనుకనే యోహాను " ఏనాడూ ఏ నరుడూ దేవునిచూచి యెరుగడు. ఆ దేవుని ప్రియ కుమారుడే అతనిని మన కెరుక పరచాడు" అంటాడు -1 -18. ఈలా క్రీస్తు పితనుగూర్చి తెలియజేయడమే దివ్యావిష్కరణం. క్రీస్తు వచ్చింది సిలువపై మరణించి పాప పరిహారం చేయడం కోసం మాత్రమే కాదు. పితను తెలియజేయడం కోసం గూడ.

క్రీస్తు పితనూ పితను గూర్చిన దివ్యసత్యాలను తెలియజేసేవాడు. కావుననే అతడు సత్యదాత. పిత మనకు అస్తిత్వము నిచ్చినవాడు గావున మన యునికి యంతటితోను సంబంధించినవాడు. కాని క్రీస్తు విశేషంగా మన బుద్ధిశక్తితో సబంధించినవాడు. సత్యాన్ని గ్రహించేది బుద్ధికదా!

క్రీస్తుతో మనకుండే సంబంధం ఏలాంటిదంటే, అతడు మన బుద్ధిశక్తిని ప్రబోధించే బోధకుడు. అతని నుండి మనం దివ్యసత్యాలను గ్రహించే శిష్యులం. విశ్వాసాన్ని పెంపొందించుకొనే భక్తులం. కావుననే పౌలు ఎఫెసీయులకు వ్రాస్తూ "విశ్వాసం ద్వారా క్రీస్తు మీ యందు వసించాలి" అని ప్రార్థించాడు- 3,17.

## 3. పరిశుద్ధాత్మ ప్రేమదాత

పిత మనకు దివ్యజీవాన్నీ సుతుడు దివ్య సత్యాన్నీ ప్రసాదిస్తే, ఆత్మ దివ్యప్రేమను అనుగ్రహిస్తుంది. ఈ ప్రేమవలననే మనం దేవుణ్ణి తండ్రిలా ప్రేమింపగల్గుతున్నాం.

దేవుని ఆంతరంగిక జీవితంలోపరిశుద్ధాత్మ పితపుత్రుల పరస్పర ప్రేమనుండి వెలువడుతుంది. దేవునియందు ఒకే ప్రేమభావం వుంటుంది. ఈ ప్రేమభావమే ఆంతరంగికంగా, పరిశుద్ధాత్మ. బహిరంగంగా, దేవుడు సృష్టి ప్రాణులయెడల చూపే అనురాగం. అనగా దేవుని ఒకే యనురాగపు తలపులో మనమూ పావనాత్మమూ ఇమిడి వున్నాం.

ఈ జగము ఇందలి ప్రాణులు వార్తకు పోలికగా వార్త యందు సృజింపబడ్డాయి. అలాగే ఈ జగాన్ని ఇందలి ప్రాణులనూ దేవుడు పావనాత్మకు పోలికగా పావనాత్మయందు ప్రేమిస్తుంటాడు.

దివ్యాత్మ చేసేపని దేవుని ప్రేమను మనమీద కుమ్మరించడం మాత్రమే కాదు. మన ప్రేమను గూడ దేవునికి అందించడం. పిత బుద్ధిశక్తినుండి వెలువడే సుతుడు మన బుద్ధిశక్తిమీద పనిచేసి మనం సత్యం గ్రహించేలా చేస్తాడు. అలాగే పితసుతుల చిత్తశక్తి నుండి వెలువడే పరిశుద్ధాత్మ మన చిత్తశక్తి మీద పనిచేసి మనం ప్రేమభావం పెంపొందించుకొనేలా చేస్తుంది.

పావనాత్మతో మనకుండే సంబంధం ఎలాంటిదంటే, ఆ యాత్మ మన హృదయాల నంటి అనురాగ భావాలు మొలకెత్తిస్తుంది. దేవుని తండ్రిలా ప్రేమించే విధానం నేర్పిస్తుంది. అందుకే పౌలు "పావనాత్మ వలన దేవుని ప్రేమ మన హృదయాల్లోనికి కుమ్మరింపబడింది" అని చెప్పాడు - రోమా 5,5.

ఈ రీతిగా దివ్యవ్యక్తులు ముగ్గురూ మన హృదయాల్లో వసిస్తూ తమతమ ప్రత్యేక స్వభావాలననుసరించి మన హృదయాల్లో పనిచేస్తుంటారు. పిత జీవనదాతగా పనిచేస్తూ మనకు పుట్టువు నిస్తుంటాడు. క్రీస్తు ప్రబోధకుడుగా పని చేసి మన ఆత్మకు దివ్యసత్యాలను వివరిస్తాడు. ఆత్ముడు ప్రేమికుడుగా పని చేసి మన హృదయాలను ప్రేమభావంతో నింపుతూంటాడు.

## 4. భగవత్కారుణ్యం

దేవుడు మనలను గూర్చి యింత శ్రద్ధ చూపడం దేనికి? మనలను యింతగా ప్రేమించడం దేనికి?

ఒకానొక పేదపడుచు. అందము నాగరకత కులీనత మొదలైన గుణాలేవీ లేవు. అందుచే ఆమెను వలచినవాళ్లే లేరు. తల్లిదండ్రులకు ఆమె భారమైంది. జీవించడంవలన ప్రయోజనమేమిటో ఆమెకు అర్థం కాలేదు. తన జీవితం తనకే బరువనిపించింది. ఈలా వుండగా బుద్ధిమంతుడైన యువరాజొకడు త్రోవవెంట వెళ్తూ ఆ యువతిని జూచి జాలి గొన్నాడు. ఆమెను తన భార్యనుగా, భావి రాజ్ఞినిగా స్వీకరించాడు. తన ప్రాసాదానికి తోడ్కొని పోయాడు. ఆ యువతి మొదట భయపడింది. కాని విభుని మంచితనాన్నీ అనురాగాన్ని చూచి తెప్పరిల్లింది. క్రమేణ తన యంతస్తునకు తగినట్లుగా రాజ్ఞిలాగ ప్రవర్తించింది. తీగ చెట్టుకులాగ తాను అతని కంటిపెట్టుకొని జీవించింది, సుఖపడింది.

ఈ కథ దేవునికీ మనకీ అక్షరాల వర్తిస్తుంది. ఆ యువతికి యువరాజునకు రాణి అయ్యే యోగ్యత లేదు. కేవలం అతని కారుణ్యం వలననే ఆమె రాణి కాగలిగింది. భగవంతుడు కూడ ఎందుకు పనికిరాని ప్రాణులమైన మనమీద కరుణబూని తన వరప్రసాదంతో మనకు దివ్యత్వం ఇచ్చాడు. ఓ దేవాలయంలో లాగ మన హృదయంలో వసించడం మొదలెట్టాడు. దానివలన మనకు విలువ వచ్చింది.

యూదులు కొలిచిన యావే ప్రభువు కరుణామయుడు. క్రైస్తవులు కొలిచే క్రీస్తుకూడ తన తండ్రిలాగే కారుణ్యమూర్తి. తప్పిపోయిన గొర్రెను కాపరిలాగ, తప్పిపోయిన కుమారుని తండ్రిలాగ, అతడు నిత్యం మనలను వెదుక్కుంటూ వస్తాడు. బైబులు చిత్రించే ఈ భగవంతుని కారుణ్యమే అతని వరప్రసాదం.

### ప్రార్థన భావాలు

1. నాల్గవ శతాబ్దానికి చెందిన గ్రెగోరీ నాసియాన్సన్ భక్తుడు ఈలావాకొన్నాడు "నేను అల్పులడను, ఘనుడను. క్రిందివాడిని, పైవాడిని. మర్త్యుడను, అమరుడను. నాలోని వోగుణం ప్రపంచానిది, మరోగుణం దేవునిది. ఒకటి శరీరానికి మరొకటి ఆత్మకు సంబంధించింది. కనుక నేను క్రీస్తుతో చనిపోయి అతనితో ఉత్థానం కావాలి. అతని దివ్యరూపం నాలో నెలకొనాలి." వరప్రసాదం ద్వారా క్రీస్తు దివ్యరూపం మనలో నెలకొంటుంది.

2. రెండవ శతాబ్దానికి చెందిన ఇరెనేయుస్ వేదశాస్త్రి ఈలా చెప్పాడు "పొడి పిండితో రొట్టెనుగాని ముద్దనుకాని చేయలేం. నీటితో తడిపినట్లయితే పిండిని ముద్దజేసి రొట్టె చేసికోవచ్చు. అలాగే చాలమందిమైన మనం, మనలో మనం ఐక్యంగాలేం.

కాని జ్ఞానస్నాన సమయంలో పవిత్రాత్మ నీళ్లలాగ మన మీదికి దిగివస్తుంది. మనలనందరినీ తడిపి మనలో మనం ఐక్యమయ్యేలా చేస్తుంది". అనగా జ్ఞానస్నానంద్వారా మనం పొందే వరప్రసాదం మనకు సోదరప్రేమను దయచేస్తుంది.

3. "ఉనికి కంతటికీ దేవుడు కారణమైనట్లే వరప్రసాదానికంతటికీ క్రీస్తు మానుషత్వం కారణం" అన్నాడు తోమాసు అక్వినాసు భక్తుడు. ఇది చాల గొప్పవాక్యం. పిత తలంపుద్వారా ఈ వునికి అంతా యేర్పడింది. మహిమను పొందిన ప్రభువు మానుషదేహంద్వారా వరప్రసాదాలన్నీ లభిస్తాయి. అనగా క్రీస్తు వరప్రసాదమూర్తి.

పై అక్వినాసే మరో తావులో "భౌతిక ప్రపంచంలో వెలుగుకంతటికీ సూర్యుడు కారణమైనట్లే, ఆధ్యాత్మిక ప్రపంచంలో వరప్రసాదానికంతటికీ క్రీస్తుకారణం" అని చెప్పాడు. అన్ని గ్రహాలనుండి వచ్చే వెలుగూ సూర్యునినుండే వస్తుంది. ఆలాగే అన్ని విధాలా వచ్చే వరప్రసాదాలూ క్రీస్తునుండే వస్తాయి.

# 6. సహాయక వరప్రసాదం

పవిత్రీకరణ వరప్రసాదంవలన మనం దివ్యులమౌతాం. దివ్యజీవితం జీవిస్తాం. కాని పవిత్రీకరణ వరప్రసాదం మనకు దివ్యజీవితం జీవించే సామర్థ్య మిస్తుందేగాని, యథార్థంగా దివ్యజీవితం జీవించేలా చేయదు. అలా చేసేది సహాయక వరప్రసాదం. కనుక ఇక మీదట సహాయక వరప్రసాదాన్ని గూర్చి చూద్దాం.

## 1. సహాయక వరప్రసాదంతో అవసరం

సహాయక వర ప్రసాదంలో చాలా రకాలున్నాయి. ఈ గ్రంథంలో కనీసం ఆరు రకాలైన చూస్తాం. ఇవి చావైన పాపం కట్టుకొనిన ఆత్మలో కూడ వుండవచ్చు. ఈ జాతి వరప్రసాదాలు మనకు దైవత్వాన్ని ఈయలేవు. వీటి వలన మనం మోక్షానికి హక్కుదారులం కాము. పై శాశ్వత వరప్రసాదంతో అవసరంలేకుండానే సహాయక వరప్రసాదం దానంతట ఆది పనిచేయగలదు. ఈ విషయాలన్నీ మున్ముందు స్పష్టమౌతాయి.

ఈ యధ్యాయంలో మూడంశాలు విచారిద్దాం.

నడవడం, మాట్లాడ్డం, భుజించడం, నిద్రించడం మొదలైనవి ప్రాకృతిక జీవితంలో మనం చేసే పనులు. ఈ పనుల్లో దేవుడు మనతో సహకరిస్తుంటాడు. ఆధ్యాత్మిక జీవితంలో మనం చేసేపనులు జపించడం, పశ్చాత్తాపపడడం, సంస్కారాలను స్వీకరించడం మొదలైనవి. ఈ యధ్యాత్మిక కార్యాల్లో కూడ దేవుడు నిత్యం మనతో సహకరిస్తుంటాడు. శిరస్సు దేహంలోని అంగాల్లోనికి చైతన్యాన్ని ప్రవేశపెడుతూంటుంది. లత రెమ్మలలోనికి

సారాన్ని ప్రవేశపెడుతూంటుంది. అలాగే క్రీస్తు కూడ నీతిని బడసిన విశ్వాసుల్లోనికి తన శక్తిని ప్రసరింప జేస్తుంటాడు. మన సత్కార్యాలను ప్రేరేపించేదీ, కొనసాగించేదీ, ముగింపునకు గొనివచ్చేదీ ఈ దివ్యశక్తే. ఈ శక్తేలేకపోతే మనం చేసే పనులు దేవునికి ప్రియపడవు. ఈ శక్తే సహాయక వరప్రసాదం.

పసిబాలుని చేతిలో పలకా బలపమూ వుంటాయి. ఐనా ఉపాధ్యాయుడు బాలుని చేతిని బట్టుకొని దిద్దింపనిదే వాడు అక్షరాలు వ్రాయలేడు. ఇదే రీతిగా సహాయక వర ప్రసాదం పురికొల్పందే మనం సత్కార్యాలు చేయలేం.

భక్తుడు అగస్టీను మరో వుపమానం చెప్పాడు. నేత్రం ఆరోగ్యంగా వున్నా సూర్యరశ్మి ప్రకాశించేదాకా వస్తువులను చూడలేదు. అలాగే నరుడూ నీతిని పొందినంక కూడ సహాయక వరప్రసాదం సాయపడిందాకా సత్కార్యాలు చేయలేడు. కనుక నరుడు దివ్యుడు కావడంలో మూడు మెట్లుంటాయి. మొదటిది పవిత్రీకరణ వరప్రసాదం. దీని ద్వారా దేవుని పోలిక అతనియందు అచ్చు వేయబడుతుంది. రెండవది నైతిక పుణ్యాలు, దివ్యపుణ్యాలు, వరాలు. వీని ద్వారా నరుడు దివ్యకార్యాలను చేయగలడు. దివ్య జీవితం జీవింపగలడు. మూడవది సహాయక వరప్రసాదం. దీని ద్వారా అతడు యథార్థంగా దివ్యజీవితం జీవిస్తాడు.

## 2. సహాయక వరప్రసాదమూ స్వాతంత్ర్యమూ

మనం చేసే దివ్యకార్యాలతో దేవుడూ సహకరిస్తాడన్నాం. ఈ సహకారం వలన మన స్వాతంత్ర్యం భంగపడదా?

దైవ సహకారం వలన మన స్వాతంత్ర్యం భంగపడదు. దేవుడు ఆయా ప్రాణుల స్వభావానికి అనుకూలంగా వాటితో సహకరిస్తుంటాడు. జంతుజాలానికి బుద్ధీ, స్వాతంత్ర్యమూ అనేవి లేవు. అందుచేత నైసర్గిక బోధనం ద్వారా భగవంతుడే వాటిని స్వయంగా నడిపిస్తుంటాడు. నరులకు స్వాతంత్ర్యమూ, ఆలోచనా వుంది. వాళ్ళ కార్యాలను వాళ్ళే నిర్ణయించుకుంటారు. భగవంతుడు సహాయక వరప్రసాదంతో నరులకు తోడ్పడేప్పుడు, ఆ నరులు తమ నిర్ణయాలను తామే చేసికొనేట్లుగానే తోడ్పడుతూంటాడు.

ఒక్క ఉదాహరణం చూద్దాం. ఉపాధ్యాయుడు బిడ్డచేతిని బట్టుకొని అక్షరాలు వ్రాయిస్తాడు. ఆ వ్రాసిన అక్షరాలు ఉపాధ్యాయునివి, బాలునివి కూడ. ఇక్కడ ఉపాధ్యాయుని తోడ్పాటు వలన బాలుని స్వాతంత్ర్యం నశించలేదు గదా, ఫలసిద్ధికి వచ్చింది. సహాయక వరప్రసాదంతో భగవంతుడు మన ఆధ్యాత్మిక జీవితంలో తోడ్పడ్డం కూడ ఈలాగే వుంటుంది. అనగా మన పుణ్యకార్యాలకు పూర్తిగా మనమే కర్తలం.

భక్తుడు అగస్టీను "మన సహకారం లేకుండానే మనలను సృజించిన దేవుడు మన సహకారం లేందే మనలను రక్షించడు" అని వ్రాసాడు. ఈ వాక్యం భావం ఏమిటి? మనకు పుట్టువు నీయకముందు దేవుడు మన అనుమతిని గైకొనలేదు. అసలు ఉనికిలోనే

లేని మనం పుట్టువునకు ఇష్టపడతామని అనుమతి నీయలేము కదా! కాని ఓ మారు పుట్టామో దేవుడు మనలను స్వాతంత్ర్యపు ప్రాణులనుగా పుట్టించాడు. స్వాతంత్ర్యంతో పుట్టాక దేవుడు మన స్వాతంత్ర్యాన్ని మన్నించకుండా వుండటం ఉచితం కాదు. కావుననే ఆ సర్వశక్తిమంతుడు మన స్వాతంత్ర్యాన్ని మన్నిస్తూ మనలను బలవంత పరచకుండా, మనం చేసే సత్కార్యాలతో సహకరిస్తూంటాడు. ఎవరు ఎలాంటి యిల్లు కట్టుకున్నారో అలాంటి యింట్లోనే వసిస్తారు. మనంకూడా బుద్ధిపూర్వకంగా ఏయే కార్యాలు చేసామో ఆయా కార్యాల ఫలితాన్నే అనుభవిస్తాం.

## 3. సహాయక వరప్రసాదాలను పొందే మార్గం

పవిత్రీకరణం విశేషంగా పావనాత్మ పని. పవిత్రీకరణ వరప్రసాదాన్నిలాగే సహాయక వరప్రసాదాన్ని గూమ మనకనుగ్రహించేది ఆ దివ్యాత్మయే. ఈ యాత్మ ఓ దేవాలయంలో లాగ మన హృదయాలలో వసిస్తూంటూంది. కావున మనలోనికి మనం ప్రవేశించి మన హృదయంలో నెలకొని వున్న ఆ దివ్యాత్మను దర్శించాలి. అతనికి మ్రొక్కులిడాలి. "ప్రభువు నాతో పల్కే పల్కులు ఆలిస్తాను" అన్నాడు కర్తీనకారుడు - 85 8. క్రీస్త్వనుసరణ గ్రంథకారుడు కూడా "అంతరాత్మలో ప్రభువు పల్కే పల్కులు ఆలించి ఆ ప్రభువు నొద్దనుండి ఓదార్పును పొందేనరుడు భాగ్యవంతుడు" అంటాడు-3,1,1. ఔను. పావనాత్మ మన హృదయంలో సంభాషిస్తూంటుంది. ఆ యాత్మ పలుకులు మనకు వెలుగునీ, ఓదార్పునీ, శక్తిని ప్రసాదిస్తుంటాయి. కావున విశ్వాసులు ఆ యాత్మతో చక్కని పరిచయం కలిగించుకోవాలి. "వేనిసాంక్తెస్పిరితుస్" అనే గీతం వర్ణించినట్లుగా, ఆ యాత్మ మన యాత్మకు గారాబు నెచ్చెలి. బిరాన వరాలొసగే దాత. హృదయాలు వెలిగించే భాగ్యామల జ్యోతి. ఎండువారిన యెదదలమీద మంచు చిలుకుతూంటుంది. శీతల హృదయాలకు వెచ్చదన మిస్తూంటుంది. శ్రమల్లో పరిశ్రాంతి, శోకాల్లో కుస్తరింపు, శోధనల్లో బాధల్లో ఉపశాంతి ప్రసాదిస్తుంటుంది. వేయేల! ఆ దివ్యాత్మ తోడ్పాటు లేనిదే పతితమానవులమైన మనలో పాపంతప్పు మేలిగుణ మొక్కటీ వుండదు. అట్టి విశుద్ధాత్మను శరణుజొచ్చి మనకు కావలసిన సహాయక వరప్రసాదాలను అడుగుకొంటూండాలి.

### ప్రార్థనా భావాలు

1. తండ్రి వరప్రసాదాలు చాలా వున్నాయి. కాని వాటన్నిటిలోను శ్రేష్ఠమైన వరప్రసాదం క్రీస్తే. క్రీస్తుద్వారానే మనకు పాపవిముక్తీ రక్షణమూ లభిస్తాయి. కనుక తండ్రి క్రీస్తుద్వారా మనకు అతి ప్రశస్తమైన వరప్రసాదంఇచ్చాడని చెప్పాలి. ఈ భావాన్నే పౌలు "మానవాళి రక్షణకై దేవుని కృప ప్రత్యక్షమైంది" అన్న వాక్యంలో వ్యక్తం చేసాడు - తీతు 2,11. ఈ ప్రత్యక్షమైన "దేవుని కృప" క్రీస్తు మనుష్యావతారమే.

ఈలా తండ్రి వరప్రసాదంగా ఈ లోకంలో అవతరించిన క్రీస్తుకి మనం వందనాలర్పించాలి.

2. అగస్టీను భక్తుడు ఈలా చెప్పాడు. "నరుడు దేవుని నుండి వైదొలగితే చస్తాడు. అతని వద్దకు తిరిగివస్తే బ్రతుకుతాడు. అతనియందు నెలకొనివుంటే పూర్ణంగా జీవిస్తాడు". వరప్రసాదం మనం దేవునియందు నెలకొని వుండేలాను, పూర్ణజీవితం జీవించేలాను చేస్తుంది.

3. చాలమంది దేవుని వరప్రసాదంతో సహకరించరు కనుకనే ఆధ్యాత్మికంగా వృద్ధిలోకి రారు. ఇది చెడ్డపద్ధతి. మనం వరప్రసాదంతో సహకరించడం నేర్చుకోవాలి. పౌలు దేవుని అనుగ్రహం వలన నేనింతటివాణ్ణయ్యాను. అతని అనుగ్రహం నాయందు వ్యర్థం కాలేదు" అని చెప్పుకొన్నాడు - 1కొ 15,10. మీరు పొందిన దేవుని కృపను వ్యర్థం చేయకండి అని కొరింతీయులను హెచ్చరించాడు - 2కొ 6,1. కనుక ఈ విషయంలో మనం జాగ్రత్తగా మెలగాలి.

# 7. సహాయక వరప్రసాదాలు మూడు

ఒకే నర్తకి సావిత్రి, సుశీల మొదలుగాగల పలుపాత్రలను ధరించి, పలురూపాలతో, పలు పేళ్లతో రంగస్థలంమీద నటిస్తుంది. అదేరీతిగా సహాయక వరప్రసాదం కూడా చాలా కార్యాలను నిర్వహిస్తూ చాలా పేర్లతో పిలువబడుతూంటుంది. ఈ యధ్యాయంలో మూడు రకాల సహాయక వరప్రసాదాలను పరిశీలిద్దాం.

## 1. చికిత్సాత్మక వరప్రసాదం

తొలి పాపం ద్వారా నరుని బుద్ధిశక్తీ, చిత్తశక్తీ రెండూ గాయపడ్డాయి. బుద్ధిశక్తి ద్వారా దేవుని తెలిసికోగలం. ఐనా జన్మపాప ఫలితంగా ఓ విధమైన మాంద్యం ఈ బుద్ధిశక్తిని మంచులాగ ఆవరిస్తుంది. ఈ మాంద్యం వలన ఆధ్యాత్మిక సత్యాలను అంత నిశితంగా గ్రహింపలేక ప్రపంచ వస్తు వ్యామోహాలకు ఇంద్రియ వ్యాపారాలకూ దాసులమై పోతూంటాం. నేటి మన బుద్ధిశక్తి నీరోడ్చే జబ్బు కన్నులాంటిది.

మన చిత్తశక్తి స్వయంగా సత్కార్యాలు చేయగలదు. స్వాతంత్ర్యంతో ప్రవర్తించగలదు. కాని తొలి పాపానంతరం ఆశాపాశాలు దీనికి వస్త్రాల్లాగ తొడుగుకున్నాయి. దీని ఫలితంగా మన చిత్తశక్తి స్వాతంత్ర్యం కొంతవరకు నశించిపోయింది. అది సత్కార్యాలకు మారుగా దుష్కార్యాలకు పూనుకొంటుంది. మంచిని చేయడానికి మారుగా ఇంద్రియాలకు ప్రియమైన కార్యాలను చేస్తుంది. పర్వతారోహకుడు శిఖరం ఎక్కగలిగికూడ ఒకోమారు బద్దకించి వెనుకాడుతుంటాడు. ఈ కొండ కొమ్ము ఎక్కలేననుకొని

నిరుత్సాహపడి వెనుకకు పోతూంటాడు. ఈ రీతినే చిత్తశక్తి కూడ ఆధ్యాత్మిక జీవితం జీవించడానికి బద్ధకించి ఇంద్రియాలకు రుచించే జంతుజీవితం జీవిస్తూంటుంది.

ఈ పరిస్థితుల్లో చికిత్సాత్మక వరప్రసాదం మన మీద ఔషధంలాగ పనిచేస్తుంది. మన బుద్ధిచిత్త శక్తులందలి జాడ్యాన్ని తొలగిస్తుంది. అందుకే దీన్ని చికిత్సాత్మక వరప్రసాదం అన్నాం. అనగా మన ఆత్మ వ్యాధిని నయం చేసే వరప్రసాదం. ఇది బుద్ధిశక్తికి ఓ విధమైన వెలుగునిచ్చి దివ్య సత్యాలను గ్రహించేలా చేస్తుంది. ఈ వెలుగుద్వారా మన బుద్ధి ప్రపంచ వస్తువులను రోసి ఆధ్యాత్మిక సత్యాలయందు రంజిల్లుతుంది. అదేవిధంగా చిత్తశక్తికి కూడ ఓ విధమైన దివ్య ప్రేరణాన్ని యిస్తుంది. దీని వలన చిత్తం ఇంద్రియ వ్యాపారాలపై ఏవగింపునొంది ఆధ్యాత్మికకార్యాల్లో రంజిల్లుతుంది. సృష్టి వస్తువులమీది ప్రేమను విడనాడి సృష్టికర్తమీద మనసు నిల్పుతుంది.

ఆధ్యాత్మిక జీవితంలో చికిత్సాత్మక వరప్రసాదం చేసే మేలు అంతింతగాదు. నీతిని పొందిన పిదప గూడ చికిత్సాత్మక వరప్రసాదం ఆదుకోందే పెద్ద కాలం పుణ్యావస్థలో నిలువలేం. మనమా బలహీనపు నరులం. పాపావకాశాలా పెక్కులు. కనుక ఈ వరప్రసాదం చేయిచ్చి ముందునకు నడపందే చావైన పాపాలనే గోతుల్లో తప్పక కూలిపోతాం.

ఇక, పాపపు ప్రాణులమైన మనకు స్వల్ప పాపపు అవకాశాలు అనంతాలు. కాని చికిత్సాత్మక వరప్రసాదం మనకు అండగా నిలుస్తుంది. స్వల్పపాపాల నుండి మనలను చాలవరకు వైదొలగిస్తుంది. ఐనా చికిత్సాత్మక వరప్రసాదం సాయపడినంక గూడ, దేవుని ప్రత్యేక అనుగ్రహం లేందే స్వల్పపాపాలన్నిటినీ విడనాడలేం. మరియమాతకు మాత్రం ఈలాంటి ప్రత్యేకానుగ్రహం వుందని బోధిస్తుంది త్రెంటుసభ.

దివ్యగ్రంథాలు జన్మ కర్మ పాప ఫలితాలను తేటతెల్లంగా వర్ణిస్తాయి. ప్రపంచమింకా చాలవరకు ఈ లోకపు నాయకుని ఆధీనంలోనే వుంది –యోహా 14, 30. చేప నీటిలోలాగ మనమూ రేయింబవళ్లు పాపపులోకంలో మునిగి తేలుతూంటాం. మన యెదదలో కూడ రోజురోజు పాపపు మొగ్గలు పొటమరిస్తూనే వుంటాయి. ఈ పరిస్థితుల్లో మన బుద్ధికి వెలుగునీ, చిత్తానికి చైతన్యాన్నీ దయచేసే చికిత్సాత్మక వరప్రసాదాన్ని ప్రసాదించమని పావనాత్మను అడుగుకొంటూండాలి.

## 2. ఉద్ధరణ వరప్రసాదం

ఉద్ధరణ మనగా పైకి లేపడం. మన కార్యాలను ప్రాకృతిక దశ నుండి ఆధ్యాత్మిక దశకు లేపుకొని పోయేది ఉద్ధరణ వరప్రసాదం. నా చేతిలోని కలం పుస్తకం వ్రాస్తుంది. ఐనా పుస్తకం వ్రాయాలంటే బుద్ధి, చిత్తశక్తు లుండాలి. కలానికి ఈ శక్తులు లేవు. కనుక అది స్వయంగా పుస్తకం వ్రాయలేదు. బుద్ధి చిత్తశక్తులతో కూడిన నేను చేతిలోనికి తీసుకున్నంక అది పుస్తకం వ్రాస్తుంది. ఇదే రీతిగా మన ఆత్మ కూడ స్వయంగా ఆధ్యాత్మిక

కార్యాలు చేయలేదు. అది స్వయంగా చేయగలిగింది ప్రాకృతిక కార్యాలు మాత్రమే. కాని వరప్రసాదం ఈ యాత్మను తన చేతులలోనికి తీసికొని మెట్ల నెక్కించుకొని పోతుంది. ఈలా తీసికొని పోవడమే ఉద్ధరణం. అనగా పుణ్యకార్యాలను ఆచరించేలా చేయడం. పవిత్రీకరణ వరప్రసాదం మన ఉనికిని ప్రాకృతిక దశ నుండి ఆధ్యాత్మిక దశకు కొనివస్తుంది. ఉద్ధరణ వరప్రసాదం మన క్రియలను పాకృతిక దశనుండి ఆధ్యాత్మిక దశకు కొనివస్తుంది.

మనం సత్కార్యాలు చేయాలంటే ఉద్ధరణ వరప్రసాదం అవసరం. కాని తొలినాళ్ళల్లోని క్రైస్తవులు ఈలా అవసరమా అని సందేహించారు. పేలేజియనులు అనబడే శాఖవాళ్ళు సత్కార్యాలు చేయడానికి ఉద్ధరణ వరప్రసాదం అవసరం లేదని వాదించారు. సెమిపెలేజియనులు అనబడే శాఖవాళ్లు సత్కార్యాలు ప్రారంభించాలంటే ఉద్దరణ వరప్రసాదం అవసరం లేదు గాని వాటిని కొనసాగించాలంటే అవసరం అని వాదించారు. మహా మనీషియైన అగస్టీను జీవితాంతం వరకూ ఈ రెండు శాఖలవాళ్ళతో పోట్లాడి వాళ్ళ నోళ్ళు మూయించాడు. సత్కార్యాలు ఆరంభించాలన్నా, కొనసాగించాలన్నా ఉద్ధరణ వరప్రసాదం అవసరమని శ్రీసభ బోధిస్తుంది.

కైసరియా ఫిలిప్పి చెంత క్రీస్తు "నన్ను గూర్చి మీ యభిప్రాయం ఏమిట"ని శిష్యులను ప్రశ్నించాడు. పేత్రు "నీవు దేవుని కుమారుడవైన క్రీస్తువవు" అని జవాబిచ్చాడు. క్రీస్తు సంతోషించి "ఈ సత్యం నీకు మనుష్యమాత్రుల వలనగాదు, పరలోకంలోని తండ్రి వలన తెలిసింది" అని పేత్రుని మెచ్చుకొన్నాడు - మత్త 16,16. ఇక్కడ విశ్వాసం అనే సత్కార్యం ప్రస్తావించ బడింది. దివ్యవిశ్వాసం దేవుని వద్ద నుండేగాని అభింపదు. అందుకే పౌలు కూడ ఆత్మ అనుగ్రహం లేందే మనంతట మనం "యేసు ప్రభువు" అని పల్కలేం అన్నాడు-1కొ 12,3.

మరో తావులో ప్రభువు "పిత ఆకర్షించందే ఎవరూ నా వద్దకు రాలేరు" అన్నాడు-యోహా 6, 43. మన క్రీస్తుజీవితమూ, ఆధ్యాత్మిక జీవితమూ దేవుని కార్యం. అందుకే పౌలు కూడా "ఏ దేవుడు మీయందు రక్షణకార్యం ప్రారంభించాడో ఆ దేవుడే దాన్ని ముగింపునకు గొనివస్తాడు" అని వ్రాసాడు-ఫిలి 1,6.

ఈ దివ్యగ్రంథ వాక్యాలను బట్టి మన చేత దివ్యకార్యాలను చేయించేవాడు దేవుడు లేక దేవుని వరప్రసాదం అని అర్థం చేసికోవాలి. మన పనులను ప్రాకృతికావస్థ నుండి దివ్యదశకు లేపుకొని పోయేదే ఉద్దరణ వరప్రసాదం.

పశుపక్ష్యాదులకు ఆత్మలేదు. కావున దివ్యత్వం లేదు. నరులకు దివ్యత్వం వుందిగాని చాలమంది ప్రపంచ వ్యామోహాల్లో మునిగితేలుతూ ఆ సత్యాన్ని గమనింపనే గమనింపరు. ఇక, అపాత్రుల మైనను మనకు జ్ఞానస్నానం ద్వారా దివ్యత్వం లభించింది. కాని ఈ దివ్యత్వాన్ని పొందినంక గూడ మనం పాకృతిక కార్యాల్లోనే కాలం గడుపుతూంటాం.

తినడం, నిద్రించడం, ఉద్యోగం చేయడం. డబ్బుజేసికోవడం మొదలైన పనులు ప్రాకృతిక కార్యాలు. మనం సదుద్దేశం ద్వారా, ఉద్ధరణ వరప్రసాదం ద్వారా ఈ ప్రాకృతిక కార్యాలను దివ్యకార్యాలుగా మార్చుకోవాలి. పైగా స్వతస్సిద్ధంగా దివ్యకార్యాలైన సోదరప్రేమ, ప్రార్థనం, సంస్కారాలు మొదలైన వున్నాయి. మనం వీటిని గూడా ఆచరించాలి. ఉద్ధరణ వరప్రసాదం ద్వారానే గాని ఇవన్నీ సాధ్యం కావు. కనుక ఈ వరప్రసాదాన్ని ప్రసాదించమని పావనాత్మను అడుగుకొంటుండాలి.

## 3. ప్రబోధాత్మక వరప్రసాదం

కొలనులోని పద్మం రాత్రి ముకుళించుకొని పోతుంది. ఉదయాన్నే సూర్యకిరణాలు దాన్ని ప్రబోధించి మేలుకొల్పుతాయి. ఇక రోజంతా పద్మం శోభాయమానంగా విప్పారి వుంటుంది. ఆధ్యాత్మిక జీవితంలో మన ఆత్మకు గూడ ఓపాటి ప్రబోధము లేక మేలుకొల్పు లభిస్తుంది. ఈ మేలుకొల్పునిచ్చే వరప్రసాదాన్నే ప్రబోధాత్మక వరప్రసాదం అంటాం. ఈ మేలుకొల్పు వలన మన యాత్మంగూడ పూవులాగ విప్పారుతుంది. చైతన్యం పొంది దివ్యకార్యాలకు పూనుకొంటుంది.

ప్రాకృతిక రంగంలో ఏదైనా ఓ పని చేయాలంటే మున్ముందుగా ఆ కార్యాన్ని గూర్చిన ఆలోచనా, అభిలాషా వుండాలి. ఉదాహరణకు, ఇల్లు కడుతున్నాం అనుకుందాం. మున్ముందుగా ఆ యింటి యొక్క అవసరాన్నీ, లాభాన్నీ ఆలోచించి చూచి, దాన్ని అభిలషించిన పిదపనేగాని గృహనిర్మాణానికి పూనుకోము. ఇదేరీతిగా ఆధ్యాత్మిక జీవితంలో గూడ ఆయా పుణ్యకార్యాలను చేయాలంటే – ఉదాహరణకు జపము, సోదరప్రేమ పవిత్రజీవనము మొదలైన వాటిని పాటించాలంటే – మున్ముందుగా ఆలోచనా అభిలాషా అవసరం. ఇదే ప్రబోధం. కాని గృహనిర్మాణాది ప్రాకృతిక కార్యాలను మనమే స్వయంగా ఆలోచించగలం. అభిలషించగలం. ఆధ్యాత్మిక కార్యాలను మాత్రం మనంతట మనం అభిలషించలేం. పరిశుద్ధాత్మే మన యాత్మను ప్రబోధించి ఆధ్యాత్మిక కార్యాలను అభిలషించేలా చేస్తుంది.

ఓ నిదురించే వ్యక్తిని పెద్దస్వరంతో పిల్చి తట్టి లేపామనుకుందాం. అతడు మేల్కొని పడక మీదనుండి లేస్తాడు. ఇక్కడ మేల్కొందీ లేచిందీ ఆ వ్యక్తే ఐనప్పటికీ, అతన్ని పిల్చింది తట్టింది మనం. ఈ పిలవడానికీ, తట్టడానికీ అతని సహకారమేమీలేదు. ఈ రీతినే ప్రబోధాత్మక వరప్రసాదాన్ని గూడ మన సహకారం లేకుండానే తలవని తలంపుగా భగవంతుడు ఇస్తుంటాడు. అందుకే 529లో జరిగిన ఓరంజ్ మహాసభ "భగవంతుడు వరప్రసాదమిచ్చేది నరుడు తొలుత ప్రార్థించినందుకు గాదు. మరి భగవంతుడు తొలుత వరప్రసాద మిచ్చాడు కనుకనే నరుడు ప్రార్థింప కల్గుతున్నాడు" అని బోధించింది. ఈ వాక్యం ఒక్క ప్రార్థనకేగాదు ఆధ్యాత్మిక కార్యాలన్నిటినీ వర్తిస్తుంది. ఆధ్యాత్మిక జీవితమంటే

మనంతట మనం భగవంతుణ్ణి వెదుక్కుంటూ పోవడంగాదు. అతడు మనలను వెదుక్కుంటూ రావడం. ఫ్రెంచి తత్వజ్ఞుడు పాస్కాలు వ్రాసిన ఓ గ్రంథంలో భగవంతుడు ఆత్మతో ఈలా అంటాడు. "నేను నీ వద్దకు వచ్చాను గనుకనే నీవు నన్ను వెదక గలిగావు". భక్తుడు ఆగస్టీనుకూడ "ప్రభూ? నేను నీ కొరకు అన్ని తావుల్లో వెదుకుతూ వచ్చాను. కాని నీవు మాత్రం ఇంతవరకు నా హృదయంలోనే దాగుకొని వున్నావు" అన్నాడు. అనగా భగవంతుడు ఆ భక్తుని హృదయంలో వుండి దాన్ని ప్రనబోధించడం వలననే అతడు దేవుణ్ణి వెదకడం ప్రారంభించాడు.

మరియమాత బాలయేసును దేవాలయానికి కొనిపోయింది. అదే సమయంలో సిమ్యోను అనే వృద్ధుడు ఆత్మచే ప్రబోధితుడై దేవాలయానికి వచ్చాడు - లూకా 2, 27. ఇతడు చాల యేండ్లనుండి యిస్రాయేలు పునరుద్ధరణాన్ని అభిలషిస్తున్నాడు. ఆ పునరుద్ధరణాన్ని ప్రసాదించే మెస్సీయాను కండ్లార చూచిందాకా కన్నులు మూయవని పరిశుద్ధాత్మ అతనికి హామీ యిచ్చింది. ఇది ప్రబోధమే.

పౌలు తన మూడవు ప్రేషిత ప్రమాణములో మాసెడోనియాలోని ఫిలిప్పి పట్టణం నదీ తీరాన గుమికూడిన స్త్రీలకు ప్రసంగించాడు. వారిలో లూదియా అనబడే ఆమె హృదయాన్ని దేవుడు ప్రబోధింపగా ఆమె జ్ఞానస్నానము పొందింది - అచ 16,14. తరువాత ఆమె అపోస్తలులకు ఆతిథ్యమిచ్చింది. అక్కడ అందరు స్త్రీలుంటే దేవుడు ఆమె హృదయాన్నే ఎందుకు ప్రబోధించాడో ఎవరు చెప్పగలరు?

మొదట ఆయా కార్యాలను అభిలషించడానికి, అటు పిమ్మట వాటిని కొనసాగించడానికీ వలసిన సామర్థ్యమిచ్చేవాడు ప్రభువేనన్నాడు పౌలు - ఫిలి 2, 13. అనగా భగవత్ప్రబోధం వలననే ఆయా సత్కార్యాలకు పూనుకొంటామని భావం. యెహెజ్కేలు ప్రవచనంలో ప్రభువు "నేను మీలోని రాతిగుండెను తీసివేసి దాని తావున క్రొత్తదైన మాంసపు గుండెను నిల్పుతాను" అంటాడు - 36, 26. ఇక్కడ రాతి గుండె విధేయతలేని జీవితాన్ని, మాంసపు గుండె విధేయాత్మక జీవితాన్ని సూచిస్తుంది. అనగా దేవుడు మన హృదయంలో ఈ మార్పును గలిగించాలి. ఈ ప్రబోధాన్ని మనకీయాలి.

పైన నిద్రించే వ్యక్తి ఉపమానం వాడాం. మనం ప్రబోధించినపుడు నిద్రించే వ్యక్తి పడకమీద నుండి లేవవచ్చు, లేవకపోవచ్చు. ఇదే విధంగా మనంకూడ ప్రబోధక వరప్రసాదాన్ని గుర్తించి ఆయా పుణ్యకార్యాలకు పూనుకోవచ్చు. పూనుకోకపోవచ్చు గూడ. నరుడు స్వతంత్రుడు కనుక ఒకోమారు పరిశుద్ధాత్మ ప్రబోధాలను పెడచెవిని పెడుతూంటాడు. ఇది చాల పెద్ద యనర్థకం. విశ్వాసులు భక్తి భావంతో తమ హృదయంలోని ప్రబోధాలను గుర్తించడానికి అలవాటు పడాలి. ఆత్మ మన అంతరాత్మలో మెల్లగా మాట్లాడుతూంటూంది, అభిలాషలు పుట్టిస్తూంటుంది. జపతత్పరులేగాని ఈ యాత్మ ప్రబోధాలను అభిలాషలను గుర్తించలేరు.

ఆత్మ ప్రబోధాన్ని గుర్తించినంక ఆ ప్రబోధం ప్రకారం నడచుకోవాలి. స్వర్గస్థులైన 23వ జాన్ పోపుగారు క్రైస్తవ మహాసభ జరిపించాలి అనే ప్రబోధాన్ని హృదయంలో గుర్తించారు. వెంటనే ఆయన రెండవ వాటికన్ సభను సమావేశపరచాడు. ఈ సభ వలన కల్గిన మేళ్లు అన్ని యిన్నికావు. మొదటి పెంతెకోస్తు తర్వాత ఈ రెండవ వాటికన్ వంటి క్రైస్తవ సంఘటనం మరొకటి జరగలేదని చాలామంది విజ్ఞుల అభిప్రాయం. జాన్ పోపుగారు వాటికన్ సమావేశ ఫలితాలను కన్నులార చూడకముందే కన్నుమూసారు. కాని నేడు మనం ఆ సత్ఫలితాలను అనుభవిస్తున్నాం. ఈ జాన్ పోపుగారివలె మనం కూడ ఆత్మ యిచ్చే ప్రబోధాలను పాటించడం నేర్చుకోవాలి. "ఈ దినం మీరు ప్రభువు పల్కులు ఆలించినట్లైతే ఎంత మేలయ్యేది! ఆనాటి మీ పితరుల వలె నేడు మీరు కూడ హృదయం కఠినపరచుకోకండి" అంటుంది కీర్తన 95,7. ఈ వాక్యాలు ప్రతిరోజు స్మరించుకోదగ్గవి.

## ప్రార్థనా భావాలు

1. మూడవ శతాబ్దానికి చెందిన క్లెమెంట్ అనే వేదశాస్త్రి యీలా వ్రాసాడు. "మొక్కలను మడిలో నుండి పెరికి తోటలో నాటుతారు. అక్కడవి బాగా పెరుగుతాయి. మనతోట క్రీస్తే. మనలను పూర్వపు పాపజీవితంనుండి పెరికివేసి క్రీస్తు అనే మంచి నేలలో నాటుతారు. క్రీస్తు అనే తోటలో మనం చక్కగా ఫలిస్తాం." అనగా క్రీస్తు వరప్రసాదం మన మీద పనిచేసి మనం దివ్యజీవితం జీవించేలా చేస్తుందని భావం.

2. మనం వరప్రసాదంతో సహకరించాలని చెప్తూ నాల్గవ శతాబ్దానికి చెందిన జెరోము భక్తుడు ఈలా వ్రాసాడు. "అడగడం మన పని, ఈయడం దేవుని పని. కార్యాన్ని మొదలు పెట్టడం మన పూచీ, దాన్ని ముగించడం దేవుని పూచీ. మనకు చేతనైంది మనం చేస్తే, మనకు చేతకానిది దేవుడే చేస్తాడు." కనుక మన మెప్పుడుకూడ దేవుని వరప్రసాదంతో సహకరించి సత్కార్యాలకు పూనుకోవాలి.

3. బావిలో నీరు చేదుకోవడానికి వచ్చిన సమరయ స్త్రీతో క్రీస్తు "నేను నీకు జీవజల మిస్తాను" అని చెప్పాడు. ఈ జలం అంతరంగమనే చెలమనుండి ఉబికి వస్తుందనీ, దాని ద్వారా శాశ్వత జీవం పొందవచ్చుననీ చెప్పాడు - యోహా 4, 14. బైబుల్లో జలం ఆత్మను సూచిస్తుంది. క్రీస్తు ఉత్థానమయ్యాక తన ఆత్మను మనకు అనుగ్రహిస్తాడు. ఈ యాత్మ ద్వారా మనకు వరప్రసాదం లభిస్తుంది. అనగా ఉత్థాన క్రీస్తు ఆత్మ మన ఆత్మలో వుండి మన అంతరంగంలో వరప్రసాదాన్ని ఊరిస్తూంటుంది. చెలమలోనుండి నీళ్ళు వుబికి వచ్చినట్లుగా మన అంతరంగంలోనుండి వరప్రసాదం ఉబికి వస్తూంటుంది.

# 8. సహాయక వరప్రసాదాలు మరో మూడు

పూర్వాధ్యాయంలో ఒకే సహాయక వరప్రసాదం మూడు రూపాల్లో పని చేస్తుందని చెప్పాం. ఈ యధ్యాయంలో మరో మూడు రకాల సహాయక వరప్రసాదాలను గూర్చి విచారిద్దాం. ఇక్కడ మూడంశాలను పరిశీలిద్దాం.

## 1. బాహిరవరప్రసాదం

నరుడు సాంఘిక జీవి. అనేకమంది ప్రజలతో తిరుగుతూంటాడు, అనేక సంఘటనల్లో పాల్గొంటూంటాడు. ఈ సంఘటనలూ ఈ నరులూ అతనికి వరప్రసాద కారకులౌతూంటారు. వరప్రసాదం మన ప్రాకృతిక జీవితానికి అనుకూలంగా వర్తిస్తూంటుంది. క్రీస్తు నరావతారం ద్వారా ఈ భౌతిక ప్రపంచమంతా పునీతమైంది. కనుక ఈ సంఘటనలు ఈ నరులు మనకు వరప్రసాదాన్ని ఈయగలరు. ఈ సత్యాన్ని బాగుగా గ్రహించిన పునీత చిన్నతెరేస "సర్వం వరప్రసాదమయం" అని నమ్మింది.

బాహిర వరప్రసాదమంటే బాహ్యసంఘటనంవల్ల లభించే వరప్రసాదం. దీనిలో కొన్ని దీర్ఘకాల ముండేవి. కొన్ని తాత్కాలికాలు. వివాహ జీవితంలో భార్యాభర్తలు ఒకరి కొకరు వర ప్రసాద కారకులు. తల్లిదండ్రులూ బిడ్డలూ ఒకరి కొకరు వరప్రసాద కారకులు. ఇవన్నీ దీర్ఘకాలముండే బాహిర వరప్రసాదాలు.

ఓ మంచి ప్రసంగాన్నో మంచి సంభాషణనో వినడం, ఓ మంచి పుస్తకాన్ని చదవడం తాత్కాలికమైన బాహిర వరప్రసాదానికి ఉదాహరణలు. బాహిర వరప్రసాదాన్ని అర్థం చేసికోవడానికి ఇంకా కొన్ని ఉదాహరణలు :

**సద్గ్రంథ పఠనం :** అగస్టీను పరివర్తనకు దివ్యగ్రంథ పఠనం చివరి కారణం. "ఆశాపాశాలతో కూడిన దైహికవాంఛలకు తావీయక క్రీస్తును ధరించండి" అన్న రోమీయుల జాబు నందలి వాక్యాన్ని చదివి అతడు మనసు మార్చుకొన్నాడని వింటూన్నాం - 13. 14. ఇదే రీతిగా ఇన్యాసిలొయోలా కూడ యుద్ధంలో గాయపడి ఆస్పత్రిలో వున్నపుడు పునీతుల జీవిత చరిత్రలు చదివి మనసు మార్చుకొన్నాడు. రాజుల కొలువు మాని దేవుని కొలువులో చేరాడు. నేడు సద్గ్రంథ పఠనం ద్వారా పరిశుద్ధాత్మ మన హృదయాలను ప్రబోధిస్తుంటుంది.

**సత్సంభాషణలు:** ఆల్ఫోన్సస్ రొడ్రిగస్ అనే సహోదరుని శిష్యుడు పీటర్ క్లేవర్. క్లేవర్ ఆ సహోదరుని సంభాషణలు వలన ప్రేరితుడై దక్షిణ అమెరికాలోని నీగ్రో ప్రజల శ్రేయస్సు కొరకు పాటుపడ్డాడు. వీళ్ళిద్దరూ దొడ్డ పునీతులు. జస్టిన్ అనే ఓ రోమను యువకుడు దేవుణ్ణి తెలిసికోగోరి చాలమంది భక్తులను సందర్శించాడు. ఒకానొక యూదవృద్ధుడు అతన్ని పూర్వవేదం చదవమని సలహా యిచ్చాడు. దానితో జస్టిన్ బైబులు

పతనం ప్రారంభించాడు. ఈయన రెండవ శతాబ్దిలో వేదసాక్షిగా మరణించాడు. సత్సంభాషణం ద్వారా దివ్యాత్ముడు మన హృదయంలో మాట్లాడుతూంటాడు. ప్రబోధం కలిగిస్తుంటాడు.

**సంఘటనలు:** పేత్రు క్రీస్తు నెరుగనని మూడుసార్లు బొంకాడు. ఆ ప్రభువు అతనివైపు జాలితో చూచాడు. పేత్రు తన తప్పును తెలిసికొని పశ్చాత్తాపంతో బోరున యేడ్చాడు -లూకా 22,62. ఫ్రాన్సిస్ బోర్జియా అను నాతడు కూడ భార్య మరణం కారణంగా జేసుసభలో చేరి గొప్ప భక్తుడయ్యాడు. ఈలాగే జీవితంలోని రకరకాల సంఘటనలు మనకు వరప్రసాదాన్నిస్తూంటాయి.

**కుటుంబం:** భక్తురాలగు మోనీక తన భర్త పెట్రీష్యస్ పరివర్తనానికి, కుమారుడు ఆగస్టీను పరివర్తనానికి కారకురాలైంది. రోమను సామ్రాజ్యమునందలి క్రైస్తవ వనితలు చాలమంది తమ భర్తలు జ్ఞానస్నానం పొందదానికి కారకురాళ్ళయ్యారని వేదసాక్షుల చరిత్రలు చెప్తూంటాయి. ఈలా కుటుం జీవితంలో ఓ వ్యక్తి మరోవ్యక్తికి వరప్రసాద కారణం కావచ్చు.

ఈలా జీవితంలో ఆయా సన్నివేశాలు ఆయా వ్యక్తులూ మనకు వరప్రసాద కారకులౌతూంటారు. అందుకే పౌలు "దేవుణ్ణి ప్రేమించేవాళ్ళకి అన్నీ మంచినే చేస్తాయి" అని వాకొన్నాడు - రోమా 9, 28.

## 2. అన్యప్రయోజక వరప్రసాదం

ఇంతవరకు నాల్గు రకాల సహాయక వరప్రసాదాలను చూచాం. ఇవన్నీ స్వీయ ప్రయోజనం కొరకు ఉద్దేశింపబడ్డాయి. ఇవిగాక అన్యప్రయోజనం కొరకు ఉద్దేశింపబడిన సహాయక వరప్రసాదాలూ వున్నాయి. అనగా ఇవి తనకుగాక ఇతరులకు ఉపయోగపడుతుంటాయి.

ఇవీ చాలా వున్నాయి. కొన్ని విశ్వాసుల సమాజం కోసం ఉద్దేశింపబడ్డాయి. దివ్యప్రేరణం ఈలాంటిదే. దీనిద్వారా పరిశుద్ధ రచయితలు బైబులు గ్రంథాలను వ్రాసి విశ్వాసుల కందరకూ మేలు చేకూర్చారు. భగవంతుడు అనుగ్రహించే దర్శనాలూ ఈలాంటివే. శ్రీ హృదయ దర్శనాలకు పాత్రురాలైన మర్గరీత మరియ క్రైస్తవ ప్రజలకందరకును దివ్య ప్రేమను చాటి చెప్పగల్గింది. పౌలు తన గ్రంథాల్లో పేర్కొనిన దైవవరాలూ ఈలాంటివే - 1కొ 12, 7-11. అన్యభాషల్లో మాటలాడ్డం, ప్రవచించడం, ఉపన్యసించడం మొదలుగా గల ఈ వరాలు ముప్పైదాకా వున్నాయి. శ్రీసభ తొలినాళ్లలో ఈ వరాలు బహుళ ప్రచారంలో వుండేవి. ఇవన్నీ జ్ఞానదేహం పెంపుకోసమే ఉద్దేశింపబడ్డాయి - ఎఫే 4,13.

మరికొన్ని సమాజ మంతటి కొరకు గాక, పరిమిత వ్యక్తుల కొరకు ఉద్దేశింపబడ్డాయి. వివాహ జీవితము మఠశ్రేష్ఠత్వము, గురుత్వము మొదలైనవి ఈలాంటివి. వివాహ జీవితంలో భార్యాభర్తలు ఒకరికొకరు, వాళ్ళిద్దరూ కలసి బిడ్డలకూ వరప్రసాద కారకులౌతారు. మఠ శ్రేష్ఠులద్వారా మఠవాసులకు అనేక వరప్రసాదాలు లభిస్తాయి. గురువు ద్వారా విశ్వాసులకు పెక్కు వరప్రసాదాలు సిద్ధిస్తాయి.

## 3. క్రియా నిర్వహణ వరప్రసాదం

పవిత్రీకరణ వరప్రసాదం మన ఉనికికి, సహాయక వరప్రసాదం మన కార్యాలకు దివ్యత్వమిస్తాయని చెప్పాం. కనుక సహాయక వరప్రసాదం మనం ఆయా దివ్యకార్యాలు చేయడానికి ఉపయోగపడుతుంది. ఈ సహాయక వరప్రసాదంతో మనం సహకరిస్తే ఆయాసత్కార్యాలను చేసి ముగిస్తాం. సహకరింపకపోతే ఆ కార్యాలు ఆలాగే కుంటుపడిపోతాయి. కాబట్టి ఈ సహాయక వరప్రసాదంలో రెండు మెట్లుంటాయి. మొదటి మెట్టుని క్రియా సమర్థక వరప్రసాదం అంటాం. ఈ మెట్టులో సహాయక వరప్రసాదం మనకు పుణ్యకార్యాన్ని చేయగలిగే సామర్థ్యం ఇస్తుంది. రెండవ మొట్టను క్రియానిర్వహణ వరప్రసాదం అంటాం. ఈ మెట్టులో పై సామర్థ్యాన్ని సద్వినియోగ పరచుకొని పుణ్యకార్యంచేసి ముగిస్తాం. ఈ రీతిగా మన తోడ్పాటు వలన క్రియా సమర్థక వరప్రసాదం క్రియా నిర్వహణ వరప్రసాదంగా మారిపోతుంది.

ఓ వుదాహరణం చూద్దాం. దమస్కు త్రోవలో పయనమై పోతువున్న సౌలుని క్రీస్తు ప్రబోధించాడు. "సౌలూ! ఎందుకు నన్ను హింసిస్తున్నావు?" అని అడిగాడు. సౌలు విషయం గ్రహించాడు. ఇది మొదటిమెట్టు. అతడు గుండె బండ చేసికోలేదు. పరివర్తనం చెంది క్రీస్తుకు నచ్చిన శిష్యుడయ్యాడు. ఇది రెండవమెట్టు. ఈలాగే తన్ను శత్రువులకు పట్టీయవచ్చే యూదానుకూడ క్రీస్తు ప్రబోధించాడు. "మిత్రుడా! మనుష్యకుమారుని ముద్దుతో శత్రువులకు పట్టీయ వచ్చావా" అని హెచ్చరించాడు. యూదాకు అర్థమైంది. ఇది మొదటి మెట్టు. యూదా ఈ క్రియా సమర్థక వరప్రసాదంతో సహకరించనేలేదు. తన పాపకార్యాన్నుండి వైదొలగలేదు. అంచేత ఇక్కడ క్రియానిర్వహణ వరప్రసాదం లేనేలేదు.

మన జీవితంలో కూడ ఓ పుణ్యకార్యాన్ని చేయాలనో ఓ పాపకార్యాన్నుండి వైదొలగాలనో బలమైన కోరిక కలుగుతూంటుంది. ఇది ఓ ప్రబోధం, ఓ అంతర్వాణి. ఇదే క్రియా సమర్థక వరప్రసాదం. ఇట్టి పట్టుల్లో మనం అంతర్వాణితో సహకరించి ఆత్మ ప్రబోధం ప్రకారం నడచుకోవాలి. అలా నడచుకొంటే ఆ ప్రబోధమే క్రియా నిర్వహణ వరప్రసాదమౌతుంది. ఆలా నడుచుకోకపోతే వరప్రసాదాన్ని వ్యర్థపరచినవాళ్ళ మౌతాం.

ఈలా వ్యర్థపచవద్దని నూత్నవేదం చాలా తావుల్లో హెచ్చరిస్తుంది. స్తెఫను చనిపోతూ యూదుల నాయకులను "మీరు హృదయాలు రాయి చేసికొన్నారు. పరిశుద్ధాత్మను

ప్రతిఘటిస్తున్నారు” అని మందలించాడు - అచ 7,51. పౌలు కొరింతీయులకు రెండవ జాబు వ్రాస్తూ “దేవుని వరప్రసాదం వ్యర్థపరచకండి” అని హెచ్చరించాడు - 6,1.

పైన యూదా ఉదాహరణం చూచాం. “ముద్దుతో మనుష్య కుమారుని పట్టిస్తున్నావా!” అని క్రీస్తు యూదాను మందలించాడు అని చెప్పాం - లూకా 23, 48. ఈ యుదాహరణలన్నిటిల్లో నరులు క్రియాసమర్థక వరప్రసాదంతో సహకరింపక పోవడంచే అది క్రియా నిర్వాహణ వరప్రసాదంగా మారిపోలేదు. అనగా ఆ పుణ్యకార్యం నిర్వహింపబడనే లేదు. అగస్టీను “మనం మొదట భగవంతుని త్యజించందే భగవంతుడు మనలను త్యజించడు” అని వ్రాసాడు. అనగా మనం దుర్బుద్ధులమై వరప్రసాదంతో సహకరించడం. గొర్రెపోతును ముందుకు లాగుతూంటె అది వెనక్కు బోతుంటుంది. అలాగే వరప్రసాదం మనలను ముందుకు వెళ్ళమని ప్రబోధిస్తుంటే మనం దుర్బుద్ధితో వెనక్కు వెళ్తాంటాం. కనుక జీవితంలో మనం వరప్రసాదంతో ఎంతవరకు సహకరిస్తున్నామా అని జాగ్రత్తగా ఆత్మవిచారం చేసికోవాలి.

ఓ మారు మన సహకారం వలన క్రియాసమర్థక వరప్రసాదం క్రియానిర్వహణ వరప్రసాదంగా మారిందో, ఇక యీ వరప్రసాదం మరో క్రియా సమర్థక వరప్రసాదాన్ని మొలకెత్తిస్తుంది. అది గూడ మళ్ళా క్రియానిర్వహణ వరప్రసాదమైందో మరో క్రియా సమర్థక వరప్రసాదాన్ని మొలకెత్తిస్తుంది. ఈ వరప్రసాదాలు ఈ రీతిగా గొలుసుకట్టులాగ, చెరువులోని అలల్లాగ ఎడతెగకుండా పెరిగిపోతూనే వుంటాయి. పైన పౌలు పరివర్తనను ఉదహరించాం. పరివర్తనానంతరం పౌలు గ్రీకు పట్టణాల్లో చాలచోట్ల క్రీస్తును బోధించాడు. క్రైస్తవ సమాజాలు స్థాపించాడు. ఈ సమాజాల మేలు కొరకై మళ్ళా చాలా జాబులు వ్రాసాడు. మళ్ళా ఈ సమాజాల స్థితిగతులను విచారించడానికై తీతు తిమోతి మొదలగు తన శిష్యులను అధికారులనుగా నియమించాడు. వరప్రసాద మానవుడు జీవితమంతా ఈలా తామరతంపరగా వృద్ధిచెందుతూంటాడు. భగవంతునికీ తోడి నరులకూ ప్రియపడే కార్యాలను చేసికొంటూ పోతాడు.

క్రియానిర్వహణ వరప్రసాదం అరటి బోదెలాంటిది. అరటి చెట్టు కాపుకు వచ్చేప్పటికి మరో పిలక వేస్తుంది. ఆ పిలక గూడ తల్లి చెట్టు పద్ధతినే అనుసరిస్తుంది. వరప్రసాదంతో సహకరించామంటే రోజురోజుకి మన జీవితం ఫలభరిత మౌతుంది. మన వరప్రసాదం పెరిగినా తరిగినా ఇక్కడున్నన్నినాళ్ళే. మన మార్జించిన వరప్రసాదానికి మరులోకంలో వృద్ధి క్షయాలు ఉండవు. చనిపోయేపుడు ఏపాటి వరప్రసాదంతో చనిపోతామో ఆమీదట శాశ్వతకాలమూ అపాటి వరప్రసాదంతోనే ఉండిపోతాం. కనుక ఈ లోకంలో ఉన్నంత కాలమూ మన వరప్రసాదం పెరుగుతుండాలనే దేవుని కోరిక.

ఇంతవరకూ వరప్రసాదాన్ని గూర్చి మనం చెప్పిన విషయాలన్నీ ఈ క్రింది ప్రాచీన జపంలో చక్కగా పొందుపరచబడ్డాయి. “ప్రభూ! మా జపాలూ పనులూ మీ

ప్రేరణంతో ప్రారంభమగునుగాక. మీ సహాయంతో కొనసాగును గాక. మీయందే ముగింపు జెందునుగాక".

ఇంకొక్క విషయాన్ని మాత్రం చెప్పి ఈ యధ్యాయాన్ని ముగిద్దాం. భగవంతుడు మనలను ఏ యంతస్తుకు పిలిచాడో ఆ యంతస్తునకు చెందిన బాధ్యతలను నిర్వహించే వరప్రసాదం కూడ ఇస్తాడు. అందుకే అగస్టీను "దేవుడు మనలను అసాధ్యమైన పనులు చేయమని అజ్ఞాపింపడు. కనుక ఆయా బాధ్యతలు మన పాల బడినపుడు, శక్తిగల యంతవరకు మన మా బాధ్యతలను చక్కగా నిర్వర్తించాలి. శక్తి చాలనియపుడు భగవంతుని సహాయం అడుగుకోవాలి. భగవంతుడు మన మనవులను ఆలించి ఆ బాధ్యతలను నిర్వహించే సామర్థ్యాన్ని అనుగ్రహిస్తాడు" అని బోధించాడు. అతడే మరో తావులో "ప్రభూ! మొదట నీ వాజ్ఞాపించే కార్యాన్ని నిర్వహించే శక్తిని ప్రసాదించు. ఆ మీదట నీ యిష్టం వచ్చిన కార్యాన్ని ఆజ్ఞాపించు, చేస్తాను" అని వాకొన్నాడు. సంసార జీవితంలో దైనందిన కార్యాలతో విసిగి వేసారిపోయే ప్రజలు ఈ వాక్యాలను స్మరించుకోవడం మేలు.

## ప్రార్థనా భావాలు

1. ఓరిజిన్ వేదశాస్త్రి యిలా వాకొన్నాడు. "నీవు వూపిరిపోసినట్లయితే ప్రాణి సృష్టి జరుగుతుంది. నీవు భూమికి నూత్నజీవాన్ని దయచేస్తావు" అంటుంది కీర్తన 104, 30. ఈ వూపిరి పవిత్రాత్మే. ఆ యాత్మ నరుల హృదయాల్లోనికి ప్రవేశించి వాళ్లల్లోని ప్రాతమానవుని నాశం చేస్తుంది. అతని స్థానే నూత్నమానవుని ఆవిర్భవింపజేస్తుంది." ఈ నూత్న మానవుడే వరప్రసాద మానవుడు.

2. సొలోమోను దేవాలయాన్ని నిర్మించడానికి లక్షలాది కూలీలు పని చేసారు. ఆ దేవాలయాన్ని పూర్తిచేయడానికి ఏడేండ్లు పట్టింది -1 రాజు 9, 38. కాని బాబిలోనియా రాజు కేవలం 3,300 మంది సైనికులతో వచ్చి ఒక్క రోజులోనే ఆ మందిరాన్ని ధ్వంసం చేసాడు. వరప్రసాదంతో మన హృదయమనే దేవాలయాన్ని నిర్మించుకోవడానికి చాల యేండ్లు పడుతుంది. కాని పాపంతో దాన్ని ధ్వంసం చేసికోవడానికి మాత్రం ఒక్క నిమిషమే చాలు.

3. జీవితంలో కష్టాలు వొస్తూంటాయి. మనం వాటిని తొలగించమని దేవుణ్ణి అడుగుకొంటాం. కాని ప్రభువు తరచుగా ఆ కష్టాలను తొలగించడు. వాటిని భరించే శక్తిని మాత్రం దయచేస్తూంటాడు. పౌలు తన బాధను తొలగించమని ఆడగ్గా ప్రభువు "నా కృప నీకు చాలు. నరుల బలహీనతల్లో నా శక్తి పరిపూర్ణమౌతుంది" అని చెప్పాడు-2 కొ 12-9. కనుక వరప్రసాద బలంతో మన పాలబడే కష్టాలను భరించాలి.

# 9. జ్ఞానదేహం

ఉత్థాన క్రీస్తు మన మధ్యలో నెలకొని వుండేలా చేసే సంస్థ శ్రీసభ. ప్రభువు ఆర్జించిన వరప్రసాదాలు శ్రీసభ ద్వారాగాని మనలను చేరవు. ఈ శ్రీసభనే పౌలు "జ్ఞానదేహం" అని పిలుస్తుంటాడు. ఇక్కడ మూడంశాలు విచారిద్దాం.

## 1. జ్ఞానదేహ సిద్ధాంతం

పూర్వ వేదంలో ప్రభువు యిస్రాయేలు ప్రజలను వ్యక్తిగతంగా గాక, ఓ జాతిగా ఎన్నుకున్నాడు. యిస్రాయేలు ప్రజలంతా గలసి యావే పుత్రుడు. వారిది సాంఘికమైన వ్యక్తిత్వం. ఈ పూర్వవేదపు సాంఘిక వ్యక్తిత్వమే నూత్నవేదానికి అన్వయించినపుడు జ్ఞానదేహం అని చెప్పబడుతుంది. పౌలు "జ్ఞానదేహం" అనే శబ్దాన్ని ఎక్కడా వాడలేదుగాని, దాని సిద్ధాంతాన్ని మాత్రం వివరించాడు. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన వాళ్ళంతా క్రీస్తు అవయవాలుగా ఏర్పడతారు. విశ్వాసులూ క్రీస్తు కలిసి ఒక్క వ్యక్తిగా ఒసగూడుతారు. ఈ యైక్యత జ్ఞానస్నానం ద్వారా, దివ్యసత్ప్రసాదం ద్వారా సిద్ధిస్తుంది.

జ్ఞానస్నానం ద్వారా క్రీస్తుతో మరణిస్తాం. క్రీస్తుతో ఉత్థాన మౌతాం. క్రీస్తుకు అంకిత మౌతాం. క్రీస్తనే వాతావరణంలో జీవిస్తాం – రోమా 6,1–11. ఈ క్రీస్తు జీవితాన్నే దివ్యసత్ప్రసాదం కూడ పోషించి పెద్ద జేస్తుంది. ఒకే రొట్టెను భుజించిన వాళ్ళంతా ప్రభువుతో ఒక్క దేహమౌతారు. ఆ ప్రభువు ద్వారా తోడి ప్రజలతోను ఐక్యమౌతారు. 1కొ 10, 17.

శరీరంలో ఎన్నో అవయవాలుంటాయి. ఐనా అవన్నీ ఒక్క దేహ మౌతాయి. ఈలాగే విశ్వాసులంతా క్రీస్తుతో ఒక్క దేహమౌతారు – 1కొ 12,12. ఈ దేహానికి శిరస్సు క్రీస్తే. స్త్రీకి శిరస్సు భర్త. అలాగే విశ్వాసులకు శిరస్సు క్రీస్తు – 1కొ 11,3. ఇక్కడ శిరస్సు అంటే నాయకుడు లేక అధిపతి అని అర్థం. క్రీస్తు విశ్వాసులను పిత యొద్దకు నడిపించుకొని పోయే నాయకుడు. రెండవ మోషే.

క్రీస్తుతో ఒక్కటిగా ఐక్యమైన విశ్వాసులు ఆ క్రీస్తు ద్వారా తమలో తాము ఐక్యమౌతారు. ఒక్క రొట్టెగా మారిన గోదుమ గింజలు, ఒక చేరెడు రసంగా మారిన ద్రాక్షపండ్లు, ఒక దేహంగా ఏర్పడిన అవయవాలు తమలో తాము ఐక్యమౌతాయి. ఆవిధంగానే క్రీస్తుతో ఐక్యమైన విశ్వాసులూ తమలో తాము ఐక్యమౌతారు. అనగా క్రీస్తునందు అందరూ అక్కచెల్లెళ్లూ అన్నదమ్ములూ ఔతారు. దేహంలోని అవయవాలు ఒకదాని కొకటి ఉపయోగపడినట్లే మనమూ ఒకరి కొకరం ఉపయోగపడాలి – రోమీ 12, 4.

## ౭. జ్ఞానదేహపు బాధ్యతలు

క్రీస్తునందు ఒక్కటిగా ఐక్యమైన ప్రజలు జాతిభేదాన్ని పాటించకూడదు. పౌలు క్రైస్తవుల్లో యూదులు, గ్రీకులు రోమనులు ఉన్నారు. ఐనా వీళ్ళంతా క్రీస్తుతో ఐక్యమైన ప్రజలు గనుక వీళ్ళల్లో వీళ్ళు జాతిభేదాలు పాటించకూడదు - కొలో 3,11. నేడు కులభేదాలనూ, వర్గభేదాలనూ వదలివేయలేక సతమతమౌతున్న భారతీయ క్రైస్తవులు పౌలుబోధలను స్మరించుకోవడం మేలు.

ఈ రీతినే క్రీస్తులోనికి ఐక్యమైన ప్రజలు లింగభేదాన్నీ పాటించరాదు - గల 3, 28. స్త్రీలను ఓ ప్రత్యేక జాతిగా భావించి కేటాయిస్తూ వుండడం నూత్నవేద బోధలకు విరుద్ధం.

దేహంలోని అవయవాల్లాగే క్రీస్తుతో ఐక్యమైన ప్రజలూ ఒద్దికగా, కలుపుగోలుతనంతో జీవిస్తూండాలి. క్రైస్తవుల మధ్య కలహాలు పనికిరావు. జగడాలు కలిగించి విశ్వాసులను ఒకరినుండి ఒకరిని వేరుపరచే ప్రయత్నం తలపెట్టరాదు - 1కొ 1, 13.

విశ్వాసులు ఒకరికొకరు దురాదర్శం జూపి పాపకారణం కాకూడదు. మన పాడు పనులను జూచి ఇతరులు కూడ పాడుపనులు చేసేలా వుండకూడదు. ఈ బలహీనపు నరులకోసం కూడ క్రీస్తు సిలువమీద చనిపోయాడు - 1కొ 8,11

క్రైస్తవ ప్రజలు ఒకరితో మరొకరు సత్యాన్నే గాని అసత్యాన్ని వచింపగూడదు - 2 కొ 1, 19-20. అబద్ధపు మాటలు ప్రాత జీవితానికి, సత్యభాషణాలు క్రొత్తజీవితానికి చెందినవి. కొలో 3, 9-11.

## 3. వరప్రసాదాలన్నీ శ్రీసభ నుండే

క్రీస్తు ఆర్జించిన వరప్రసాదాలు అతని జ్ఞానశరీరమైన శ్రీసభ ద్వారా గాని విశ్వాసులకు లభింపవు. నూత్నవేద ప్రజల రక్షణకై ప్రభువు ఏర్పరచిన మార్గం శ్రీసభ. క్రీస్తు వరప్రసాదాలు శ్రీసభ ద్వారా సభ్యులకు చేరడం మాత్రమేకాదు. ఈ సభ్యులనుకూడ శ్రీసభతో జోడిస్తాయి. ఈ రీతిగా శ్రీసభతో ఐక్యం గావడం ద్వారా సభ్యుల వరప్రసాదాలు కూడ ఒకరి వొకరికి ఉపకరిస్తాయి. ఈ కారణం చేత క్రైస్తవ సమాజంలో రక్షణం వ్యక్తిగతంకాదు, సాంఘికం. "ఎవరికి వారే యమునా తీరే" అనే భావం క్రీస్తుతో ఒక్క దేహంగా ఐక్యమైన క్రైస్తవ ప్రజలకు చెల్లదు. మన మందరమూ క్రీస్తు నందు ఒక్క సమాజంగా ఐక్యమయ్యాం గనుక సుఖదుఃఖాల్లోను ఒకరినొకరం భరించుకొంటూండాలి.

మనమందరమూ పితకు బిడ్డలం. క్రీస్తుకు సోదరసోదరీ జనులం. క్రీస్తు ఏర్పరచిన శ్రీసభలో సభ్యులం. ఇక, దేహంలోని అవయవాల నన్నింటినీ ఆత్మ ఒక్కటిగా బంధిస్తుంది. ఈ ఆత్మ దేహాన్ని విడిచిపోయినపుడు నరుడు మరణిస్తాడు. దేహంలోని అంగాలు కూడ శిథిలమై పోతాయి. ఇక అవి ఒక్కటిగా పని చేయవు. ఇక, శ్రీసభ అనే జ్ఞానదేహాన్ని ఒక్కటిగా బంధించేదీ దానిలోని అవయవాలైన వివిధ ప్రజలకు ఐకమత్యం చేకూర్చేదీ పవిత్రాత్మ. "దివ్యభోజనంలాగే దివ్యాత్మకూడ విశ్వాసులకు ఐక్యత చేకూరుస్తుంది" అన్నాడు సిరిల్ భక్తుడు.

నూత్నవేద ప్రజలమైన మనం క్రీస్తుద్వారా గాని తండ్రి దగ్గరకు వెళ్లలేం. కాని శ్రీసభ ద్వారాగాని క్రీస్తు దగ్గరికి వెళ్లలేం. దేవుడు శ్రీసభను రక్షణ మార్గంగా నిర్ణయించాడు. కావుననే సిప్రియస్ "దేవుణ్ణి తండ్రిగా బొందాలంటే ముమ్మందుగా శ్రీసభను తల్లిగా బొందాలి" అని చెప్పాడు. మరియ మాత క్రీస్తును ఉదరంలో భరించింది. ఆ ప్రభువుకి పుట్టువు నిచ్చింది. అలాగే శ్రీసభకూడ మనలను తన ఉదరంలో భరించింది. మనకు జ్ఞానస్నానపు పుట్టువు నిచ్చింది. ప్రభువు మరియమాతను ఎంత ప్రేమభావంతో చూచాడో మనమూ శ్రీసభను అంత ప్రేమభావంతో చూడాలి. ఆ తల్లి అందించే వరప్రసాదాలను ప్రేమ గౌరవాలతో స్వీకరించాలి.

## ప్రార్థనా భావాలు

1. యావే ప్రభువు మోషే ముందుగా సాగిపోతూ తన్ను గూర్చి తాను ఈలా ప్రకటించుకొన్నాడు. "ప్రభువు! ప్రభువు! అతడు కరుణామయుడూ దయాపరుడూ ఐన దేవుడు. అతడు సులభంగా కోపపడేవాడు కాదు. నిత్యం ప్రేమ జూపేవాడు. నమ్మదగినవాడు. వేలకొలది ప్రజలను కృపతో జూచేవాడు. మన దోషాలను అపరాధాలనూ పాపాలనూ మన్నించేవాడు" - నిర్గ 34, 6-7. మనం వరప్రసాదాన్ని గూర్చి చెప్పే ముఖ్య భావాలన్నీ ఈ వేదవాక్యాల్లో ఇమిడి వున్నాయి. కనుక భక్తుడు ఈ వాక్యాలను జాగ్రత్తగా మననం చేసికోవాలి.

2. బైబులు భావాల ప్రకారం దేవుని వరప్రసాదాన్ని పొందడమంటే అతని దీవెన పొందడమే. పూర్వవేదంలో యాజకులు ప్రజలను దీవించేపుడు "ప్రభువు మిమ్ము దీవించి కాపాడునుగాక. మిమ్ము కరుణించి ఆదరంతో జూచునుగాక. మిమ్ము కృపతో జూచి మీకు సమాధానం దయచేయునుగాక" అని పలికేవాళ్లు - సంఖ్యా 6,24-26. దేవుని వరప్రసాదాన్ని పొందినపుడు మనం ఈ దీవెనలన్నిటినీ స్వీకరిస్తాం.

3. “తిరుసభ సేవంతాగూడ మాటలద్వారా నైతేనేమి చేతలద్వారా నైతేనేమి క్రీస్తు సందేశాన్ని లోకానికి వెల్లడిచేసి అతని వరప్రసాదాన్ని ప్రజలకు పంచిపెట్టడమే” అంటుంది రెండవ వాటికన్ మహాసభ. వరప్రసాదంతో నిండివున్న మానవులు ఇతరులకు గూడ వరప్రసాదాన్ని అందిస్తారు. కనుక మొదట మనతరపున మనం వరప్రసాద మానవులంగా తయారుకావాలి.

# 10. సత్ర్కియలు

దినదినము మనము చేసే సత్కార్యాల ద్వారా కూడ క్రీస్తు కృపను పొందుతూంటాం. ప్రస్తుతాధ్యాయంలో దైనందిన క్రియల ద్వారా వరప్రసాదం ఎలా ఆర్జిస్తామో విచారిద్దాం. ఇక్కడ మూడంశాలను ఆలోచిద్దాం.

## 1. సత్ర్కియలు, బహుమానం

మన జీవితంలో జపించడం, సంస్కారాలు స్వీకరించడం మొదలైన ఆధ్యాత్మిక క్రియలుంటాయి. భుజించడం, నిద్రించడం, ఆయా పనులు చేసికోవడం మొదలైన ప్రాకృతిక క్రియలూ వుంటాయి. వస్తుతః ప్రాకృతిక క్రియలకంటె ఆధ్యాత్మిక క్రియలు ఎక్కువ విలువ కలవి. ఐనా జ్ఞానస్నానం పొంది, దివ్య వ్యక్తులను హృదయంలో నిలుపుకొని, దివ్యజీవితం జీవించే విశ్వాసులందు ఈ ప్రాకృతిక క్రియలుకూడ విలువైనవే. ఈ యధ్యాయంలో “సత్ర్కియులు” అన్నపదం పైరెండు రకాల క్రియలకూ వర్తిస్తుంది. పాప క్రియలు, సదుద్దేశంతో చేయని పనులు మాత్రమే ఈ సత్ర్కియల్లో చేరవు.

ఇక, దైనందిన బాధ్యతలతో క్రీస్తు జీవితాన్ని జీవించడం ద్వారా క్రీస్తు వరప్రసాదాన్ని పొందుతాం. ఏలాగ? జ్ఞానస్నానంద్వారా క్రీస్తుతో ఐక్యమౌతాం. క్రీస్తు మనతో ఐక్యమౌతాడు. కావున మనం ఆయా పనులు చేసేపుడు క్రీస్తు మనతో సహకరిస్తుంటాడు. అనగా క్రీస్తు వరప్రసాదం మనలో పనిచేస్తుంటుంది. అందుకే పౌలు కూడ “దేవుని అనుగ్రహం వలన నేను ప్రేషితధర్మం అవలంబించాను. నేను గాదు, దేవుని వరప్రసాదమే నాయందు పని చేస్తుంది” అని చెప్పుకున్నాడు - 1కొ 15, 10. అనగా పౌలుతోపాటు దేవుని వరప్రసాదమూ పని చేసిందని భావం. ఈ రీతిగా మనం చేసే ప్రతి కార్యంలోను ప్రభు వరప్రసాదం మనతో పనిచేయడం వల్ల మనం చేసే పనులన్నీ సత్కార్యాలుగా మారిపోతున్నాయి. అయస్కాంతం నిప్పు మొదలైన వస్తువులు తమ కంటుకొన్న పదార్థాలకు తమ ధర్మం ఇస్తాయి. ఇదే రీతిని ప్రభువున కంటుకొని ప్రభువునందు నెలకొనిన మన జీవితంగూడ ప్రభు జీవితంలాగే దివ్యమౌతుంది.

ఈలా క్రీస్తు వరప్రసాదాన్ని పొందడం వలన మూడు బహుమానాలు పొందుతాం. మొదటిది, రోజురోజుకీ మన వరప్రసాదం అభివృద్ధి చెందుతూంటుంది. తీగ రెమ్మలలోకి సారాన్ని పంపి రోజురోజుకీ ఆ రెమ్మలను పెంపునకు గొనివస్తుంది. అదే రీతిని క్రీస్తు సారము లేక వరప్రసాదము రోజురోజు మనలోనికి ప్రసరిస్తుంది. మనమూ పుష్టిని పొందుతాం. ఈ పుష్టే బహుమానం.

రెండవది, నిత్యజీవితం పొందుతాం. వరప్రసాద జీవితమనగా దివ్యజీవితం జీవించడమే. ఈ దివ్యజీవితమే మరణంతో నిత్యజీవితంగా మారిపోతుంది. ఇదే మోక్షజీవితం. మూడవది, మహిమను పొందుతాం. ఉత్థాన క్రీస్తు మహిమాన్విత జీవితం జీవిస్తుంటాడు. మోక్షంలో మనమూ క్రీస్తు మహిమలో పాలు పొందుతాం. కాని మనం పాలుపొందే మహిమ మన సత్క్రియలను బట్టి వుంటుంది.

ఇక్కడ బహుమాన స్వభావాన్ని చక్కగా అర్థం చేసికోవాలి. ప్రాకృతిక రంగంలో మన క్రియలే మనకు బహుమాన మిస్తాయి. ఉదాహరణకు కసరత్తుద్వారా దేహం పుష్టిమంతం గావించుకొంటాం. కాని ఆధ్యాత్మిక రంగంలో ఈ నియమం చెల్లదు. ఎన్ని మంచి పనులు చేసినా మనంతట మనం భగవంతుని కృపను పొందలేం. మన అంతస్తు వేరు, అతని అంతస్తు వేరు. కాని భగవంతుడే మన మీద జాలిగొని తాను మంచివాడు కావున ఆయా పుణ్యకార్యాలు చేయడానికి సహాయపడతాడు. అలా చేసిన పుణ్యకార్యాలను – అవి కేవలం మన కార్యాలేనన్నట్లు – వరప్రసాదంతో బహూకరిస్తాడు. అనగా నరులు సత్కార్యాలు చేసే సామర్థ్యమిచ్చేది భగవంతుడే. కడకు ఆ సత్కార్యాలను బహూకరించేదీ భగవంతుడే. కనుకనే అగస్టీను "దేవుడు మన పుణ్యకార్యాలకు మెచ్చి మోక్షాన్ని బహుమానంగా ఇస్తున్నాడంటే, తన సత్కార్యాలను తానే మహిమ పరచుకొంటున్నాడు" అని వ్రాసాడు.

పౌలు తన జీవితపు ప్రొద్దు పడమటకు క్రుంకినంక తిమోతికి వ్రాసిన రెండవ జాబులో "నేను మంచి పోరాటం పోరాడాను. పందెంలో గెల్చాను. విశ్వాసం నిలబెట్టుకొన్నాను. ఇక న్యాయమూర్తియైన ప్రభువు నా కొరకు కిరీట మొకటి సిద్ధం జేసి వుంచుతాడు. కడదినాన నాకది లభిస్తుంది. నా కొక్కడికే గాదు, ప్రభురాకడ కొరకై వేచివుండే వాళ్ళందరికీ ఈలాంటి కిరీటం లభిస్తుంది." అని వ్రాసాడు, ఏమిటీ కిరీటం? మోక్ష బహుమానమే. సత్క్రియల ద్వారా పుణ్యాత్ములు పొందే బహుమానాన్నే దివ్యగ్రంథాలు "కిరీటం" అని పిలుస్తాయి. ప్రభువు తన్ను ప్రేమించే వాళ్ళకిస్తానని ప్రమాణం చేసిన జీవపు కిరీటాన్ని నీతిమంతులంతా పొందుతారు – యాకో 1, 12. మంచి క్రైస్తవ జీవితం వలనా సత్కార్యాల వలనా కలిగే బహుమానం మోక్షభాగ్యమనే కిరీటం.

## 2. సత్కార్యాలకు ఉండవలసిన నియమాలు

మనం చేసే పనులు దేవునికి ప్రియపడాలంటే, అవి వరప్రసాదమనే బహుమానాన్ని పొందాలంటే, ఈ క్రింది మూడు నియమాలను పాటించాలి. ప్రేమభావం, క్రీస్తుతో ఐక్యంగావడం, ఉద్దేశ పారిశుద్ధ్యం.

నరుడు వెలుపలి కార్యాలను మాత్రమే చూస్తాడు. భగవంతుడు హృదయాలను గూడ పరిశీలిస్తాడు. మనం ఏ వుద్దేశంతో ఆయా పనులు చేస్తున్నామా అని కూడ పరిశీలించి చూస్తాడు. దేవునికి మన పనులతో అవసరం లేదు. బిడ్డలమైన మన ప్రేమభావం మాత్రం అతనికి ప్రియం గలిగిస్తుంది. అందుకే మనం ప్రేమభావంతో చేసిన పనులు మాత్రం ఆ ప్రేమమూర్తికి ప్రియం గలిగిస్తాయి. కావుననే ప్రభువు "బిడ్డా! నాకు నీ హృదయాన్ని ఈయి" అంటాడు. క్రీస్తు కేవలం మరణం ద్వారానే మనలను రక్షింపలేదు. అతడు తండ్రిపట్ల జూపిన విధేయత మనపట్ల జూపిన ప్రేమ కూడ మనలను రక్షించాయి. విధేయతతో ప్రేమతో సిలువపై కెక్కిన ప్రభువు ప్రతి కార్యంలోను మనకు మార్గదర్శకంగా వుండాలి.

ద్రాక్షలతతో ఐక్యమైయున్నంత వరకు మాత్రమే రెమ్మలు పూలుపూచి కాయలు కాస్తాయి. తల్లితీగ నుండి వేరైన వెంటనే రెమ్మలు వాడిపోతాయి. మనమూ ఇంతే. క్రీస్తుతో ఐక్యమై యున్నంత వరకే సత్ఫలితాన్ని ఇస్తాం. కావున మనం చేసే పనులన్నీ క్రీస్తు ద్వారా, క్రీస్తుతో, క్రీస్తునందు చేస్తూండాలి. క్రీస్తు ద్వారా ఎందుకంటే, అతనిద్వారాగాని పితను చేరలేం. క్రీస్తుతో ఎందుకంటే, మన కార్యాలను బహూకరించేది ప్రభువు ఆర్జించిన వరప్రసాదాలే. క్రీస్తునందు ఎందుకంటే, చేప నీటిలోలాగ, పిండం మాతృగర్భంలో లాగ మనమూ నిత్యం క్రీస్తునందు జీవిస్తూంటాం. కావుననే పౌలు కొలోసా పౌరులకు వ్రాస్తూ "మీరు చేసే పనులన్నీ ప్రభు యేసు నామంమీదుగానే చేయండ"ని బోధించాడు -3,17.

దేహానికి ఆత్మ యేలాంటిదో మన కార్యకలాపాలకూ సదుద్దేశం ఆలాంటిది. ఆత్మం దేహంలోని అవయవాలన్నిటినీ ఒక్కటిగా సంధించి వానికి జీవ మిస్తుంది. ఉద్దేశ పారిశుద్ధ్యం కూడ మన పనుల నన్నిటినీ ఒక్కటిగా సంధించి అవి దేవునికి ప్రియపడేలా చేస్తుంది. ఉద్దేశ పారిశుద్ధ్య మంటే స్వీయ ప్రీతి కొరకుగాక, దైవప్రీతి కొరకు ఆయా పనులు చేస్తుండడం. ఒకే రకపు కాగితాలు రెండున్నాయి. ఒక దానిపై ప్రభుత్వంవారి ముద్రవుంది. అది నూరు రూపాలయ నోటు. విలువ కలది. రెండవదానిపై ఈ ముద్ర లేదు. కనుక దానికి ఏ విలువలేదు. చిత్తుకాగితాల బుట్టలో పడుతుంది, అంతే. ఉద్దేశ పారిశుద్ధ్యం అనే ముద్రతోగూడిన మన పనులు ప్రభుత్వంవారి ముద్రపడిన కాగితంలాగ

విలువయైనవి. ఈ ముద్రలేని పనులకు దేవుని యెదుట ఏ విలువా లేదు. అందుకే మనం రోజురోజు ఈ సదుద్దేశాన్ని నూత్న పరచుకొంటూండాలి. రోజురోజు ఉదయం "ప్రభూ! నీకు ప్రియంగలిగించడానికే ఈ పనులను చేస్తున్నాను. వీటన్నిటిని భక్తితో నీకే సమర్పిస్తున్నాను" అని చెప్పుకొంటూండాలి. జప అపోస్తలుల ప్రార్థనా పద్ధతికూడ దీనికి తోడ్పడుతుంది. ఆయా కార్యాలకు ముందు ప్రభు సాన్నిధ్యం కలిగించుకొని ప్రభునామం ఉచ్చరించడంగూడ మంచి పద్ధతి. "జ్ఞాని కొలది కాలంలోనే పరిపూర్ణుడయ్యాడు. కనుక అతడు కొలది కాలంలోనే దీర్ఘకాలం జీవించాడు" అంటుంది సొలోమోను జ్ఞానగ్రంథం – 4,13. అనగానీతిమంతుల కార్యాలన్నీ పుణ్యమయం గావున వాళ్ళు బహుకాలంలో ఆర్జింపవలసిన పుణ్యాలను గూడ అనతికాలంలోనే ఆర్జించారని భావం. ఉద్దేశ పారిశుద్ధ్యంతో పనిచేసేవాళ్ళు ఈలాంటి జ్ఞానులుగా గణింపబడతారు.

## 3. పరసువేది

పరసువేది నంటిన లోహం బంగారం ఔతుంది. దాన్ని సాధించడానికై ప్రాచీనులు చాలమంది విశ్వప్రయత్నాలు చేసారు. అసలు ఈ పరసువేది అనే శిల ఒకటివుందో లేదో మనకు తెలియదు. కాని మన కార్యాలను మాత్రం బంగారంగా మార్చే పరసువేది ఒకటుంది. అదే జ్ఞానస్నానం, మనలను క్రీస్తుతో జోడించే సాధనం. ఓమారు జ్ఞానస్నానం ద్వారా క్రీస్తుతో ఐక్యమయ్యాయో, మన కార్యాలూ క్రీస్తు కార్యాలే ఐపోతాయి. మన జీవితమూ ఒక రీతిగా క్రీస్తు జీవితమౌతుంది.

మన యీదైనందిన కార్యాల ద్వారానే భావిమోక్షాన్ని పొందగలుగుతున్నాం. పొలం దున్నుకొనడం, పంటలు పండించుకోవడం, అన్నం వండుకోవడం, నిద్రించడం, బిడ్డలను కనడం ఈ రీతిగా మనం చేసే పనులు సామాన్యమైనవే కావచ్చు. ఐనా ఈ పనులు ద్వారానే క్రీస్తు కృపను బడసి, క్రీస్తు మహిమకు హక్కుదారులం కాగల్గుతూన్నాం. ఎందుచేత? క్రీస్తుతో ఐక్యం కావడం వలన. మంటిమీద జీవించే మన యీ జీవితం – అది యే మాదిరి జీవితమైనసరే – వ్యర్థంకాదు. గొప్ప ఓదార్పునీ, మనశ్శాంతినీ ప్రసాదించే సత్యం యిది.

ఫ్రాన్సిస్ శౌరివారివలె మనం దూరదేశాలకు వెళ్ళి క్రీస్తును బోధించలేం. అంతియోకయా ఇన్యాసి వారివలె సింహాలకు మేతై వేదసాక్షిగా మరణించలేం. తోమాసు అక్వినాసుగారివలె మేధాశక్తితో దైవశాస్త్రాంశాలను ప్రతిపాదించలేం. 23వ జాన్ పోపుగారివలె శ్రీసభలో ఉత్తేజకరమైన నూత్నభావాలను ప్రవేశపెట్టలేం. మదర్ తెరేసాలాగ సాంఘికసేవ చేయలేం. మనం పేదరికంలో పుట్టి పేదరికంలోనే చనిపోవచ్చు. మనం

చేసే గొప్పకార్యాలేవీ లేకపోవచ్చు. మన వూరికి వెలుపల మన పేరు తెలిసినవాళ్ళు ఎవరూ ఉండకపోవ్చు. ఐనా నిరుత్సాహపడవలసిన అవసరమేమీలేదు. రోజురోజుకీ మనం జీవించే సామాన్య జీవితమే, రోజురోజు మనం చేసికొనే మామూలు పనులే మనలను పవిత్రులను జేయగలవు. మనలను దేవుని పుత్రులనుజేసి భావి మహిమకు పట్టానీయగలవు. కావలసినదంతా, క్రీస్తుతో ఐక్యమై సదుద్దేశంతో ఆయా పనులు చేసికొంటూ పోవడమే.

ఓ పసిబాలుడు. ఇంటి ప్రక్కనున్న రాతిని కదిలించాలని తన చిన్న చేతులతో నెట్టాడు. వాడికి ముచ్చెమటలు పోసాయి. కాని రాయేమో కదల్లేదు. అంతలో ఆ పసిబిడ్డ తండ్రి కుమారుని ప్రయత్నం గమనించి రాతి దగ్గరకు వచ్చాడు. "అది నీకు కదుల్తుందా! నన్నెందుకు పిల్చావు గావు?" అని కుమారుణ్ణి మందలించాడు. తన బలమైన చేతులను ఆ పసిబిడ్డ బలహీనపు చేతులతో జోడించి రాతిని అవలీలగా అవతలకు నెట్టివేసాడు.

మన విషయమూ ఇంతే. క్రీస్తుతో ఐక్యం గానంత వరకూ మన యీ దరిద్ర జీవితమూ, జిగేలు మనిపింపని మన యీ మామూలు పనులూ చాల భారమనిపిస్తాయి. కాని ప్రభువు చేయిస్తే చాలు, ఈ భారపు రాతిని సునాయాసంగా ప్రక్కకు నెట్టివేయగలం. క్రీస్తు మనతో మనం క్రీస్తుతో ఐక్యం గావడమంటే యిదే.

## ప్రార్థనా భావాలు

1. క్రీసోస్తం భక్తుడు ఈలా వాకొన్నాడు. "మట్టితో కలసివున్న ముడిలోహాన్ని కొలిమిలో కరిగించి బంగారం తయారుచేస్తారు. ఆలాగే జ్ఞానస్నానం మట్టిముద్దలమైన మనలను బంగారంగా మారుస్తుంది. జ్ఞానస్నాన సమయంలో ఆత్మ అగ్నితో మనలోకి దిగివచ్చి మనలోని ప్రాపంచిక మానవుని కాల్చివేసి ఆధ్యాత్మిక మానవుని వెలుపలికి తెస్తుంది." అనగా జ్ఞానస్నాన సమయంనుండి మనలో వరప్రసాదం పనిచేయడం ప్రారంభిస్తుంది.

2. క్రీస్తు వరప్రసాదాన్ని గూర్చి ట్రెంటు మహాసభ "శిరస్సు ప్రాణాన్ని అవయవాలలోనికి వలె, తీగ సారాన్ని రెమ్మలలోనికివలె, క్రీస్తు తన వరప్రసాదాన్ని మన ఆత్మలోనికి ప్రసరింపజేస్తుంటాడు" అని బోధించింది. దేహానికి జీవమిచ్చేది శిరస్సు. కొమ్మలకు జీవమిచ్చేది తల్లితీగ. క్రైస్తవులకు జీవమిచ్చేది క్రీస్తు.

3. వరప్రసాదం దేవుడు మనకు ఉచితంగా యిచ్చే వరం. కేవలం మన పుణ్యక్రియలద్వారా మనం దాన్ని సంపాదించలేం. మనం అంతస్తు వేరు, వరప్రసాదం అంతస్తువేరు. కనుక మనకు దానిమీద ఏలాంటి హక్కు లేదు. ప్రభువు తన కృపద్వారా మనలను ఎన్నుకొంటాడుగాని మనంచేసే సత్క్రియలద్వారా కాదు - రోమా 11,6.

# 11. హిందూ సంప్రదాయం

పూర్వాధ్యాయాల్లో మన క్యాతలిక్ సిద్ధాంతంప్రకారం వరప్రసాదమంటే యేమిటో వివరించాం. కాని మనం భారతీయ క్రైస్తవులం. ఈ భారతదేశంలో హిందూసంప్రదాయం ప్రధానమైంది. హైందవ మహర్షులూ వరప్రసాదాన్ని గూర్చి బోధించారు. హైందవ భక్తులూ వరప్రసాద జీవితం జీవించారు, జీవిస్తున్నారు. కనుక హైందవ సంప్రదాయం ప్రకారం వరప్రసాద జీవితం ఏలా వుంటుందో తెలిసికోవడం గూడ అవసరం. ఇక, మత విషయాలు వచ్చినపుడు మన క్యాతలిక్ సమాజంలో లాగ హిందువులలో ఏకాభిప్రాయమూ, ఏకబోధలంటూ వుండవు. ఐనా పదిమందికీ అంగీకారమైన భావాలను మాత్రమే ఇక్కడ సంగ్రహంగా పొందుపరుస్తున్నాం.

## 1. శబ్దాలు

మామూలుగా హిందూ సంప్రదాయం వరప్రసాదానికి నాల్గు పేర్లు వాడుతుంది. 1. అనుగ్రహం : ఈ శబ్దానికి భగవంతుడే మనలను చేపట్టడం అని భావం. 2. ప్రసాదం: ఈ శబ్దానికి వెలుగుతో కూడిన శాంతి అని అర్థం. ఈ శాంతిభగవంతుడిచ్చే వరం. 3. కృప: ఈ శబ్దానికి నెనరు అని అర్థం. 4. పుష్టి : అనగా పెంపుచెందడం. ఈ శబ్దాన్ని వల్లభాచార్యుడు మాత్రమే వాడాడు.

## 2. ప్రాథమిక విషయాలు

హిందూ సంప్రదాయం రెండు ప్రధాన సిద్ధాంతాల మీద ఆధారపడివుంటుంది. 1. నరుడూ దేవుడూ ఒకటే. నరునికీ దేవునికీ భేదంలేదు. "త్వమే వాహం"- నీవే నేను – అని ఉపనిషత్తులు చెప్తాయి. 2. నరుడు భగవంతుడి నుండి వేరైపోయి పునర్జన్మ లెత్తుతూంటాడు. కర్మబంధాలలో తగులకొంటూంటాడు. మాయవలన నేను వేరు, భగవంతుడు వేరు అనిభ్రాంతిపడుతూంటాడు. అతడు నేనూ భగవంతుణ్ణేనని గుర్తించినపుడు మళ్ళీ ఆ భగవంతునితో ఐక్యమైపోతాడు. అదే ముక్తి.

**1. దివ్యత్వం :** మనం వరప్రసాదం ద్వారా దివ్యత్వం పొందుతామని నమ్ముతాం. హిందువులు ఈలా అనరు. నరుడు స్వతస్సిద్ధంగానే భగవంతుని అంశ. వరప్రసాదం వలన మనం పూర్వం ఏ భగవంతునికి చెందామో మళ్ళీ ఆ భగవంతునితో ఐక్యమైపోతాం. భగవంతుడు మన మీద దయదలచి తన వరప్రసాదాన్ని ఉచితంగా ఈయడు. మనకు దానిమీద జన్మహక్కు వుంది. మనం భగవంతునికీ దత్తపుత్రులం గాము. దివ్యపుణ్యాలు, నైతిక పుణ్యాలు, వరాలు ఇవేవీ లేవు. అసలు మనమే దేవుళ్ళమైనపుడు ఇవన్నీ యెందుకు?

**2. ఆరంభం :** దేవుడే మనలను రక్షించడానికి పూనుకొంటాడని మనం చెప్తాం. మనం ప్రాకృతికరంగానికి చెందిన వాళ్ళం. వరప్రసాదం ఆధ్యాత్మిక రంగానికి చెందినది. మనంతట మనం దాన్ని పొందలేం. దేవుడే పనిబూని వరప్రసాదాన్ని మన కిస్తుంటాడు. హిందూ సంప్రదాయాలలో కూడ భగవంతుడే నరుణ్ణి పిలవడమనేది వుంది. భగవంతుడే నరుణ్ణి వరిస్తాడు. అతనికి రక్షణనో, శిక్షణనో ముందుగానే విధిస్తాడు కూడ.

**3. పాపవిముక్తి :** దేవుడు మొదట వరప్రసాదం ద్వారా మన పాపాలను పరిహరిస్తాడనీ ఆ మీదట మనలను పవిత్రపరుస్తాడనీ మనం నమ్ముతాం. ఇవి మనం సొంతంగా చేసిన పాపాలు. కాని హిందూ సంప్రదాయంలో పాపం ఈ యర్థంలో అట్టే కనిపించదు. హిందువులకు పాపమంటే ప్రధానంగా పునర్జన్మలో చిక్కుకోవడమే. వరప్రసాదం కలిగించే విముక్తి పాపంనుండికాదు, పునర్జన్మనుండి. భగవంతుడు మన కర్మ బంధాలను త్రెంచివేసి మనం మళ్లా పునర్జన్మ యెత్తకుండా వుండేలా చేస్తాడు.

## 3. పవిత్రీకరణ వరప్రసాదం, సహాయక వరప్రసాదం

**1. పవిత్రీకరణ :** పవిత్రీకరణ వరప్రసాదంద్వారా దేవుడు మనలను ప్రాకృతిక దశనుండి ఆధ్యాత్మిక దశకు తీసికొని వెళ్తాడని మనం నమ్ముతాం. హిందువుల దృష్టిలో ప్రాకృతిక దశ లేనేలేదు. మనం మొదటి నుండీ భగవంతులమే గనుక ఎప్పుడూ ఆధ్యాత్మిక దశలోనే వుంటాం. కనుక వాళ్ళ సంప్రదాయంలో పవిత్రీకరణ వరప్రసాదమనేదే లేదు.

**2. అంతర్నివాసం:** దేవుడు వరప్రసాదము ద్వారా మనలో వసిస్తుంటాడనీ, పరిశుద్ధాత్ముడు మనలను నడిపిస్తూంటాడనీ మనం నమ్ముతాం. హిందువులు ఈలా నమ్మరు. వరప్రసాదముద్వారా దేవుడు క్రొత్తగా మనలో వసించడు. కాని వరప్రసాదముద్వారా మనమూ దేవుడిమేనని తెలసికొంటాం. కనుక అది నూత్న నివాసంగాదు, నూత్నజ్ఞానం. ఉపనిషత్తులు మనలో వసించే భగవంతుణ్ణి "అంతర్యామి", "ఆత్మారాముడు" అని పిలుస్తాయి. కాని ఈ వ్యక్తి ఏంచేస్తాడో స్పష్టంగా చెప్పవు.

**3. సహాయక వరప్రసాదం :** సహాయక వరప్రసాదం ద్వారా దేవుడు మనలను ప్రబోధిస్తూంటాడనీ, మన పనులతో సహకరిస్తుంటాడనీ మనం నమ్ముతాం. హిందూ సంప్రదాయం దీన్ని "సహకారీ కారణం" అని పిలుస్తుంది. అనగా దేవుడు మన పనులతో సహకరించే కారణం అని భావం. కాని ఈ సహాయక వరప్రసాదం దేవుడు నరునికిచ్చే ఉచిత వరంకాదు. నరుని జన్మహక్కు. ఇక్కడ హిందూ సంప్రదాయంలో రెండు విభిన్న మార్గాలున్నాయి. కొందరు "మార్జాలన్యాయం" ఎన్నుకొన్నారు. పిల్లి తానే తన పిల్లను నోట గరచుకొని మోసుకొనిపోతుంది. ఈలాగే భగవంతుడు తానే మనలను మోసుకొని

పోతాడు అన్నారు కొందరు. ఈ మార్గం ప్రకారం నరుని సహకారంతో గాని, స్వాతంత్ర్యంతోగాని అట్టే అవసరం లేదు. మరి కొందరు "మర్కట న్యాయం" ఎన్నుకొన్నారు. కోతిపిల్ల తల్లికడుపునకు కరచుకొని ఉంటుంది. కోతి దానిని పట్టుకోదు. అదే కల్లి కడుపునకు అంటిపెట్టుకొని వుంటుంది. ఈలాగే మనంతట మనమే భాగవంతునికి అంటిపెట్టుకొని వుండాలి అన్నారు మరికొందరు. ఈ మార్గం ప్రకారం నరుని సహకారం చాల ముఖ్యం. ఇవి రెండూ భక్తిమార్గాలే. రెండింటి ప్రకారము నరుడు తన్ను తాను భగవంతునికి అర్పించుకోవాలి. ఈ యాత్మార్పణకే "ప్రపత్తి" అని పేరు. (వరప్రసాదాన్ని గూర్చిన క్యాతలిక్ సమాజం బోధలు మర్కట న్యాయానికి దగ్గరగా వుంటాయి. ప్రోటస్టెంటు సమాజం బోధలు మార్జాలన్యాయానికి దగ్గరగా వుంటాయి.)

## 4. వరప్రసాదమూ, సత్కార్యాలూ

మన సత్కార్యాలవల్ల వరప్రసాదం పెరుగుతుందని మనం భావిస్తాం. హిందూ సంప్రదాయంలోకూడ కర్మమార్గ మనేది వుంది. స్వధర్మాన్ని పాటించడమే ఉత్తమ కర్మ. కాని ఈ కర్మలు ఏం చేస్తాయి? అవి మనకు వరప్రసాదం ఆర్జించిపెట్టవు. పునర్మజన్మనుండి విముక్తిపొందడానికి మాత్రం ఉపయోగపడతాయి. పైగా కర్మమార్గం భక్తిమార్గం కంటే తక్కువది. కనుక మన సత్కార్యాలకూ, వరప్రసాదానికీ సంబంధం లేదు.

## 5. మోక్షం, అవతారం, సమాజం

**1) మోక్షం :** మనం వరప్రసాద జీవితమే మోక్ష జీవితంగా మారిపోతుందనీ, ఇది పిందె, అది పండు అనీ చెప్తాం. హిందూ సంప్రదాయంలో వరప్రసాదానికీ, మోక్షానికీ సంబంధం అట్టేలేదు. ఐనా వరప్రసాదంద్వారా మాయ నుండి తప్పుకొని నేనూ భగవంతుణ్ణేనని తెలిసికొంటాం గనుక అది పరోక్షంగా మోక్షకారణ మౌతుంది. మనకు మోక్షమంటే దేవుణ్ణి ప్రేమిస్తూ దేవుని సన్నిధిలోవుండడం. హిందువులకు మోక్షమంటే పునర్జన్మలను బాసి మళ్లా దేవునితో కలిసిపోవడం. ఈ కలిసిపోవడంలోకూడ మళ్లా భేదాలున్నాయి. కొందరు దేవునితో ఒకటిగా కలిసిపోతామన్నారు. కొందరు అలాకాదు, దేవుని సన్నిధిలో వుండిపోతామన్నారు. దేవుని వ్యక్తిత్వమూ, మన వ్యక్తిత్వమూ వేరువేరుగా వుంటాయన్నారు.

**2) అవతారం:** మనం భగవంతుడు నరావతారం పొందాడనీ, అతడే క్రీస్తనీ నమ్ముతాం. ఆ క్రీస్తు తన మరణోత్థానాలవలన మనకు వరప్రసాదం సంపాదించిపెట్టాడనీ, జ్ఞానస్నానంద్వారా అతనితో ఐక్యమై అతని వరప్రసాదం పొందుతామని చెప్తాం. హిందూ సంప్రదాయంలోకూడ రామకృష్ణాది అవతారాలున్నాయి. కాని ఈ యవతారం ద్వారా

భగవంతుడు ఏంచేస్తాడో అంత స్పష్టంగా బోధపడదు. ఆ యవతారమూర్తి నరులకు వరప్రసాదం ఇస్తాడనిగానీ, నరులందరినీ రక్షిస్తాడనిగాని ఎక్కడా స్పష్టంగా విన్పించదు. ఓతావులో మాత్రం గీత "ధర్మసంస్థాపనార్థాయ" అంటుంది - 4,8. అనగా ధర్మాన్ని నిలబెట్టడానికి భగవంతుడు అవతరిస్తాడని భావం. ఈ భగవంతుని అవతారం వలన మనలో మార్పేమీ కలుగదు. అతని సత్కార్యాలూ బోధలూ మాత్రం మనకు మార్గదర్శకంగా వుంటాయి. హిందువుల దృష్టిలో ప్రపంచాని కంతటికీ ఏకైక భగవంతుడంటూ లేడు. ఎవరి ఇష్టంవచ్చిన దేవరను వాళ్ళు "ఇష్టదేవత" అన్న పేరుతో కొలుచుకొంటూంటారు అంతే.

**3) సమాజం :** మనం వరప్రసాదంద్వారా ఒక్క సమాజంగా ఏర్పడతామని చెప్తాం. అదే శ్రీసభ. క్రీస్తు వరప్రసాదాలు ఈ సభ ద్వారానే మనకు లభిస్తాయి. మనలను ఈ సభలో సభ్యులనుగా చేస్తాయి. హిందూ సంప్రదాయం ప్రకారం వరప్రసాదం వ్యక్తిగతమైందే కాని సామాజికమైందికాదు. "ఎవరికివారే యమునాతీరే" అని హిందువుల భావం. ఐనా హిందూ సాంప్రదాయంలో కూడా సామాజిక భావాలు రెండు మూడున్నాయి. సత్సంప్రదాయం అంటే సనాతన హిందువులకు చెందిన సంప్రదాయం. శిష్యులు దీన్ని పాటించాలి. ఈలా పాటించేవాళ్ళు ఓ సమాజమౌతారు. భక్తులు సద్గురువుతో కూడుకొనివున్న సమాజమౌతారు. సత్సమాజం లేక సత్సంగతి అంటే భక్తుల సమాజం.

ఇక్కడ మనం చెప్పిన భావాలన్నీ ప్రాచీన హిందూ మహర్షుల గ్రంథాలనుండి, బోధనలనుండీ గ్రహింపబడినవి. కాని హిందూ ప్రజలందరు ఈ శాఖకు చెందినవాళ్ళే అనుకోరాదు. హిందువుల్లో సామాన్య ప్రజలకు వరప్రసాదాన్ని గూర్చి భిన్నభావా లుంటాయి. తుకారాం, మాణిక్యవాసకరు మొదలైన భక్తులుకూడ మన క్రైస్తవుల్లాగే స్వయంకృతమైన పాపాన్ని ఒప్పుకొన్నారు. భగవంతుడూ, నరుడూ ఒకటికాదని బోధించారు. భక్తితో భగవంతుని అనుగ్రహాన్ని అడుగుకొన్నారు. మనం దైనందిన జీవితంలో కలుసుకొంటూండే సామాన్య హిందూ ప్రజల్లోకూడ మన భావాలకు దగ్గరగా వుండే భావాలు విరివిగా కల్పిస్తాయి. కనుక సామాన్య హిందూ ప్రజలమార్గం వేరు. పైన మనం చూపిన ఋషులు ఆచార్యులు బోధించిన మార్గంవేరు.

మనం రెండు భిన్నమతాల భావాలను పోల్చిచూచేపుడు మొదట వానిలోని భేదాలనుకాదు సామ్యాలను గుర్తించాలి. మహా మేధావియైన అగస్టీ "ప్రపంచములోని నరులందరూ సహజంగానే క్రైస్తవ భావాలు కలిగి వుంటారు" అన్నాడు. వరప్రసాదాన్ని గూర్చి ప్రాచీన హిందూ ఋషులూ, భక్తులూ ప్రతిపాదించిన సిద్ధాంతాల్లోనైతేనేమి, నేటి సామాన్య హిందూ ప్రజలు జీవించే ఆధ్యాత్మిక జీవిత విధానంలోనైతేనేమి, మన క్రైస్తవ భావాలకు సన్నిహితంగా వుండే భావాలు ఎన్ని వున్నాయో చూడండి! నరులందరిలోను ఒకే పరిశుద్ధాత్ముడు, ఒకే అంతర్యామి ప్రబోధం కలిగిస్తున్నా డనడానికి ఇది గొప్ప తార్కాణం గదా!

# 1. ప్రశ్నలు

## అధ్యాయం -1

1. శాశ్వత వరప్రసాదానికీ తాత్కాలిక వరప్రసాదానికీ భేద మేమటి? పవిత్రీకరణ వరప్రసాదానికీ దైవాత్మక వరప్రసాదానికీ తేడా యేమిటి?
2. వరప్రసాదాన్ని గూర్చిన లూతరు భావాలను సవరిస్తూ త్రెంటు మహాసభ బోధించిన మూడు ముఖ్య విషయాలను వివరించండి.
3. పవిత్రీకరణ వరప్రసాదాన్ని వివరిస్తూ సిరిల్, బాసిల్ భక్తులు వాడిన రెండు ఉపమానాలను వివరించండి.
4. క్రీస్తునుండి మన వరప్రసాదాన్ని స్వీకరిస్తామనిచెప్పడానికి పౌలు, యోహాను, పేత్రు, వాడిన ఉపమానాలను వివరించండి.

## అధ్యాయం -2

1. నరుడు దేవుని ప్రతిబింబం అనడంలో దివ్యగ్రంథం ఉద్దేశాలేమిటివో వివరించండి.
2. క్రీస్తుద్వారా మనం దైవత్వం పొందుతామనే గ్రీకుపితృపాదుల భావాలను కొన్నిటిని పేర్కొనండి.
3. నరుడు స్వభావ సిద్ధంగానే దివ్యుడు అనే అద్వైతవాదానికీ, అతడు వరప్రసాదం ద్వారా దివ్యత్వం పొందుతాడు అనే క్రైస్తవ వాదానికీ భేదం ఏమిటి?

## అధ్యాయం -3

1. క్రీస్తు ద్వారా మనం తండ్రికి ఏలా దత్తపుత్రులమౌతాం?
2. సృష్టి నిబంధనం జ్ఞానస్నానాల ద్వారా నరులు దేవునికి దత్తపుత్రులయ్యే తీరును వివరించండి
3. "ధర్మశాస్త్రం మోషేద్వారా లభించింది. కాని వరప్రసాదమూ సత్యమూ క్రీస్తుద్వారా లభించాయి" - యోహా 1,17. వివరించండి.
4. పరిశుద్ధాత్మ మనలను ఏలా దత్తపుత్రులను చేస్తుంది?

## అధ్యాయం -4

1. తండ్రి అంతర్నివాసాన్ని వివరించండి
2. క్రీస్తు అంతర్నివాసాన్ని వర్ణించండి
3. ఆత్మ అంతర్నివాసాన్ని విశదీకరించండి

## అధ్యాయం -5

1. తండ్రి జీవనదాత ఏలా ఔతాడు?
2. క్రీస్తు సత్యదాత ఏలా ఔతాడు?
3. పవిత్రాత్మ ప్రేమదాత ఏలా ఔతాడు?

## అధ్యాయం -6

1. సహాయక వరప్రసాదంతో మనకు అవసర మేమిటి?
2. సహాయక వరప్రసాదం వలన మన స్వాతంత్ర్యం భంగపడదా?
3. సహాయక వరప్రసాదాలను సాధించే మార్గం ఏమిటి?

## అధ్యాయం -7

1. చికిత్సాత్మక వరప్రసాదాన్ని వివరించండి.
2. ఉద్ధారణ వరప్రసాదమంటే యేమిటి?
3. ప్రబోధాత్మక వరప్రసాదాన్నిగూర్చి తెలియజేయండి.

## అధ్యాయం -8

1. బాహిర వరప్రసాదాన్ని వివరించండి.
2. అన్యప్రయోజక వరప్రసాదం అంటే యేమిటి?
3. క్రియానిర్వహణ వరప్రసాదాన్ని గూర్చి తెలియజేయండి.

## అధ్యాయం -9

1. జ్ఞానదేహ సిద్ధాంతాన్ని వివరించండి
2. జ్ఞానదేహ బాధ్యతలను పేర్కొనండి
3. వరప్రసాదాలన్నీ ఏలా తిరుసభనుండే లభిస్తాయో తెలియజేయండి

## అధ్యాయం -10

1. మన దైనందినకార్యాలద్వారానే క్రీస్తు వరప్రసాదాన్ని పొందడం ఏలా?
2. సత్కార్యాలకు వుండవలసిన మూడు నియమాలు ఏమిటివి?
3. మన రోజువారి క్రియలు ఏలా బంగారంగా మారిపోతాయి?



ఫాదర్ పూదోట జోజయ్య, **S.J.** గారు, పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం॥ ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో **M.A.** (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేష్యస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :

1. అనువాదకునిగా : అకుంఠిత దీక్షతో 17 సం॥లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. ఆధ్యాత్మికవేత్తగా : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. విద్యార్థి బాంధవునిగా : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. వక్తగా : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.